# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

ఆగస్ట్ చతుర నవల ఆడలేనురా గోపాలా

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................



# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/– పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచంవంటి శీర్షికలుకాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. 'చతుర'లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదు గనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35 వేలపదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్ వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్కప్రకారం 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చేవక్షంలో, అందుకు అభ్యంతరం లేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియవర్చటమో, లేనివక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# సచిత్ర విచిత్రం




నికోల్‌తో స్టీఫెన్.
'పెంట్‌హౌస్' మేగజైన్‌కు చెందిన ట్రేసీవాలెస్

పోటీలు ప్రారంభిస్తున్న స్టీఫెన్ (దూరదర్శన్ అధికారి)




బరిలో దిగడానికి సిద్ధంగానున్న ఇతర అభ్యర్థినులు.



విజేత నికోల్‌తో నిర్వాహకుడు డెస్‌రెన్‌ఫోర్డ్.

# తడిబట్టలతో తరుణుల పోటీ

మంచులాంటి చల్లని నీళ్లను, అవసరమనుకుంటే కొన్ని మంచుగడ్డల్నివేసి మరీ మొదటి ఫొటోలో చూపిన విధంగా అమ్మాయిలు తమ టీ-షర్టులమీదకి ఒంపుకోవాలి. ప్రత్యేకంగా అలా ఒంపడం కోసం ఓ మనిషిని నియోగిస్తారు. నరాలు జివ్వుమన్పించే ఆ నీళ్ళు ధారాపాతంగా పడి, చలితో శరీరం గడ్డకట్టుకుపోతున్నా బాధపడకూడదు. బిగదీసుకు పోకూడదు. నిటారుగా నిలబడాలి. అదే సమయంలో అడుగుతున్న కొంటెకోణంగి ప్రశ్నలన్నింటికీ సమయస్ఫూర్తితో హాస్యభరితంగా జవాబులిచ్చి న్యాయనిర్ణేతల్ని ఒప్పించాలి. అంతేకాదండోయ్! తడిసిన బట్టల్లోంచి బహిర్గతమయ్యే ఒంపు సొంపుల విషయంలోనూ అభ్యర్థినులనందర్నీ తలదన్నేలా ఉండాలి. అలాగైతేనే ఈ గమ్మత్తయిన పోటీలో విజేతలవుతారు.



'కోల్డెస్ట్ వెట్ టీ- షర్ట్ కంటెస్ట్' పేర చలికాలంలో జరిగే ఈ పోటీని సిడ్నీలోని మారౌబ్రా బీచ్ హోటల్ యజమాని, డెస్‌రెన్‌ఫోర్డ్ ఏటా నిర్వహిస్తున్నాడు. చిత్రాతిచిత్రమైన ఈ పోటీని తిలకించేందుకు జనం గుంపులు గుంపులుగా ఎగబడుతున్నారట.

"కేవలం ఇలాంటి చౌకబారు చిట్కాల ద్వారా ప్రజల్ని ఆకర్షించి, తన వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడమే రెన్‌ఫోర్డ్ ఆశయం. అంతే తప్పఇందులో క్రీడా స్ఫూర్తి ఏమి ఏడ్చింది?" అని గిట్టని వాళ్ళు ప్రచారం చేస్తున్నా సదరు హోటలు యజమాని పట్టించుకోవడం లేదు.

"మిగిలిన అన్ని పోటీల్లా కాకుండా ఈ పోటీలో ఏక సమయంలో ఎన్నో రకాలుగా మన ప్రతిభను చూపాలి. ఉదాహరణకు- చల్లని నీళ్లు ఒంటిని కొరికేస్తున్నా తట్టుకొని చిరునవ్వుతో నిలవాలి అంటే సహనంతో పాటు శారీరక దారుఢ్యం ఎంతో కావాలి. అలాగే గజగజ వణికిస్తున్న తడిబట్టల్లో నిబ్బరంగా నిలిచి, హాస్యం, చతురత మేళవించి సమాధానాలు చెప్పాలంటే ఎంతటి సమయస్ఫూర్తి కావాలి? ఈ సమర్థతలన్నింటితోపాటు అందరినీ అలరింపచేసే అవయవ సౌష్ఠవం కావాలి. ఇన్ని మేలైన (?) అర్హతలున్న వ్యక్తిని గుర్తించి గౌరవించడమేగదా ఈ పోటీ లక్ష్యం. దాంట్లో తప్పేముంది?" అని నిలదీసి అడుగుతోంది ఇటీవల ఈ పోటీలో విజయం సాధించిన పద్ధెనిమిదేళ్ల నికోల్. మరి మీరేమంటారు?

← ఫైనల్‌లో పరాజయం చవిచూసిన సౌందర్యరాశి.

# చమత్కార కథలు

## స్త్రీ ధనం

ఆర్థికంగా పుంజుకుంటున్న తనయుడ్ని చూస్తే ఏ తల్లయినా పొంగిపోతుంటుంది. కాని అన్నపూర్ణమ్మ మాత్రం తన పుత్రుడ్ని చూసి కృంగిపోతుంటుంది. ఆమె కొడుకు పేరు సుందరం. ఇప్పుడిప్పుడే యవ్వనంలోకి అడుగిడుతున్నాడు. చదువు సంధ్యలు పెద్దగా అబ్బకపోయినా, వ్యాపార మెలకువలు అపా



రంగా అబ్బాయి. తన దగ్గరవున్న చిన్న మొత్తంతో ఫైనాన్స్ వ్యాపారం ప్రారంభించాడు. అది దినదిన ప్రవర్ధమానమవుతోంది. అంతవరకూ కుమారుడి ధోరణి అన్నపూర్ణమ్మకి ఇష్టంగానే వుంది. అయితే సుందరం దృష్టి ఇప్పుడు తల్లి వొంటిమీద నగలపై పడింది. పైసా లాభంలేకుండా ఆ బంగారం అలా ఊరికే మురుగుతుండటం సహించలేకపోయాడు. అవి అమ్మి, వచ్చిన డబ్బుని బిజినెస్‌లో పెడతానని తల్లితో చెప్పేడు. కానీ ఆమె అందుకు అంగీకరించలేదు.

బంగారంమీద మోజు స్త్రీకి సహజం. తన పుట్టింటినుంచి సంప్రదాయబద్ధంగా వచ్చిన నగల్ని తన కళ్ళముందు పుట్టి పెరిగిన కొడుకు అమ్మేస్తాననడం అన్నపూర్ణమ్మ సహించలేకపోయింది. ఫలితంగా ఆ ఇంట్లో తల్లీకొడుకులమధ్య వాగ్వివాదం తలెత్తింది.

ఉడుకునెత్తురు ప్రవహిస్తున్న ఓ మగాడితో వయసు మళ్ళుతున్న ఓ స్త్రీ ఎంతవరకు వాక్పోరాటం కొనసాగించగలదు?

ఫలితంగా సుందరందే పైచేయయింది. అన్నపూర్ణమ్మ నగలన్నిటిని సుందరం అమ్మేశాడు. అన్నపూర్ణమ్మ ఎంతగానో విలపించింది. కొడుకుని ఎన్నో రకాలుగా శపించింది.

పక్కా హేతువాది, మెటీరియలిస్ట్ అయిన సుందరం తల్లిని ఖాతరుచేయలేదు.

రోజులు గడుస్తున్నాయి. ఫైనాన్సియర్‌గా సుందరం పేరు చుట్టుపక్కల క్రమేపి పెరుగుతోంది. తమకన్నా తక్కువ ఆదాయం వున్న తోటి ఆడవాళ్ళు సైతం నాలుగు రకాల నగలు పెట్టుకోవడం చూస్తూ అన్నపూర్ణమ్మ మానసికంగా చిత్రవధ అవుతోండగా కాలచక్రం గిర్రున నాలుగేళ్ళు ముందుకు తిరిగింది.

---

*కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: జగ్‌మోహన్*

అన్నపూర్ణమ్మ తన తనయుడ్ని చూసి ఇప్పుడు కొండంతగా పొంగిపోతోంది. తనంత అదృష్టవంతురాలు ఇలలో లేదని గర్వపడుతోంది. కారణం... సుందరం ఆమెని బంగారంలో ముంచేశాడు!!!

రాగిడి, తీగ, గొలుసు, రెండుపేట్ల తాడు, పాపిడిశేరు, వడ్డాణం, ఎత్తుగొలుసులు, పదిజత గాజులు... బ్రీఫ్‌గా అన్నపూర్ణమ్మ వంటి మీదగల నగలివి! అరవై తులాలుకి తక్కువ వుండదా బంగారం.

కొడుకులో వచ్చిన ఈ అనూహ్య మార్పుకి అన్నపూర్ణమ్మ ఆశ్చర్య చకితురాలయింది. ఇది కలా? నిజమా? ఇప్పటికీ నమ్మలేకపోతోంది. ఉండలేక ఒకసారి అడిగేసింది సుందరంని.

తల్లితో సౌమ్యంగా చెప్పేడు సుందరం- "అప్పటికి ఇప్పటికి నాలో మార్పేమీ లేదమ్మా... పరిస్థితులే మారాయి. అప్పుడు మనం మధ్యతరగతివాళ్ళం. మనదగ్గర గోల్డ్ వుంటే వడ్డీ లాస్. ఇప్పుడు లక్షాధికార్లం. ఇన్‌కంటాక్స్ ఎగ్గొట్టడం గురించి నీకు నగలు చేయించాను. స్త్రీధనం ఎక్కడిదని అడిగే హక్కు రాజ్యాంగంలో ఎవరికీ లేదు!

**-కొల్లిమల్ల అప్పారావు**

---

## రిజిష్టర్ మ్యారేజ్

శ్రావణి, సూర్యంలు గాఢంగా ప్రేమించుకున్నారు, ఒకర్ని విడిచి ఒకరు వుండలేనంతగా!

"సూర్యం!"

"ఊం...!"

"నన్నెప్పుడు పెళ్ళిచేసుకుంటావ్!"

"అదే ఆలోచిస్తున్నా! మా ఇంట్లో ఒప్పుకునేట్లులేరు! మరి మీ ఇంట్లో!?"

"మా డాడీకి ఇష్టమే!"

"రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుందామా!?"

"సరే... నీ ఇష్టం!"

ఇద్దరూ ఓ శుభముహూర్తాన రిజిష్ట్రార్ ఆఫీసుకు వెళ్ళి రిజిష్టరు మ్యారేజి చేసుకున్నారు! "మీలాగా అందరూ ధైర్యం చేస్తే, మనల్ని పీడించే వరకట్న పిశాచి నామరూపాల్లేకుండా పోతుంది" అని శ్రావణిని సూర్యాన్ని మెచ్చుకున్నారు రిజిష్ట్రార్ అనంతంగారు!

సూర్యాన్ని దగ్గరికి పిలిచి, "మీరు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు ఇక వచ్చే వడిదుడుకుల్ని ధైర్యంగా, సమయస్ఫూర్తితో ఎదుర్కోవాలి" అన్నారు అనంతంగారు.

"అలాగే సార్!" అన్నాడు సూర్యం!

శ్రావణిని దగ్గరకు పిలిచి, "మీ డాడీకి ఇష్టమేనన్నావుగా! మీ డాడీ రాలేదేం మన పెళ్ళికి" అన్నాడు సూర్యం.

శ్రావణి నవ్వి వూరుకుంది!

"అమ్మాయిని జాగ్రత్తగా చూసుకో, ఒక్కగానొక్క కూతురు! మీరు ధైర్యంగా వుండండి! మీకు అండగా నేవుంటా" అన్నారు అనంతంగారు!

ఖంగుతిన్నాడు సూర్యం! శ్రావణి ఒక్కతే కూతురని ఈయనకెట్లా తెలుసబ్బా! అని మనసులోనే అనుకుని పైకి మాత్రం, "మీ అంతవారు మా అండగా వుంటే మాకింకేం కావాలి" అన్నాడు సూర్యం!

"సాయంత్రం ఆఫీసునుంచి సరాసరి ఇంటికే వెళ్ళు! శ్రావణి ఒక్కతే వుంటుంది గదా!"

"అలాగే సార్" ఇంత ఆప్యాయంగా చెబుతున్నారీ అనంతంగారు, ఎంత మంచివారు అనుకున్నాడు సూర్యం మనసులో!

"ఆదివారం సినిమాకి తీసుకెళ్ళు! రిలీఫ్‌గా వుంటుంది!"

"అలాగే సార్!" అన్నాడు అనంతంగారి అభిమానానికి ఆశ్చర్యపోతూ సూర్యం!

"ఇంటిపనుల్లో శ్రావణికి సాయం చెయ్యి! పాపం చిన్నపిల్ల!"

"అయ్యయ్యో! అది చెప్పాలా! లేచింది మొదలు శ్రావణి వెనకే వుంటా"

"శ్రావణిని ఏడిపించకు! ఇల్లాలే ఇంటికి శ్రీమహాలక్ష్మి"!



"కావాలంటే నేనే ఏడుస్తాగాని, శ్రావణిని మాత్రం ఏడిపించను" అన్నాడు సూర్యం నవ్వుతూ.

"జీతం రాగానే శ్రావణి చేతికే ఇవ్వు"

అనంతంగారామాట అనగానే పురుషాహంకారంతో చికాకుపడుతూ, "అసలు మీరెవరు సార్! ఆ మాట చెప్పడానికి" కస్సున మండిపడ్డాడు సూర్యం, వేసవి సూర్యుడిలాగ!

"శ్రావణి తండ్రిని" అన్నారు అనంతంగారు కూల్‌గా!

శ్రావణి ముసిముసిగా నవ్వుతోంది!

-ఎ.వి.యం

---

# ఆత్మహత్య

నిత్యం ఆఫీసులో బాస్ సతాయింపులు, సహోద్యోగుల వెక్కిరింతలు, ఇంట్లో పెళ్లాం, బిడ్డల వేధింపులు, చుట్టపక్కాల వెటకారాలు, వీధిలో అప్పులవాళ్ళ సాధింపులు సాజన్యారావుకి జీవితంమీద విరక్తిని పెంచేశాయి. క్రమంగా 'బతికుండి ఏం లాభం?' అన్పించసాగిందతనికి. ఫలితంగా తన సమస్యలన్నింటికీ ఏకైక పరిష్కారం చావేనన్న నిర్ణయానికొచ్చేశాడతను. అంటే ఆత్మహత్య చేసుకోవాలి అయితే ఎక్కడ చేసుకోవాలి?

ఆలోచించగా ఆలోచించగా తను పనిచేసే ఆఫీసే ఆత్మహత్యకు అనువైన స్థలం అన్పించిందతనికి. ఎందుకంటే వాళ్ల ఆఫీసు 8 అంతస్థుల భవనం. 8వ అంతస్థులోంచి కిందకి దూకేస్తేచాలు. నిస్సందేహంగా ప్రాణం పోతుంది. కొన్నివందలమంది ఉద్యోగులు పనిచేసే ఆ ఆఫీసులో చివరి అంతస్తుని కాన్ఫరెన్సు హాలుగా ఉపయోగిస్తారు. ఏవైనా మీటింగులుంటే తప్ప అక్కడెవరూ ఉండరు. కనుక తనని గమనించేవాళ్ళు, తన ప్రయత్నాన్ని నిరోధించేవాళ్ళు ఉంటారని భయపడాల్సిన పనిలేదు. మంచి ఆలోచన తట్టినందుకు తృప్తిగా నిట్టూర్చాడతను. మర్నాడు మధ్యాహ్నం లంచ్ అవర్లో ఆత్మహత్య చేసుకోవాలని ముహూర్తం నిర్ణయించుకుని ఆ రాత్రి తృప్తిగా నిద్రపోయాడు సాజన్యారావు.

తెల్లవారింది.

ఆఫీసుకు బయలుదేరుతూ భార్యాబిడ్డల్ని చివరిసారిగా కళ్ళనిండుగా ప్రేమగా చూసుకుని భార్యతో "వస్తాను" అన్నాడు సౌజన్యారావు ప్రశాంతంగా.

"సాయంత్రం త్వరగా తగలడ్తారా? చంటిదానికి విరోచనాలు... హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. ఇంట్లో కూరలేం లేవు. తేకపోతే రేపు పచ్చడి మెతుకులే! అన్నట్లు రేపు మా చెల్లెలు పుట్టిన్రోజు. నేను మా వాళ్ళింటికి వెళ్ళాలి. ప్రజెంటేషన్‌కీ, ఆటోకి రానూపోనూ కలిపి ఎంతలేదన్నా వందన్నా కావాల్సుంటుంది. తెలిసిన వాళ్ళని ఓ వంద అప్పడగండి... ఇంకా..." అంటున్న భార్యామణి వీడ్కోల్ని పూర్తిగా విన్పించుకోకుండానే గడపదాటాడు సౌజన్యారావు.

దారిలో పచారీ కొట్టు పద్మనాభం ఎదురయ్యాడు. చిరునవ్వుతో విష్ చేశాడు సౌజన్యారావు.

"ఈ బోడి నమస్కారాలెవరికి కావాలయ్యా? సాయంత్రం ఠంచన్‌గా ఆరు కొట్టేసరికి మీ గడపలో ఉంటా. అణాపైసల్తో నా బాకీ కట్టాలి. లేకుంటే ఊర్కునేది లేదు" అన్నాడు అతను ఫైనల్ వార్నింగిస్తున్నట్లు.

'పిచ్చివాడా అప్పటిదాకా నేనుంటేగదా?' అని మనసులో అనుకొని మౌనంగా తలాడించి ముందుకు నడిచాడు అతను.

ఆఫీసులో అడుగు పెట్టేసరికి ఆఫీసంతా యధావిధిగానే ఉన్నా సౌజన్యారావు కళ్ళకిమాత్రం చాలా అందంగా కన్పించింది. బహుశా ఇంకాసేపట్లో పోతున్నానన్న భావనవల్లే అలా అన్పించి ఉండొచ్చు. అవునుమరి ఆ ఆఫీసులో పదిహేనేళ్ళుగా పని చేస్తున్నాడతను.

అంతలో మేనేజర్‌నించి పిలుపు.

"ఏమోయ్ ఇప్పుడు టైమెంత? ప్రతిరోజూ లేటేనా? ఇలాగైతే నిన్ను సస్పెండ్ చేయాల్సుంటుంది. ఎన్ని మెమోలిచ్చినా నువ్ ఖాతరు చేయడంలేదు. ఈ ఫైలేమిటయ్యా ఇలా



తగలేశావ్? పని చేసేటప్పుడు ఒళ్ళు దగ్గరుంచుకోవాలి. పంక్చుయాలిటీ లేదు. పనిలో శ్రద్ధ లేదు. మీకు జీతాలిచ్చి మేపేది మా నెత్తినెక్కి తొక్కేందుకా? ఇదుగో నీకిదే లాస్ట్ అండ్ ఫైనల్ వార్నింగ్. మరోసారి ఆఫీసుకు లేటయినా, పనిలో పొరపాటు దొర్లినా నిన్ను డిస్మిస్ చేసిపారేస్తాను..." అంటూ అరగంట సేపు ఎడా పెడా వాయించిపారేశాడు మేనేజర్.

విరాగిలా చూశాడు సౌజన్యారావు.

ఆఫీసుకి తను లేటవడాన్కి తన భార్యే కారణమన్న సంగతి అతనికి స్పష్టంగా తెల్సు. ఆమె బారెడు పొద్దెక్కాక గానీ పక్కమీంచి లేవదు. లేచి పిల్లల్ని తయారుచేసి వాళ్ళని స్కూలుకి పంపాకగానీ వంటపని చూడదు. ఆ తర్వాత ఓ గంటా గంటన్నరకి గాని 'అన్నం' అనే పేరుగల తెల్లని పదార్థమూ, 'కూర' పేరుతో బొగ్గుల్లాంటినల్లటి నాలుగైదు ముక్కలు అతని కంచంలో పడవు. అవి గొంతులో వేసుకొని, నులువుగా మింగుడు పడ్డానికి గొంతులో కాసిన్ని నీళ్ళు పోసుకొని, ఆఫీసుకి బయలుదేరతాడతను. పెందలకడే లేచి వంట చేయమంటే ఆమె ఛస్తే ఒప్పుకోదు. ఆ లెక్కన ఆఫీసుకి లేటుగాక ఏమౌతుంది?

తల వంచుకొని తన సీట్లోకి వచ్చి కూర్చున్నాడు సౌజన్యారావు.

పక్క సీట్లలో నకిలింతలు, పొడి దగ్గులు స్పష్టంగా విన్పిస్తూనే ఉన్నాయి. అయినా ఇదివర్లోలా సౌజన్యారావు బాధపళ్ళేదు. మరో గంటలో ఎలాగూ తనీలోకంనించే నిష్క్రమించనున్నాడుగదా! వీళ్లతో ఎందుకు?

లంచ్ అవర్ వచ్చేసింది!

సీట్లోంచి లేచి రిలాక్సింగ్‌గా ఓసారి ఒళ్ళు విరుచుకున్నాడు సౌజన్యారావు. చిరునవ్వు పెదాలమీద తొణికిసలాడుతుండగా మెల్లగా నడిచి లిఫ్టని సమీపించాడు. క్రిందనుంచి లిఫ్ట్ వచ్చింది గానీ ఫుల్ రష్. రెండుమూడు సార్లు కిందికీ పైకీ తిరిగింది కానీ లిఫ్టనిండా ప్రతి ట్రిప్పూ కిటకిటలాడ్తూ జనం.

ఇలా లాభం లేదు. టైం దాటిపోతోంది. మెల్లగా మెట్లెక్కి నడవడమే ఉత్తమం అను'కుంటూ మెట్లవైపు దారితీశాడు సౌజన్యారావు.

తనుండే ఫ్లోర్‌నించి కాళ్ళీడ్చుకుంటూ 5వ ఫ్లోర్‌కి చేరుకునేసరికి పావుగంట పట్టిందతనికి. ఇంకా మూడు ఫ్లోర్లు నడవాలి. కానీ అక్కడ మెట్లమీద కిటకిటలాడ్తూ జనం. ఆ జనాన్ని గదమాయిస్తూ మెట్లమీదే నాలుగు 'క్యూ'లు ఏర్పాటు చేస్తున్నాడొక వ్యక్తి. వాళ్ళమధ్యనుంచి సందుచేసుకొని మెల్లగా పైకి నడవబోయాడు సౌజన్యారావు.

క్యూలోని వాళ్లంతా గట్టిగా అరిచి సౌజన్యారావుని ఆపేశారు.

"ప్లీజ్ కమ్ ఇన్ టూ ది క్యూ" అన్నాడొక మర్యాదస్థుడు సౌజన్యారావు ఆశ్చర్యాన్ని పసిగట్టి.

చేసేదిలేక మెల్లగా 'క్యూ'లోకి వెళ్ళి వెనగ్గా నిలబడ్డాడతను. క్యూ మెల్లగా కదుల్తోంది. 'మరికొన్ని క్షణాల్లో చచ్చేవాడికి ఈ క్యూల్లో నిలబడే ఖర్మమేంటి?' అని మనసులోనే చిరాకు పడ్డాడు సౌజన్యారావు.

రెండు నిమిషాలయ్యాక క్యూనించి తప్పుకొని పైకి నడవబోయాడు అతను. 'ఎవరైనా అడిగితే నిజం చెప్పేద్దాం భవబంధాల్నే తెంచేసుకోబోతున్న తనకింకా ఈ క్యూలతో నిమిత్తం ఏంట'ని అనుకుంటూ ముందుకు నడిచాడు.

వెంటనే క్యూలో ఉన్న ఒక అతను లైన్ విడిచి వచ్చి సౌజన్యారావుని పట్టుకున్నాడు. అతని కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి.

"ఎక్కడికి బే? క్యూలో రమ్మంటే నీగ్గాదూ? మహా దూకుడుమీదున్నావ్?" అన్నాడతను కోపంగా.

ప్రశాంతంగా నవ్వాడు సౌజన్యారావు. నిజం చెప్పేస్తే తనని పోనిస్తారనీ తనమీద వారంతా సానుభూతి కురిపిస్తారనీ అతని నమ్మకం. అందుకే కోపం తెచ్చుకోకుండా అందరికీ విన్పించాలని గట్టిగా చెప్పాడు.

"నాయనా... నన్నాపకండి, నేను వెళ్ళేది పైనుంచి దూకి ఆత్మహత్య చేసుకోడానికి... నన్ను త్వరగా వెళ్ళనియ్యండి"

"అంటే మేమందరం అక్కడ తైతక్కలాడ్డానికి వెళ్తున్నాం అనుకుంటున్నావా? నోర్మూసుకొని లైన్‌లోరా. నీ ముందు ఆత్మహత్య చేసుకోవాల్సినవాళ్ళం మూడువందలమందిదాకా ఉన్నాం" అంటూ గద్దించాడతను.

-ప్రతాపచంద్ర

# హరిత ముత్యాలు

★ కాళ్లకు చెప్పులు లేవే అనేబాధ. అసలు కాళ్లే లేని వ్యక్తిని చూసేవరకే ఉంటుంది.

— డేవిడ్ హ్యూమ్

★ నీ బాధకు కారణం ఏదైనా కావచ్చు. కాని ఆ కారణంవల్ల నువ్వు ఇతరులకు మాత్రం హానిచెయ్యవద్దు.

— గౌతమబుద్ధుడు

★ తన పూర్వీకులలో ఎవరో ఒకరు బానిస అయివుండని రాజు లేడు; అలాగే ఎవరో ఒకరు రాజు అయివుండని బానిసలేడు.

— హెలెన్ కెల్లర్

★ తెలివితేటలుగలవారు ఇతరులతో మాట్లాడేటప్పుడు వారి మాటల వలనకంటే; వారి చూపుల వల్లనే ఎక్కువ విషయాలు తెలుసుకుంటారు.

— ఎర్లఆఫ్ చెస్టర్‌ఫీల్డ్

★ అహంభావ నిర్మూలనతోనే భయం కూడా అదృశ్యమవుతుంది.

— గాంధీజీ

★ నీవు మరణించిన తరువాత ప్రజలు నిన్ను మర్చిపోకుండా ఉండాలంటే చదువుకొనేందుకు ఉపయోగపడే పుస్తకాలయినా రాయి లేదా రాసేందుకు యోగ్యతగల పనులైనా చెయ్యి.

— ఆంగ్ల సామెత

★ కేవలం మంచివాడివే కాకు. కొంత మంచిని కూడా చెయ్యి.

— ఆంగ్ల సామెత

★ నీవు మంచివాడివి కాదలిస్తే మంచివారిలోని మంచిని ప్రేమించు.

— ఆంగ్ల సామెత

★ ప్రతి మనిషి నిత్యం నిశితంగా పరిశీలించేది ఎదుటివారి పొరపాట్లనే.

— డ్రైడన్

★ గణతంత్రం ప్రజల్లో ఆత్మవిశ్వాసాన్ని, గౌరవాన్ని పాదుకొల్పుతుంది. రాజ్యతంత్రం ప్రజలను గొర్రెలుగా మారుస్తుంది.

— రాహుల్ సాంకృత్యాయన్

★ ప్రజలు గొర్రెమందలాగా ఉండే రాజ్యం ప్రజాస్వామ్యం అనిపించుకోదు.

— గాంధీజీ

★ ప్రజాస్వామ్యం నా రాజకీయ ఆదర్శం. ప్రతిపౌరుడూ గౌరవించబడాలి. కాని ఏ వ్యక్తీ ఆరాధించబడకూడదు.

— అల్బర్ట్ ఐన్‌స్టీన్

★ ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం అని నినాదాలు చేస్తారు. కాని విద్యాగంధం లేని ప్రజాస్వామ్యం ఒక అంతులేని మోసం.

— లింకన్

సేకరణ: నలబెల్లి శ్రీమన్నారాయణ

# చతుర

సంపుటి: 15: సంచిక: 7: ఆగస్ట్ 1992

పదహారు వసంతాలయినా నిండని ఆ అద్భుత సౌందర్య రాశి... నిస్సహాయ స్థితిలో ఓ ధనవంతుడయిన వృద్ధుడికి భార్య అయింది. కానీ... శారీరక, మానసిక బలహీనతలకు లొంగి, అందరూ హీనకులస్తునిగా చూసే ఓ యువకునితో లేచిపోతుంది. ఉన్నత వంశంలో పుట్టి, సంస్కృతీ సంప్రదాయాలతో పెరిగిన ఆ పడతి జీవితం ఆ బలహీన క్షణాల్లో ఊహించని మలుపులు తిరుగుతుంది.

అలా ఒక కులంనుండి మరొక కులానికి జరిగిన ప్రస్థానంతో అక్కడ ఇమడనూలేక, వెనక్కి రానూలేక... ఆమె పడిన మానసిక సంఘర్షణకి సాహితీ రూపాన్నిచ్చిన సాహిత్య అకాడమీ పురస్కార గ్రహిత అమృతలాల్‌నాగర్ విశిష్ట హిందీ నవలకు **సి.వసంత** స్వేచ్ఛానువాదం **'ఆడలేనురా గోపాలా'** ఈ నెల 'చతుర' సమర్పణ.

# ఆడలేనురా గోపాలా

## - అమృతలాల్ నాగర్



**మా** ఇంటి వెనక ఉన్న దళితుల పేటలను నా చిన్నప్పటి నుంచీ చూస్తూనే ఉన్నాను. కానీ ఈమధ్య కొన్ని నెలల నుంచి ఒక ఉద్దేశ్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ బస్తీని మరింత శ్రద్ధగా పరిశీలించసాగాను నా స్టడీరూమ్‌లో నిల్చుని.

ఆ బస్తీవైపు ఉన్న కిటికీలగుండా చూస్తూ ఉంటే, ఇన్నేళ్ళుగా ఈ ఇరుగుపొరుగు వారితో ఎంతో కొంత సంబంధం ఉండి కూడా వాస్తవంలో వాళ్ళ ఆంతర్యాలు, వాళ్ళ పరిస్థితులు మొదలైనవాటిని గురించి నాకు ఏమీ తెలియదనే అనిపిస్తోంది. వారిలో నలుగురయిదుగురి పేర్లు మాత్రమే నాకు తెలుసు. అప్పుడప్పుడు వాళ్ళ మధ్య జరిగే పోట్లాటలు నాకు వినిపిస్తూనే ఉంటాయి. ఇప్పటి వరకు వారి యెడల నాకు కేవలం సానుభూతి మాత్రమే ఉండేది. ఇప్పుడు అలాగాక వారి మనస్సులకు దగ్గరగా వెళ్ళి వార్ని గురించి పూర్తిగా తెలుసుకోవాలన్న కోరిక నాలో రేగింది. ఆ ఉద్దేశ్యంతోనే ఈ బస్తీలోను, పట్టణంలోని ఇతర దళితుల పేటలలోను ఉన్న వారితో ఇంటర్వ్యూలు తీసుకుందామని ఒక కార్యక్రమాన్ని తయారు చేశాను. వారిని కొన్నిసార్లు కలిసి మాట్లాడటం జరిగిన తరువాత నేనొక ఉన్నత కులానికి చెందిన వాడిననే భావం నాకు తెలియకుండానే నాలో వుందనిపించింది. అంటీముట్టనట్టు వారితో వ్యవహరిస్తూ విషయ సేకరణే ప్రధానం అనుకుని ప్రవర్తించడం వలన నేను కేవలం ఒడ్డున నిలబడి సముద్రపులోతును కొలుస్తున్నానేమో అనిపించింది. వాళ్ళతో పూర్తిగా కలిసిపోయి వాళ్ళలో ఒకడిగా నన్ను నేను ఊహించుకుంటేగానీ వాళ్ళ జీవిత పద్ధతులనీ, సంస్కారాన్నీ అర్థం చేసుకోలేనేమో అనిపించసాగింది.

నేను గత రెండురోజులుగా ఈ పేటకి వస్తున్నాను. ముఖ్యులని అనుకున్న వాళ్ళందరితో ఇంటర్వ్యూలు తీసుకునే పని నిన్నటితో పూర్తయింది. ఈ బస్తీని ఫోటోలు తీసే మిషతో మళ్ళీ ఇవాళ వచ్చానుగానీ అసలు కారణం నా హృదయపు లోతుల్లో ఎక్కడో ఓ మూల నిర్గుణియా కనబడుతుందేమోననే ఆశ ఉండటమే. నన్ను కలవడానికీ నాతో మాట్లాడటానికీ ఆమె నిరాకరించింది. బహుశా ఆ నిరాకరణే ఆమె పట్ల నాలో ఆకర్షణను పెంచిందేమో.

నేను బస్తీలలో నిర్గుణియా గురించి చాలా విని ఉన్నాను. పట్టణంలోని పాకీవాళ్లకు ఆమె చదువు నేర్పేదని చాలా మంది చెప్పారు. ఆమె భర్త మోహన్ దాదాపు నలభై సంవత్సరాల క్రిందటే పోలీసుల చేతిలో మృతి చెందాడు. ఆ తరువాత ఎన్నో కష్టాలనీ, ఒడిదుడుకులనీ భరిస్తూ ఆమె తన కొడుకు, కూతుళ్ళను చదివించింది. తోటి వాళ్ళలో చదువుకోవాలన్న కోరికను రేకెత్తించింది. బాజా భజంత్రీలు వాయించే వృత్తిని చేపట్టాలనీ వీలున్నంతవరకూ ఎవరిమీదా ఆధారపడకుండా బ్యాండు మేళాలు వగైరా వృత్తుల్లో స్వతంత్రంగా బతకాలనీ చెప్పి అవి వారికి నేర్పింది కూడా ఆవిడే. అయితే కొన్ని సంవత్సరాలుగా ఆమె వీటన్నింటికీ దూరంగా ఉంటూ కూరగాయలు పండించి అమ్ముతూ, డబ్బు వడ్డీలకిస్తూ తన మానానతాను బతుకుతున్నది. ఆమె కొడుకు, కూతురు ప్రస్తుతం పెద్ద పదవులలో ఉన్నారు. తల్లంటే వాళ్ళకి ఎంతో గౌరవం.

హరిజనుల మాంటిసరీ స్కూల్ అధ్యాపకుడయిన శ్యామ్‌లాల్ నా తరఫున స్వయంగా నిర్గుణియా దగ్గరకు వెళ్ళాడు. ఒకవేళ ఇంటర్వ్యూ కోసం తను నా దగ్గరకు రావడం ఆమెకు ఇష్టం లేకపోతే ఆమె దగ్గరికే నేను రావడానికయినా అనుమతి ఈయవలసిందని ఆమెను కోరాడు. ఇంతకుముందు ఈ అధ్యాపకుడి ఇంట్లోనే నేను దళితులతో ఇంటర్వ్యూలు తీసుకున్నాను. కాని నిర్గుణియా మాత్రం ఇంటర్వ్యూ ఇవ్వడానికి నిరాకరించింది. ఈ నిరాకరణ నాకెంతో అవమానంగా తోచి, ఆమెను ఏవిధంగానయినా సరే కలిసి మాట్లాడాలన్న పట్టుదల నాలో పెరిగింది. దళిత వర్గానికి చెందిన ఈ మహిళను ఒక వి.ఐ.పి.గా భావించి నేను ఆమె దగ్గరికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను.

ఒక విస్కీబాటిల్ కాసిని మిఠాయిలు, ఫలాలు ఓసంచిలో వేసుకుని వచ్చాను.

ఆమె ఓ బందిపోటు దొంగ భార్య.

జీవితాంతం హక్కుల కోసం పోరాడిన ఒక మహిళ.

విద్యావంతులయిన ఇద్దరు బిడ్డల తల్లి.

ఆమె అనుభవాలను తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉంది. ముందు ఫొటోగ్రాఫర్ చేత ఆ బస్తీ ఫొటోలు తీయించి అతడిని పంపించి వేశాను.

సంచి తీసుకుని నిర్గుణియా ఇంటికి వచ్చి తలుపు తట్టాను.

''ఎవరు?''

జవాబు ఇవ్వాలా, ఒద్దా?

ఒకవేళ నా గొంతు గుర్తుపడితే ఆవిడ తలుపు తెరవదేమో...

మళ్ళీ గొళ్ళాన్ని టకటకలాడించాను.

''అరె ఎవడురావాడు'' అంటూ ఓ బూతు మాట వదిలిందామె ''అడుగుతుంటే జవాబు చెప్పడు ఎవడాడు?'' అంది మళ్ళీ.

''నిర్గుణియాగారూ! నేను మీతో మాట్లాడుదామని వచ్చాను. తలుపు తెరవండి'' అన్నాన్నేను.

కొంచెం సేపు మౌనం రాజ్యం చేసింది.

ఎటువంటి కఠోరమైన మాటలు తిట్లు వినడానికైనా నేను సిద్ధంగానే ఉన్నాను.

తలుపు తెరుచుకుంది. నా ఎదురుగుండా ఒక వృద్ధురాలు నిల్చుని ఉంది.

ఆమెలో అందంకన్నా ఆకర్షణ ఎక్కువ. ఆమె ముఖం మీద ముడతలు లేవుగానీ ఈ కఠోర సమాజం వేసిన కొరడా దెబ్బల తాలూకు కొన్ని గీతలు మాత్రం నాకు కన్పించాయి. అయస్కాంతంలా ఉన్న ఆమె కళ్ళు నన్ను ఆకర్షించాయి. ఆ తర్వాత ఆమె అన్న మాటలు మాత్రం తీయగా మర్యాదగానే ఉన్నాయి.

''రండి బాబుగారూ! మీ పాద ధూళి పడటం వలన ఈ దురదృష్టవంతురాలి ఇల్లు ఎంతో పావనం అయింది'' అందామె.

లోపలికి వచ్చి సోఫాలో కూర్చుంటూ ఒకసారి చుట్టూ కలయచూశాను. గది ఎంతో అందంగా సర్ది ఉంది. గోడమీద పెద్ద సైజుతో ఒక యువకుడి ఫొటో ఉంది. అది బహుశా ఆమె భర్త, బందిపోటు మోహన్‌దేమో.

సంచిలోంచి మిఠాయి పొట్లం, ఫలాలు, బ్లాక్‌వైట్ విస్కీబాటిల్ తీసి టీపాయిమీద పెట్టాను.

''ఇవన్నీ ఎందుకు బాబుగారూ?''

''మీకోసం...''

''నాకోసమా! నాకెందుకు?''

''నేను నిన్న ఈ పేటలో పిల్లలందరికీ చాక్లెట్లు పంచాను''

''అయితే నేను చిన్నపిల్లనా ఏమిటి బాబుగారూ?''

''మీరు నన్ను కలవనని అన్నారుకదా! అందుకని ఈ ముసలి పావను ఎట్లాగయినా బ్రతిమిలాడి దారికి తేవాలనుకున్నాను''

అనుకోకుండానే నా నోటినుండి ఆ మాటలు వచ్చేశాయి. ఆమె ఏమనుకుంటుందోనని భయం వేసింది.

''ఓహ్హో! అయితే నా విషయం మీకూ తెలిసిపోయిందన్న మాట. సరే ఆ బాటిల్ అలాగే ఉంచండి. నేను లోపలి నుండి మరొకటి తెస్తాను'' ఆమె నవ్వుతూ అంది.

''నిర్గుణియాగారూ! ఇది మీకోసమే తీసుకు వచ్చాను. నేను అప్పుడప్పుడు తాగే మాట నిజమే కాని పని ఉన్నప్పుడు మాత్రం తాగను''

''పాకీవాళ్ళని ఇంటర్వ్యూలు చేయడం మీ పనా?''

''అవును ప్రస్తుతం అదే నా పని''

''ఈ పని గవర్నమెంట్‌కి సంబంధించిందా?''

''కాదు ఇది నా స్వంతపని. సమాజానికి ఉపయోగపడే పని''

''దీని వలన మీకు ఏం లాభం?''

''ఈ పని చేయడం వలన నా జ్ఞానం అభివృద్ధి చెందుతుంది''

''ఆ... అయితే బాబుగారూ! ఒక ప్రశ్నకు సమాధానం చెప్పండి. మీరు మానసికంగా మా జాతివారిలో ఒకరుగా ఎంతవరకూ మారగలిగారు?''

నా దృష్టి ఆమె చూపుల మీదే ఉంది. ఆమె

కళ్ళలో అవతలివాళ్ళని హిప్నటైజ్ చేయగల శక్తి ఉంది. నీలం, బూడిద వన్నెలు కలిపినట్లున్న ఆమె కనుపాపలే దీనికి కారణమేమో! మనదేశంలో ఇటువంటి కళ్ళు గలవారు అరుదుగా కనిపిస్తారు. నా అంచనా ప్రకారం ఆమె వయస్సు అరవై ఐదు లేక డెబ్బై ఉండవచ్చు. బహుశా ఈమె తన యౌవనంలో ఎందరో పురుషులను తన చుట్టు తిప్పుకుని ఉండవచ్చు.

ఆమె నావంకే చూస్తోంది. బహుశా మేం ఇద్దరం కూడా ఒకరిని గురించి మరొకరు పూర్తిగా తెలుసుకోవాలని ఆరాటపడుతున్నామేమో!

"నా చేతి వంట మీరు తింటారా?" కొద్దిసేపటి మౌనం తరువాత ఆమె మళ్ళీ అడిగింది.

"చాలా సాధారణమైన ప్రశ్న"

"నాతో ఒకే కంచంలో తింటారా?"

"అటువంటి అవసరమే వస్తే తప్పకుండా తింటాను"

"క్లబ్బులో ఆడవాళ్ళతో కలిసి తాగినట్లుగా నాతో మీరు కలిసి తాగగలుగుతారా?

"తప్పకుండా.."

"ఒకే గ్లాసులో..."

"ఈ వయస్సులో అడగవలసిన ప్రశ్నలు కావివి"

"నిర్గుణియా ఒక మహారాణి నవ్వినట్లు హుందాగా నవ్వింది.

మా సుహిళలతో ప్రేమకలాపాలు సాగించడంకోసం మీరు ఈ నాటకం ఆడుతున్నారేమో అని నాకనిపించిందిలెండి"

"ఇప్పుడు ఈ వయస్సులో నేను ఎవరితో ప్రేమకలాపాలు సాగిస్తానని? ఆ వయస్సు దాటిపోయింది. నేను వయస్సులో ఉన్నప్పుడు కూడా ఇటువంటి వాటి నుండి దూరంగా, పిరికివాడిగానే ఉన్నాను"

"ఈ అంటరాని వాళ్ళ ఒళ్ళు తగిలితే భ్రష్టుడినయిపోతానని భయపడ్డారా? ఎంతో నిష్టాపరులైన పండితులు కూడా ఈ అంటరాని స్త్రీల వెనక కుక్కల్లాగా తిరగడం నేను చూశానులెండి. వారంతా ఎవరికీ తెలియకుండా ఎన్నో చీకటి పనులు చేస్తూ ఉంటారు. తెల్లవారేసరికి మీసాలు తిప్పుతూ తప్పుకోండి తప్పుకోండి అని అరవడం మొదలు పెడతారు. చెప్పేవి శ్రీరంగ నీతులు దూరేవి దొమ్మరి గుడిసెలు.

ఇవన్నీ చూశాక నా మనస్సులో ఒక ప్రశ్న తల ఎత్తుతూనే ఉంది. "ఇప్పుడు అసలు పాకీవారెవరు? ఉత్తమ జాతులవారెవరు?"

"మంచి ప్రశ్నవేశారు. దానికి సమాధానం వేదాంతానికి తొలిమెట్టే అవుతుంది. మీరు అనుమతిస్తే నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు అడగాలనుకుంటున్నాను. అడగవచ్చునా?"

నా మాటలు వినీ విననట్లుగా ఆమె అడిగింది.

"మీ ఇల్లు ఎక్కడుంది?" నేను చెప్పాను.

"నేను ఎప్పుడో ఒకరోజు మీ ఇంటికి వస్తాను. అప్పుడే మీ ప్రశ్నలకు సమాధానాలు దొరకడమూ, మీ జ్ఞాన పిపాస తీరడమూ జరుగుతుంది. ప్రస్తుతానికి మాత్రం మీదాహం తీర్చే ఏర్పాట్లు చేయనీయండి" అంటూ ఆవిడ లేచింది.

ఆవిడ వెనకాలే నేనూ లోపలికి నడిచాను. లోపల గదిలోంచి చూస్తే వెనుక కూరగాయల తోట కనిపిస్తోంది. బహుశ ఈ గది పడకగది అయి ఉండవచ్చు. ఈ గదిలో కూడా ఒక ఫొటో ఉంది. అందులో భార్యభర్తలు ఇద్దరూ ఉన్నారు. నిర్గుణియా కుర్చీమీద కూర్చుని ఉంది. మోహన్ సూట్ వేసుకుని ఆమె దగ్గరగా నిల్చుని ఉన్నాడు. ఆవిడ ముఖం ఎంతో అందంగా ఉంది కాని ఆ ముఖంలో ఏదో బాధ గోచరిస్తోంది. మోహన్ గర్వంగా నిల్చుని ఉన్నాడు. అతని ముఖంలో గాంభీర్యం అందం రెండూ ఉన్నాయి.

కొద్ది క్షణాలు ఆ ఫొటో వంకే చూస్తూ నిల్చున్నాను. "పాకీది" అన్న శబ్దం నా మనస్సులో ఆమె గురించిన మరో రూపాన్ని తయారు చేసింది. నిర్గుణియా తట్ట నడుం మీద పెట్టుకుని చీపురు చేత్తో పట్టుకుని నడుస్తోంది. ఆ భంగిమలో ఆమె పర్సనాలిటీ ఇంకా బాగుంది.

భర్త ఓ బందిపోటు దొంగగామారి పారిపో

యిన తరువాత ఆమె ఒంటరి జీవితం ఎంతో దుర్భరంగా ఉండి ఉండవచ్చు.

పిల్లలను పెంచడానికి ఆమె ఎంతో శ్రమ పడి ఉండవచ్చు.

ఆనాడు ఆమె ఎటువంటి పరిస్థితులను ఎదుర్కోవాల్సి వచ్చిందోకదా...

ఈ బస్తీలో ఈమె పట్ల అందరికీ ఉన్న గౌరవభావమే ఈమె ఎంతో పవిత్రురాలన్న విషయాన్ని వ్యక్తం చేస్తుంది. యౌవనంలో కాముకులైన తోడేళ్ళ బారి నుండి తనను తను రక్షించుకోవడానికి ఈమె జీవితంలో ఎంతో ఘర్షణ పడి ఉండవచ్చు. ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఉండవచ్చు. నా చిన్నప్పుడు నేను వీళ్ళను గురించిన ఎన్నో విషాదగాథలు విని ఉన్నాను.

కొన్ని సంఘటనలను స్వయంగా చూశాను కూడా. తక్కువ కులాల వాళ్ళు అందులోనూ పాకీ స్త్రీలు కామాంధుల చేతులలో ఎంతగా నాశనం అయ్యే వారనీ...

సిర్గుణియా ట్రేలో టీ, కాసిని పళ్ళు తీసుకు వచ్చింది. బీరువాలోంచి ఒక విస్కీ సీసా తీసింది.

ఆమె నన్ను కూడా విస్కీ తాగమని రెండు మూడు సార్లు అడిగిందిగానీ నేను తాగనని చెప్పాను.

"అయితే నేను మాత్రం తాగుతాను బాబు గారూ! ఏదో రోజులు గడవడానికి నానా పనులూ చేస్తాను కానీ సాయంత్రం తాగి మత్తుగా పడి ఉండటమే నా అసలు పని. అప్పుడే నా హృదయంలోంచి నా మోహన్ బయటకు వచ్చి నా ఎదురుగా కూర్చుంటాడు. మేం ఇద్దరం కలిసితాగుతాం. కలిసి తింటాం. ఒకరినొకరు కౌగలించుకుని పడుకుంటాం"

"తుమ్ మేరే పాస్ హోతేహోగయా జబ్ కోయీ దూసరా నహీ హోతా..." అప్రయత్నంగా నోటి నుండి ఈ షాయిర్ వెలువడింది.

ఆ వృద్ధురాలి కళ్ళల్లో నీళ్ళు నిండాయి. కన్నీళ్ళని తుడుచుకుంటూ "బాబుగారూ! మీరసలు ఏమీ తినడంలేదు" అంది.

కన్నీళ్ళు కూడా ఒక్కొక్కప్పుడు ఎంత అందంగా ఉంటాయో! నాకు ఒక పాత శ్లోకం గుర్తుకు వచ్చింది. కామిని వెనుక కాముక పురుషుడు ఉన్నట్లుగా ఉదయం వెనక సూర్యుడు ఎప్పుడూ ఉంటాడు. స్మృతుల వెనుక కన్నీళ్ళు అంతే.

వచ్చేటప్పుడు నేను తెచ్చిన బహుమతులను స్వీకరించమని మరీమరీ అడిగాను. ఆమె ఫలాలు, మిఠాయి మాత్రం తీసుకుని బాటిల్‌ని నా సంచిలోనే పడేసింది.

"మీలాంటి పెద్దవారి మాట కాదు అనే సాహసం నాలోలేదు. తక్కినవన్నీ ఉంచుకుంటాను కానీ మీరు ఇదొక్కటి మాత్రం తీసుకువెళ్లండి"

"ఎందుకని?"

"మధువును తీసుకువచ్చి నాకిచ్చే నా నాథుడు ఎప్పుడో వెళ్ళిపోయాడు. నా కొడుకు అప్పుడప్పుడు తెచ్చి ఇస్తాడు కాని అతని మాట వేరు"

ఆమె మనస్సు తెలుసుకున్న నేను మారు మాట్లాడకుండా బయటకి వచ్చేశాను.



చలిగాలి వీస్తున్నా వెనక కిటికీ తలుపులు తెరిచే ఉంచాను.

మా ఇంటి వెనుక దళితుల ఇళ్ళు ఉన్నాయి. అసలు ఈ పాకీవాళ్ళ తీరే నన్ను ఇంటర్వ్యూలు తీసుకుని వారి జీవిత విధానాన్ని సూక్ష్మంగా పరిశీలించడానికి ప్రేరేపించింది. నా హృదయంలో వీళ్ళ రూపమే మెదులుతోంది.

కిటికీలోంచి కిందకి తొంగిచూశాను. ఆడ మొగ గొంతులు వినిపిస్తున్నాయి.

"నీకు సిగ్గులేదురా? నన్ను ఆ లం.. కొడుకు దగ్గరికి పొమ్మంటావ్... నువ్వు నన్ను తిట్టుకొట్టు, ఏమయినా చెయ్యి. నేను మాత్రం వాడి దగ్గరికి వెళ్ళనంటే వెళ్ళను" అని ఒక స్త్రీ అరుస్తోంది.

"వెళ్ళనంటేఎట్లాగే? మనగతి ఏమవ్వుతుందో ఆలోచించు. నీ ఇష్టంతో పనిలేదు. వాడికి లంచం పెట్టడానికి డబ్బులు ఎక్కడ నుండి తెస్తాను? ఎట్లాగోట్లా కాసేపు కళ్ళు మూసుకుని ఒప్పుకో... మన పని పూర్తవ్వుతుంది"

"నీ పని కోసం పెళ్ళాన్ని పరాయివాడి దగ్గరకి పొమ్మంటావా? సిగ్గులేకుండా మాట్లాడకు. నేనేం బోగందాన్ననుకుంటున్నావా?"

"పోనీ ఏం చెయ్యాలో నువ్వే చెప్పు. ఈ నీతులన్నీ మనకెందుకే? తిండానికి గుప్పెడు మెతుకులు లేనివాళ్ళం. అయినా కుక్కకీ, బీదోడి పెళ్ళానికీ సిగ్గేమిటే?"

ఈ మాటలు విన్నాక నాకు ఈ వ్యవస్థ మీద అసహ్యం కోపం రెండూ కలిగాయి. వీళ్ళు ఎంత నిస్సహాయులూ అనిపించింది. మరునాడు అతన్ని కలిశాను. అతని పేరు మజీద్. తను భార్యను పై అధికారి దగ్గరికి ఎందుకు పొమ్మంటున్నాడో చెప్పాడతను. నన్ను ఐదు రూపాయలు అడిగితే అతడు అడిగినదానికన్నా కాస్త ఎక్కువే ఇచ్చాను. వాళ్ళ పరిస్థితులు చూశాక నా మనస్సు బాధతో నిండిపోయింది. ఈ ఇరవయ్యవ శతాబ్దంలో కూడా మనిషి ఎంత నిస్సహాయుడుగా బతుకుతున్నాడూ అనిపించింది.

ఆ సాయంత్రం నిర్గుణియా మా ఇంటికి వచ్చింది. ఆమెను చూసిన వెంటనే లేచి నిల్చున్నానుగానీ ఆమె ముందు ఎందుకు నిలబడాలీ అని మనస్సులో ఓ మూల బలంగా అనిపించింది. ఆమెలో ఏదో ఒక గొప్ప విశేషం ఉంది. ఆమెకో ప్రత్యేకమయిన వ్యక్తిత్వం ఉంది. అందుకనేనేమో ఆవిడకి గౌరవం ఇవ్వకుండా ఉండలేకపోయాను.

"ఎక్కువ కష్టపడకుండానే మీకు మా ఇల్లు దొరికిందనుకుంటాను" అన్నాను మర్యాదగా ఇక్కడ చాలామందికి మీరు తెలుసు. మీ పేరు చెప్పగానే వెంటనే ఇల్లు చూపించారు" అంటూ ఆమె గది నలుమూలలా చూసింది.

"ఈ గది ఓ ఆఫీసర్‌దిలా ఉంది తప్ప పండితుడైన ఓ బ్రాహ్మణుడి ఇల్లులాగా లేదు" అందామె.

"పండితుడి ఇంట్లో ఏదైనా గొప్పతనం ఉంటుందా" అని ప్రశ్నించాను.

"పెద్ద పెద్ద గ్రంథాలు ఉంటాయి. సరస్వతీ దేవి బొమ్మ, చదవడానికి రాయడానికి కావాల్సిన సామాన్లు ఉంటాయి అక్కడ. అవీ ఉండే ఉంటాయి. వేరే గదిలో సర్ది ఉంటారు. అవునా బాబుగారూ?"

"రండి నా స్టడీ రూమ్ చూపిస్తాను. అక్కడే కూర్చుని మాట్లాడుకుందాం"

"మాటలు తరువాత. ప్రస్తుతం మీ ఇల్లు చూద్దామని వచ్చాను. మీ శ్రీమతిగారు ఎక్కడున్నారు?"

ఇంతలో దేవుడి గదిలోనుండి నా భార్య కాంత బయటకు వచ్చింది. నిర్గుణియా త్వర త్వరగా ఆమె దగ్గరకు వెళ్ళి కాళ్ళకు దండం పెట్టింది. తనకన్నా వయస్సులో పెద్దదైన ఒక మహిళ తన కాళ్ళు మొక్కడం నా భార్యకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది.

"అరె... అరె... మీరు నా కాళ్ళు మొక్కడం ఏమిటి? నాకన్నా మీరు పెద్దవారు" అంటూ తడబడింది. నేను ఒకరినొకరిని పరిచయం చేద్దాం అనుకుంటుండగానే నిర్గుణియానే అన్నది "కేవలం వయస్సు వలన ఎవరూ పెద్దవాళ్ళుకారు. మనలోని తేజస్సు, ప్రత్యేక వ్యక్తిత్వం వల్లనే గొప్పవాళ్ళం కాగలుగుతాం. మీరు నాకన్నా పెద్దవాళ్ళు"

నా అహంభావానికి దెబ్బ తగిలింది. ఎంతో మంది గొప్ప వాళ్ళ చేత సభలలో సన్మానింపబడి అందరిచేత గౌరవింపబడే ఈ పురుషుడు ఈ గొప్పవ్యక్తి వీళ్ళ ఇంటికి వెళితే ఈవిడ నాకాళ్ళకి మొక్కలేదు. అలాంటిది నా భార్యలో అంత గొప్ప విశేషం ఏముందని ఆమె మీద ఇంత గౌరవాభిమానాలు ప్రదర్శించింది నిర్గుణియా?

"అమ్మా! మీ ఇంట్లో దేవుడి గదిఉంది కదూ!" నిర్గుణియా అడిగింది.

"దేవుడిగదా!"

"అవును మీ ఈశ్వరుడు ఎక్కడైతే శోభిల్లు తాడో ఆ గది? లేకపోతే మీరు ఆర్య సమాజంకి చెందినవాళ్ళు కాదుగదా?"

"నా భార్య సనాతనురాలేగానీ నేను ఏ మతానికి చెందినవాడినీ కాను" అని నేనన్నాను.

"నన్ను మీ దేవుడి గదిలోకి తీసుకు వెళ్లండి"

"మేం ఇద్దరం నిశ్చేష్టులమయ్యాము.

చిన్నప్పటినుండి నాలో ఎన్నో కొత్త భావాలు, కొత్త ఆలోచనలు ఉండేవి. నేను అభ్యుదయవాదిననుకునేవాడిని. కాని ఇప్పుడు ఈ క్షణంలో నేను కూడా మన పాత సంప్రదాయాలు నమ్మకాలకు ఎంత బానిసనో ప్రత్యక్షంగా తెలుసుకున్నాను. ఒక ముస్లిం మిత్రుడిని అయినాసరే ఆదరభావంతో మా దేవుడి గదిలోకి తీసుకువెళ్ళ గలుగుతానేమోగానీ ఒక పాకీ ఆమెను...

నా భార్య కాంత ప్రశ్నార్థకంగా నావంక



చూస్తోంది. నాకు ఏం చెప్పాలో తోచలేదు.

నీలిరంగుగల ఆకర్షణీయమైన ఆమె కళ్ళు మావంకే చూస్తున్నాయి. ముఖం మీద చిరునవ్వు చిందిస్తూ ఆమె మళ్ళీ అడిగింది.

"ఏం నేను అక్కడికి రాకూడదా?"



"ఆహా... అదేంలేదు... భగవంతుడు అంద రివాడు. రండి... రండి దర్శనం చేసుకుందు రుగాని..."

నిర్గుణియా ముఖం వెలుగుతో నిండిపో యింది. ఏదైనా ఒక భావం ఎవరిలోనైనా పొంగిపొర్లి పైకి వచ్చిందంటే ఆ మనిషి ముఖంలో తప్పకుండా ఆ భావం ప్రస్ఫుటిత మవుతుంది. ఆమె ముఖంలో తేజస్సు ఉట్టిప డుతోంది. దివ్యమైన ఆనందం ఆమెలో కని పిస్తోంది "ఈమె నిర్గుణియా కాదు మరెవరో" అనిపిస్తోంది.

నిర్గుణియా కాళ్ళు చేతులు కడుక్కుని మా దేవుడి గదిలో ప్రవేశించింది. దేవుడికి దూ రంగా గోడనానుకుని దండం పెడుతూ కళ్ళు మూసుకుని నిల్చుంది. ఆమె గొంతులోంచి ఒక శ్లోకం వెలువడింది. రాగయుక్తంగా పాడటం మొదలుపెట్టింది.

"అతులిత బలధామం హేమశైలాభ దే హమ్.

దనుజవన కృశానాం జ్ఞానినామగ్రగణ్యమ్
సకల గుణనిధానం వానరా ణామధీశం
రఘుపతి ప్రియ భక్తంవాత జాతమ్ నమా మి"

ఆమె గొంతులో ఉన్న మాధుర్యంకన్నా ఆమె స్వరంలో ఉన్న కారుణ్యత మమ్మల్ని ముగ్ధుల్ని చేసిందని చెప్పవచ్చు. దేవుడి గది నుండి బయటకి వచ్చాక ఆమె నా భార్యను కౌగలించుకుంది.

"ఇవాళ మీరు నేను పోగొట్టుకున్న గొప్ప సంపదను నాకు మళ్ళీ తిరిగిఇచ్చారు. భగ వంతుడి దయవలన మీరిద్దరూ, మీ పిల్లలూ, అందరూ సిరిసంపదలతో తులతూగాలి. నూరే ళ్ళు బతకాలి"

ఆమె అన్న ఈ మాటలకు నా భార్య కళ్ళలో ఆనందం కనిపించింది.

పాకీవాళ్ళు నేడు చదువుకుంటున్నమాట నిజమే. కానీ ఈ వృద్ధురాలు... పట్టుదలతో ఎట్లాగోట్లా హిందీ చదవడం, వ్రాయడం నేర్చు కుందంటే నమ్మవచ్చు. ఆమెలో ఆ విద్యని తమవర్గం ప్రజలలో ప్రచారం చేయాలన్న పట్టుదల ఉండవచ్చు. కాని ఈ మనిషి సంస్కృతశ్లోకాలు కూడా అతిస్వచ్ఛంగా పాడటం నేర్చుకుందంటే అసలు నమ్మకమే కలగడంలేదు. కాని, మా చెవులు స్వయంగా విన్నాయిగదా. "మంచిది, నేను వెళ్ళివస్తాను. మీ ఇల్లు దారిలోనే ఉందికదా చూసిపోదామని వచ్చాను..." అంటూ ఆమె నా భార్యను వది లేసి ముందుకు నడిచింది.

ఆమెకు స్వాగతసత్కారాలు చేయలేదనీ, అది మా సామాన్య ధర్మం అనీ నాకని పించింది. ఇంతలో "టీ తీసుకోకుండా ఎట్లా వెళ్తారు? ఇప్పుడే తీసుకువస్తాను" అంది నా భార్య.

"తప్పకుండా తీసుకుంటాను. టీయే కాదు భోజనం కూడా చేస్తాను. కానీ ఈరోజు మాత్రం కాదు. నాకు కొంచెం ఆరోగ్యం బాగాలేదు. మావాడి ఇంటికి వెళ్ళాలి"

ద్వారం దగ్గర మళ్ళీ నిర్గుణియా నా భార్య కాళ్లకు దండం పెట్టింది. నాకు పెట్టడానికి ముందుకు వచ్చింది. కానీ నేను వెంటనే వెనక్కి జరిగాను. మెట్లుదిగి ఆమె తన రిక్షా వైపు వెళ్లింది. మరొకసారి మా ఇంటినీ, మా ఇద్దరినీ చూసింది.

"నేను నా కిందటి జన్మలోని నా ఇంటికి వచ్చినట్లుగా అనిపిస్తోంది. మరింక వెళ్లివస్తా ను" అంటూ రిక్షా ఎక్కింది.

ఆమె కంఠం ఏడుస్తున్నట్లుగా ఉంది. ఆమె కన్నీళ్ళనితాగేసిందేమో అందుకే ఒక్క కన్నీటి బొట్టు కూడా కిందపడలేదు.
ఈమె ఎంత వింతమనిషి.

★ ★ ★

నేనూ నా భార్యా ఏదో ఒక సందర్భంలో నిర్గుణియా గురించి చర్చిస్తూనే ఉండేవాళ్లం. "ఆమె తప్పకుండా గొప్ప ఇంటిబిడ్డ అయి ఉండాలనీ, ఇంట్లోనుండి పారిపోయి వచ్చేసి అయినా ఉండాలనీ, లేకపోతే ఎవరయినా లేపుకువచ్చయినా ఉండాలి" అనీ నా భార్య వాదించేది.

అవిధంగా జరగనూవచ్చు, జరగకపోనూవ చ్చు అని నాకనిపించేది. బందిపోటు మోహన్ బహుశ ఏ ఇంటినయినా లూటీ చేస్తున్నపుడు

ఈమెను బలవంతంగా తీసుకువచ్చి ఉండవచ్చు. ఆ అవకాశం కూడా ఉందిగానీ, యువ దంపతులయిన నిర్గుణియా మోహన్‌ల ఫొటో చూశాక నాకు... ఒకటికాదు ఎన్నో ఆలోచనలు వచ్చాయి. మనిషి తన జీవితంలో ఎన్నో రహస్యాలను దాచి ఉంచుతాడు. ఆ రహస్యాల వెనక అనేక కారణాలు ఉంటాయి. ఎవరిలోనైనా ఎన్ని నిజాలు ఎన్ని అబద్ధాలు దాగిఉన్నాయో ఎవ్వరు చెప్పగలుగుతారు? నిర్గుణియా నాకు పరిచయం అయినప్పటినుంచీ ఆమెను మరచిపోదామనుకున్నా మరవలేకపోతున్నాను. ఆమె వ్యక్తిత్వంలో ఏదో ఆకర్షణ ఉంది. ఇది మాత్రం నిజం. ఒకవేళ ఈ వృద్ధురాలు చరిత్రహీనురాలే అయితే ఆమెను అందరూ ఎందుకంతగా ప్రశంసిస్తారు. నిర్గుణియా ఉండే బస్తీలోనేకాదు మరో రెండు మూడు బస్తీలలో కూడా ఆమెను గురించి మంచిగానే విన్నాను. నగరంలో ఎంతోమంది పాకీవాళ్లకి ఆమె విద్య నేర్పించేదని, స్వయంగా ఒక స్కూల్ కూడా నడుపుతూ ఉండేదని విన్నాను. స్వాతంత్రసమరం సమయంలో ఆమె జైళ్ళకు కూడా వెళ్ళిందట.

ఏమైనా ఆమె ఒక చిక్కుప్రశ్న లాంటిదే.

ఓరోజు నిర్గుణియా దగ్గరనుండి ఉత్తరం వచ్చింది

గౌరవనీయులైన మాస్టర్‌గారి చరణకమలాలకి నమస్కారములు. మీరు మా ఇంటికి ఒకసారి రాగలరు. ఎప్పుడు వస్తారో ఫోన్‌చేసి చెప్పగలరు. అని ఉంది ఆ ఉత్తరంలో.

ఉత్తరంమీద అడ్రెస్, ఫోన్‌నంబరు ఉన్నాయి. శ్రీమతి నిర్గుణిమోహన్ బి.ఎ. అని వ్రాసివుంది. నేను వెంటనే ఫోన్ చేశాను. నిర్గుణియా కంఠం వినిపించింది.

"ఆ... ఆ.... నమస్కారాలు. మీ ఇంటిదగ్గర నుండి వచ్చినప్పటినుంచి నేను ఇక్కడే ఉంటున్నాను. పూర్తిగా మంచం ఎక్కలేదు. గానీ జ్వరం వచ్చింది. ముసలితనం అన్నాక ఇక తప్పదు, ఏదో ఒకటి వస్తూనే ఉంటుంది. ఆ... ఇప్పుడు బాగానే ఉన్నాను. మీరు ఇవాళ రాగలుగుతారా? తప్పకుండా రండి. మా ఇంట్లో భోజనం కూడా చేయాలి బాబుగారూ! అమ్మగారిని కూడా వెంట తీసుకురండి"

"ఆమెను తీసుకువస్తే మర్యాదలు చేయటంలోనే కాలం గడిచిపోతుంది. నేను మీతో మాట్లాడాలి"

అటువైపు నుండి చిన్నగా నవ్వు వినిపించింది. "మాటలు రేపు... ఇవాళ మాత్రం భోజనం... సరేనా... భార్యాసమేతంగా రమ్మని విన్నవించుకుంటున్నాను"

ఎందుకో ఈమె తన గురించిన అసలు విషయాలు నాకు ఎక్కడ చెప్పాల్సివస్తుందో అని ఎలాగోలా దాటేస్తోంది. ఎందుకో ఆమె చరిత్ర అంతగా...

"నేను ఒక్కడినే వస్తాను"

"అయితే భోజనంతోపాటు డ్రింక్ కూడా తీసుకోవాలి... సరేనా...".

మళ్ళీ నేను జవాబు చెప్పేలోపల ఫోన్ కట్ అయింది.

ఆమెలోని వాక్‌పటుత్వం, చిలిపితనం, విలాసత్వం, రాజసం అన్నీ కలిపి నా మనోనేత్రంముందు ఒకరూపం కదలాడసాగింది. మరుక్షణం... ఆమె తాలూకు మరో రూపం కూడా నా ఊహలో మెదిలింది.

సాయంత్రం ఆరుగంటలకు నిర్గుణిమోహన్ ఇంటికి వెళ్లాను. చామనఛాయకల ఒక యువతి నన్ను లోపలికి ఆహ్వానించింది. ఆమె అందంగా ఫాషనబుల్‌గా ఉంది.

"ఆవిడ బయటకి వెళ్లారు. మీరు వస్తారనీ, వస్తే కూర్చోపెట్టమనీ నాకు చెప్పి వెళ్లారు"

నేను కూర్చున్నాను.

"ఎన్.ఎమ్.గారు బాత్‌రూమ్‌లో ఉన్నారు. మీరు మా ఇంటికి రావడం మా అదృష్టం. మీరు వ్రాసిన ఎన్నో వ్యాసాలు, రచనలను చదివాను"

"మీరు నిర్గుణియాగారి కోడలా?"

"అవును"

"మీరు మీ విద్యాభ్యాసం ఇక్కడే చేశారా?"

"నేను ఢిల్లీలో చదివాను. ఇంతకుముందు ఢిల్లీ పి.ఐ.బి.లో స్టెనోగా పనిచేసేదాన్ని. ఎన్.ఎమ్.కూడా అక్కడే పనిచేసేవారు. మా స్నేహం పెరిగి తరువాత ఇద్దరం పెళ్లిచేసుకున్నాం. పెళ్ళికిముందు మావాళ్లు ఎన్.ఎమ్.కి

బాప్టిజం ఇప్పించమని అన్నారు. కానీ అత్తగారు తన కొడుకు క్రిస్టియన్ కావడం ఇష్టం లేదన్నారు. నీలమ్‌నే శుద్ధిచేసి హిందూమతం ఇప్పించండి అని మా వాళ్ళతో అన్నారు. మా అంకుల్, బ్రదర్స్ అందరూ వ్యతిరేకించారు. కానీ నేను పట్టుబట్టి హిందువుగా మారిపోయాను.

నిర్గుణియాని గురించిన ఓ రహస్యం బయటపడింది. క్రిస్టియన్‌ని శుద్ధిచేసి హిందువుగా మార్చిందామె.

''అయితే మీకు క్రైస్తవ హిందూమతాలలో ఏమైనా బేధం కనిపించిందా?'' ఆమె కిలకిలా నవ్వింది. కానీ ఆ నవ్వు సహజంగా వచ్చింది కాదనిపించింది.

''మతం మిమ్మల్ని ఏవిధంగా టచ్ చేస్తుందో మమ్మల్ని అంటే ఈ యువతరాన్ని అంతగా టచ్ చేయదు''

''అయితే మీరు ఏవిధంగా ఫీలవుతారు?''

''నిజం చెప్పమంటారా? ఏమీ అనుకోరుకదూ! ఇవాళ నీలంచీర రేపు పచ్చచీర, ఎల్లుండి గులాబీచీర మార్చినట్లుగా మతాన్ని కూడా రోజూ మార్చుకలుగుతాను. ఈ మతం అనేది పైకులాలవాళ్ళు ఆడే ఓ నాటకం, బూటకం! నాకు దేవుడిమీద నమ్మకం ఉంది. అంతే! మతం మీదకాదు''

ఏవిధంగా అయితే తక్కువ కులాలవాళ్ళను చూసి పైకులాలవాళ్ళు అసహ్యించుకుంటారో అదేవిధంగా నీలమ్ కంఠంలో పైకులాలవాళ్లమీద అసహ్యత స్పష్టంగా కనిపించింది. ఇంతలో నిర్గుణిమోహన్ వచ్చాడు. అతడు ఎర్రగా ఉన్నాడు. బహుశ తండ్రి రంగు వచ్చి ఉండవచ్చు. ముఖం ముదురుగా ఉంది. చాలా అభిమానం కలవాడు అని అతడిని చూడగానే అనిపిస్తుంది. అతడు నమస్కారం చేశాడు. నేను ప్రతినమస్కారం చేశాను.

''మీకు మన మంత్రిగారు తెలిసే ఉండవచ్చు''

''తెలుసు...''

''బాబుగారూ! నిత్యం మా షెడ్యూల్‌కులాలవారిమీద అత్యాచారాలు జరుగుతూనే ఉంటాయి. అంబేద్కర్ బౌద్ధుడుగా మారినట్లే నాకూ మతం మార్చుకోవాలనిపిస్తోంది. క్రిస్టియన్‌లలోనయినా లేక ముస్లింలలోనయినా కలిసిపోవాలనిపిస్తుంది. హిందూమతం మూర్ఖుల మతం''

''మీరు ముస్లింలలో కలిసినా లేక క్రిస్టియన్‌లలో కలిసినా మీకు ఒరిగేది ఏమీలేదు. అన్ని మతాలలో ఏదో ఒకరకమయిన మూర్ఖత కనిపిస్తూనే ఉంటుంది?''

''మీరు సరిగ్గానే చెప్పారు. మనం నాస్తికులమయితే ఏ గొడవా లేకపోను. అయినా మాకు దేవుడియందు విశ్వాసం ఉందికానీ మతంలో కాదు'' అంది నీలమ్.

''కాని మనం దేవుడిని తెలుసుకోవాలనుకుంటే, ఏదో ఒక మతంలో చేరకతప్పదు'' నిర్గుణిమోహన్ అన్నాడు..

అగ్రవర్ణానికి చెందిన నన్ను వీళ్లు గేలిచేస్తున్నారేమో... నాకులాన్ని వీరు వెక్కిరిస్తున్నారేమో అని నాకనిపించింది. నేను అక్కడ కూర్చున్న కాసేపటిలో ఎన్నో సత్యాలను తెలుసుకున్నాను. ''నీలమ్ టీ తొందరగా తీసుకురా... నేను వెళ్ళాలి'' అంటూనే అతడు నావైపు తిరిగాడు. ''మా మదర్ కారణంగా మీరు ఇక్కడికి వచ్చారు. మా ఇల్లు మీ రాకతో పావనం అయింది. మా అమ్మ ఓ గొప్ప తపస్విని బాబుగారూ! మమ్మల్నామె ఎంతో కష్టపడి చదివించింది. ఆకలితో తన కడుపు మాడుతున్నా మాకు పంచభక్ష్యపరమాన్నాలు పెట్టి ఏ లోటు రానీయకుండా పెంచింది.

నిజం చెబుతున్నాను. షీ ఈజ్ ఎ గ్రేట్ వుమన్. నేను అమ్మ దగ్గరనుండే ఆత్మాభిమానం ఎట్లాంటిదో దాన్ని ఎట్లా రక్షించుకోవాలో నేర్చుకున్నాను''

ఇంతలో నిర్గుణియా లోపలికి అడుగుపెట్టింది.

''మీ కోసమే బజారుకు వెళ్ళాను బాబుగారూ! ఇవాళ పనేదో ఉందని వంకచెబుతూ మీరు త్వరగా బయటపడతారు. నేను మిమ్మల్ని తాగించకుండా పంపించను. వెళ్ళేటప్పుడు కారులో వెళ్దురుకాని. నేను మోహన్‌కి చెప్పాను'' అంది నిర్గుణియా.

మోహన్... కొడుకు పేరు, ఈ శబ్దం ఆమెకు

ఎప్పుడూ అతని తండ్రిని గుర్తుకుతెస్తూ ఉంటుంది. తన పేరు భర్తపేరు కలిపి పిల్లవాడికి పెట్టడం బహుశ ఒక్క నిర్గుణియానే చేయగలుగునేమో. ఇటువంటి ఆలోచన ఈమెకి ఎట్లా వచ్చింది?

"ఇవాళ నేను ఓ పెద్ద మనిషిని, అందులోను ఓ శ్రోత్రియ బ్రాహ్మణుడిని భ్రష్టుడిని చేయాలని సంకల్పించాను. ఈ పండితుడిని, ఒక పాకీస్త్రీ ఇంట్లో తినిపించి తాగించి పంపిస్తాను" నిర్గుణియా నవ్వుతూ అన్నది.

"మీ పుత్రుడు పి.ఐ.బి.లో పెద్ద ఆఫీసర్. నేను అతనితో కూర్చుని భోజనం చేస్తున్నట్లుగా ఓ ఫొటో తీయించి దాన్ని పేపర్లలో వేయించండి. నా గౌరవం పెరుగుతుంది. మీరు నన్ను భ్రష్టుడిని చేసినందుకు నాకు ఫలితం దక్కుతుంది. వాహ్ శర్మగారూ! మీరే నిజమైన కమ్యూనిస్టులు అని అందరూ నన్ను పొగుడుతారు" నేను నవ్వుతూ అన్నాను. గదిలో ఉన్న తక్కినవాళ్లు పెద్దగా నవ్వారు.

టీ తీసుకున్న తరువాత నిర్గుణిమోహన్, అతడి భార్య నీలమ్ వెళ్లిపోయారు.

నిర్గుణియా నన్ను లోపలి గదిలోకి తీసుకువెళ్లింది. ఈ గదిలో గోడమీద నిర్గుణియా మోహన్ల ఫొటో ఉంది. నన్ను కుర్చీలో కూర్చోమని చెప్పి ద్వారందాకా వెళ్లి బెట్టీ... బెట్టీ... అంటూ పిలిచింది.

"ఆ వస్తున్నా అమ్మగారూ..."

నిర్గుణియా చిన్న టీపాయ్ తీసుకువచ్చింది, "ఈ ఇంట్లో పిల్లా, జెల్లా లేరు. నీలంకి నేనంటే ఎంతో ఇష్టం. ఇద్దరూ నన్ను ఇక్కడే ఉండమంటున్నారు"

"ఇక్కడ ఉండటంవలన మీకూ సుఖంగా ఉంటుంది. ఈ వయస్సులో కొడుకు, కోడళ్ల దగ్గరే ఉండటం ఉచితం అని నేననుకుంటున్నాను"

"నిజమే బాబుగారూ! కానీ వీళ్లకి ట్రాన్స్ఫర్లు అవుతూపుంటాయి. హరిచరణ్ ఇక్కడ హరిజనమంత్రి కావడంవలన నిర్గుణిమోహన్ కి ఇక్కడ ఛాన్సు దొరికింది. వాళ్లు కూడా వేరేకులంవాళ్లు. మమ్మల్ని వాళ్ళూ నీచంగానే చూస్తారు. ఏమో ఎప్పుడు ఆయన ఎట్లా మారుతాడో. అయినా ఈ గవర్నమెంట్ ఉద్యోగాల సంగతి చెప్పాలా! వీళ్ళతో ఎక్కడెక్కడని తిరగను. నాకు స్వతంత్రంగా ఉండటం అంటేనే ఇష్టం"

బెట్టీ ద్వారం దగ్గర వచ్చి నిల్చుంది. అమ్మగారి ఆజ్ఞకోసం ఆమె ఎదురుచూస్తోంది. నిర్గుణియా ఆమెను చూసి కూడా చూడనట్లుగా నాతో మాట్లాడుతూ తన రాజసం చూపిస్తోందేమో అని నాకనిపించింది. బెట్టీని అంతగా పట్టించుకోకుండా నిర్లక్ష్యం చేయగల అధికారం ఈమెకేముంది. ఎన్నో యుగాల నుండి అతి నీచంగా చూడబడుతున్న జాతికి చెందిన ఒక స్త్రీ, ఆమె పరివారం ఈనాడు ఎంత ఉన్నతదశకు వచ్చారంటే తమకన్నా కూడా ఇంకొకరిని హీనంగా చూడగలుగుతున్నారు.

నిర్గుణియా సంచిలోంచి విస్కీ, సోడాబాటిల్స్ తీసి టేబుల్మీద పెట్టింది.

"దీని కారణంగానే విధి నన్ను ఎన్నో ఆటలు ఆడించింది"

"అమ్మగారూ..." మళ్ళీ బెట్టీ పిలిచింది.

"ఆ... చూడు... ఈయన చాలా పెద్దబాబుగారు. పత్రికలలో నలుపుని తెలుపుగా, తెలుపుని నలుపుగా చేసి చూపించగలరు. వీరికి నీవు మంచి భోజనం పెట్టాలి. జీవితాంతం నీ వంట వీరికి గుర్తుండాలి. ముందు నాకు రెండు గ్లాసులు తెచ్చి ఇయ్యి. అట్లాగే తినడానికి కూడా ఏవైనా తీసుకురా. ఆ చూడు, ఈ సంచిలో పానీర్ ఉంది. కాస్త పెద్ద పెద్ద ముక్కలుగా కోసి మాకు పకోడీలు తయారుచెయ్యి. నీకోసం కూడా కొంచెం ఉంచుకో. నీ ముసలాడితో కూర్చుని తాగుదువుకాని. ఆ... చూడు... మీ సాహెబ్కోసం ఎవరైనా వస్తే లోపల నేను ఉన్నానని చెప్పొద్దు. నేను ఈ బాబుగారితో ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి"

కొంచెంసేపు రాజకీయ విషయాలు మాట్లాడుకున్నాము. ఆమె తాగడం మొదలుపెట్టింది. ఆమె విస్కీని సిప్ చేయదు. వెంట వెంటనే గుటకలు మింగుతుంది. అరనిమిషంలో సగంగ్లాసు ఖాళీ అయింది. నేను సమయం చూసి అడగటం మొదలుపెట్టాను.

"నిర్గుణియాగారూ! మీరు సంస్కృతం ఎక్కడ నేర్చుకున్నారు?"

"ప్రత్యేకంగా ఏ మాస్టరుని పెట్టి నేర్చుకోలేదు. కానీ నాకు చాలా శ్లోకాలు గుర్తు ఉన్నాయి"

"మీకు వీటిని నేర్చుకునే అవకాశం ఎలా దొరికింది"

ఆమె గ్లాసులో మిగిలిఉన్న విస్కీని తాగేసింది. గ్లాసు టేబిల్‌మీద పెట్టి రెండు చేతులతో తలపట్టుకుంది. ఆమె కుడిచేతివేళ్ళ మధ్య సిగరెట్టు అట్లాగే ఉంది. సిగరెట్టు ఆమె చీరమీద ఎక్కడ పడుతుందో అని నాకనిపించింది. అందుకే లేచి ఆమె దగ్గరికి వెళ్ళాను. ఆమె ఆశ్చర్యంగా చూసింది. "మీరెందుకో బాధపడుతున్నట్లున్నారు" నేను మళ్ళీ వచ్చి కూర్చున్నాను.

"ఇది రోజూ ఉన్నదే. జన్మంతా ఇట్లాగే గడిచిపోయింది. ముందు పట్టుదలకి పోవడం తరువాత తల కొట్టుకుని కొట్టుకుని పశ్చాత్తాప పడటం" అంటూ ఆమె నవ్వింది.

మళ్ళీ సరిగ్గా కూర్చుంటూ నా గ్లాసువంక చూసింది. "ఇంకా మీ గ్లాసు సగం కూడా ఖాళీ కాలేదు. నేను రెండోగ్లాసు తాగబోతున్నాను. అయినా ఇప్పటివరకూ ఒకేఒక్క గ్లాసు నన్నెప్పుడూ మత్తులో పడేయలేదు" అంటూ తన గ్లాసులో మళ్ళీ విస్కీ పోసుకుంది. నా గ్లాసులో కూడా పోయబోయింది గానీ నేను వద్దని చెయ్యి అడ్డంపెట్టాను.

"మీరు నా విషయం వదిలివేయండి. నేను రెండు పెగ్‌లకన్నా ఎక్కువ తాగను. కానీ మీరు నాకు ఎంతమాత్రం అర్థంకావడంలేదు. మీరు సంస్కృత శ్లోకాలు చదవగలగడం నాకెంతో ఆశ్చర్యంగా ఉంది. మీ కోడలిని మీరే క్రైస్తవమతంనుంచి హిందూమతంలోకి మార్చారని విన్నాను. మీ నోటినుండి అల్లా అన్న శబ్దం కూడా విన్నాను"

"ఇందులో ఆశ్చర్యం ఏముంది? నేను ఒకప్పుడు పనిచేసిన ఇళ్ళలో హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు అందరూ ఉండేవారు. మేం భగవంతుడిని, అల్లాని ఇద్దరిని నమ్ముతాం. ఎవరి ధర్మం వాళ్ళదే అనుకోండి. దాన్ని ఎవరూ మార్చలేరు. స్వధర్మే నిధనమ్ శ్రేయం పరధర్మో భయావహః" అంటూ మరో గుక్కతాగింది.

నాకు ఆశ్చర్యం ఎక్కువ కాసాగింది. "ఈ సంస్కృతం ఏ యజమాని దయవల్ల వచ్చింది?"

"ఏ యజమాని దయవలనా రాలేదు. ఆ దేవుడి ప్రభావంవలన వచ్చింది. స్వార్థపరులైన ఆ యజమానులవలన ఏ స్త్రీకీ ఏమాత్రం, మంచి జరుగదు. కపటులైన ఆ పండితులకన్నా ఈ నవాబ్ బాద్‌షాలే ఎంతో నయం అనిపిస్తారు. ఎవరిని కావాలనుకుంటే వాళ్లని గౌరవంగా, ప్రేమగా చూసేవాళ్లు. ఒక నవాబు తను కోరుకున్న డోమినీ (ఒకజాతి పేరు) స్త్రీని అందరి ఎదురుగుండానే చేరదీసి ఉంచుకున్నాడు. వారు ఎవ్వరికీ భయపడకుండా తను కోరుకున్న పడతిని తన స్థితికి తగ్గట్లు ఎక్కడో ఒకచోట ఉంచేవాళ్లు. గొప్ప గొప్ప బేగమ్‌ల దర్బార్‌లలో డోమినులను వేశ్యలుగా కూడా ఉంచుకునేవారు"

"అందరు డోమినులు మీ జాతివారే కారు. నా ఉద్దేశంలో అణచబడిన కొన్నివంశాలవాళ్ళే ఈ జాతివాళ్ళుగా మారిపోయి ఉండవచ్చు. వాళ్ళ దగ్గర బాజాలు వాయించే విద్య ఉండేది"

"ఆ విద్య వాళ్ళందరి దగ్గరా ఉన్నది"

"మీ దగ్గర కూడా ఉందా?"

"నేను పాకీస్త్రీని కాను బాబుగారూ!" అంటూనే ఆమె నాలుక కరచుకుంది.

ఒక్కక్షణం అయ్యాక ఆమె నోటినుండి మాటల ప్రవాహం వెలువడింది. "అసలు ఇక్కడ మా స్త్రీలకు ఆటా పాటా నేర్పించరు. దానివలననే ఎందరో స్త్రీలను మా జాతివాళ్లు పోగొట్టుకున్నారు. ఇప్పుడయితే కేవలం మొగవాళ్ళే బాజాలు వాయిస్తారు. మా కులంలో కూడా బాండ్‌బాజా, క్లారినెట్, వైలిన్, హార్మోనియమ్ వాయించగల ఉస్తాద్‌లు ఎందరో ఉన్నారు. పాటగాళ్ళు కూడా చాలామంది ఉన్నారు. పండితులు కథలలో గంధర్వజాతి గురించి చెబుతూ ఉంటారే ఆ గంధర్వుల సంతానమే మా జాతి అని నేననుకుంటాను"

"అంటే మీ జాతివాళ్ళందరూ ఒకే గోత్రానికి చెందినవాళ్ళని మీరంటారా?"

''అవును''

''ఈ నగరంలో కొన్నిచోట్ల ఇంటర్వ్యూలు తీసుకున్నప్పుడు కొన్ని సత్యాలు తెలుసుకున్నాను. మీ జాతివాళ్ళల్లో కూడా ఎన్నో గోత్రాలు ఉన్నాయి. వాల్మీకి థామత్, రావత్, లాల్‌బైగీ, జిల్లార్ మొదలగునవి''

''అవును నిజమే''

''వాళ్ళవాళ్ళ ఆచార వ్యవహారాలు కూడా వేరువేరుగా ఉన్నాయి''

''ఇది కూడా సత్యమే''

''అయితే మరి అందరూ ఒకే గోత్రంవాళ్ళు ఎట్లా అవుతారు?''

ఆమె ఒక గుక్క తాగింది. ''పీడితులు తాడితులందరూ ఒకే గోత్రం, ఒకే వర్ణంకాక మరేమవుతారు బాబుగారూ!''

ఈ స్త్రీ ఎంత చతురత కలది. అసలు సంగతి బయటపెట్టకుండా ఎంత జాగ్రత్త పడుతోంది.

__నాలో ఆమె నోటినుండి నిజం చెప్పించాలన్న పట్టుదల ఎక్కువయింది.

''నిర్గుణీయాగారూ! ఇంతకు ముందు మీరు పాకీజాతికి చెందినవారుకాదని అన్నారు కదూ!''

గ్లాసులో విస్కీ చాలా భాగం తాగేసిందామె.

''ఆ... అదా...! నేను ఒక్కోసారి ఏదో ఆవేశంలో కిందటి జన్మకు చెందిన బ్రాహ్మణురాలిని, పాకీదాన్ని కాదు అంటూ ఉంటాను'' నిర్గుణియా నవ్వింది. ''శర్మగారూ! మీరు జర్నలిస్టు కాకుండా ఉండాల్సింది. ప్లీడరుగిరీ చేస్తే బాగుండేది. పేరుతోపాటు ధనం కూడా సంపాదించి ఈ పాటికి కోటీశ్వరులై ఉండేవారు కాని అట్లా ఎందుకవుతుంది. మన ఖర్మ మనలని ఏ విధంగా ఆడించాలో అదేవిధంగా ఆడిస్తుంది. ఓహ్... ఈ సంగతి వదిలేయండి. ఏదీ మళ్ళీ గ్లాసు నింపుకోండి''

నేను బాటిల్‌ని ఒంపి అర పెగ్గు విస్కీని గ్లాసులో పోసుకున్నాను.

''శర్మగారూ! ఒక మాట చెప్పనా... నా జీవితంలో ఈ రోజు నాకు రెండో దేవుడు కనిపించాడు''

''అయితే ఇంతకు ముందు కనిపించిన దేవుడే మీకు సంస్కృతం నేర్పించాడా? మీ భర్త మోహన్ చనిపోయాక ఆయన మీకు కనిపించాడా?''

''ఊహు... మోహన్ చనిపోయాక కాదు. అతడు నా బాల్యంలోనే కనిపించాడు''

''అయితే మీకు తిండి బట్ట ఇచ్చి సంరక్షణ చేశాడా?''

''ఊ...''

''మిమ్మల్ని వాళ్ళ ఇంట్లో ఉంచుకుని పెంచాడా?''

''అవును అతడే నన్ను పెంచాడు''

''మీ అమ్మ వాళ్ళ ఇంట్లో పనిచేస్తూ ఉండేదా?''

''మా అమ్మ ఆ దేవుడి గారాల బిడ్డ. ఆయనకు ఆమె ఒక్కతే సంతానం''

''అయితే ఆ రోజులలో ఆ దేవుడిని కులంనుండి వెలివేసి ఉండవచ్చుకదూ!''

''అటువంటి తపస్సంపన్నుడిని, నూతన ఆచారాలు పాటించే ఛాందస బ్రాహ్మణ పండితుడిని వెలివేయడానికి ఎవరికి గుండెలున్నాయి'' అంటూనే ద్వారంవైపు చూస్తూ పెద్దగా కేకవేసిందామె. ''బెట్టీ భోజనం తీసుకురా...'' ఇప్పుడు నిర్గుణియా రూపం నా ముందు మరోలా కనిపిస్తోంది. ఆమె కొంచెం అర్థం అవుతోంది.

''మీరు మీ మోహన్ ప్రేమలో పడి ఆ ఇంటిని వదిలేశారు కదూ'' కుర్చీమీద సరిగ్గా కూర్చుంటూ నేనన్నాను.

''ప్రేమ తరువాత కలిగింది. కాని ఆకలి అనేది ఒకటుందిగా...''

''అయితే మీరు విధవగా జీవితం గడిపారా?''

''శర్మగారూ! మీరు దయచేసి ఇంకేమీ అడగకండి. ఇప్పటికే నా గురించి మీరు చాలా తెలుసుకున్నారు. మీరు ఇవాళ నిర్దయగా నాలోని గాయాన్ని రేపినట్లుగా అనిపిస్తోంది''

''మీరు పొరపాటు పడుతున్నారు. నాకు అసలు అట్లాంటి ఉద్దేశ్యమేలేదు'' నేను కొంచెం గాభరాగా అన్నాను.

''మీరు మాజాతి వాళ్ళని ఇంటర్వ్యూలు

చేస్తున్నారని తెలిసినప్పటినుండి ఎందుకో నాకు మిమ్మల్ని చూడాలనీ, మాట్లాడాలనీ అనిపించింది. నా మనస్సు నాకు తెలియకుండానే నన్ను మీవైపు లాక్కొచ్చింది. అప్పటినుండే నా మనస్సులో ఎవరో 'నిర్గుణియా నీ మనస్సు విప్పి ఆయనతో మాట్లాడు. లేకపోతే నీకు శాంతి ఉండదు' అని అంటున్నట్లుగా అనిపించేది. మిమ్మల్ని కలిశాక నా మనస్సు కూడా దీనికి నిస్సంకోచంగా ఒప్పుకుంది''

''ఈ మాత్రం అయినా మీరు నాతో మాట్లాడి నామీద ఎంతో దయచూపించారు. నేను ఈ పని మొదలెట్టినప్పటినుండి మిమ్మల్ని కలవాలనీ మీతో మాట్లాడాలనీ అనిపించేది. అందుకే మిమ్మల్ని కలవాలని ఎంతో ప్రయత్నంచేశా



ను. నాకు తెలియని ఏదో శక్తి నన్ను మీ ముందుకు తీసుకువచ్చింది. నా మనస్సును ఆక్రమించుకున్న సన్నజాజుల పరిమళం, దుర్గంధం వెండి వెన్నెల, నల్లటి అమావాస్య ఇవాళ నా కలంద్వారా బయటకు రాబోతున్నాయి''

బెట్టీ భోజనం తెచ్చింది.

భోజనం చేసి తిరిగి వస్తూ ఉండగా నిర్గుణియా నాకో నోట్‌బుక్ ఇచ్చింది.



"ఇదిగో ఇది తీసుకోండి. నా అనుభవాలని ఇందులో వ్రాద్దామని ప్రయత్నించాను. వ్రాయలేని విషయాలు కొన్ని వదిలివేశాను. ఇది చదవండి. బహుశ మీకు కావలసిన విషయాలు దొరుకుతాయేమో..." అంది.

నా మనసు ఎప్పుడెప్పుడు ఇంటికి వెళ్దామా నిర్గుణియా జీవిత రహస్యాలు ఎప్పుడెప్పుడు తెలుసుకుందామా అని ఉరకలు వేయసాగింది.



నిర్గుణియా ఆ నోట్‌బుక్‌లో వ్రాసిన ఈ అధ్యాయంలో నేను అక్కడక్కడా కామాలు, ఫుల్‌స్టాప్‌లు మాత్రం పెట్టాను. అక్కడక్కడా కొన్ని తప్పులు దిద్దాను. అంతే... తక్కినదంతా ఆమె ఎట్లా వ్రాసిందో అట్లాగే ఉంది. ఇహ చదవండి.

"ముద్రణాయంత్రం వచ్చినప్పటినుండి మా ఇళ్ళల్లో మనస్సుల్లో ఒకే దేవుడు నిలిచిపోయాడు. తులసీదాసు రామాయణమే మా అందరికీ కనిపించే దైవం. ఇప్పటికీ మా వాళ్ళల్లో ముసలివాళ్ళు పైకులాలవాళ్ళకి తెలియకుండా, భయపడుతూనే అయినా రామాయణగ్రంథం దాచుకుంటూ ఉంటారు. ఈ పవిత్రగ్రంథంతోటే రోగాలూ, రొష్టులూ దూరంచేసుకుంటూ ఉంటారు.

ఇవాళ వసంత పంచమి.

నాకు ముప్పై ఒక్క వసంతాలు వచ్చాయి.

ఈ శరీరంలోనే నేను ఒక జన్మ వదిలి మరో జన్మలో ప్రవేశించాను. మన నొసటన వ్రాసిన వ్రాతలు ఎంత వింతగా ఉంటాయి. ఇదంతా విధివిలాసం. ఈ లలాటలిఖితం మనిషిని ఒక్కక్షణంలో మార్చివేస్తుంది. మనిషి జీవితాన్ని తన ఇష్టంవచ్చినట్లు ఆడిస్తుంది. ఒక్కక్షణం ఆకాశానికి ఎత్తేస్తుంది. మరొకక్షణం అధోగతికి తోసేస్తుంది. నీలాకాశంలో హాయిగా విహరించే పక్షి రెక్కలను నరికేసి నేలమీదకు తోసేస్తుంది.

విధిచేతిలో మనం కీలుబొమ్మలం. మనుమల బ్రతుకులతో ఈ విధి తన ఇష్టంవచ్చినట్లు ఆడుకుంటుంది. మనిషిని పూర్తిగా మసిగా మార్చేసే శక్తి కూడా దానికి ఉంది.

ఇవాళ ఈ వంటరితనం నన్నెందుకో నిలవనీయడంలేదు. నాలోని వేదనను కాగితం మీద పెట్టాలని అనిపిస్తోంది.

జీవితం సత్యాసత్యాల సమ్మిశ్రణం.

ఇప్పుడు నేను కాగితం, కలం లేకుండా బతుకుతాను. ఆనాడు తులసీదాసు కూడా తన వేదనను, తనలో ఉప్పొంగుతున్న భావాలను వ్యక్తం చేయడానికేగా కాగితం, కలం పట్టింది. మరి నేనూ ఆ పని ఎందుకు చేయకూడదు.

తులసీదాసు ఒక పద్ధతిలో భక్తిలో విరక్తిలో ముక్తిని పొందాడు. సరిగ్గా వీటికి వ్యతిరేకమయిన పని చేసి నేను రాముడిని దర్శించాను.

ఇప్పుడు తాగి మత్తులో మునిగి ఉన్నాను. ఈ మత్తులో నేను అసత్యం అనేది పలుకను. నా జీవితం గురించి పూర్తిగా ఎటువంటి రహస్యాలనీ దాచకుండా వ్రాయలని ఉంది. కాని ఎక్కడ నుండి మొదలుపెట్టను?

నేను గొప్పవంశంలో పుట్టాను.

నా తండ్రి ఒక గొప్ప షావుకారు దగ్గర గుమస్తాగా పనిచేసేవాడు. నా తల్లి ఒక గొప్ప పండితుడి ముద్దుల కూతురు.

నా తల్లి మంచి సంస్కారవంతుల ఇంట్లో పుట్టింది కాని నా తండ్రి...!

ఆ పరిమళం ఎక్కడ? ఈ దుర్గంధం ఎక్కడ? ఆ ఇల్లు వెన్నెలంత; మంచు బిందువులంత పవిత్రమయింది. మరి ఈ ఇల్లు...!

ప్చ్... ఏం చెప్పను. ఆ ఇంటికి ఈ ఇంటికి ఆకాశ పాతాళాల అంతరం ఉంది. యజమాని కోడలు నా తండ్రిని ఉంచుకుందన్న విషయం

నాకు చిన్నప్పుడు మా అమ్మమ్మా, తాతయ్యా, చుట్టుపక్కల వాళ్ళూ చెప్పేవాళ్ళు. తరువాత నేను నా కళ్ళతో ఆ నిజాన్ని చూశాను. నేను ఆమెను చూడనంతవరకు ఈ ముసలివాళ్ళు చెప్పే విషయం నాకెంతమాత్రం అర్థంకానిది గానే ఉండేది. నాకు పన్నెండేళ్ళు వచ్చేవరకూ కూడా ఈ విషయం సమస్యగానే ఉంది.

ఆ పన్నెండు సంవత్సరాలు...! వసంతం ఆ పన్నెండు సంవత్సరాల కాలంలో మాత్రమే నావెంట వుంది. అట్లాంటి రోజులు మళ్ళీ రావు. గడచిపోయిన కాలం మళ్ళీ ఎప్పుడయినా వచ్చిందా? ఏమో వచ్చినా రావచ్చు. వస్తుందికూడా... తులసీదాసు దగ్గరికి శ్రీరామచంద్రుడు వచ్చినట్లుగా నా మోహన్ నా దగ్గరికి...! కాని శ్రీరామచంద్రుడు తులసీదాసుకి రుద్రాక్షమాలలో కనిపించాడు. భక్తిలో కనిపించాడు. మరి నాకు నా మోహన్ మద్యపానంలో కనిపించాడు. ప్చ్... రెండింటికీ ఎంత భేదం...

ఇవాళ వసంత పంచమి.

పరమ పూజ్యులయిన మా తాతయ్యగారి ఇంట్లో ఈ రోజు ఏటేటా పెద్ద ఉత్సవం జరిగేది. నాలుగు దిక్కులనుండి కనీసం ఏభై మంది పండితులు వచ్చేవారు. వాళ్ళు వేదపఠనం చేసేవాళ్ళు, దేవుడి కథలు చెప్పేవారు. రోజంతా వేదపఠనంతో ఆ ప్రదేశం మారుమ్రోగేది. ఎంత ఆనందంగా ఉండేది.

ఖర్చంతా మా తాతయ్యే భరించేవాడు. పెద్ద పండగలాగా ఉండేది. దాదాపు నాలుగు వేలమంది పట్టే పెద్ద మైదానం మా తాతగారి ఇంటికి ఎదురుగుండా ఉండేది. బస్తీలో ఆరొందల ఇళ్ళదాకా ఉన్నాయి. మా తాతయ్యే పురాణాలు చెప్పేవారు. అసలయితే ఆయన వ్యాకరణంలో పండితుడు. చదువుకున్నవాడు, కాని బతుకుతెరువుకోసం ఆయన ఈ పనిచేసేవారు. ఆయనకు మంచి కంఠం ఉండేది. బాగా పాడేవారు. అవి హార్మోనియమ్ కొత్తగా వచ్చిన రోజులు. ఎప్పుడూ వాయిస్తూ పాడుతూ ఉండేవారు. తులసీరామాయణం, భాగవతం, శివపురాణం, గరుడ పురాణం చెప్పేవారు. ఆయన చెప్పేతీరు ఎంతో బాగుంటుంది, పిల్లలు కూడా తలలు ఊపుతూ కూర్చుని వినేవాళ్ళు. పళ్ళెంలో దక్షిణ చాలా వచ్చేది. ఆయనకి నా తల్లి ఒక్కతే సంతానం కనక ఎక్కువ ఖర్చు ఉండేది కాదు. అందుకే సంపాదించిందంతా గొప్ప మనస్సుతో ఖర్చు చేసేవారు. ఎన్నో దానాలు, పుణ్యకార్యాలు చేసేవారు. ఆయన గృహస్థ జీవితం గడిపినా అచ్చం ఒక సన్యాసిలా బతికారు. రాత్రి మూడు గంటలకు లేచి గంగాస్నానం చేయడానికి నడిచి వెళ్ళేవారు. మూడు కాలాలలో ఆయన ఎప్పుడూ తన నియమం తప్పేవారు కాదు. రాగి చెంబుతో నీళ్ళు తెచ్చుకునేవారు. ఆ నీళ్ళనే రోజంతా వాడుకునేవారు. నాకు తెలిసినంతవరకు గంగాజలం తప్పితే మరే నీళ్ళూ ఆయన తాగి ఎరుగరు.

నా తల్లి అత్తవారింట కాలు పెట్టినప్పటి నుంచీ ఏ సుఖం ఎరుగదు. మా నాన్నగారికీ, బతికి ఉన్నంతకాలం మామగారికీ వండిపెట్టడం, వాళ్ళు అనే మాటలు పడటం, అప్పుడప్పుడు భర్త చేతుల్లో తన్నులు తినడం తప్ప మా అమ్మకి మరో జీవితం లేదు. మా నాన్నవైపు వారికి మంచి అలవాట్లు లేవు. సంస్కారాలు లేవు. అందరి ఎదురుగుండా మా నాన్న, తాత హుక్కా తాగేవారు. ప్రొద్దున ఏడుగంటలకు లేవడం ఆయన అలవాటు. లేచినప్పటినుండి అమ్మను బూతులు తిడుతూ ఉండేవారు. ఎన్ని జన్మల పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలనో గానీ భగవంతుడు ఆ ఇంట్లోనే నాకు జన్మనిచ్చాడు.

నాకు మా అమ్మమ్మ ఇల్లు తెలిసినంతగా మా నాయనమ్మ వాళ్ళ ఇల్లు తెలియదు. ఒకసారి మా అమ్మకి క్షయవ్యాధి వచ్చింది. తాతయ్య వెళ్ళి మా నాన్నని తీసుకువచ్చారు. ఆ వ్యాధితోటే మా అమ్మ చచ్చిపోయింది. ఈ విషయం నాకు కొద్దికొద్దిగా గుర్తుంది. తరువాత అమ్మమ్మ, తాతయ్య నాకు దిక్కయ్యారు. ఏ ఆరు ఏడు నెలలకో ఒకసారి మా నాన్న కొంచెం మిఠాయి, చీరలు తీసుకువస్తూ ఉండేవాడు. ప్రొద్దున్న వచ్చేవాడు మధ్యాహ్నం భోజనంచేసి సాయంత్రంకల్లా తిరిగి వెళ్ళిపోయేవాడు.

చిన్నప్పుడు ఒకసారి మా వాళ్ళు నాకు ఒక విచిత్రమయిన శిక్ష వేశారు. పట్టణం దగ్గరిగా బజరియా బస్తీలో మా ఇల్లు ఉంది. ఇక్కడ

నాకు నా వయస్సుకు తగ్గవాళ్ళెవరూ ఆడుకోవడానికి దొరకలేదు. ఓరోజు నేను ఎండలో మా ఇంటి వెనక ద్వారంగుండా బయటకి వచ్చి రోడ్డునపడ్డాను. నా వయస్సు వాళ్ళు ఎవరైనా దొరుకుతారేమో అన్న ఆశతో బయలుదేరాను. ఎండని భరిస్తూ నడుస్తూ దారితప్పి మరో ఊరు చేరుకున్నాను. ఆకలి, దాహం వేయడంవలన చేసేది ఏమీలేక ఓ చెట్టుకింద కూర్చుని ఏడవడం మొదలుపెట్టాను.

ఇప్పటికీ నా కళ్ళముందు ఆ దృశ్యం కనిపిస్తోంది. మా అమ్మని నేను ఎన్నోసార్లు తలచుకున్నాను. నేనెందుకు ఇటు వచ్చాను? ఇప్పుడేమవుతుంది? ఇంటికి ఎట్లా వెళ్ళను? విపరీతమైన ఆకలి వేయడం మొదలుపెట్టింది. నాకు ఏడుపు తప్ప మరొకటి రావడంలేదు. అప్పుడే అటువైపు మేకలు కాసే ఒకామె వచ్చింది. నన్ను చూసి దగ్గరికి వచ్చి నన్ను గుండెలకి హత్తుకుంది. తన ఇంటికి తీసుకువెళ్ళింది. నాకు అన్నంపెట్టింది, దాహం తీర్చింది. వేడినీళ్ళలో ఉప్పువేసి వాచిన కాళ్ళకు కాపు పెట్టింది. మా తాతయ్య పేరు ఆమెకు బాగా తెలుసు. పిల్లకోసం విచారపడవద్దనీ పిల్లకాళ్ళు వాచి ఉండటంవలన బండిలో తీసుకువెళ్ళవలసిందనీ, తాతయ్యకు చెప్పమని ఓ మనిషిని పంపించింది.

ఆ రాత్రంతా నేను అక్కడే ఉన్నాను. ఉదయం మా ఇంటికి వచ్చేశాను.

ఇంటిద్వారం దగ్గర బండి దిగంగానే మా తాతయ్య నావేపు రావడం చూశాను.

ఆయన నన్ను అక్కడే నిల్చోమని ఆజ్ఞాపించారు.

బగ్గీ మనుషులకు ఐదురూపాయలు ఇచ్చారు.

ఒక బిందెడు నీళ్ళు తెచ్చి నా తలమీద కుమ్మరించారు. ఆ బట్టలతోటే నేను లోపలికి వెళ్ళాను. అక్కడ ఏమయినా తిన్నావా? తాగావా అని తాతయ్య నన్ను అడిగారు. నేను తిన్నానని చెప్పాను. అంతే! నా చేత నెయ్యి తాగించి కడుపులోదంతా కక్కించారు. బహుశ పంచగవ్యం కూడా తాగించి ఉండవచ్చు. నన్ను నవ్విస్తూనే మా తాతయ్య నాకు ఈ శిక్ష వేశారు. నన్ను పల్లెత్తుమాట కూడా అనలేదు. మా అమ్మమ్మ రెండు చెంపదెబ్బలు కొట్టింది. తక్కువ జాతివారు ముట్టుకున్న అన్నం కూడా తినకూడదు. అని ఆమె నాకు చెప్పింది. దారితప్పిన నన్ను రక్షించింది. వారేకదా! అసలు తక్కువజాతి అంటే ఏమిటో ఆనాడు నాకేం తెలుసు? మా నాన్నమాట ఎప్పుడు వచ్చినా "ఉంచుకున్న ముండ" అన్న శబ్దంకూడా అందరు కలుపుతూ ఉంటారు. దీనితో పాటు తక్కువజాతి అన్న శబ్దంకూడా కలిసి ఉందా? ఏమో! అప్పుడు ఆ రెండు శబ్దాలు వాటి అర్థాలు నాకు ఓ పొడుపు కథలాగా అనిపించేవి. అంటు సొంటు అన్న భేదం కూడా అప్పుడే నాకు కాస్త తెలిసింది. నన్ను ఆదరించి అన్నం పెట్టిన స్త్రీని ఎందుకు ముట్టుకోకూడదో నాకు అర్థంకాలేదు.

★ ★ ★

నా జాతకంలో మంచిరోజులు గడిచిపోయాయి. వసంతమాసం వెళ్ళిపోయింది.

ఒకరోజు మా అమ్మమ్మ తాతయ్యకోసం రొట్టెలు కాలుస్తూ కాలుస్తూ పడిపోయింది.

అంతే తరువాత మళ్ళీ ఆమె లేవలేదు.

తాతయ్య పంపిన కబురు విని మానాన్న వచ్చాడు. "నిర్గుణియా భారం ఇక మీమీదే ఉంది. నా రోజులు కూడా దగ్గర పడుతున్నాయి. మీ అత్తగారు నేను లేకుండా ఆ లోకంలో కూడా ఉండలేదు" అని తాతయ్య నాన్నతో అన్నారు. నేను ఎదురుగుండానే నిల్చున్నాను. కొంత అర్థం అయింది. కొంత అర్థంకాలేదు. ఆ రాత్రి నాకు ఏవేవో భయంకరమైన కలలు వచ్చాయి. కలలో పెద్దపెద్ద పర్వతాలు కనబడ్డాయి. ఆ పర్వతాలలో నేను దారి తప్పి తిరుగుతున్నాను. కొండచిలువలు నన్ను కాటేయడానికి వస్తున్నాయి. నానోట మాట రావడం లేదు. పెద్దగా కేకవేద్దామనుకున్నాను. కాని ఊహు... నోట్లో నుండి మాటరావడంలేదు.

ఆరోజు నాకు వచ్చిన భయంకరమైన కలలన్ని గుర్తులేవుకాని ఒక విషయం మాత్రం బాగా గుర్తు. పొద్దున్న నేను లేచేసరికి తాతయ్య ఇంకా లేవలేదు. తాతగారు అంతపొద్దెక్కేవరకూ పడుకుని ఉండటం నేను ఎప్పుడూ చూడలేదు. అప్పటికే కొంతమంది చుట్టాలు వచ్చారు. నేను తాతగారిని లేపబోయాను. కానీ

కొంచెం సేపయ్యాక తెలిసింది. తాతగారు రాత్రే ఎప్పుడో ఈ లోకం వదిలి వెళ్ళిపోయారని. అంతే! ఇల్లంతా ఏడుపులు పెడబొబ్బలతో మారుమ్రోగిపోయింది.

మా తాతగారిని అందరూ వ్యాసులవారు అని పిలిచేవారు. గంట రెండు గంటలలో వ్యాసులవారు చనిపోయారన్న వార్త అన్నివైపులా వ్యాపించింది. చూస్తూచూస్తూ ఉండగానే మనుష్యులు గుంపులు గుంపులుగా చేరసాగారు. చచ్చిపోయిన తాతగారి శవాన్ని తీసుకుపోవడం చూశాను. అమ్మమ్మకోసమే తాతగారు ఇన్నాళ్ళూ బతికి ఉన్నారు. సీతమ్మ తల్లి భూదేవి ఒడిలో చేరిపోయినప్పుడు రామయ్యతండ్రే రాజ్యం చేయలేకపోయాడు. తనూ వెళ్ళి సరయూ నదిలో కలిసిపోయి అంతర్ధానమయ్యాడు.

తాతగారి దగ్గర నేను ఎన్నెన్నో కథలు విన్నాను. ఆయన తను చెప్పే ప్రతీ మాటనూ ఆచరణలో పెట్టేవారు. అమ్మమ్మకి తాతయ్యాకి మధ్య ఎంత ప్రేమ ఉండేది. తాతయ్యాగారు మనస్సులో అనుకున్న ప్రతిమాటా అమ్మమ్మ వినగలిగేది. ఆయన చెప్పకుండానే ఆ మాటను ఆచరణలో పెట్టేది. ఆ రోజులలో కూడా మా తాతగారు అమ్మమ్మని ప్రజ్ఞా అంటూ పేరు పెట్టి పిలిచేవారు. ఆ రోజుల్లో ఏ ఇంట్లోనూ భర్త భార్యను పేరుపెట్టి పిలిచేవారుకారు. ఆమె అసలు పేరు గంగ అని, ప్రజ్ఞ అన్న పేరు తాతగారు పెట్టారని అమ్మమ్మ నాకు చెప్పింది. ఎంత మంచి మంచి పేర్లు పెట్టారు తాతగారు. ప్రజ్ఞ, అదితి, నిర్గుణియా...

కాని నేనెంత అభాగ్యురాలిని! అట్లాంటి మహాత్ముడు పెట్టిన పేరును సార్థకం చేయలేకపోయాను. పేరుకి తగ్గట్టుగా జీవితాన్ని గడపలేకపోయాను. నేను చేసిన పనులకి నిర్గుణియా కాదు దుర్గుణియా అని పిలవాలి. ఖర్మ మనలని ఎన్నెన్ని ఆటలు ఆడిస్తుంది!

మానాన్న తాతగారి కర్మ చేసి, ఇల్లు అమ్మేసి, నన్ను పట్నం తీసుకువెళ్ళారు. ఓ పెద్ద భవనం, మూడో అంతస్థులో చక్కగా అలంకరింపబడ్డ గదిలోకి అడుగుపెట్టంగానే నేను ఒక స్త్రీని చూశాను. ఈమె ఆ స్త్రీయేనా...? మా నాన్న ఉంచుకున్న ఆవిడ ఈమెనా...?

అంతే నా మనస్సులో అగ్నిపర్వతం బద్ధలయింది.

★ ★ ★

నాన్న నన్ను ఒక కుర్చీలో కూర్చోపెట్టి తను లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు. కొంచెంసేపయ్యాక ఒక స్త్రీ కంఠం వినిపించింది. ఆమె కఠోరంగా అన్న మాటలు నాకు ఇప్పటికీ గుర్తే.

"పాపం నువ్వు చేసి దాన్ని నా నెత్తిమీదకు తెచ్చిపెట్తావా! నాకేం పని? నీ కూతుర్ని నీవే చూసుకో! ఇక్కడికి ఎందుకు తెచ్చావు"

నాన్న కంఠం వినిపించింది. "ఎక్కడికి తీసుకుపోను? మా ఇంట్లో అయితే ఎవరూ లేరు, ఈ అనాథను ఎక్కడికి తీసుకువెళ్ళను?"

"నీకు ఇష్టం అయితే ఉంచుకో... లేకపోతే మెడపట్టి గెంటేసేయి, పీడ వదిలించుకో. పాడుముండ, శని విరగడ అవుతుంది"

ఆ మాటలు విన్న నాకు దుఃఖం పొర్లుకువచ్చింది.

తరవాత మళ్ళీ ఏ మాటలు వినిపించలేదు.

కొంచెంసేపయ్యాక ఆ స్త్రీ నేను ఉన్న గదిలోకి వచ్చింది. ఆమె ఎర్రగా ఉంది. ఆ ముఖంలో గర్వం ఉంది. మా నాన్న ఆమె వెనకాలే వచ్చాడు. నేను లేచి నిల్చున్నాను "అమ్మ కాళ్ళకి దండం పెట్టు" అని ఆయన ఆజ్ఞాపించాడు. నేను దండం పెట్టడానికి వంగాను. మళ్ళీ ఆయనే "ఇదిగో దీన్ని నీకు ఇచ్చేశాను. ఇష్టంలేకపోతే తీసుకువెళ్ళి చంపేసేయి" అని ఆ స్త్రీతో అన్నాడు.

ఆ స్త్రీ... నేను ఇక ముందు ఎవరినయితే అమ్మ అని పిలవాలో ఆమె నా భుజాలు పట్టుకుని నన్ను లేపింది.

"ఇంత అందమయిన అమ్మాయిని చంపడమా! అరె ఈ అందమయిన ముఖాన్ని చూసి ఎంతమంది మొగాళ్ళు జీవిస్తారో..." నవ్వుతూ అంది ఆమె. నన్ను గట్టిగా కౌగలించుకుంది. ముద్దుపెట్టుకుంది. తరువాత ఆమె నా శరీరం అంతా నిమిరింది. పైనుంచి కిందిదాకా మెటికలు విరుస్తూ ఆమె నా శరీరంలో పులకింత కలిగించింది.

ఇది వ్రాస్తున్నప్పుడుకూడా ఇంకా నా మన

స్సులో అట్లానే అనిపిస్తోంది. కాని ఆ పులకింతే నా జీవితాన్ని సర్వనాశనం చేసింది. నన్ను పాపపంకిలంలోకి దింపింది. ఆమె నన్ను ఎంతో ఏడిపించింది. నవ్వించింది. బతిమిలాడింది. కాని ఆకలితో చంపింది. ఏడ్చి ఏడ్చి నాకు ఒక్కసారిగా తెలివి వచ్చింది. కాని ఆ సరికే నేను బ్రాహ్మణ స్త్రీ నుండి పాకీస్త్రీగా మారాను.

ఈ రెండు దశలమధ్య నేను చేసిన పనులు నాకు తెలియకుండానే జరిగిపోయాయి. జీవితం నా చేతులలోంచి జారిపోయింది. ఏమీ చేయలేక, చేసే ధైర్యంలేక జరిగేవన్నీ చూస్తూ నిల్చుండిపోయాను.

ఆ ఇంట్లో ఉంటూ నెమ్మది నెమ్మదిగా నేను పండిత్ బటుక్ ప్రసాద్‌కోరీ చరిత్రను తెలుసుకున్నాను. మా నాన్న ఉంపుడుకత్తెను గురించి తెలుసుకున్నాను.

పెద్ద దొరగారైన రాయ్‌సాహెబ్ బటుక్‌ప్రసాద్ పెద్ద వ్యాపారస్థుడు. లక్షలకి అధిపతి. ఆయనకు సతీప్రసాద్, మాతాప్రసాద్ కొడుకులు. సతీప్రసాద్ వ్యాపారం చూసుకునేవాడు. ఇల్లంతా తెల్లదొరలు తెల్లదొరసానులతో నిండిపోయేది. వాళ్ళు ఒకళ్ళ నడుంమీద మరొకరు చేయివేసి నృత్యంచేసేవారు. పాటలు పాడేవారు. నాకంతా ఆశ్చర్యంగా ఉండేది. నా మనస్సంతా ప్రశ్నలమయంగా ఉండేది. అంతా అగమ్యగోచరంగా ఉండేది. కాని నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్క విషయమే తెలుసుకోగలిగాను. ఆ చిక్కు ప్రశ్నలు విడదీస్తూ, విడదీస్తూపోగా నా జీవితం వాళ్ళ చేతుల్లో చిక్కుకుపోయిందన్న విషయం తరువాత అర్థమయింది. ఆ ఇంటికి వచ్చిన కొత్తలో నేను చాలా భయపడేదాన్ని. తెల్లవారుఝామున నాలుగు గంటలకే లేవడం నాకు మొదటినుండి అలవాటు. మా తాతగారు నేను లేవకముందే, గంట క్రితమే గంగాస్నానం చేయడానికి వెళ్ళిపోయేవారు. అమ్మమ్మ ఇల్లంతా ఊడ్చి అలికేది. కాని ఇక్కడ అంతా విచిత్రంగా ఉంది. రాత్రి పన్నెండు గంటలదాకా భోజనం దొరకదు. తరువాత అమ్మ సేవ చేయాల్సివచ్చేది. ఆమె నన్ను దగ్గరకు లాక్కుని పడుకునేది. అప్పుడు ఆమె చేసే చేష్టలు చెప్పాలంటే సిగ్గనిపిస్తుంది. అసలు ఈ అమ్మవల్లే కదా నాకు ఇట్లాంటి మరోజన్మ కలిగింది. తన పాపపంకిలం అంతా నాకు పూసేసింది. ఈ జన్మలోనే ఇంత ఘోరంగా బతకడం అనేది నాకు ఎవరో పెట్టిన శాపం. ఆ ఇంటి గూర్ఖాకీ, అమ్మకీ సంబంధం ఉందన్న రహస్యం కూడా నాకు తెలిసింది. అందరిలోకీ చిన్నవాడు బబులూ. అయినా వాడు నన్ను తినేసేలా చూసేవాడు. నేను అతడిని చూసి భయపడేదాన్ని.

ఒకరోజు నేను భయపడుతున్నట్లుగానే ఒక ఘోర సంఘటన జరిగిపోయింది.

ఆ ఇంట్లో అడుగుపెట్టినప్పటినుండీ దేవుడి పూజ పనంతా నేను చేసేదాన్ని. ఒకరోజు తెల్లవారుఝామున అమ్మ గూర్ఖా ఖడ్గబహదూర్‌ని తీసుకుని పొలంవైపు వెళ్ళింది. నేను పూజ చేస్తూ ఉన్నాను. బబులూ సమయంకోసం వేచి ఉన్నాడేమో... లోపలికి వచ్చాడు.

దేవుడి పూజ చేస్తూ ఉన్న ఆ సమయంలోనే దేవుడి ఎదురుగుండానే, మొదటిసారిగా నా శీలాన్ని నేను పోగొట్టుకున్నాను.

మొట్టమొదటిసారిగా నాకెన్నో విషయాలు తెలిశాయి.

తాతయ్య అమ్మమ్మల ఉన్నతమైన సంస్కారం నాలో ఇంకా ఉండటంవలన నా మనస్సులో సంఘర్షణ జరిగేది. నాలో ఎవరో నన్ను తిడుతున్నట్లుగా కొడుతున్నట్లుగా అనిపించేది. ఆ సమయంలోని నా మనఃస్థితిని నేను వర్ణించలేను.

ఇప్పుడు ఆలోచిస్తూవుంటే నన్ను బబులూ బలవంతంగా అనుభవించినా కేవలం అతడిని అపరాధి అని చెప్పడం న్యాయంకాదేమో అనిపిస్తుంది. నా చిన్నారి మనస్సు కూడా ఆ పనికి చలించిందేమో ...! అమ్మ ఇంట్లో స్త్రీ-పురుషులు చేసే అశ్లీలమయిన పనులు నా మనస్సులో అగ్నిపర్వతంలా దాగివున్నాయి. అవకాశం కలిగింది కనుక అది ప్రజ్వలించింది. ఆ వేడికి ఈ వెన్న కరిగింది. పాపపుకూడు తినకూడదు. తింటే మనిషి భ్రష్టుడయిపోతాడు. రాముడే వాళ్ళని రక్షించాలి అని మా తాతగారు ఎప్పుడూ అంటూ ఉండేవారు. అమ్మ ఇంట్లో ఆ సంస్కారం ఎక్కడ

ఉందీ నన్ను రక్షించడానికి? నౌకర్లు, చాకర్లు, యజమాని, యజమానురాలు, వాళ్ళపిల్లలు, అందరూ ఒకేగూటిపక్షులు. అందరూ ఒకేరక మయిన వాళ్లు. అక్కడే వుంటూండగా ఆ ఎంగిలిమెతుకులు నా నోటపడకుండా ఎట్లా ఉంటాయి. ఆ సెగ నాకు తగలకుండా ఎట్లా ఉంటుంది?

''నీకు నేను మాస్టర్‌ని పెట్టి ఇంగ్లీషు చెప్పిస్తాను. గొప్ప ఇంటివాడిని తెచ్చి పెళ్లి చేస్తాను. చూసుకో నీవెంత సుఖపడతావో. నీవు బబులూనికలవకు, మాట్లాడకు తెలిసిందా?'' అని ఒకరోజు ఆమె నన్ను పిలిచి ప్రేమగా చెప్పింది. నిజంగానే ఆమె దృష్టిలో ఓ కుర్రాడు ఉన్నాడు. కానీ వాడు నా కోసం మాత్రం కాదు. తన కోసమే ఆ కుర్రాడిని ఎన్నుకుంది.

ఆడదానికి మొగాడికంటే ఎనభైశాతం కామం ఎక్కువగా ఉంటుందని నాకు ఎప్పుడో, ఎక్కడో చదివినట్లు గుర్తువుంది. ఆ కుర్రాడిపేరు బసంత్‌లాల్. అతడు అందంగా ఆకర్షణీయంగా ఉంటాడు. నాకు చదువు చెప్పే మిషతో అతడిని అమ్మ పిలిపించింది. ముప్పై రూపాయలకు చదువు చెప్పడానికి అతడు ఒప్పుకున్నాడు. అతడు పాఠాలు చెప్పేటప్పుడు నావంక కోరికతో చూసేవాడు. కానీ అమ్మ అతడిని బెదిరించి తన కోరిక తీర్చుకోసాగింది. ఇది చూశాక నాలో ద్వేషం పుట్టింది. ఆ ద్వేషంవల్లే నేను బబులూను రెచ్చగొట్టడం మొదలుపెట్టాను. నిజానికి బసంత్‌లాల్ నన్ను హృదయపూర్వకంగా ప్రేమించాడు. కానీ నేను అతడివైపు ఆకర్షితురాలిని కాలేకపోయాను.

అమ్మ మనస్సులో నామీద కోపం ఇంకా ఎక్కువయింది. దానికి రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి బబులూ సర్కార్ నా దగ్గరికి రావడం, రెండోది అమ్మ బసంత్ మాస్టర్‌కి అన్నీ ఇస్తున్నా ఆమెను కాదని అతడు నామీద ఇష్టం చూపెట్టడం.బబులూ నాముందే ఆమెని అడ్డమైన బూతులు తిట్టేవాడు. ఆమె ఎదురుగుండానే ఆమె గదిలోంచి నన్ను లాక్కువెళ్ళిపోయేవాడు. అతడు ఈవిధంగా ప్రవర్తించడానికి కారణం నేనే... అతడిని రెచ్చగొట్టిందీ నేనే...

నా గర్భం మాట చెప్పి నన్ను పెళ్ళి చేసుకోమని అతడిని అడిగాను.

కానీ, నేను అనుకున్నవన్నీ ఇసుకమేడల లాగా నేలపాలయ్యాయి. నా గర్భాన్ని తీయించేశారు. హఠాత్తుగా నా పెళ్ళి కుదిర్చారు. ఆ రాత్రే అమ్మ స్నేహితుడయిన మసురియాదీన్ మహారాజ్‌తో నన్ను ముడిపెట్టారు. మా నాన్న కూడా వచ్చాడు. నా వయస్సు అప్పుడు పదహారు సంవత్సరాలు. నా భర్త నా తండ్రికన్నా ఆరు ఏడు సంవత్సరాలు పెద్ద. నేను వచ్చేటప్పుడు మా అమ్మ నన్ను కలువను కూడా కలవలేదు. ఒకప్పుడీ మసురియాదీన్‌కి అమ్మకి మధ్య సంబంధం ఉండేదట...

అక్కడితో కథ ఆగిపోయింది. ప్చ్... నేను నిట్టూర్చాను. పరిస్థితులు మనిషిని ఏ స్థితి నుండి ఏ స్థితికి లాక్కువస్తాయి. అమ్మమ్మ తాతయ్యల సంస్కారం ఆమెలో మంచి విత్తనాన్ని నాటినా అది పెరిగి పెద్దయ్యేందుకు మంచి ఫలపుష్పాలు ఇచ్చేందుకు తగ్గమట్టి, నీరు, గాలి, ఎండ దొరకలేదు. వాళ్ళనుండి నిర్గుణియా ఎన్నో మంచి విషయాలు నేర్చుకుంది. ఎంతో గొప్ప సంస్కారం పొందింది. కాని... కాని... వాళ్ళ అడుగుజాడలలో ఆమె జీవితాంతం నడవలేకపోయింది. ఒక్కసారిగా ఆమె విపరీత సంస్కారాలు కలవారి వలలో చిక్కుకుంది. ఇదేనా విధివిధానం? బ్రాహ్మణురాలయిన నిర్గుణ్ పరిస్థితుల కారణంగా ఇలా మారినప్పుడు ఆమె మనోదశ ఎట్లా ఉండి వుండవచ్చు. బహుశ ఆమె క్షణంక్షణం చస్తూ బతికి ఉండవచ్చు. ఆ బతుకును గురించి నేను ఊహించనైనా ఊహించలేను. నాకు రాత్రంతా నిద్రపట్టలేదు. నా కాలికింద భూమి కదుల్తున్నట్లుగా ఎండి బీటలువారి లోపలికి పోతున్నట్లుగా అనిపించసాగింది. నిర్గుణియా పర్వతంనుండి పడిపోయి ఒక్కసారిగా ధూళిగా మారింది. కాని ధూళికి కూడా ఓ అస్తిత్వం ఉంటుందికదా...

నాకు ఆమెను ఎప్పుడెప్పుడు కలుద్దామా అనిపించింది. నిర్గుణిమోహన్‌కి ఫోను చేశాను. నిర్గుణియా అంతకు కొంచెముందే తన ఇంటికి వెళ్లిపోయిందని తెలిసింది.

★ ★ ★

నేను రిక్షాలో నిర్గుణియా ఇంటికి వెళ్లాను.

ఆమె జీవితం గురించి పూర్తిగా తెలుసుకోవాలన్న ఉద్దేశంతో కొన్ని ప్రశ్నలు వేశాను.

"ఇప్పుడు ఎవరైనా పాత పరిచయస్థులు మీ ఎదుటపడితే?"

"అప్పటివాళ్ళందరూ ఇప్పుడు బాగా ముసలివాళ్ళయి వుంటారు. అసలు ఈ పాటికి చనిపోయేవుంటారు"

"మీరు ఆర్యపుత్రుడు అని వ్రాసారే ఆయన ఒకవేళ..."

"నా మోహనుడే ఆయనని నరకంలోకి పంపించేశాడు"

"పోనీ ఆయన కాకపోతే మీ అమ్మ తమ్ముడు, లేకపోతే ఆ మాస్టరు..."

"అన్నీ వదిలేసుకున్నదానికి, ఇప్పుడు వాళ్ళు కనిపిస్తే మాత్రం నన్నేం చేస్తారు? వీళ్లేగా నా జీవితాన్ని నాశనం చేసింది"

"బబ్లూని మీరు కొంతవరకు దోషి అనవచ్చు. కానీ తరువాత మీ జీవితంలో ప్రవేశించిన బసంత్‌లాల్ మాస్టరు, బందిపోటు మోహన్ మీ మూలంగానే భ్రష్టులయ్యారని నేనంటాను... వాళ్లని మీరు తప్పు పట్టలేదు"

"మీ మాటలు వింటుంటే ఎంతో సిగ్గువేస్తోంది. భూమి పగిలిపోతే బాగుండునని పిస్తోంది. లేకపోతే బాగా తాగి అయినానరే మీరు వేసే ప్రశ్నలను ఎదుర్కోవాలనిపిస్తోంది. మీకు చదవమని ఆ పుస్తకం ఇచ్చినప్పుడే ఆ పాప పంకిలంనుండి పూర్తిగా బయటపడ్డాను. మనస్సును గట్టి చేసుకున్నాను. ఇప్పుడు నేను ఏ సమాజంలో బతుకుతున్నానో ఆ సమాజంలోనే నా చివరిక్షణం దాకా బతకాలని అనుకుంటున్నాను. బ్రాహ్మణురాలిగా బతకాలన్న కోరిక నాకు ఏమాత్రం లేదు"

"నా పేరు చివర శర్మ అన్న శబ్దం వినగానే మీ లోపల ఉన్న బ్రాహ్మణత్వం జాగృతి చెందలేదా? మా ఇంటికి వచ్చినప్పుడు మా దేవుడి గదిలోకి రానివ్వమని అడగడం, శ్లోకాలు చదవడం ఇవన్నీ మీలో ఉన్న బ్రాహ్మణత్వం చేయించిన పనులు కావా?"

"నిజమే! ఇంకెవరి ముందయినా అయితే ఈ విషయం ఒప్పుకోకపోదును. కానీ మీతో అబద్ధం చెప్పలేను"

"నా మనస్సులో మరో బలమైన సందేహం రేగుతోంది. మీరు శ్రీమతి మోహన్ కాగానే కొత్త జీవితంలో ప్రవేశించి... మీ కర్తవ్యాన్ని నెరవేర్చడానికి సందుగొందులు తిరిగినప్పుడు..."

"వెళ్లినప్పుడు నా గొంతు నులిమివేసుకోవాలనిపించింది. బ్రాహ్మణురాలినయి ఉండి వారి మలమూత్రాలే ఎత్తాల్సివస్తుందని నాకేం తెలుసు? కాని విచిత్రం... నేను మా తాతయ్య దగ్గర చదువుకున్న కబీర్ దోహా ఒకటి గుర్తుకు వచ్చింది. నాకు బ్రాహ్మణులు మాలవాళ్లు అన్న ఈ కులభేదం ఎందుకు? అందరూ నా యజమానులేకదా అనిపించింది. ఆనాటి నుండి ఈనాటివరకు నాకు ఇటువంటి భేదం కనబడలేదు. మీ ఇంటి దగ్గరే నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకపోయాను. నేను వద్దన్నప్పుడు మీరు నా దగ్గరకు మళ్ళీ మళ్ళీ రాకుండా ఉంటే అసలు ఏ గొడవా ఉండేదికాదు. నాకు మీ నీతినిజాయితీల మీద చాలా నమ్మకం ఏర్పడింది. మీతో ఆత్మీయత ఏర్పడింది. అందుకే నాలోఉన్న బ్రాహ్మణత్వం జాగృతి చెందింది. నా మనస్సులోని ఏ బాధతోకూడిన భావోద్వేగం అయితే ఏకాంతంలో నాచేత కాగితంమీద వ్రాయించిందో అదే భావోద్వేగం నన్ను మీ ఎదురుగుండా నిల్చోపెట్టింది. నేను ఏమిటో మీకు చెప్పమంది. మనస్సువిప్పి మాట్లాడమంది. బాబుగారూ..., నా గ్లాసులో ఉన్న ఈ సారాయిమీద ఒట్టు. నాకు ఈ మధువు గంగాజలంతో సమానం. మీలాంటివాళ్ళు చాలా అరుదుగా కనిపిస్తారు. అందుకే నా మనస్సులో కొన్నేళ్లనుండి రగులుతున్న అగ్ని ఒక్కసారిగా బయటికి వచ్చింది. ఆ అగ్నిపర్వతం బ్రద్దలవడం వల్లనే నా మనస్సు తేలికపడింది"

ఆమె స్వరంలో, ఆమె మాటల్లో, ఎన్నోసార్లు దెబ్బతిని అగ్నిజ్వాలల్లో తనను తాను దహించుకున్న శుద్ధమైన ఆమె వ్యక్తిత్వంలో, ఏదో లోతైన ఆకర్షణ ఉంది. అంటరాని స్త్రీ అయిన ఈమెను మానసికంగా స్పర్శించాలని నా మనస్సు తహతహలాడింది. ఆమె యెడల నాకు గౌరవం కలగసాగింది. రెండు మూడుక్షణాలు గడిచాయి. "నిర్గుణియాగారూ! మీ ఆత్మకథ కొంత చదివాక నాలో మీ గురించి

పూర్తిగా తెలుసుకోవాలన్న కోరిక మరీ ఎక్కువ అయింది. మీ దగ్గర ఉన్న మరో డైరీ కూడా ఇవ్వగూడదా!!! ఆమె నవ్వింది. "వ్రాయడాని కి చాలానే వ్రాశాను. మనస్సులోని బాధను ఇక దాచుకోలేనప్పుడు ఏది గుర్తుకు వస్తే అదే రాసేశాను. ఆ కాగితాలు ఒకచోట లేవు"

"ఒహ్... మీరు నన్ను ఎడారి మధ్యలో వదిలేస్తున్నారు. మీరు మీ ఆత్మకథను పూర్తిగా ఎందుకు వ్రాయరు?"

"కొంత వ్రాసాక హఠాత్తుగా ఎందుకో నాకు వ్రాయాలని అనిపించలేదు"

"ఏ అనుభవాలయితే మిమ్మల్ని మరీ బాధ పెట్టాయో, ఆ అనుభవాలనే మీరు వ్రాశారుక దూ!"

"ఏమో తెలియదు బాబుగారూ! అప్పుడు నాకేం పిచ్చిపట్టిందో కాని అలా వ్రాసేశాను. ఇప్పుడు ఇక ఆ ఆవేశం రాదు"

"మీరు మీ భర్త అయిన మసురియాదీన్ ఇంటికి వెళ్ళినప్పుడు మీ మనఃస్థితి ఎట్లా వుండేది?"

"మనకు ఆకలి వేసినపుడు, అందులోనూ శరీరానికి ప్రకృతి ఇచ్చిన సెక్స్ ఆకలి... తీరన ప్పుడు..., ఆ నిస్సహాయ పరిస్థితుల గురించి ఏం చెప్పను బాబుగారూ...! ఆ వెధవ వచ్చినా డు నా భర్త...! క్షమించండి నా నోటినుండి తిట్లువచ్చాయి. వాడు నన్ను నాలుగంతస్థుల మేడలో బంధించేవాడు. ద్వారాలకు తాళాలు వేసేవాడు బాబుగారూ! విధి ఎంతో విచిత్రంగా రకరకాల కొరడాదెబ్బలు నామీద వేసింది. బహుశ నాకు ఒక్కజన్మలోనే రెండు జన్మలని ఎత్తాలని వ్రాసిపెట్టిఉందేమో..."

"మీరు విధి అంటూ ఒకటుందని నమ్ము తారా?"

"ఏమో! నమ్ముతానో నమ్మనో ... నేను ఏదీ చెప్పలేను. బహుశ రెండూ... మనిషి కొంత తన చేజేతులా చేసుకుంటాడు. కొంత మనకు తెలియనివాడు ఎవడో మనచేత చేయిస్తాడు. నా చిన్నతనంలోనే అమ్మ చనిపోయింది. మా అమ్మని నేను చంపానా? పన్నెండేళ్లవరకు తాతయ్య అమ్మమ్మల ఇంట్లో నేను మంచి విషయాలు నేర్చుకున్నాను. ఎంతో మంచి సంస్కారం నాకు అలవడింది. బ్రాహ్మణురా లిగా పండితురాలిగా జీవితాన్ని గడిపాను. కాని మా నాన్న ఉంచుకున్న ఆ లం... ఆ అమ్మ దగ్గరికి పరమఛండాలుడయిన ఆ తండ్రి దగ్గరికి నేను రావలసివచ్చింది. ఆ బురదలో కాలుపెట్టవలసివచ్చింది. ఇవన్నీ నాకు ఇష్ట మయ్యే చేశానా? నేనేమీ కావాలని వెళ్ళలేదే... విధి నన్ను ఆడించింది. ఆటబొమ్మలా అది ఎట్లా ఆడిస్తే అట్లా ఆడాను. ఇదంతా ఏమిటి? మీరే చెప్పండి? కాని బాబుగారూ... ఎవరికీ ఎప్పుడూ ఏ జన్మలోనూ ఇటువంటి దుఃఖం కలగకూడదని నేను దేవుడిని ప్రార్థిస్తున్నాను"

నేనారోజు శ్రీమతి నిర్గుణియా దేవిని సరిగ్గా అర్థం చేసుకున్నాను. నిప్పులో కాలాకే బంగారా నికి మెరుపు వస్తుందనే సత్యాన్ని మొట్టమొద టిసారిగా ఆరోజే తెలుసుకున్నాను. ఆమె నాకు బలవంతంగా భోజనం పెట్టింది. సాయంత్రం వచ్చేటప్పుడు ఆమెతో తన ఆత్మకథని పూర్తిగా వ్రాయమని మరీ మరీ చెప్పాను.

"ఇక నేను వ్రాయలేను! కానీ నేను చెబు తూ ఉంటా మీరు వ్రాయండి"

సరే ఏదో ఒకటి ఆమె వ్రాస్తే ఏం ఆమె చెబుతున్నప్పుడు నేను వ్రాస్తే ఏం... నాకు కావలసింది ఆమె ఆత్మకథ. నేను ఒప్పుకున్నా ను. కానీ మరొకరి హృదయాంతరాళంలో ప్రవే శించి లోతుకనుక్కోవడం సాధ్యం అవు తుందా? ఇది మామూలు విషయం కాదు. ఆమె నాకు కొంతవరకు అర్థం అయింది. ఆమె జాతకాన్ని పూర్తిగా మార్చివేసిన ఆ చెడుగ్రహాలను నేను గుర్తుపట్టగలను. నా శక్తి ఆ దిశవైపు కేంద్రీకృతమయింది. ఇంటికి వచ్చాక ఆ రాత్రి వ్రాయడం మొదలుపెట్టాను.



ఆ గల్లీల్లో భజనపుస్తకాలు అమ్మేవాళ్ళు

గీతాలు పాడుతున్నారు.ఆ భక్తిగీతం నిర్గుణి యా చెవిలో మార్మోగుతోంది. కాని ఆ గీతం ఆమెలో ఎలాంటి భక్తిభావాన్ని కలిగించలేకపో యింది. నిర్గుణియాకి ముసలి భర్తవలన ఎటు వంటి సుఖంలేదు. ఆమె వయస్సులో చిన్నది కావడంవలన తన కోరికలను అదుపులో పెట్ట లేకపోతోంది. కోరిక ఆమెలోని వివేకాన్ని సైతం చంపేస్తోంది. ఇంతలో "అమ్మగారూ! దొడ్డి కడగడానికి నీళ్ళివ్వండి" అన్న మాటలు ఆమె చెవిన పడ్డాయి. కోరికల వేడిని చల్లార్చుకునే దారిలేక దిండును గట్టిగా కౌగలించుకుని మంచంమీద పడుకున్న నిర్గుణియా నెమ్మ దిగా లేచింది. భర్త దుకాణానికి వెళ్లాక ఆమెకు ఈ ఒక్కపని తప్పితే చేయాల్సిన పనులు రోజంతా ఇంకేమీ ఉండవు. ఆ పాకీమనిషి అమ్మగారూ! అని కేకవేస్తుంది. నిర్గుణియా లేచివెళ్లి రెండు బకెట్లు నీళ్లు పోస్తుంది. ఆ మనిషి దొడ్డి కడిగి, చీపురు ఓ మూలనపెట్టి మోరీ దగ్గర కొంచెం మట్టిని మోచేతులదాకా రుద్ది మోచేతులు కాళ్ళు కడుక్కుని అక్కడే బాసెంపట్ట వేసుకుని కూర్చుంటుంది. నిర్గుణి యా ఆమెకు తినడానికి ఏదైనా తెచ్చి ఇస్తుంది. ఆమె నిర్గుణియాకు బయటి విశేషా లు చెప్పి, బయటి ప్రపంచంతో సంబంధం కలుపుతుంది. ప్రస్తుతం ఇక్కడ ఈ మనిషే నిర్గుణియాకు స్నేహితురాలు. ఆ స్నేహితు రాలి పిలుపు విన్న నిర్గుణియాకు ఎంతో ఆనందం కలిగింది. వెంటనే కిందికి పరుగె త్తింది.

దొడ్డి కడిగించడం పూర్తయ్యాక నిర్గుణి ఒకగిన్నెలో పరమాన్నం తెచ్చి ఇచ్చింది. ఆ స్నేహితురాలు పరమాన్నం తింటూ కబుర్లు చెప్పసాగింది. నిర్గుణి భర్త మనురియా మహా రాజు గురించి ఆమెకు పూర్తిగా తెలుసు. అతడి గురించి చెప్పడం మొదలుపెట్టింది.

"మీ మొగడు మనురియా మహారాజు చెండాలుడు. వాడు ఎందరో ఆడవాళ్ళ మానా లను దోచుకున్నాడు. వాడు చేసిన పనులు మీరెక్కడ చేస్తారో అని వాడి భయం. అందుకే మిమ్మల్ని ఇట్లా ఇంట్లో పెట్టి తాళం వేస్తాడు. వాడు బ్రాహ్మడేగా. తిలకం చందనం పెడ్తాడు. కాని ఏంలాభం? మంచి బుద్ధులు వాడిలో లేనేలేవాయె. బ్రాహ్మలు ఎంతో నిష్టగా ఉంటా రు. కానీ వీడు అన్నికులాల ఆడవాళ్లని అను భవించాడు. అందరి ధర్మాన్ని మట్టిలో కలిపా డు. నాకు ఎన్నో ఏళ్ళనుండి వీడు తెలుసు. ఒకసారి వాడు నా చెయ్యి పట్టుకున్నాడు. ఆ మాట అంటుంటే ఆమె నల్లటి ముప్పైరెండు పళ్లూ బయటపడ్డాయి.

నిర్గుణి కుతూహలంగా ఆమెవంక చూడసా గింది. ఆమె మళ్లీ నవ్వింది.

"నేనే వాడికి బాగా బుద్ధి చెప్పాను. పెద్దగా అల్లరి చేస్తానన్నాను. నాదేముందయ్యా... నేనైతే తక్కువ కులంలో పుట్టినదానిని, నువ్వు పెద్దకులంలో పుట్టావు. నీ గౌరవం అంతా మట్టిలో కలిసిపోతుంది అన్నాను. ఏమనుకు న్నాడో ఏమోగాని నన్ను వదిలేశాడు అమ్మగా రూ! మీరు చాలా అమాయకులు. ఈ ముసలి మొగుడితో ఏం కాపురం చేస్తారు. మీరు మరో దారి చూసుకోండి"

తన అనుభవాలను చెప్పి, తమలపాకులు, కాస్త పొగాకు నమిలి నిర్గుణి స్నేహితురాలు సెలవు తీసుకుంది. ప్రతిరోజూ ఆ స్నేహితురా లు వెళ్లిపోయాక నిర్గుణికి ఏదో తెలియని బాధ కలుగుతోంది. మనస్సు భారంగా అయిపో తుంది. ఇవాళ ఆమె మనస్సు మరీ భారంగా ఉంది. ఆ స్నేహితురాలు మరో వారంరోజుల దాకా రాదు. ఆమె తన మరిది దగ్గరికి వెళ్తోంది. కొడుకును మేనమామ ఇంటినుండి పిలిపించింది. రేపటినుండి అతడే ఈ పని చేయడానికి వస్తాడు"

"అతడు వస్తాడు" అన్న భావన మృగతృష్ణ అయి నిర్గుణి మనస్సు దాహంకొన్న లేడిలాగా కల్పన అనే ఎడారిలో గెంతులు వేయసాగింది. ఏవిధంగా అయితే శ్రీకృష్ణుడి పేరు చైతన్య మహాప్రభు మీరాల మనస్సుకు ఆనందానుభూ తిని ఇచ్చిందో అదేవిధంగా పురుషుడు అన్న పదం నిర్గుణి మనస్సుకు కూడా కలిగించింది. కాకపోతే ఇద్దరి మధ్య ఒక భేదం ఉంది. ఆమె మనస్సు కృష్ణుడిమయం కాకుండా పురుష మయం అయింది. ఆమె కలలలో తేలిపోసా గింది. కొంచెం సేపయ్యాక ఆమె ఈ లోకంలోకి వచ్చింది. ఇప్పుడు ఆమెకు కలలు కల్పనలు కాదు యదార్థం కావాలి. ఈ యదార్థం తన

కింక చితిలోనే దొరుకుతుందేమో... నిరాశతో తలని మంచంకోడుకు కొట్టుకుని వెక్కివెక్కి ఏడ్చింది. చీకటిపడ్డాక మసురియాదీన్ ఇంటికి వచ్చాడు. ఆమెమీద చేయివేయగానే ఆమె పళ్ళు పటపట కొరకసాగింది. దాదాపు మూర్ఛ వచ్చింది. ఆ మూర్ఛావస్థలోనే కుళ్ళి కుళ్ళి ఏడవసాగింది.

★ ★ ★

ఆ రైలులో మూడవ తరగతి కంపార్ట్‌మెంట్ బాగా రష్‌గా ఉంది. బోగీలో దట్టంగా పొగ వ్యాపించివుంది. చలినుండి రక్షించుకోవడానికని యాత్రీకులు కిటికీల అద్దాలు కిందికి వేసేశారు. అందువలన చుట్టలపొగ, చవకగా వచ్చే చిలకమార్కు బీడీల పొగ కంపార్ట్‌మెంట్ అంతా నిండిపోయింది.

టాయ్‌లెట్ దగ్గర ఉన్న సీటుమీద నిర్గుణ్ కూర్చునివుంది. ఆమె తలపైనుంచి ముఖందాకా ముసుగు వేసుకుని వుంది. ఆమె మోకాళ్ళమీద తలపెట్టుకుని అందమైన ఓ యువకుడు పడుకుని ఉన్నాడు. అతడి శరీరం కసరత్ చేసే పహిల్వాన్‌లాగా దృఢంగా ఉంది.

నిర్గుణి ఎంతో విచారంగా మాటాపలుకు లేకుండా కూర్చునివుంది. పొగవలన ఊపిరి ఆడక దగ్గురావడంవలన అప్పుడప్పుడు ముఖంమీద ముసుగును చేత్తో అటు ఇటూ ఊపుకుంటోంది. టాయ్‌లెట్‌కి వెళ్ళి వచ్చేవాళ్ళు తలుపులు మూయకుండా వెళ్లిపోతూ ఉండటంవలన దుర్గంధం వస్తోంది. ఆమె మనస్సు భారంగా ఉంది. గతవారం రోజుల్లోనే ఆమె ప్రపంచం ఎంత మారిపోయిందీ! నిర్గుణియాకి జరిగిన సంఘటనలు గుర్తుకు రాసాగాయి.

ఆరోజు పాకీ మహిళ సెలవు తీసుకుని వెళ్లిపోయింది. మరునాటినుండి ఆమె కొడుకు రావడం మొదలుపెట్టాడు, "అమ్మగారూ! నీళ్లు పోయండి" అన్నాడు. ఆ కంఠం వినడానికి బాగున్నా అవతలివాళ్లని గద్దించినట్లుగా ఉంది. నిర్గుణి నీళ్ళు పోయడానికి వెళ్లింది. ఎదురుగుండా నిండుయవ్వనంలో ఉన్న నూనూగుమీసాల యువకుడు నిల్చుని ఉన్నాడు. అతడి కళ్లు పెద్దవి. అతడు ఎర్రగా అందంగా ఉన్నాడు. ముక్కు, మూతి బట్టతో కప్పబడి ఉన్నాయి. "దొడ్డి కడిగాక లోపలికి రా! మీ అమ్మకి కూడా రోజు అన్నం పెట్టేదాన్ని. నీకు కూడా పెడతాను" అంది నిర్గుణియా.

కానీ ఆ యువకుడు తనపని పూర్తిచేసుకుని బయటికి వెళ్ళిపోయాడు. నిర్గుణి అతడిని మళ్లీ పిలిచింది. "చూడూ..."

యువకుడు ఆగిపోయాడు. కళ్లలో ఎందుకు అన్న ప్రశ్న వ్యక్తం అవుతోంది.

నిర్గుణి దాహంతో కూడిన కళ్ళతో అతని వంక చూసింది. "అన్నం తిని వెళ్ళు..."

"ఇప్పుడు అన్నమా... ఊహూ..."

"మీ అమ్మ నన్ను అడిగి మరీ పెట్టించుకునేది. లోపలికి రా..."

యువకుడు లోపలికి వచ్చాడు.

"చెయ్యి కడుక్కో..."

యువకుడు కాళ్లు చేతులు కడుక్కున్నాడు. మూతిమీద ఉన్న బట్టపట్టీని తీసి ముఖం కడుక్కున్నాడు. ముఖంమీదనుండి అతడు బట్ట తీయగానే అతని అందమైన ముఖం పురుషుడికోసం తహతహ లాడుతున్న నిర్గుణి గుండెలో సన్నని మంటరేపింది. ఆ కనుముక్కుతీరు ఎంత బాగుంది!

కళ్ళు కళ్ళు కలిశాయి.

యువకుడు ఉలిక్కిపడ్డాడు.

నిర్గుణ్ ఎంతో ప్రేమగా అంది "కూర్చో ఇప్పుడే అన్నం తీసుకువస్తాను"

గబగబా వెళ్లి విస్తరాకులో అన్ని పదార్థాలు పెట్టికిందకు తీసుకువచ్చింది.

"అమ్మగారూ! ఇంత అన్నమా! కడుపు నిండా తింటే పని ఎవరు చేస్తారు?"

"కొంచెమే ఉంది తిను"

తనకు ఇంత ప్రేమగా తినిపిస్తున్నందుకు అతడు వినయంగా తలవంచితినడం మొదలుపెట్టాడు నిర్గుణ్ అతడి రూపాన్ని యౌవనాన్ని చూస్తూనిల్చుంది. తింటూ తింటూ ఆ యువకుడు ఓసారి తల ఎత్తాడు. మళ్ళీ మళ్లీ కళ్లు కలిశాయి. ఆమెకు గుండె ఆగినంత పనయింది.

"నీ పేరేమిటి?"

"మోహన్‌సింగ్... అందరు నన్ను మోహన్ అని పిలుస్తారు"

"నేను కూడా నిన్ను మోహన్ అనే పిలవనా?"

"పిలవండి..."

"నేను అట్లా పిలిస్తే నీకు బాగుంటుందా?"

మోహన్‌సింగ్ కళ్ళు పైకెత్తాడు.

నాలుగుకళ్లు ఒక్కక్షణం అట్లాగే ఉండిపోయాయి.

నిర్గుణ్ తన కళ్లల్లోంచి ఏదో శక్తిని తన కళ్లల్లోకి పంపిస్తోందా అని అతనికి అనిపించింది.

"అమ్మగారూ! మీరు నన్నెందుకు అట్లా చూస్తున్నారు?" తడబడుతూ అన్నాడతను.

నిర్గుణ్ సిగ్గుపడి కళ్లుదించుకుంది.

"ఆ... ఏంలేదు. నీవు చాలా అందంగా ఉంటావు"

మోహన్ ఏమీ మాట్లాడలేదు. అన్నం తిన్నాక చేతులు కడుక్కున్నాడు.

"అమ్మగారూ! ఇక వెళ్ళమంటారా?"

"మీ అమ్మ ఇంకా ఎన్నిరోజులదాకా రాదు?"

"మా బాబాయి ఇంట్లో పెళ్లి ఉంది. నేను సెలవు తీసుకుని ఇక్కడికి వచ్చాను. ఛావనీలో వంటవాడిగా పనిచేస్తాను. తెల్లదొరల దగ్గర బాండ్ బాజాలు నేర్చుకుంటున్నాను. మా అమ్మకోసం ఉండిపోయాను. దానిపని నేనే చేస్తాను. అసలు నేనీపని చేయను"

"నాతో నీవు తన కొడుకువని చెప్పిందే"

"నిజమే... కానీ నా మేనమామ, అత్తయ్యలు నన్ను పెంచారు. అందుకనే నేను అత్తయ్యని అమ్మ అని పిలుస్తాను"

"రేపు వస్తావా?"

"ఎందుకు రాను అమ్మగారూ! వస్తాను"

"ఇదిగో ఇది ఉంచుకో..."

"ఈ రూపాయలు ఎందుకు?"

"పాన్, సిగరెట్లు కొనుక్కో. మిఠాయి తిను-తీసుకో"

మోహన్ సంకోచంతో చేతులు ముందుకు జాపాడు. కళ్ళతో కళ్లు కలిశాయి. అతడు చిరునవ్వు చిందించాడు. నిర్గుణ్ సాయంత్రందాకా ఆ అందమైన ముఖాన్ని గుర్తుకు చేసుకుంటూ గడిపింది. ఒడ్డునపడ్డ చేపలా కొట్టుకోసాగింది. రాత్రి మసురియాదీన్ దగ్గరికి రాబోతే అతడిని విదిలించికొట్టింది.

పొద్దున్న వంటగదిలోకి వెళ్ళగానే ఆమెలో కొత్త కోరికలు చిగురించసాగాయి. తను ఇప్పుడు రకరకాల పదార్థాలు తయారు చేస్తుంది. అతడికి ప్రేమతో తినిపిస్తుంది. ఇంటికి తాళాలు వేసి ఉన్నా ఆ రోజు ఆమె ఎంతో స్వతంత్రంగా ఫీల్ అవుతూ ఆకాశంలో విహరించసాగింది. ఊహలలో తేలిపోసాగింది. తను చేసిన పదార్థాలను అతడి పెదవులకు అందిస్తుంది. ప్రేమతో తన ప్రియుడు...

ఛ! అతడు పాకీవాడు కదూ! అనిపించిందంతలోనే.

అతడి కులం మాట గుర్తుకు రాగానే మనస్సనే గులాబీ ఎండిపోసాగింది. పరుగెత్తుతూ పరుగెత్తుతూ గదిలోకి వెళ్లి టైమ్ చూసింది. అతడు రావడానికి ఇంకా చాలా టైమ్ ఉంది. ఒళ్ళు విరుచుకుంది. చేతులు జాపింది. వేళ్ళలో వేళ్ళు పెట్టి నొక్కుకుంది. నెమ్మది నెమ్మదిగా బట్టలు విప్పేసింది. బయట ఎంత చలిగా ఉన్నా ఆమెకు చలి అనిపించలేదు. అతడు వస్తే... నన్నీవిధంగా చూస్తే...!

అదేక్షణంలో నిర్గుణియాకు అమ్మమ్మ, తాతయ్య గుర్తుకువచ్చారు. అంతే మనస్సులో చెలరేగే పిచ్చి ఆలోచనలు ఓ క్షణం రావడం మానేశాయి. కొంచెంసేపు మనస్సు కంట్రోల్‌లో ఉంది. కానీ అతడి సవ్వడి వినగానే మనస్సు మళ్ళీ వశం తప్పింది. బట్టలు వేసుకుంది. మోహన్ పిలవకుండా బకెట్టు తీసుకుని నిల్చుంది. అతడు తన పని పూర్తి చేసుకుని వెళ్ళబోయాడు.

"రా... కాళ్ళు చేతులు కడుక్కో..."

"పనంతా చేశాక స్నానం చేసి తింటే బాగుంటుంది" చీపురు మూల పెట్టి అతడు వెళ్ళబోయాడు.

"అరె... చెప్పేది వినమంటుంటే... బయట తలుపులు మూసేసేయి"

ఆ మాట వినంగానే మోహన్ ఆమెవంక

ఉరిమిచూశాడు. అతడి పెద్దపెద్ద కళ్ళు ఆమె హృదయంలో బల్లాలు గుచ్చాయి. తడబడుతూ ఆమె అంది "గాజర్ హల్వా! నేను నీకోసం ఎంతో ప్రేమగా చేశాను"

మోహన్ బయట తలుపులు దగ్గరకు వేసి లోపలి గడప దగ్గరికి వచ్చినిల్చున్నాడు. నోటి మీదినుంచి పట్టి తీసేశాడు. అతని కళ్ళు 'ఏమిటి? ఎందుకు?' అని ప్రశ్నిస్తున్నాయి. ఆ కళ్ళు మధు పాత్రలలాగా ఉన్నాయి. ఓహ్ ఎంత అందంగా ఉన్నాడు. అని లోపల అనుకుంది నిర్గుణ్.

"కూర్చో... ఇప్పుడే వస్తాను..." అంటూ ఆమె లోపలికి వెళ్లి హల్వా తీసుకువచ్చింది కానీ మోహన్ వెళ్ళిపోయాడు. అంతే ఆరోజు పగలు, రాత్రీ ఏడుస్తూనే ఉంది. అన్నం ఒక్క ముద్ద అయినా తినలేదు. పచ్చిమంచినీళ్ళు తాగలేదు.

మూడోరోజు మంచం మీద నుండి లేవలేక పోయింది. మనస్సు తననుతానే కాల్చుకోసాగింది. ఆరోజు వంట చేయలేదు. ఆమె భర్తే వంట చేశాడు. మురారి చేత పళ్ళు మిఠాయిలు తెప్పించాడు. దుకాణంకి వెళ్తూ ఆమెను తినమని చెప్పి వెళ్ళాడు...

నిర్గుణ్ ఈ లోకంలోకి వచ్చింది. మోహన్ తలెత్తి ఆమె వంక చూశాడు. తరువాత వేలితో రాస్తూ ఆమెలో పులకింత కలిగించాడు. తను కూడా మోహన్ని ఈవిధంగానే రెచ్చగొట్టింది గదా అనుకుంది ఆమె. మళ్ళీ ఆమె ఉదాసీనంగా మారిపోయింది. మోహన్ స్పర్శ... ఆ స్పర్శ ఎంత మత్తు కలిగించింది. వేయివసంతాలు ఒక్కసారిగా తన జీవితవనంలో వచ్చినట్లుగా అనిపించింది. మరుభూమిలో వానజల్లు కురిసినట్లనిపించింది. మానసవిపంచి ఒక్కసారిగా మ్రోగినట్లుగా అనిపించింది. ఆ పురుషస్పర్శకు ప్రకృతి పులకించింది. ఆమె నరాలు జిల్లుమన్నాయి. కొన్ని రోజుల క్రితం జరిగిన సంఘటనలు ఆమె కళ్ళముందు దృశ్యాల్లా కదలాడసాగాయి.

మోహన్ వచ్చాడు. దొడ్డి శుభ్రం చేసి వెంటనే వెళ్ళిపోదామని అనుకున్నాడు. ఇంతలో ద్వారం దగ్గర నిల్చుని ఉన్న నిర్గుణ్ పరదా వెనకనుండి చూసింది. దాన్ని కొంచెం పక్కకు జరిపింది. ఆమె చూపులు మోహన్ను బంధించి వేశాయి. అతడి చేతిని పట్టుకుని తన వైపు లాగుతూ "బయటి తలుపులు వేసేయి" అన్నది నిర్గుణ్. గారడివాడి చేతిలో బొమ్మలా అతడు వెళ్లి తలుపులు వేసేశాడు. బయటి ప్రపంచం నుండి రక్షణ దొరకగానే నిర్గుణ్ లోపల గది రెండో పరదాను తీసేసింది. అతడిని గట్టిగా వాటేసుకుంది.

ఆ యువకుడిలో పురుషత్వం జాగృతి చెందడానికి ఎక్కువసేపు పట్టలేదు.

ఈ రోజు తన కోరిక తీర్చుకోవడానికని నిర్గుణ్ అంతా ఏర్పాటు చేసి ఉంచుకుంది. అంటుసొంటు, అంటరానితనం, అనే నియమాలు ఇప్పుడు ఆమెకు లేవు. ఆ కలయిక ఇద్దరిమధ్య నూరేళ్ళ బంధాన్ని పెంచింది. ఒకరినుండి ఒకరు దూరంగా ఒక్కక్షణం కూడా ఉండలేని స్థితికి వచ్చారు. ఆరోజు మోహన్ తన పనంతా పూర్తి చేసుకుని స్నానం చేసి వచ్చాడు. వచ్చేటప్పుడు ఒక పూలదండ కూడా తెచ్చాడు. దాన్ని నిర్గుణ్ మెళ్ళో వేశాడు. తన మెడలో నుండి తీసి నిర్గుణ్ దాన్ని అతడి మెడలోనే వేసి గట్టిగా కౌగలించుకుంది.

"నీకూ నాకూ గాంధర్వ వివాహం జరిగిపోయింది" అంటూ మోహన్ ఆమెను ముద్దు పెట్టుకున్నాడు.

"ఈ జన్మలో నిన్ను విడువను. మన ఇద్దరం నూరేళ్ళు కలిసి ఉందాం"

"ఒకవేళ ఎప్పుడయినా ఆ బ్రాహ్మడు పట్టుకుంటేనో..."

"వాడిని చంపేసి నిన్ను లేపుకుపోతాను"

"ఈ నరకం నుండి నన్ను ఇప్పుడే తీసుకుపోరాదూ! నా దగ్గర బోలెడంత డబ్బు ఉంది. నన్ను దూరంగా ఎక్కడైనా వేరే ఊరికి తీసుకుపో... ఎక్కడోక్కడ కిళ్ళీ దుకాణం తెరుచుకుని కూర్చో. నిన్నెవరు గుర్తుపడతారనీ! నాతో వచ్చేశావూ అంటే నీవూ బ్రాహ్మణుడివైపోతావు"

"అమ్మాయిగారూ! నేను ఎట్లా మారిపోతాను. తమరే మార్తారు" మోహన్ చల్లగా ఆ

మాట అన్నా నిర్గుణ్‌కి కాలికింద భూమి కదు ల్తున్నట్లుగా అనిపించింది. తర్వాత ఆమె చిరునవ్వు నవ్వింది.

"ఏదైతేనేం? రెండూ ఒకటేగా! కాని నీకు ఉన్నతంగా జీవించడం ఇష్టం లేదా? పెద్దవాళ్ళలాగా బతకడం నేర్చుకుంటే మరో కొత్త జీవితాన్ని నీవు చూడవచ్చు. అదీకాక అందరి దృష్టిలో మనం అంటే మంచి భావన ఏర్పడుతుంది. ఇంత అసహ్యాకరంగా నీవు కష్టపడన ఖ్ఖరలేదు. ఎంతైనా ఈ పని..."

"నేను జన్మంతా ఈ పనే చేస్తూ బతకను. రెండేళ్ళలో బాండ్ మాస్టర్నయి ఓ కొత్త కంపెనీ తెరుస్తాను. కెప్టెన్ సాహెబ్ దయ పొందడానికి నేను ఎంతో కష్టపడ్డాను. ఇన్నాళ్ళకి ఆయనకి నా మీద దయకలిగింది. ఇదంతా ఇప్పుడు వదిలేసుకోమంటే ఎట్లా చెప్పండి?"

కానీ, ఆరవ రోజు నిర్గుణ్ తన దగ్గర దాచివుంచిన తొమ్మిది వేల రూపాయలు, నగలు, నాలుగైదు చీరలు, జాకెట్లు, మూటకట్టి సాయంత్రం సమయంలో మసురియాదీన్ ఇంటికి రాకముందే వెనకద్వారం నుండి బయటపడింది.

సరాసరి స్టేషన్‌కు వచ్చింది. కంపార్టుమెంట్‌లో కొందరు దిగారు, కొందరు కొత్త ప్రయాణీకులు ఎక్కారు.

మోహన్ ఒళ్ళు విరుచుకున్నాడు. ఆమె ముసుగు తొలగించింది. ఇద్దరూ నవ్వుకున్నారు.

"తాగడానికి నీళ్ళు కావాలా?"

"ఊహు అఖ్ఖరలేదు. ఎక్కడికి టికెట్టు తీసుకున్నావు?"

"మామ ఊరికి టికెట్టు తీసుకున్నాను" ఆ మాట వినగానే నిర్గుణ్ ఉదాసీనంగా మారిపోయింది. మొదటిరాత్రి ఇంటినుండి వచ్చేయగానే మోహన్ తల్లి ఇంటికి వెళ్ళారు ఇద్దరూ. అక్కడ తనకు ఎంతో అవమానం జరిగింది. మోహన్ తల్లి ఇష్టం వచ్చినట్లు తిట్టింది.

"ఇదిగో మోహనా! దీన్ని ఎక్కడికైనా తీసుకుపో... నా ఇంట్లో మాత్రం ఇట్లాంటి ముండలకి చోటులేదు. ఇవాళ మొగుడిని వదిలేసి లేచివచ్చింది. రేపు నిన్ను వదిలి మరో మొగాడితో లేచిపోతుంది. దీన్ని ఎవరు నమ్ముతారు. దీని మొగుడు పోలీసు రిపోర్టు ఇస్తాడు. అప్పుడు మన గతేంకాను"

ఆ రాత్రి ఇద్దరూ ఒక హోటల్‌లో ఉన్నారు. నిర్గుణీయా మోహన్‌ని పట్టుకుని కుళ్ళి కుళ్లి ఏడ్చింది. ముళ్ళలాంటి ఈ ప్రపంచంలో మోహన్ ఒక్కడే గులాబి పువ్వులా తనకు దగ్గరయ్యాడు. ఇప్పుడు అతడు ఒక్కడేగా తనకు ఆధారం.

మరునాడు మోహన్ తల్లి దగ్గరికి వెళ్ళాడు. నిర్గుణ్ లేచిపోయిందన్న వార్త ఊరంతటా పాకిపోయిందని చెప్పింది. అందరు మసురియాదీన్ తిడుతున్నారు. మోహన్ మీద ఎవరికీ అనుమానం రాలేదని చెప్పింది. ఇదంతా విన్నాక మోహన్‌కి ధైర్యం వచ్చింది. మనస్సుకు శాంతి కలిగింది. మళ్ళీ తల్లి అతనికి హితబోధ చేసింది "ఇదిగో మోహనా! నా మాట విను దీన్ని వదిలేయి. ఇది నీకు ఉరితాడవుతుంది. ఏజంట్లకు తక్కువేం లేదు. దీన్ని ఎవడికో ఒకడికి ఆరొందలకు అమ్మేయి. ఈ పీడ విరగడ చేసుకో..."

మోహన్ ఆమె మాట వినలేదు. ఒకరాత్రి రెండోరోజు పగలు అక్కడే గడిపారు. సాయంత్రం ఫారెన్ లిక్కర్ తీసుకువచ్చాడు. నిర్గుణ్ దాని కంపును ఎట్లాగొట్లా భరించింది. కాని తాగడానికి నిరాకరించింది. తను మోహన్‌తో వాళ్ళ కులంలోకే మారివెళ్తోంది అని తెలియంగానే నిర్జీవురాలయింది. తను తను ఓ ఉన్నత కులంకి చెందిన తను ఎన్ని అవమానాలను సహించాలని రాసి ఉందో...

'హే రామా! రామా!' కంపార్ట్‌మెంట్‌లో ఎవడో పాడుతున్నాడు. మైనె లాఖోంకె బోల్ సహె సితమ్‌గర్ తేరేలియే... (నీకోసం నేను లక్షల మందితో తిట్లు పడవలసివచ్చింది కదా!)

★ ★ ★

నిర్గుణ్ మోహన్‌లు స్టేషన్ నుండి మోహన్ మేనమామ ఇంటికి బయలుదేరారు.

నిర్గుణ్ దూరంగా ఎక్కడికైనా వెళ్ళి పోదామని, మంచి జీవితం గడుపుదామని ఎన్నోసార్లు మోహన్‌కి చెప్పింది. కాని మోహన్ తనకులాన్ని వదులుకోదలచలేదు. కులాన్ని వదలకూడదు, వదిలితే అన్నివిధాల భ్రష్టులై కుక్క

బతుకు అవుతుందని తన మామ ఎన్నోసార్లు చెప్పాడు. పరాయి ధర్మం స్వీకరించి బతకడం ఎంతో భయంకరమైనదనీ అంతకన్నా స్వధర్మంలో మృత్యువును కూడా ఆహ్వానించవచ్చుననీ భగవద్గీతలో రాసి ఉందట.

నిర్గుణ్‌కి ఎవరో చెంపదెబ్బ కొట్టినట్లుగా అనిపించింది. ఎన్నో కోరికలతో నిండి ఎన్నెన్నో వెన్నెల వసంతాలు చూస్తాననుకుంది. ఆ మనస్సు ఒకటైతే, రెండు మూడు రోజులలోనే తన పరిస్థితిని తెలుసుకుని అయ్యో... నిర్గుణ్ ఎంతగా దిగజారిపోయావూ అనే మనస్సు రెండోది.

ఆ రెండో మనస్సు ఇప్పుడు బయటకి రావడానికి ప్రయత్నిస్తోంది. నిర్గుణ్‌లో స్పృహ తప్పి పడిఉన్న ఆరెండో మనస్సు ఎన్నో ముక్కలయింది. తన దృష్టిలో తనే హీనురాలిగా మారిపోయింది.

నాలుగు రోజుల తరువాత ఆమె మనస్సు ఆమెను ఎందుకిట్లా భ్రష్టురాలివైపోయావని నిలదీసి అడిగింది.

అయ్యో... తన చేజేతులారా ఎందుకిట్లా చేసుకుంది? ఎందుకు? ఎందుకు?

మోహన్ తన ప్రియురాలిని దగ్గరకు తీసుకున్నాడు. సిగరెట్టు పారేసి ఆమె ముఖాన్ని తన వైపు తిప్పుకున్నాడు. ఎన్నో ముద్దులు పెట్టాడు. కొన్ని రోజుల క్రితం ఏ ఆలింగనం, ఏ ముద్దులకోసం పరితపించిందో ఇప్పుడు అవే ఆమెకు ఎంతో బాధకరంగా అనిపించాయి. నాలుగు రోజుల క్రితం ఇదే శరీరంలో చచ్చిపడి ఉన్న ఆమె పూర్వపు జన్మ ఇప్పటి ఆమె జీవితంలోని జ్యేష్ఠమాసపు ఎండలా కాల్చేస్తోంది.

''నీవు నన్ను వాళ్ళ కాళ్ళు మొక్కమని అడగవుకదా!'' నిర్గుణ్ అడిగింది.

మోహన్‌కి కోపం వచ్చింది.

''ఏమనుకుంటున్నావో ఏమో... నా అత్త మామలు లక్షలాది పై కులాల వాళ్ళకంటే ఎంతో నయం... నీవు ఇప్పుడు నా పెళ్ళానివి. మావాళ్ళ కాళ్ళకు నువ్వు మొక్కి తీరాల్సిందే... కాళ్ళు మొక్కడం మా ఆచారం. ఇదిగో నువ్వు కనుక ఇట్లా ఆలోచిస్తే నీ ఇష్టం, ఎటైనా వెళ్ళిపో... ఎక్కడికి వెళ్ళాలని ఉంటే అక్కడికి వెళ్ళిపో... నేను నిన్ను ప్రేమించాను, కాదనడంలేదుకానీ నేను నా కులాన్ని వదులుకుంటానా... ఊహు... ఎప్పటికీ వదలను'' అంటూ బూతు మాట అనేసి గబగబా అడుగులు వేస్తూ వెళ్ళబోయాడు.

నిర్గుణ్ గాభరాగా అతడి కాళ్ళను పట్టేసుకుంది. ''నీవేది చెబితే అది చేస్తాను'' అంది. మోహన్ మనస్సు కరిగింది. ఆమె తల నిమురుతూ అన్నాడు ''నిర్గుణ్ నీవు ఎవరితో లేచివచ్చావు. ఒక పాకీ వాడితోటి. అవునాకాదా? మరి నా కులం వాళ్ళలో నువ్వు కలిసిపోక తప్పదు. అర్థం అయిందా?''

కాలవ దగ్గర మట్టితో కట్టిన ఇళ్ళు ఉన్నాయి. కరెంట్ స్తంభాల దగ్గర పందుల గుంపులు ఉన్నాయి. వేపచెట్టుకింద ఉన్న కుక్కలు, పందులు. పాదాల చప్పుడు విని అరవడం గుర్‌గుర్ మనడం మొదలుపెట్టాయి. మోహన్ ఇంటి తలుపు తట్టాడు. తల్లిని (అత్త) పిలిచాడు. మోహన్ మామ రామచందర్ తలుపు తెరిచాడు. మోహన్ రామచందర్ కాళ్ళకి దండంపెట్టాడు. చూసి చూడనట్లుగా నిర్గుణ్ కూడా మొక్కింది. ఆ క్షణంలో ఆమె మనస్సు రెక్కలు తెగిన పక్షిలా విలవిలాకొట్టుకుంది. కానీ మనస్సు కొంతవరకు గట్టిపడింది. ఇప్పుడు తను పూర్తిగా మోహన్‌దయింది. అతడు ఎట్లా ఆడిస్తే తను అట్లా ఆడుతుంది.

''ఇది ఎవరురా?'' అని అడిగింది అత్త. నిర్గుణ్ ఆమె కాళ్ళకు మొక్కింది.

''నీ కోడలనుకో...''

''ఆ... కోడలా!''

''అమ్మా! కొంచెం నెమ్మదిగా మాట్లాడు. దీని మొగుడు ముసలివాడు. వాడికిది ఏడో పెళ్ళాం. వాడు ఆ ముసలిముండా కొడుకు దీన్ని తిట్టేవాడు. కొట్టేవాడు. పాపం ఇహ అక్కడ ఉండలేక ప్రాణం కాపాడుకోవడం కోసం ఇది ఇంట్లోంచి వచ్చేసింది. నన్ను రక్షణ అడిగింది. కాదనలేక నేను దీన్ని తీసుకువచ్చాను. అమ్మ చాలామంచిది! దీన్ని ఉంచుకుంటుందని నా నమ్మకం. అవునుకదూ అమ్మా...''

''అరె... డెబ్బైమంది మొగుళ్ళని చేసు

కుందంటున్నావు. దీని ముఖాన ఇదే రాసి ఉంది. ఆమొగుళ్ళనివదిలి చివరికి నీ దగ్గరకు చేరింది''

''మరి ఈమెది ఏ కులంరా మోహనా?'' అడిగాడు రామచందర్.



"పెద్దకులం..."

"బ్రామ్మలా... అత్తమామ ఇద్దరు ఒక్కసారిగా ఆశ్చర్యపోతూ అన్నారు. "మీరు దీన్ని కోడలుగా స్వీకరించాల్సిందే"

"దీన్ని నేను ఇంట్లో ఉంచుకోను. ఎక్కడికైనా పొమ్మను"

"అయితే నేనూ వెళ్ళిపోతాను. మేం ఇద్దరం క్రైస్తవుల మతం తీసుకుంటాం" మోహన్ బెదిరిస్తూ అన్నాడు.

"ఇందుకేనురా నిన్ను పెంచింది" అంటూ మోహన్ అనలు తల్లిని బూతులు తిట్టసాగింది అత్త.

కోడలు ఎదురుగుండా భార్య తన చెల్లెలు గురించి ఈవిధంగా మాట్లాడటం రామచందర్ సహించలేకపోయాడు "నోరు మూసుకోవే..."



సుబరాతన్‌కి కోపం ఎక్కువ అయింది. "నీ ముద్దుల చెల్లెలి సంగతి ఎవడికి తెలియదని? ఆ జద్దుఠాకుర్ దీనికి కడుపు చేశాడు. వీడు పుట్టగానే చెప్పాను వీడిని బొందపెట్టమని"

తన భార్య ఎదురుగుండా తన జన్మ గురించి ఇంత హీనంగా మాట్లాడటం మోహన్ భరించలేకపోయాడు. "దీన్ని ఉంచుకుంటావా ఉంచుకో. లేకపోతే మేం వేరే ఇల్లు అద్దెకు తీసుకుంటాం" అనేశాడు.

"పోనీలేవే ఇకవాడిని తిట్టకు... జరిగిపోయిందేదో జరిగిపోయింది. మోహన్ అమ్మానాన్న ఘర్‌బైఠవా (పెళ్ళి కాకపోయినా సరే పిల్లవాడిని పిల్లని గడపలోకి రానీయడం) చేయించారు. ఇంట్లోకి రానిచ్చి అందరికి తినిపించి తాగించారు అని మనకులం వాళ్ళకి చెబుదాం. రేపొద్దున్న పంచాయితి పెట్టిస్తాను ఏమంటావ్..."

నిర్గుణ్ మౌనంగా అన్నీ విన్నది. మోహన్ మాటలు ఎలా ఉన్నా తన పట్టుదలతో ఆమెను రక్షించాడు. అందుకే అతడంటే ఆమెకు మరీ ప్రేమ కలగసాగింది. మరుభూమిలో ఒక్క ఆకు పచ్చటిగడ్డి మొక్క మొలిచినా మనస్సంతా హాయిగా ఉంటుంది. అత్త తిడుతూనే ఉంది. ఆ గది చాలా చిన్నది. ఒక మూల నాలుగు కుండలు ఒకదాని మీద ఒకటి పెట్టి ఉన్నాయి. గది అంతా పేడతో అలికి ఉంది. అక్కడక్కడ పెచ్చులు లేచిపోయాయి. బలిసిన రెండు పందులు చలికి ఓ మూల ఒణుకుతూ కూర్చున్నాయి.

నిర్గుణ్ తన నగల మూటను కిందపెట్టింది. ఆమెను పీడిస్తున్న సమస్య ఒక్కటే. ఈ మూటను ఈ పరాయికొంపలో ఎట్లా రక్షించుకోవాలి?

ఆమె ముఖంకి దగ్గరగా మోహన్ దీవపు బుడ్డీ పెట్టాడు. మోహన్ ఆమె ముఖం ఎంతో ఉదాసీనంగా ఉండటం చూశాడు. అతడికి ఆమె జీవం ఉన్న ఓ ఆడదిలాగా కాకుండా రెండు చేతులు తెగి చౌరస్తా మీద నిల్చున్న ఆడదిలాగా కనిపించింది. 'అరె ఈమెను ఎందుకు లేపుకు వచ్చాను' అన్న పశ్చాత్తాప భావనే అతడి కళ్ళను కిందకు దింపేటట్లు చేసింది.

అతడి దృష్టి గదిలోని పందుల మీద పడ్డది. ఆ కోపం అంతా వాటి మీద చూపెట్టాడు.

ఆమెను ఆలింగనంలోకి తీసుకుని తన ముద్దులతో ఆమెలో మళ్ళీ ప్రాణం పోయాలని ప్రయత్నించాడు. "నీవు రాజమహలులో ఉండవలసినదానివి. ఖర్మకాలి నాతో వచ్చేశావు. ఆ భగవంతుడు నాకు చావన్నా ఇస్తే బాగుండును నీకు విముక్తి కలుగుతుంది"

ఈ ఆత్మగ్లానితో నిండిన వాక్యాలు ఆమెలో అతని ముద్దులు కూడా పోయలేని ప్రాణాన్ని పోశాయి. ఆమె తన జీవన లతను పైకిపాకించుకోవడానికని పురుషుడనే వృక్షంతో పెనవేసుకుంటూ పోయింది.

శారీరకంగా మానసికంగా అతనికి ఎంతో ఆనందం కలగసాగింది. ఆ క్షణాలు ఎంతో మధురంగా ఎంతో గొప్పవిగా మరుపురానివిగా అతడికి అనిపించసాగాయి. "రేపు నువ్వు మీ దొరను క్వార్టర్ విషయం కనుక్కో" అంది.

"ఎట్లాగూ అడుగుతాననుకో కాని నీవు ఓ మాట గుర్తుంచుకో... వీలు ఉన్నంత వరకు మనం అత్త మామల దగ్గరే ఉండాలి. వాళ్ళకి నువ్వు గౌరవం ఇవ్వాలి. ప్రొద్దున్నే అమ్మ ఐదుగంటలకి లేస్తుంది. ఇప్పటివరకు అయితే మామ దానికి హుక్కా నింపి ఇస్తున్నాడు. కాని రేపటినుండి ఆ డ్యూటీ నువ్వు చెయ్యాలి తెలిసిందా... వాళ్ళని ఎట్లాగొట్లా నీవలలో వేసుకో..."

"నాకు హుక్కా నింపడం చేతకాదు. మాలో ఎవరూ హుక్కా నింపరు... మా బ్రాహ్మణులలో..."

"అరె... నీ కులం సంగతి వదిలేయి. ఇప్పుడైతే నీవు పాకీదానివి. గుర్తుపెట్టుకో... మామను చూసి నేర్చుకో..." అలా అనటంలో ఓ బూతు మాట కూడా అన్నాడు మోహన్.

తనను ఎవరో ఉరితీస్తున్నట్లుగా అనిపించింది నిర్గుణ్‌కి... ఓ రామా! నా వలన ఎంత తప్పు జరిగిపోయింది, అనుకుంది. ఆమె మనస్సులో మరో కొత్త భయం పట్టుకుంది. ఈ శూర్పణఖ తనను అందరి ఇళ్ళకి

వెళ్ళి మలమూత్రాలను ఎత్తమనదు కదా! కేవలం ఆ ఊహను కూడా ఆమె భరించలేక పోయింది. కడుపులో తిప్పుతున్నట్లుగా అని పించింది. వస్తున్న డోకును బలవంతంగా ఆపుకుంది. అటువంటి పని చస్తే చేయను అని మనస్సులో దృఢంగా నిశ్చయించుకుంది.

ప్రొద్దునే రామచందర్ దగ్గు వినిపించగానే నిర్గుణ్ గదిలోంచి బయిటకి వచ్చి అతడి కాళ్ళకు దండం పెట్టబోయింది. అతడు వెంటనే తన కాళ్ళను వెనక్కి తీసుకున్నాడు. "పిల్లాపాపలతో నూరేళ్ళు చల్లగా ఉండు కోడలా" అని దీవించాడు.

"మామయ్యగారూ! నాకు హుక్కా ఎట్లా తయారు చేస్తారో నేర్పించండి" అని మధుర మైన కంఠంతో అన్నది.

"ఒద్దు ఒద్దు... ఈ పని నేనే చేసుకుంటాను. ఎంతయినా నీవు పెద్ద కులంలో పుట్టిన దానివి"

"నేను నాకులాన్ని వదిలేసి వచ్చాను. ఇప్పుడు మీ మనిషిని..."

"నీవు పెద్ద తప్పు చేశావు. పెద్ద కులంలో పుట్టిన దానివి, వీడి చేయిపట్టుకుని గడపదాట కుండా ఉండాల్సింది. ప్చ్... చాలా పెద్ద తప్పు చేశావు అమ్మాయి"

"హుక్కా నింపడం నేర్పించండి" అంటూ పట్టుబట్టి హుక్కా ఎట్లా నింపాలో నేర్చుకుని అత్త దగ్గరకు వచ్చింది.

అత్త నులకమంచం మీద కూర్చుని దగ్గు తోంది. కోడలిని చూడంగానే అత్త అధికారం చూపిస్తూ అంది, "కోడలా! ఆ హుక్కా అక్కడ పెట్టు. ముందు నాకాళ్ళు పట్టు"

కోడలు అత్త పాదసేవ చేసింది. బాల్యంలో తను అమ్మమ్మ కాళ్ళు పట్టేది. ఒకసారి మసురి యాదీన్ పాదసేవ చేసింది. కొన్నాళ్ళు అమ్మగా వ్యవహరించిన నాన్న ఉంపుడుకత్తె కాళ్ళు కూడా పట్టింది. అక్కడివరకు ఫరవాలేదు. కాని ఈ పాదసేవ... ఒకే జన్మలో తను ఎన్నెన్ని జన్మలనెత్తింది.

అత్తవేసిన ప్రశ్నకు ఈ లోకంలోకి వచ్చింది, "నీ ముసలి మొగుడి దగ్గర నుండి ఏమైనా డబ్బు తెచ్చావుటే?" నిర్గుణ్ వెంటనే జవాబు చెప్పకపోవడం వలన అత్త నిర్గుణ్‌ని ఒక తావు తన్నబోయింది. కాని నిర్గుణ్ పక్కకు తప్పు కుని తన్నుతాను రక్షించుకుంది. తడబడుతూ అంది "ఏవోకొన్ని ఉన్నాయి. నాలుగైదు వందలు ఉండవచ్చు"

అత్త నిర్గుణ్ రెండు చేతులూ పట్టుకుని గట్టిగా ఊపుతూ అంది, "నీ కన్ను నా ఇంటి మీద ఎందుకు పడ్డదే... నీ వయస్సు తగలడ! లేచివస్తూ ఇంత తక్కువా తెచ్చేది" అంటూ రెండు చేతులతో ఆమె గొంతు పట్టుకుంది. పాలు తాగే నా కొడుకేనా నీకు దొరికింది. వెళ్ళవే వెళ్లు... హుక్కా తీసుకురా" అంటూ బూతులు తిట్టింది. "నీ శరీరాన్ని తేళ్ళుకుట్ట... నీ ఏడుతరాలు నరకానికి వెళ్ళ... నీయమ్మ... నీ నాయనమ్మా... నీ బాబు... ఎందుకే ఆపాడు జన్మలు..." అంటూ ఇష్టం వచ్చినట్లు తిట్టసా గింది.

కోడలి కన్నీళ్ళు ఎండిపోయాయి. ఆమె రాయిలాగా మారిపోయింది.

ఏడు ఏడున్నర గంటలకు సద్ది రొట్టెలతో కడుపు నింపుకుని అత్త తన తట్ట చీపురు, చేతిపార తీసుకుంది "ఇదిగో... వింటున్నావా... వంటచెయ్యి... నీ మామ తొందరగా తింటా డేమో... నిన్న సాయంత్రం బైలువా ఇంట్లో పందిని కోశారు. పంది మాంసం గూట్లో పెట్టా ను. బాగా వండాలి... ఘుమఘుమలాడాలి. నీ మామని వల్లో వేసుకునేవ్... వాడి ఎదురు గుండా పెట్టకు. రొట్టెలు, కూరచెయ్యి" కోడలికి అధికార ధోరణిలో చెప్పింది.

పంది మాంసమా! ఆ మాంసాన్ని వండ టమా! ఏం చేయాలి రామా! ఎట్లా చేయను రామా! ఏం అనుకున్నాను రామా! ఏం జరిగి పోయిందిరామా! రామా!

అత్త వెళ్ళిపోయింది. మామకూడా హుక్కా తీసుకుని వెళ్ళిపోయాడు. కోడలి మనస్సులో సంఘర్షణ ప్రారంభం అయింది. పతిదేవుడు తొమ్మిది గంటలకు లేచాడు. నిర్గుణ్‌కి తను మరో జన్మ ఎత్తినట్లుగా అనిపించింది. ఈ జన్మలో ఏ ఇంట్లో అయితే అడుగుపెట్టిందో ఆ ఇంట్లోని వంటగదిలో ఆమె పొయ్యి వెలి గించింది. పొయ్యిలోని కట్టెలలాగే ఆమె శరీ

రంలోని పాత జన్మ తాలూకు సంస్కారాలు కూడా మండుతున్నాయి. పైన గూట్లో ఆకులో పెట్టి ఉన్న నిషిద్ధ పదార్థాన్ని కన్నెత్తి చూసింది. చూడంగానే ఆమెకు కడుపులో తిప్పినట్లుగా అనిపించింది.

అంత చలికాలంలో కూడా ఆమె ముఖంమీద చెమట బిందువులు మెరుస్తున్నాయి.

గదిలోంచి భర్త పిలుపు వినిపించి చలనంలేని బొమ్మలా ఆ గదిలోకి వెళ్ళింది 'ఎక్కడున్నావే నిర్గుణ్' మోహన్ పెద్దగా అరిచాడు.

భర్త సిగరెట్టు దమ్ము లాగుతున్నాడు. భార్య అశాంతంగా ఏదో పోగొట్టుకున్నదానిలాగా అతనివంక చూస్తోంది.

''రాణిగారూ! తమరెట్లా వున్నారు'' అతడు గర్వంగా నవ్వాడు. భార్య ముఖంమీద పొగ వదిలాడు.

ఆమెకు ఒక్కసారిగా దుఃఖం పొర్లుకువచ్చి పతి కాళ్ళమీద పడి వెక్కివెక్కి ఏడ్చింది.

తన ఛాతీమీద తల ఆన్చిన భార్య ధుఃఖం పతియొక్క విజేత హృదయంలో కోరిక రేపింది. ఆమెను తన బాహువుల్లో తీసుకుని కన్నీళ్ళతో తడిసిన ఆమె బుగ్గలను ముద్దుపెట్టుకుంటూ అడిగాడు-

''ఏమయిందే? అమ్మ ఏమైనా అన్నదా?''

''మీ అమ్మ నన్ను మాంసం వండమంది. నేను ఇంతమటుకు దాన్ని ముట్టుకోలేదు'' ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ అంది.

అతడు ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. ఆమె బుగ్గను గట్టిగా కొరికాడు. ఆమె బాధ తట్టుకోలేక అరిచింది.

''ఇంతకుముందు నువ్వు ఏ పాకీవాడినైనా ముట్టుకున్నావా? నన్ను వలలో ఎందుకు వేసుకున్నావ్? నీ మనస్సును ఎట్లా ఒప్పించావు? చెప్పవే చెప్పు?.... చెప్పు...'' అంటూ కాలుతున్న సిగరెట్టును ఆమె బుగ్గమీద పెట్టాడు.

ఆమెలో పశ్చాత్తాపాగ్ని ఎంత ప్రబలంగా ఉందంటే కాలుతున్న సిగరెట్టు ఇంకాసేపు ఉంచినా ఆమె ఏమీ మాట్లాడేదికాదు.

కొంచెంసేపయ్యాక లేచి మాంసం ఎట్లా వండాలో చెప్పసాగాడు. ఓ అర్ధగంటక్రితం వరకు తన పూర్వపు సంస్కారంవలన ఎంతగానో బాధపడిన ఆ స్త్రీ నిర్జీవంగా మారిపోయింది. ఇప్పుడు ఆమె చేతులు పరాయివిగా మారి తన పతి ఆజ్ఞను యంత్రాలలాగా శిరసావహించి పనిచేయసాగాయి. ఆరోజు ఆమె పచ్చి మంచినీళ్ళు ముట్టుకోలేదు. మోహన్, మామ, వెళ్ళిపోయాక తను తెచ్చిన ధనంలో కొంత బయటపెట్టి మిగిలినది నేలలో పూడ్చేసింది. మధ్యాహ్నం అత్త వచ్చింది. కడిగిన తట్ట, చేతి పార ఒక మూల పెట్టింది. మంచంమీద కూర్చుని కాళ్ళు బారజాపింది. ''అన్నం వండావా? కులంవాళ్ళ నోళ్ళు మూయించాలి అంటే వాళ్ళకి కడుపులనిండా మెక్కపెట్టాలి. నువ్వు తెచ్చిన డబ్బు తీసుకురా... వింటున్నావా'' అంటూ బూతుమాటలు అంది.

''ఇదిగో వినకపోయినావో బొక్కలు విరుగుతాయ్''

''నిర్గుణ్ మౌనంగా తన గదిలోకి వెళ్ళిపోయింది. ఒక పొట్లం తెచ్చి అత్తకిచ్చింది. ఆమె మనస్సు అసహ్యంతో నిండిపోయింది. తను ఈ నరకంనుండి పారిపోవాలి. పారిపోవాలి... ఎక్కడికి? ఎక్కడికి?... ఎదురుగుండా అంతా శూన్యం. ఆమెలోని ఒక మనస్సు నాట్యం చేయసాగింది. కాని రెండో మనస్సు నిశ్శబ్దంగా మూగపోయింది.



నిర్గుణియానితన జీవితంలో జరిగిన సంఘటనల గురించి నేను వ్రాసినవన్నీ వింటూ కూర్చుంది.

"మీరు నన్ను అర్థంచేసుకుని నిర్గుణియాని సజీవంగా చిత్రించారు. చాలా బాగా వ్రాశారు" అన్నది.

"కాని మీరు చెప్పినవన్నీ నేను వ్రాయలేక పోయానేమో అనిపిస్తోంది. మీరు ఆరోజు మాంసం..."

"ఆరోజు అతనే వండాడు కాని ఆ తరువాత అన్ని పనులు నేనే చేయడం మొదలుపెట్టాను. మేం ఒకళ్ళను ఒకళ్ళు ప్రేమించుకున్నాం బాబుగారూ! ప్రేమించడం అంత తేలిక అయిన పనికాదు బాబుగారూ! ప్రేమ అంటే ఏమిటో తెలుసా! అది ఒక తపస్సు. ప్రేమావేశంలో ఏ కష్టాలు మనకు తెలియవు. ఎదురుగుండా ఉన్న పర్వతాలను సైతం దాటే శక్తి ఇస్తుంది ఆ ప్రేమ..."

ఒక అనుభవజ్ఞురాలైన స్త్రీ నోటివెంట వచ్చిన ఈ మాటలు నన్ను మరో లోకంలోకి తీసుకుపోయాయి. ఈమె గొప్ప వేదాంతి అనిపించింది. ఆ సమయంలో ఆమె నాకెంతో సౌందర్యవంతురాలిగా అనిపించింది. ఆ సౌందర్యం హిమాలయాల మంచుకొండల మీదా, కన్యాకుమారి ఒడ్డున సూర్యాస్తమయంలోనూ మాత్రమే కనిపిస్తుంది. మనస్సుకానందం కలిగిస్తుంది. బీడీలు, సారా త్రాగే ఈమె, ఇష్టంవచ్చినట్లుగా బూతులు తిట్టే ఈమె నాకు పవిత్రురాలిగా కనిపించడం ఎంత విచిత్రమైన విషయం. కాని నిర్గుణ్‌యెడల నాకు ఉన్న ఈ పవిత్రభావం చూసి నా మనస్సే నన్ను అప్పుడప్పుడు నిలదీసి అడుగుతుంది. కేవలం సెక్స్ ఆకలితో ఇంత హీనమైన స్థితికి దిగజారిన ఈ స్త్రీయెడలనా ఈ పవిత్రభావం? ఆ ఆకలి తీర్చుకోవడంకోసం సభ్యసమాజంలో చేయకూడని పనులు చేసిన ఈమెకా గౌరవం ఇవ్వడం? నా మనస్సుకు ఎంతమాత్రం నచ్చేది కాదు. ఈమె కాలుజారి ఉండవచ్చు. ఒకసారికాదు, రెండుసార్లు కాదు, మరెన్నోసార్లు... అయినా ఈమెలో ఒక ప్రత్యేకమయిన వ్యక్తిత్వం ఉంది. సాహసం ఉంది. త్యాగం ఉంది. అవతలివారిని ప్రేమించగల హృదయం ఉంది. అందుకే ఆమె నా కళ్ళకు ఎంతో ఉన్నతురాలిగా కనిపిస్తుంది.

"మీ భర్త మోహన్ బందిపోటుగా ఎట్లా మారారు?" నేను ప్రశ్నించాను.

ఆమె చెప్పడం మొదలుపెట్టింది. నేను నిర్గుణియా మిగిలిన జీవితం గురించి వ్రాయడం మొదలుపెట్టాను.

★ ★ ★

ఆ బస్తీవారు ఒకరి చెవులు ఒకరు కొరుక్కుంటున్నారు. మోహన్ ఒక ఆడదాన్ని లేపుకువచ్చాడనీ, ఆమె ఎంతో అందమయినదనీ వారు అనుకోసాగారు. ప్రతిరోజు అత్త నిర్గుణ్‌ని లోపలపెట్టి బయట తాళం వేసిపోతుంది. నిర్గుణియా లోపల బందీగా ఉంటూనే ఇరుగు పొరుగువాళ్ళ మాటలు వింటుంది. "మోహన్ ఎవత్తెనో లేపుకువచ్చాడట. అదెవరో కిరస్తానీదట! చాలా అందంగా ఉంటుందిట" లాంటి మాటలు వింటూ ఆమె మౌనంగా ఉండిపోయేది. ఆమె మనస్సు కూడా ఇప్పుడు "ఊ..." అనడం తప్ప దేనినీ వ్యతిరేకించడంలేదు. ఆ పాత భర్త ఇల్లు ఒక జైలైతే ఈ ఇల్లు మరో జైలయింది. ఖర్జూరపు చెట్టుమీదనుండి తుమ్మచెట్టుమీదికి వచ్చిపడింది.

ఆరోజు పగలు అత్తకోసం ఎదురుచూసి చూసి అలసిపోయి నిద్రపోయింది. అత్త తాళం తీసింది. లోపల గడియవేసి ఉండటంవలన తలుపులు తెరచుకోలేదు. కొంచెంసేపు అత్త తలుపు కొడుతూనేవుంది. నిర్గుణియాకి మెలకువ వచ్చింది. తలుపులు తెరచింది. అత్త ఎర్రటి కళ్లల్లోంచి నిప్పులు రాసాగాయి. "ఏమే... లోపల ఏం చేస్తున్నావే? నిన్ను పాము కాటేసిందా? అట్లా అయినా బాగుండును. నీ పీడ విరగడ అవుతుంది. రాత్రంతా నా కొడుకుని చంపుకుతింటావు. నీ కోరికలు తీర్చుకోవడానికి వాడిని పీల్చి పీల్చి పిప్పిచేస్తావు... పగలంతా నిద్రపోతావు... నీయమ్మ..." ఆమె నోటినుండి బూతులు రాసాగాయి. ఏనాడూ బూతుమాటలు పడటం సంగతలా ఉంచి వినటం కూడా ఎరుగని నిర్గుణియా ఇక్కడికి వచ్చినప్పటినుండి అవి పదే పదే వినడం అలవాటయిపోయింది. సభ్యసమాజంలో నిషేధింపబడిన మాటలన్నీ అత్త నోటివెంట వెలువడసాగాయి. తట్ట, చీపురు ఓ మూల పెట్టి తన కాళ్ళు, చేతులు కడగమని

నిర్గుణ్‌కి ఆజ్ఞ జారీచేసింది. తన అమ్మనాన్నల ఏడు తరాలనూ తిడుతున్నా నోరెత్తకుండా వింటూ అత్త ఆజ్ఞను శిరసావహించింది నిర్గుణ్. ఆమెకు తన కాళ్ళను ఎవరో నిర్దాక్షిణ్యంగా కొట్టేశారా అనిపించింది. కొంచెంసేపయ్యాక 'అన్నం వండి ఉంచు వేడివేడిగా ఉండాలి' అని చెప్పి బయటపడింది అత్త. వెళ్తూ వెళ్తూ బయట తాళం వేసింది.

అలా వెళ్ళి తన కోడలు విషయంలో పంచాయితీ పెట్టించింది. "దీని మొగుడు ఒక దొర దగ్గర పనిచేస్తూ ఉండేవాడు. వెనకా, ముందు దీనికి ఎవరూ లేరు. హఠాత్తుగా అతడు కలరా వలన మరణించాడు. మోహన్ తండ్రి కలెక్టర్ దగ్గర పనిచేస్తాడు. అందువలన కలెక్టర్ ఆమె బాధ్యతను మోహన్ తండ్రికి ఒప్పచెప్పాడు. దానిని మోహన్‌కి ముడిపెట్టారు. కులంవాళ్ళందరికి తినిపించి తాగించారు" అంటూ కోడలు గురించి తన ఇష్టంవచ్చినట్లుగా ప్రచారం చేయసాగింది. అత్తగారి ఇంటికి వచ్చినప్పటినుండి కంటినిండా నిద్రపోయి ఎరుగదు కడుపునిండా తిండి తిని ఎరుగదు. పగలంతా నిర్దయురాలయిన అత్త బాధపెడుతుంది. రాత్రిపూట భర్త ఆమెకు బలవంతంగా తాగిస్తాడు. ఆమె శరీరాన్ని నలిపివేస్తూ ఆమెను అనేకరకాలుగా హింసిస్తూ తను ఆనందిస్తాడు. నిన్నటివరకు తను అతడికి యజమానురాలు. కాని ఇప్పుడు అతడు తన యజమానియై తనను బానిసను చేశాడు. సిగరెట్టుతో ఆమెను కాలుస్తాడు. అతడి ఆనందానికి హద్దు ఇదే... ఎదుటివాళ్ళకు బాధ కలిగించి ఏడిపించి ఆనందం పొందే ఈ పురుమడిని ఎవరుమాత్రం ప్రేమిస్తారు? ఇక్కడికి వచ్చినపుటినుండి ఆమె ఒక యంత్రంలా జీవించింది. కాని ఇప్పుడు ఆ యంత్రం యంత్రంగా మాత్రమే ఉండలేదు. ఆమెలోని బుర్ర ఈ బాధనుండి తనను తాను రక్షించుకోవడానికి ఎన్నో మార్గాలు ఆలోచిస్తోంది. రాత్రి మోహన్ ఇంటికి వచ్చాక అతనికి అత్తగురించి బాగా నూరిపోసింది. "మీ అమ్మ చెడుగా మాట్లాడుతూ, నన్ను అడ్డమైన బూతులు తిడుతుంది. నీ గురించి చెడుగా చెబుతుంది. నాదగ్గర వున్న డబ్బు తీసుకుంది. అయినా నేనేమీ అనలేదు. కానీ నిన్నూ మీ అమ్మ తిడుతుంటే నేను ఊరుకోలేను"

"ఊరుకోక ఏంచేస్తావే?"

"నా ప్రాణం తీసుకుంటాను"

"ఎట్లా తీసుకుంటావు?"

ఈ ప్రశ్న విన్నాక నిర్గుణ్‌కి చాలా కోపం వచ్చింది "ఉరి పోసుకుని..."

"ఇదిగో ఈ పెన్సిల్ తీసుకో నువ్వు. నీ ఇష్టం ప్రకారం చస్తున్నానని నీ చావుకి ఎవరు బాధ్యులు కారని రాసి ఇవ్వు..." అంటూ మోహన్ మంచంమీదనుండి లేచాడు. ఆ మత్తులోనే పెన్సిల్ జేబులోంచి తీశాడు. ఒక ఖాళీ సిగరెట్టు పెట్టెను చించాడు. దాని వెనకవున్న ఖాళీస్థలాన్ని చూపెట్టి దానిమీద రాయమన్నాడు.

నిర్గుణ్ భయపడి "ఏం రాయను?" అని అడిగింది.

"నీవు నీ ఇష్టంతోనే ఉరి పోసుకుంటున్నానని రాయి"

"వేసుకున్నప్పుడు వ్రాస్తాను"

"ఎప్పుడో ఎందుకు... నాఎదుటే ఉరిపోసుకో... అయినా నీకంత ధైర్యం ఉందా! నేనే వేస్తాను నీకు ఉరి. కాని నిన్ను చంపితే నేను జైలుపాలవుతాను. అక్కడ నన్ను ఉరి తీస్తారు. అందుకే నీచేత వ్రాయిస్తున్నాను. నేను హంతకుడిని ఎందుకవ్వాలి... రాయ్‌వే... రాయి..." అంటూ బూతులు తిట్టసాగాడు. నిర్గుణ్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమెను హింసించి హింసించి మోహన్ ఆమెచేత కాగితం వ్రాయించుకున్నాడు. మంచం ఎక్కి పైన కొక్కెంకి చీరను వేళ్ళాడదీశాడు. "ఇదిగో... ఆఖరిసారిగా నీదగ్గరకు వస్తాను, నా కోరిక తీర్చు... దాని తరువాత ఉరి..."

నిర్గుణియా వ్రాసిన కాగితాల్లో కొంతవరకు ఆమె జీవితాన్ని గురించిన సత్యాలను బయటపెట్టే సంఘటనలు ఉన్నాయి. నేను ఆమె వ్రాసిన కొన్ని విషయాలను ఉపయోగించి ఇంతమటుకు వ్రాశాను.

ఆమె జీవితంలోని తరువాయిభాగం ఎట్లా నడిచిందో తెలుసుకోవాలని నాకు బలమైన కోరిక కలిగింది. ఆ తరువాతి జీవితాన్ని కల్పించి వ్రాయడం కఠినమయిన పని అని

పించింది. నిజం చెబుతున్నాను. ఆమె జీవితంలోని ఆ భయంకరమైన దృశ్యాలను కల్పించడానికి నాకు సాహసం చాలలేదు. కొన్ని వందల సంవత్సరాలకిందటి మనుషుల బానిస జీవితాలు గుర్తుకు రాసాగాయి. అప్పుడు ధనధాన్యాలనే కాదు, స్త్రీ, పురుషులను కూడా దోచుకునేవారు. నాకు ఈ సమయంలో మూడువేల సంవత్సరాలకిందటి రాజకుమారి చందన కథ గుర్తుకు వస్తోంది.

ఎంతో నాజూకుగా పెరిగిన రాజకుమారి బందిపోటు దొంగల చేతుల్లో చిక్కుకుంది. ఏ రాజకుమారివంక అయితే కన్నెత్తి చూడడానికైనా భయపడేవాళ్ళో ఆ రాజకుమారే బజారులో అమ్మబడే ఓ వస్తువయిపోతుంది. ఒక షావుకారు ఆమెను కొని ఇంటికి తెస్తాడు. అతడి భార్య రాజకుమారిని చూసి ఎంతో ఈర్ష్య చెందుతుంది. ఆమెను అనేకవిధాలు హింసిస్తుంది. యజమానురాలి హోదానుండి బానిసగా మారడానికి ఆ రాజకుమారి ఎంత నరకయాతన పడివుంటుందో నేను ఊహించగలను. నేను నా చిన్నతనంలో మా తాతగారి ఊళ్ళో ఒక కథను విన్నాను. చాలా సంవత్సరాలక్రితం ఓ రాజు అప్పటి బాద్‌షాహ్ యొక్క అధికారాన్ని ఒప్పుకోలేదు. ఆ రాజు ప్రజావాత్సల్యుడు. ఎంతో సాహసం కలవాడు. అతడు బాద్‌షాహ్‌ని తన అధికారంలో వున్న ఏ ప్రదేశంలోను పన్నులు వసూలు చేసుకోనీయలేదు. రాజు తన బుద్ధికుశలతతో ఎన్నోసార్లు బాద్‌షాహ్ సైనికులను ఓడించాడు. కాని ఆ రాజు ఒకసారి పట్టుబడ్డాడు. విజయుడైన బాద్‌షాహ్ పరాజితుడయిన ఆ రాజుని నడివీధిలో నిలబెట్టాడు. ప్రాచీనకాలంలో ఏవిధంగా అయితే పట్టాభిషేకం చేసేవారో అదేవిధంగా అన్ని ఏర్పాట్లు చేశారు. ఆ రోజుల్లో ఏడు నదుల పవిత్రజలంతో రాజుని స్నానం చేయించేవాళ్ళు. దానికి బదులుగా వీళ్ళు ఏడుగురు పాకీవాళ్ళని నిల్చోపెట్టారు. వాళ్ళ చేత అతని మీద మూత్రం పోయించారు. రాజు తలమీద మలం కల తట్టను బోర్లించారు. ఈవిధంగా అనేక అవమానాలు చేశారు. ఆయన మానమర్యాదలను మంటకలిపారు. ఆ తరువాతి సమాజంలో అతి నీచమైన జీవితాన్ని గడపమని ఆదేశించారు. నేను ఒక బస్తీలోనివాళ్ళని ఇంటర్వ్యూ చేసేటప్పుడు ఓ పాకీవాడి నోటివెంట ఈ మాటలు విన్నాను. ''బాబుగారూ! మేము మొదటినుండి పాకీవాళ్ళం కాదుట. అసలు మేము క్షత్రియులమని మా పెద్దవాళ్ళు నాకొకసారి చెప్పారు మా పెద్దలు గోరీ, గజనీ చక్రవర్తులతో యుద్ధంలో ఓడిపోయారు. వాళ్ళు మమ్మల్ని పట్టుకువెళ్ళారు. మా ఆడవాళ్ళను లాక్కున్నారు. మా మతాన్ని మార్చారు. మావాళ్ళు మా ధర్మాన్ని మేము చచ్చినా విడవం అని ఎదిరించారు. చక్రవర్తికి చాలా కోపం వచ్చింది. ఇదిగో మేం చెప్పింది ఒప్పుకోకపోతే మా మలమూత్రాలని ఎత్తాల్సి వస్తుంది అన్నాడు. మావాళ్ళు ఆ పని చేయడానికైనా సిద్ధమే కానీ మతాన్ని మాత్రం మార్చుకోమన్నారు. మలమూత్రాల విసర్జన అందరు చేస్తారనుకోండి కాని మా ఖర్మకొద్దీ మేం ఎంత హీనజన్యులమయ్యామంటే మావే కాదు పరాయివాళ్ళవి కూడా ఎత్తాల్సిన గతి మాకు పట్టింది. ఇదెక్కడి న్యాయం? అని ఒక యువకుడు నేను ఇంటర్వ్యూ చేసేటప్పుడు ఆవేశంగా అన్నాడు.

నేను నిర్గుణియా ఇంటికి వెళ్ళాను. ఆమె బాగా నిషాలో ఉంది. మత్తుగా ఉన్న ఆమె కళ్ళను చూస్తే ఆమె మోహన్‌నే ధ్యానిస్తోందనీ అతడిని మానసికంగా కలుస్తోందనీ నాకు అనిపించింది.

''ఒంటరిగా మీరు...'' పలకరించాన్నేను.

''నేను ఒంటరిదాన్ని కాదు బాబుగారూ! ఇరవై నాలుగు గంటలూ నాతో నా మోహన్ ఉంటాడు''

''మోహన్ మిమ్మల్ని అంతగా హింసించేవాడుకదా! మీరు అతని ధ్యానంలో ఇంత తన్మయులు ఎలా కాగలుగుతారు. అతడు పెట్టిన హింసలకు మీకు అతనిమీద కోపం రాదా! మనస్సులో ద్వేషం కలగదా! అతడంటే అసహ్యం కలగదా! కక్ష రాదా!''

''బాబుగారూ! నాకు మొదట్లో కోపం వచ్చేది. అతనితో పూర్తిగా కలిసిపోయినప్పటికీ నా మనస్సుమాత్రం బ్రాహ్మణత్వాన్ని వదలలేదు. అందుకే అతడిని అసహ్యించుకునేదానిని. కాని నేను మానసికంగా కూడా పూర్తిగా

కులం మారినప్పటినుండి ఆ అసహ్యత ప్రేమగా మారింది''

''మీ మనస్సు బ్రాహ్మణత్వాన్ని పూర్తిగా మరచి శూద్రత్వాన్ని ఎట్లా స్వీకరించింది? మీ అత్త మిమ్మల్ని ఎట్లా మార్చగలిగింది?''

''బాబుగారూ! అవతలివాడు పెట్టే హింస మనిషిలో ఉండే భూతాన్ని పారద్రోలుతుంది. ఆరోజు నాకు తగిలిన తన్నులు, దెబ్బలు తలచుకుంటే ఇప్పటికీ నా శరీరంమీది రోమాలు నిక్కపొడుచుకుంటాయి. బహుశా మనిషికున్న అన్ని అనుభూతులనీ మించింది శారీరక హింస గురించిన భయమేనేమో... నన్ను అత్త ఇష్టం వచ్చినట్లు కొట్టింది, అడ్డమైన బూతులు తిట్టింది. కాని నేను నా పట్టుదల వదలలేదు బాబుగారూ! తన్నులు తిని తిని స్పృహ తప్పాను కాని నేనుమాత్రం దాని మలమూత్రాలు ఎత్తలేదు. నాకు స్పృహ వచ్చేసరికి ఆమె వెళ్ళిపోయింది. కాని ఆ మోరీదగ్గర తన పాపపు పొట్లాన్ని అట్లాగే వదిలిపెట్టి వెళ్ళింది. ఆరోజు నేను అన్నం, నీళ్ళు ముట్టుకోలేదు. మధ్యాహ్నం వచ్చింది. మళ్ళీ నన్ను కొట్టింది. నా తల గోడకేసి కొట్టింది. అయినా నేను లేవలేదు. మామ రామచందర్ వచ్చాడు. అతడితో కోడలి ఆరోగ్యం బాగాలేదు అని చెప్పడం నేను విన్నాను. రాత్రి మోహన్ వచ్చాడు. ఏం జరిగిందో చెప్పమని బతిమిలాడాడు. నేను చెప్పాను. ఈ అమ్మకు ఎంత చెప్పినా వినదు. దాని పట్టుదల వదలదు అని అంటూ తల్లిని ఎదిరిద్దామని వెళ్ళాడు. కాని తిట్లు తిని బయటకు వచ్చాడు. ''అమ్మ చెబుతున్నది కూడా నిజమేకదా... ఈ పాకీపని తరతరాల నుండి మేం చేస్తున్నాం. నువ్వు చెయ్యకపోతే మా కులంవాళ్ళు ఏమనుకుంటారు? నీవు వాళ్ళలోకి ఏం ముఖంపెట్టుకుని వెళ్తావు? ఈ పనిని నీవు అలవాటు చేసుకోవలసిందే...'' అని నాతో అన్నాడు.

ఈ పని చస్తే నేను చేయనన్నాను.

''నవ్వుతూ అయినాసరే ఏడుస్తూ అయినాసరే నువ్వు పాకీపని చేయాల్సిందే'' అన్నాడు.

''నాకింత విషం తెచ్చి ఇవ్వు. నా గొంతు పిసికి చంపేసేయి... నాకింకా బతకాలని లేదు'' అని నేనన్నాను.

''నువ్వా చచ్చేది. నువ్వు పిరికిపందవే. చచ్చే ధైర్యం ఉంటే ఇన్నాళ్ళు బతికేదానివే కాదు. ఎప్పుడో ఉరి పోసుకుని చచ్చేదానివి. ఇదిగో పట్టుదల వదిలిపెట్టు, తట్ట, చీపురు పట్టు... నీవుమాత్రం ఏంచేస్తావు. ఆ ముసలి మొగుడితో కాపురం చేయలేకపోయావు. కాని నువ్వు ఒక పాకీవాడితో లేచివచ్చావు. ఆ పని చేయక తప్పదు. పోనీ ఎక్కడికి వెళ్తావో చెప్పు... రైలెక్కిస్తాను'' అన్నాడు.

దాదాపు ఆరు రోజులు నాకు తిండి, నిద్రలు లేవు. ఈ ఆరురోజులు నా అత్త అక్కడే మలమూత్రాలు విసర్జించేది. మోహన్ ఎంత నిర్దయుడంటే తిన్నావా తినలేదా అని అడిగేవాడు కాదు. రాత్రిపూట తన సెక్స్ ఆకలిమాత్రం తీర్చుకునేవాడు. నేను ఏడ్చి ఏడ్చి అలసిపోయేదాన్ని. మోహన్ మామ రామచందర్ మాత్రం నన్ను దయతో, ప్రేమగా చూశాడు. తల్లి, కొడుకులు నన్ను పాకీపని చేయమంటున్నారని తెలిసి అతడు వాళ్ళతో పోట్లాట వేసుకున్నాడు. కాని ఏమీ లాభంలేకపోయింది. అన్నివిధాల నేను బలహీనురాలినయ్యాను.

ఏడోరోజు ముక్కుమీదనుంచి చెవులదాకా పట్టీ కట్టి బయలుదేరాను. మొండిగా పాకీదానిగా మారిపోయాను''

నిర్గుణియా అలా లొంగిపోకుండా ఉండాల్సింది అని నాకనిపించింది. నాలో అభ్యుదయ భావాలు ఉన్నా ఆ పాత సంస్కారాలు కొన్ని ఇంకా మిగిలేవున్నాయి. గాంధీగారు స్వయంగా పాకీపని చేసేవారు. నేను కులమతాలు మరచి వీళ్ళతో కూర్చుని తిని తాగుతున్నాను. కాని నాలోని సంస్కారాలు నన్ను ఆ పని చేయడం గురించిమాత్రం కనీసం ఆలోచించనీయకుండా అడ్డుపడుతున్నాయి. ఆ ఆలోచనే నాలో ఎంతో అసహ్యం కలిగిస్తోంది.

నిర్గుణియా పిరికిది అని మనస్సులో అనుకున్నాను. ఆమె మరి కొన్నిరోజులు తిండి, నిద్ర మానేసి ప్రాణత్యాగం చేయలేకపోయిందా?

కానీ మళ్ళీ నాకే అనిపించింది, నేను సత్యానికి చాలా దూరంగా ఆలోచిస్తున్నానని. ప్రాణం తీసుకోవడం అంత తేలికైన పని కాదు.

ఆమె మాటల్లో పడి ఎక్కువగా తాగేసిందేమో, మంచంమీద పడిపోయింది. నేను ద్వారంకింద గడియను జరిపి బయటికి వచ్చి తలుపు ధన్‌మని వేశాను.

చలి రాత్రులు కావడంవలన అంతా నిశ్శబ్దంగా ఉంది. పాకీబస్తీలోని కుక్కలు అపరిచితుడయిన నన్ను చూసి మొరగసాగాయి. 'ఓ అపరిచితుడా... ఇక్కడనుండి వెళ్ళిపో... వెళ్ళిపో... ఇంత తొందరగా మానవుడి మనస్సును నీవు తెలుసుకోలేవు' అన్న అర్థంతో అవి అరుస్తున్నాయా అని నాకనిపించింది.



**మో**హన్ మనస్సు అశాంతితో నిండిపోయింది. జీవితంలో అకస్మాత్తుగా నిర్గుణియా ప్రవేశించడంవలన ఒకవైపు ఎంతో ఆనందం కలిగినా మరోవైపు బయట సమస్యలు ఎక్కువ అయ్యాయి. అతడు బ్యాండ్ మాస్టర్ జాక్సన్ దగ్గర వంటమనిషిగా ప్రవేశించాడు. మెల్లిమెల్లిగా అతడి బ్యాండ్ కంపెనీ పనిని కూడా చేపట్టాడు. మోహన్ పాటలకు రకరకాల కొత్త రాగాలు కడుతూ వుండేవాడు. హిందుస్తాన్ రాగంలో ఇంగ్లీషు పాటలను శ్రావ్యంగా పాడటం నేర్చుకున్నాడు. తను ఊరు వెళ్ళి వచ్చినప్పటినుండి ఇక్కడి పరిస్థితి కొంత మారిపోయిందన్న విషయం తెలుసుకున్నాడు. మామక్ ఉరఫ్ డేవిడ్ అనే వ్యక్తి జాక్సన్ జీవితంలో ప్రవేశించాడు. జాక్సన్ చరిత్రహీనుడు. అతడికి మతపిచ్చి ఎక్కువ. చాలా మందిని అతడు తన క్రైస్తవ మతంలోకి మార్చాడు. బందిపోటు వహీదా ఎక్కడినుండో డేవిడ్‌ని ఎత్తుకువచ్చాడు. వహీదా దగ్గర నుండి డేవిడ్ పారిపోయి జాక్సన్ వంచన చేరాడు. డేవిడ్ అందమైనవాడు. జాక్సన్ అతడిని తన కోరిక తీర్చుకోవడానికి ఉపయోగించటం మొదలుపెట్టాడు. డేవిడ్‌కి మోహన్‌ని చూస్తే కొంత కోపం, కొంత అసహ్యం అతడు పాకీవాడు అని తెలిసినప్పటినుండి అతడిని చీదరించుకోవడం మొదలుపెట్టాడు. తన స్థానాన్ని తీసుకుంటూ తనకన్నా జాక్సన్‌కి దగ్గర అవుతున్నాడని మోహన్‌కి అతడిపై కోపం.

ఆరోజూ, మరునాడూ ఛావనీలో క్రిస్‌మస్ పండగ బాగా చేస్తారనీ సికిందర్ దగ్గరికి తీసుకువెళ్తాననీ, నిర్గుణ్‌కి మోహన్ చెప్పాడు. మాస్టర్ జాక్సన్‌కి మోహన్ అంటే ఎంతో ఇష్టం. భార్యని తీసుకురమ్మనమని సరదాగా ఇక్కడ నాలుగు రోజులు గడపవచ్చని జాక్సన్ మోహన్‌కి చెప్పాడు. నిర్గుణియా తెల్లవాళ్ళు మంచివాళ్ళు కారనీ, వాళ్ళు విచ్చలవిడిగా పరాయివాళ్ళ భార్యలతో నాట్యంచేస్తారనీ, తను చిన్నప్పుడు వారి నృత్యాలు చూసేదాన్ననీ, అందువలన జాక్సన్ దగ్గరికి రాననీ అన్నది. కాని ఆ తరువాత అత్త ప్రవర్తన గుర్తుకుతెచ్చుకుని ఈ నరకంనుండి బయటపడితే జాక్సన్‌కి తన దగ్గర ఉన్న డబ్బు ఇచ్చేసి బ్యాండ్ కంపెనీ కొనుక్కుని మోహన్‌ని దూరంగా ఎక్కడికైనా తీసుకువెళ్ళి కొత్తజీవితం ప్రారంభించవచ్చునని అనుకున్నది.

మరునాడు మోహన్, నిర్గుణియాని తీసుకుని మాస్టర్ జాక్సన్ దగ్గరికి వచ్చాడు. నిర్గుణియాకి అంతో ఇంతో ఇంగ్లీషు రావడంవలన జాక్సన్‌తో ఇంగ్లీషులో మాట్లాడింది. ఆమె ప్రభావం అతడిమీద చాలా పడింది. కొంచెంసేపు అక్కడ గడిపాక క్లబ్‌కి వెళ్ళారు నిర్గుణియా, మోహన్‌లు. అక్కడ సికిందర్‌తో అతని భార్య మరియమ్‌లతో పరిచయం అయింది. క్రిస్‌మస్ పండగ వైభవంగా జరిగింది.

నిర్గుణియా తన డబ్బుతో బ్యాండ్ కంపెనీ కొనాలనీ, మోహన్ తను కలిసి కొత్త జీవితం ప్రారంభించాలనీ కన్న ఆ కలలన్నీ కల్లలయ్యాయి.

ఆరోజు డిసెంబరు ఇరవై ఏడు. నిర్గుణి

యా ఎంతో ఉత్సాహంగా తనకు తండ్రిలాంటి వాడైన జాక్సన్‌కి, అతడికి ఇష్టుడయిన మోహన్‌కి టీ, టిఫిన్ ఇవ్వడానికి అతని గదిలోకి వచ్చింది.

"పప్పా ఐ మేక్ దిస్ ఇండియన్- డిష్ ఫర్‌యూ" అంది నిర్గుణియా. తన సవతితల్లి ఇంటిదగ్గర తెల్లదొరలు, దొరసానులు ఉండేవాళ్ళు. అక్కడ కాస్తో కూస్తో ఇంగ్లీషు నేర్చుకుంది.

"జస్ట్‌ఫర్ మీ... మా డేవిడ్ కోసం కాదా?" అన్నాడు జాక్సన్ నవ్వుతూ.

"మా డేవిడ్‌అన్న రోజూ తింటూనే ఉంటాడు. అతడికి ప్రత్యేకంగా..."

"మాస్టర్... ఈ పాకీదానికి చెప్పేయండి. ఇక ముందు నన్ను అన్న అని పిలవవద్దని... ఆ మాటే నాకు అసహ్యం..."

డేవిడ్‌లోని ఈ భయంకర రూపం చూశాక నిర్గుణియాలోని కోపాగ్ని భగ్గుమంది. తను పాకీదానిగా మారింది నిజమే... కానీ ఎవడికీ ఉంపుడుకత్తెగా కాదు... ఒకడికి భార్యగా...!

వస్తున్న కోపాన్ని అణచుకుని ఫాదర్ కప్పులో టీ పోస్తూ ఆమె నవ్వుతూ అంది... "ఇఫ్ హి నాట్ మై బ్రదర్ దెన్ వాట్ కెన్ ఐ కాల్ హిమ్..."

"ఫ్రెండ్... ఫ్రెండ్..."

డేవిడ్‌కి కోపం ఇంకా తగ్గలేదు. బహుశ ఇటువంటి సంబంధం కూడా అతనికి ఇష్టంలేదు.

మాస్టర్ అతడివంక ప్రేమగా చూశాడు. "నో... నో... లవ్ జాలీ... షి ఈజ్ ఎ గుడ్ గర్ల్... రేపు మన క్రైస్తవ మతం పుచ్చుకోబోతోంది. ఆమెను నువ్వు ఫ్రెండ్‌గా చూడాలి... మోహన్ కూడా మంచి ఫ్రెండ్... ఐ లైక్ హిమ్... రెస్పెక్ట్ హిమ్... లవ్ హిమ్"

డేవిడ్ ఈ మాటలు వినంగానే నిర్గుణియా వెనక్కి వెళ్ళి ఆమెను ఒక్కసారిగా తన బాహువుల్లోకి తీసుకున్నాడు.

ఆశ్చర్యంతో నిర్గుణియా అతడివైపు ముఖం తిప్పింది. అతడు ఆమె పెదవులతో తన పెదవులను కలపబోయాడు.

అంతే డేవిడ్ చెంప ఛెళ్ళుమంది.

డేవిడ్ వెనక్కి జరిగాడు. నిర్గుణ్ కళ్ళు నిప్పుకణికలలాగా మారాయి... చాలా బాగా బుద్ధి చెప్పావ్... పోదాం పద" ద్వారం దగ్గర కర్‌టెన్‌ని ఒక చేత్తో పట్టుకుని ఉన్న మోహన్ అన్నాడు. నిర్గుణియా గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది. మోహన్ ఆమె వెనకాలే వెళ్ళాడు. అతడిని చూడగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. "ఇంటికి వెళ్ళిపోదాం. ఇక ఇక్కడ ఒక్కక్షణం కూడా ఉండటం నాకు ఇష్టంలేదు"

"ఇక్కడ మనకు ఇల్లు ఎక్కడుంది చెప్పు. ప్రస్తుతం సికిందర్ ఇంటికి వెళ్దాం. నేను వీడి మీద పగ తీర్చుకోకపోతే... నా పేరు మోహన్ కాదు. మనం ఏ కులంవాళ్ళం అయితే మాత్రం ఏం... అంటరాని వారిని ఉద్ధరించే రోజులు ఇవి. గాంధీమహాత్ముడు మన జీవితాలు బాగుపడడానికి ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు. ఆ మహాత్ముడు మా ప్రార్థన వింటాడు. నీవు ఊ అంటే... వో వంద రూపాయలు ఇస్తే స్ట్రయిక్ చేయిస్తాను. బాండ్‌లోకి ఎవరినీ రానీయకుండా చేస్తాను. ఈ బస్తీలో ఉండే తక్కిన వాళ్ళకి ఈ బాండ్‌లో చేరాలంటే ఎంతో ఇష్టం. నేను బాండ్ కంపెనీని తెరుస్తాను. ఛావనీలో నివసిస్తున్న క్రిస్టియన్లు కాని వాళ్ళందరూ ఇందులోకి వస్తారు. నేను మాస్టర్‌ని గౌరవిస్తాను. అందుకే వెనకముందులాడుతున్నాను... వాడు డేవిడ్‌గాడు మనమంటే ఏమనుకుంటున్నాడో" పళ్ళు పళ్ళు పటపట కొరికాడు మోహన్.

బందిపోటు వహీదా ఓ యువతి ద్వారా మోహన్‌కి కబురంపాడు. మోహన్ చాలా భయపడిపోయాడు. వెంటనే అతడిని కలవడానికి వచ్చాడు. గదిలో చాపమీద దిండు ఆసరాగా చేసుకుని వహీదా కూర్చుని ఉన్నాడు. అతడి కళ్ళు చాలా పెద్దవి. వహీదా మోహన్‌ని కన్నార్పకుండా చూస్తూ "అయితే మోహన్‌వి నువ్వేనన్నమాట" అన్నాడు. మోహన్‌కి ఏం జవాబు చెప్పాలో తోచలేదు. మాట్లాడకుండా నిల్చున్నాడు.

"ఈమధ్య నీ యజమాని దగ్గర ఏదైనా వజ్రాల హారం చూశావా?" అడిగాడు వహీదా.

"ఊహు... చూడలేదు"

"నీ మాస్టర్ దాన్ని ఇనుపపెట్టెలో పెట్టుకున్నాడేమో"

''ఇనుపపెట్టె నేనే తెరుస్తాను''

''ఆ రూఫూక్ వెధవ ఏభైవేల వజ్రాల హారాన్ని దొబ్బుకెళ్ళాడు''

''డేవిడ్ హారం తెచ్చాడా! నేను వెతికి తెస్తాను''

''నేను వచ్చి ఆ ఇంటిమీద పడితే ఐదుని మిషాలలో తీసుకువస్తాను. కాని ఒక హారంకోసం ఇంత ప్రయత్నం చేయడంలో అర్థంలేదు''

''ఇదిగో ఇక్కడికిరా! ఆ మేకుకి నా కోటు ఉంది. తీయాల్సిన అవసరం లేదుకాని లోపల చూడు''

మోహన్ కోటుని లోపల తిప్పిచూశాడు. తోలు పటకాలున్నాయి. పన్నెండు పిస్తోళ్ళకల మూడు వరసలు ఉన్నాయి.

''చూశావా! నేను నీతో స్నేహంగా ఉంటాను. కానీ నన్ను మోసం చేయాలనుకున్నావో... ప్రాణాలు తీస్తాను. ఏ సంగతీ నాకు రేపు మధ్యాహ్నంలోగా చెప్పగలుగుతావా?''

''రేపు సాయంత్రం చెబుతాను. ఐదుగంటలకు మా మాస్టర్ డేవిడ్‌ని తీసుకుని బయటకి వెళ్తాడు అప్పుడు నాకు వెతకడానికి టైమ్ దొరుకుతుంది'' అని చెప్పి బయటకి వచ్చాడు.

జాక్సన్ డేవిడ్‌ని తీసుకుని బయటకు వెళ్ళగానే మోహన్ నిర్గుణియాని గదికి కాపలాపెట్టి లోపల వెతకడం మొదలుపెట్టాడు. నిర్గుణియా ఏం వెతుకుతున్నావని రెండుమూడుసార్లు అడిగింది. జరిగిన సంగతి మోహన్ చెప్పాడు. ఆమె ఇచ్చిన సలహా ప్రకారం పరుపుల కింద నవారుమధ్య అంతా గాలించాడు. చివరికి మంచంలో రహస్యంగా ఏర్పాటుచేయబడిన ఒక అరలో ఆ విలువైన వజ్రాల హారం దొరికింది. ఈ విషయం వెంటనే వహీదాకి తెలియపరిచాడు.

నిర్గుణియా తను జాక్సన్‌తో బ్యాండ్ విషయం మాట్లాడాననీ రెండొందలకి ఇస్తానన్నాడనీ, రెండు రోజుల్లో లాహోరు వెళ్తున్నాడనీ, మోహన్‌కి చెప్పింది. మోహన్ మాస్టర్ జాక్సన్‌కి వహీదా విషయం చెప్పాడు. డేవిడ్ దొంగతనంగా తెచ్చిన హారాన్ని తను చూశాననీ చెప్పాడు. డేవిడ్‌ని ఇక్కడనుండి పంపించివేయమనీ లేకపోతే బందిపోటు వహీదావలన తమందరికి ముప్పు తప్పదనీ చెప్పాడు.

కోపంతో జాక్సన్ డేవిడ్‌ని కొట్టాడు.

రాత్రి పదకొండు గంటలకి వహీదా అతడి మనుషులు వచ్చారు. మోహన్ ఉన్న గది తలుపులు దబదబా బాదాడు వహీదా. మోహన్ భయపడిపోయాడు. లోపల గడియ ఊడిపోయింది. తలుపులు తెరుచుకున్నాయి. వహీదా హారం దొరకలేదని చెప్పి మోహన్, నిర్గుణియాలవంక అనుమానంగా చూశాడు. నిర్గుణియా తన బొడ్లో ఉన్న సంచీని తీసి చూపించింది. అందులో ఆమె నగలున్నాయి, తప్పితే హారం లేదు. వహీదా అతడి మనుషులు వెళ్ళిపోయారు.

వాళ్ళు అక్కడ ఉన్న బ్యాంక్ కంపెనీ వాళ్ళ మీద పిస్తోళ్ళను పేల్చడం మొదలు మోహన్ గబగబా జాక్సన్ గదిలోకి వెళ్ళాడు. అక్కడ అతడికి కనిపించిన దృశ్యం చూడగానే అతడికి కళ్ళు తిరిగినట్లయింది. మాస్టర్ జాక్సన్ మంచంమీద పడి ఉన్నాడు. అతడి మూతికి పట్టీ ఉంది. అతడి గుండె నుండి రక్తం కారుతోంది. మొద్దుబారిన మోహన్ బుర్ర కొంచెంసేపయ్యాక పని చేయడం మొదలుపెట్టింది. డేవిడ్ ఏడి? డేవిడ్ ఏడి? అతడి బుర్ర ప్రశ్నించింది బాత్‌రూమ్ తలుపులు సగం తెరుచుకుని ఉన్నాయి. అక్కడ అతడి శాలువా కనిపించింది. డేవిడ్ చేతులు కాళ్ళు కట్టబడి ఉన్నాయి. మూతికి పట్టీ ఉంది. జాక్సన్ చావుకి కారణం డేవిడ్ అన్న ఉద్దేశ్యంతో అతడిని కొట్టడం మొదలుపెట్టాడు మోహన్. ఆవేశంగా హారం ఎక్కడ పెట్టావో చెప్పు చెప్పు అంటూ తన్నాడు. అతడి ముక్కు నుండి రక్తం రాసాగింది. డేవిడ్ నెమ్మదిగా పాకుతూ వెళ్ళి బీరువా కింద, బండలకింద ఉన్న హారాన్ని తీశాడు. ఈ మూటని చూడంగానే మోహన్‌కి కోపం ఎక్కువ అయింది. తిట్లవర్షం కురిపిస్తూ మోహన్ అతడిమీద పడ్డాడు. అతడి గొంతు పిసకడం మొదలుపెట్టాడు. డేవిడ్ ముక్కులోంచి రక్తం రాసాగింది. నాలుక కళ్ళు బయటకి వచ్చేసరికి మోహన్ ఈ లోకంలో పడ్డాడు. భయపడి ఒక్కక్షణం చూస్తూ నిల్చుండి పోయాడు. మాస్టర్

శవంవంక చూశాడు. డేవిడ్ శవం మీద రెండు తన్నులు తన్నాడు. ఏడుపు ఆపుకుని బయట కి పరుగెత్తాడు.

వహీదా వెనక్కి తిరిగాడు. ముందే భయప డి ఉన్న మోహన్ అతడిని చూడగానే స్తబ్ధుడై పోయాడు. కాని ఆ అవస్థలో కూడా అతనిలోని ఆశే అతడికి శక్తినిచ్చింది. చేయి ముందుకు చాచాడు. పిడికిలి తెరిచాడు. వహీదా కళ్ళు మెరిశాయి. ముందుకు ఉరికాడు. "ఓహ్... నాకెంతో ఇష్టమైన హారం దొరికిపోయింది" అంటూ ముద్దుపెట్టుకున్నాడు. "పని అయిపో యింది! పదండి తొందరగా..." అని తన మనుషులతో అన్నాడు. తరువాత గేట్ వైపుకి పరుగెత్తాడు. అతని మనుషులు వెంట పరుగె త్తారు. కాంపౌండ్ దాకా వచ్చాక వహీదా అన్నా డు. "అంగున్‌రాధే వెనక వరండాలో వెతుకు తున్నాడు. అతడిని పిలవండి" ఇంతలో మోహన్‌లో చైతన్యం కలిగింది. రెండు దృశ్యా లు అతడి మనస్సులో మెదిలాయి. భూమి మీద పడి ఉన్న మాస్టర్ శవం, డేవిడ్ గుండెల మీద కూర్చుని అతడి గొంతును నులుముతు న్న తన చిత్రం, పైకి వెళ్ళుకు వచ్చిన డేవిడ్ కళ్ళు. వేళ్ళాడుతున్న నాలిక. తను హత్యా చేశాడు పట్టుబడతాడు. అక్కడినుండి పారిపో వాలి... పారిపోవాలి. అంతకంటే అతడికి ఏమీ తోచలేదు. మోహన్ వహీదా వెనక పరుగెత్తాడు అతడి కాళ్ళమీద పడ్డాడు.

"ఏమైంది? ఏమీ మాట్లడవేం?"

"రక్షించండి... హత్యా... హత్యా"

"హత్యా... ఎవడిని... తొందరగా చెప్పు చాలా దూరం వెళ్ళాలి"

"మీ డేవిడ్... మామాక్... మ...మామక్... హారం దొంగిలించాడు. నన్ను ... నన్ను... రక్షించండి..."

వహీదా మనుషులందరు వచ్చేసారు "రహ మాన్ ఈ వెధవని సైకిల్‌మీద కూర్చోపెట్టుకో... మార్తా ఇంటినుండి సరుకు అంతా తీసే సారా?"

"సరుకంతా కుతుబ్‌ఖేడ్ పంపేశాడు. మార్తా దగ్గర ఏమీ లేదు"

సైకిళ్ళు వేగంగా ముందుకుసాగాయి. మోహన్ జీవితం కూడా వేగంతో గమ్యం లేని దారిలో ప్రయాణం సాగించింది.

★ ★ ★

ఈ గొడవకి చుట్టుపక్కల ఇళ్ళలోని వారు అరవడం మొదలుపెట్టారు.

నిర్గుణియా భయపడసాగింది. ఒక తలుపు కొంచెంతోసి బయటకి తొంగి చూసింది.

రక్తం... రక్తం...

నిర్గుణియా గుండె దడదడకొట్టుకుంది. ఆమె గదిలోంచి బయటకి వచ్చేసింది. ఈలోగా చుట్టుముట్టి ఉన్న గుంపు దగ్గరికి వచ్చింది. కొంచెం సేపటికల్లా పోలీసులు వచ్చే శారు. ఇద్దరు ముగ్గురు తెల్లదొరలు కూడా వచ్చారు. ఆ వచ్చిన వ్యక్తి గురించి బ్యాండ్ కంపెనీ కుర్రాళ్ళు వర్ణించారు. వాళ్ళవర్ణన విన్నాక బందిపోటు వహీదాయే వచ్చాడని పోలీసులు నిర్ధారణ చేసుకున్నారు.

కుర్రాళ్ళ వెనక గోడపక్క నక్కి నిల్చుంది నిర్గుణియా. ఆమె మనస్సులో కేవలం ఒకటే ప్రశ్న నిలిచిపోయింది. అతడెక్కడ? ఆమెకు ఎందరివో గొంతులు వినిపిస్తున్నాయి. అన్ని గొంతుల్లో ఆమెకు ఒక గొంతును ఎక్కడో బాగా విన్నట్లుగా అనిపించసాగింది. ఒకసారి... రెండుసార్లు, మూడుసార్లు... ఆ గొంతు చెవు ల్లోంచి దూసుకుపోయినప్పుడల్లా ఆమె మన స్సులోంచి మోహన్ గురించిన చింత మాయ మయింది. ముఖం మీద ఉన్న ముసుగును కొంచెం తొలగించి అతడివంక చూసింది. పోలీస్ ఇన్‌స్పెక్టర్ వేషంలో బసంత్ మాస్టర్ నిల్చుని ఉన్నాడు ఈ జన్మలోనే పూర్వ జన్మ గుర్తుకు రాంగానే మనస్సు కొంచెంసేపు వర్త మానాన్ని వదిలి భూతకాలంలోకి వెళ్ళిపో యింది. ఇన్‌స్పెక్టర్ అక్కడ ఉన్న ఒక్కొక్క కుర్రవాడినే మోహన్ గురించి అడుగుతూ నిర్గుణియాదాకా వచ్చాడు.

"ఏయ్ మోహన్ ఎక్కడున్నాడు?"

తన కంఠం వింటే తనను గుర్తుపడతాడన్న భయంతో నిర్గుణియా జరిగినదంతా తనదగ్గర నిల్చుని ఉన్న కుర్రాడి చెవిలో చెప్పింది. మంగ్రూ పెద్దగా ఆమె చెప్పిన మాటలన్నీ చెప్పాడు.

ఎవరో అన్నాడు "మరే... అలాగైతే మోహ

న్ని వాళ్ళు చంపేసే ఉంటారు''

ఆ మాట వినంగానే నిర్గుణియా గొంతు లోంచి పెద్దగా కేక వెలువడింది. ఆ అరుపుకి ఆమెవైపు తిరిగిన సబ్‌ఇన్‌స్పెక్టర్ బసంత్ లాల్ గుప్తా ఒక్కక్షణం ఆ ముఖాన్ని చూస్తూ అట్లాగే నిల్చుండిపోయాడు. ఆమె ముఖంపైన ఉన్న ముసుగు తొలగిపోయింది. నిర్గుణియా పులి ఎదురుకుండా కట్టబడిన మేక పిల్లలా తన చావుకు దగ్గరపడుతున్న క్షణాలను మన స్సులోనే అనుభవించసాగింది.

''ఎవరు నువ్వు?''

''నేను... నేను... మోహన్ భార్యని''

''మోహన్ పాకీవాడుకదా''

''అవును...''

''నువ్వు పాకీదానివి కాదు. నేను నిన్ను గుర్తుపట్టాను'' అతడి గొంతు ఆమెకు అతిదగ్గ నుండి వినిపించింది. అతడి శ్వాస ఆమె బుగ్గలకు తగులుతోంది కాని ఆమె మౌనంగానే ఉండిపోయింది.

''నిర్గుణ్ నేను నిన్ను గుర్తుపట్టాను. నేను దూరంగా ఉన్నా నీ విషయాలు నాకు కొంతవ రకు తెలుస్తూనే ఉన్నాయి'' బసంత్‌లాల్ మాటలవలన వస్తున్న వేడి ఊపిరి భయంతో తెల్లగా పాలిపోయిన ఆమె బుగ్గలమీద పూర్వ జన్మలోని పాపాల్లాగా తగులుతోంది.

బయటనుండి అరుపులు వినిపించాయి. ''మోహన్ శవం ఎవరికీ కనిపించలేదు. మోహన్ ఎక్కడికి వెళ్ళినట్లు?'' నిర్గుణియా మనస్సు అన్ని మరిచి పదేపదే ఈ ప్రశ్ననే వేసుకోసాగింది. ఇన్‌స్పెక్టర్ నిర్గుణియా ఇంటి అడ్రస్ అడిగి తెలుసుకున్నాడు. తరువాత ఆమెను అక్కడే వదిలేసి తన ఎంక్వయిరీలో పడ్డాడు.

★ ★ ★

తెల్లవారుతుండగా నిర్గుణియా అత్త సుబ రాతన్, మామ రామచందర్ స్టేషన్‌కి వచ్చారు. రావడంతోటే సుబరాతన్ ఏడవడం మొదలు పెట్టింది. ''కొడుకా... నీవు ఎక్కడికి వెళ్ళిపో యావురో... ఈ ముసలితనంలో నువ్వే మాకు దిక్కు కదరా... నాయనా... ఈ నిర్గుణియా నిన్నుపొట్టనబెట్టుకుందిరా... దీని శరీరంలో పురుగులు పడ...'' అంటూ బూతులు మొద లెట్టింది. ఇన్‌స్పెక్టర్ బసంత్‌లాల్ ఇద్దరి పేర్ల ను అడిగాడు. వాళ్ళు చెప్పారు. సుబరాతన్ మళ్ళీ ఏడవడం మొదలుపెట్టింది. ''నేను అన్నివిధాల నాశనం అయిపోయాను. ఈ రాక్షసి బంగారంలాంటి నా కొడుకును పొట్టన పెట్టుకుంది. అయ్యో... మోహన్... ఎక్కడికి పోయావురా నాయనా... దీని...''

ఇన్‌స్పెక్టర్ ఆమెను బెదిరించి నోరు మూ యించాడు ''నీ పేరు హిందువుల పేరు. నీ ఆడదాని పేరు మహమ్మదీయుల పేరు. ఇదేం తమాషా... దీన్ని నువ్వు లేపుకొచ్చావా? లేకపోతే ఇదే నిన్ను లేపుకువచ్చిందా?''

''మా పెద్దలే ఈ పెళ్ళి చేశారు'' అన్నాడు రామచందర్.

''ఇద్దరి మతాలు వేరైనా...''

''హిందూ ముస్లింల భేదం మాలో లేదు. మేం రెండు ధర్మాలనూ పాటిస్తాం''

''నీకు ఎంతమంది పిల్లలు?''

''మాకు పిల్లలు లేరు. మోహన్ నా అక్క కొడుకు వాడిని తీసుకువచ్చి పెంచాం''

''వాడికి పెళ్ళి ఎప్పుడయింది''

''పెళ్ళికాలేదు కాని ఘర్‌బైఠవా అయింది''

''ఎవరీ పిల్ల? ఎక్కనుండి వచ్చింది? ఎవ రు ఘర్‌బైఠవా చేయించారు'' ఈ ప్రశ్నలు రామచందర్‌ని కదిలించివేశాయి. తడబడు తూ చెప్పాడు.

''ఈ పెళ్ళి మేం చేయలేదు. మోహన్ కోడలిని ఇంటికి తీసుకువచ్చాడు''

''అయితే దీన్ని నీ కొడుకు లేపుకువచ్చా డు? ఈ ఆడది ఎక్కడినుండి వచ్చింది? ఎట్లా వచ్చింది?''

సుబరాతన్ జరిగినదంతా చెప్పింది. ఇన్ స్పెక్టర్ నిర్గుణియాని పిలిచాడు. ముసలి వాళ్ళి ద్దరినీ బయటకి వెళ్ళిపొమ్మనాడు. నిర్గుణ్ చూపులు నేలమీదే ఉన్నాయి ''నీవు నా నుండి ఏమీ దాచలేవు నిర్గుణ్! నాకిప్పుడంతా తెలి సిపోయింది నిజం చెప్పు ఖడ్గబహాదూర్ నిన్ను మోహన్‌కి అమ్మేశాడా?''

''లేదు''

"నిన్న నీవిచ్చిన మూటలో నగలు ఉన్నాయి. అవి నీ కెక్కడివి?"

"నగలు నావే... మా అమ్మ అమ్మమ్మలవి. నేను ముసలి మొగుడిని ఒదిలేసి వచ్చేటప్పుడు వాటిని నాతో తీసుకువచ్చాను"

"నిర్గుణ్ నీవు ఎంత తప్పుచేశావు. ఒక పాకీవాడితో..." బాధగా అన్నాడు.

"ఎందరు బ్రాహ్మణులు, ఠాకూర్లూ, కోమట్లు, ఛత్రీలు, కాయస్థులు, ముసల్‌మానులు ఈ పాకీవాళ్ళతో సంబంధాలు పెట్టుకోవడం లేదు. అప్పుడు మీకు తప్పుగా అనిపించ లేదా?"

"మొగాడి మాట వేరు. నీవు పెద్ద కులంలో పుట్టి..."

"పెద్ద కులంలో పుట్టిన నా మంచి చెడ్డల గురించి ఎవరైనా ఆలోచించారా? పన్నెండు నెలలూ కరువుతో మలమల మాడినప్పుడు విశ్వామిత్రుడు కుక్క మాంసాన్ని దొంగతనం చేయలేదా? నేను కరువువలనే అటువంటి పాపం..."

"నోరు మూసుకో... సిగ్గేయడంలేదూ! బ్రాహ్మణుల ఇంట్లో పుట్టి..."

"బ్రాహ్మణులా! నిర్గుణియా వ్యంగ్యంగా నవ్వింది" రాయ్‌సాహెబ్ పండిత్ బటుక్ ప్రసాద్ పెద్దకులంలో పుట్టి కూడా బాహాటంగా ముస్లిం యువతిని ఉంచుకోలేదా? ఆయన గారి భార్య సంగతి సరేసరి. నా తండ్రి ప్రతి ఆడకుక్క వెంటా తిరిగేవాడు. అంతెందుకు ఇన్‌స్పెక్టర్ మీరు పెద్దకులంలో పుట్టి కూడా ఈ పెద్దింటి ఆడదాన్ని పాడు చేయడానికి ఎన్ని నాటకాలు ఆడలేదనీ?"

"ఆనాడు నిన్ను నేను హృదయపూర్వకంగా ప్రేమించాను. నిర్గుణ్ నువ్వు ఈ ఛండాలంలో ఉండటం, నీ పేరు బజారుకెక్కడం నాకెంత మాత్రం ఇష్టంలేదు"

"నా పేరెందుకు బజారుకెక్కుతుంది?"

"నిర్గుణ్ అర్థం చేసుకునేందుకు ప్రయత్నించు. మోహన్ ఇప్పుడు బందిపోట్లలో కలిశాడు. ఎప్పుడో ఒకప్పుడు వాడు పట్టుబడకపోడు. బహుశ చంపబడతాడేమో... ఎందుకంటే పోలీసులు వహీదా అడ్డాను పూర్తిగా నాశనం చేయాలనుకుంటున్నారు. ఆ మోహన్ పట్టుపడ్డాడా కోర్టులో ఎన్నో రహస్యాలు బయటకి వస్తాయి. నీ విషయం కూడా బయటపడుతుంది. పేపర్లలో నీ చరిత్ర గురించి మారుమ్రోగుతుంది. ఆలోచించు అప్పుడు నీ పరిస్థితి ఎట్లా ఉంటుందో..."

బసంత్‌లాల్ మాటల ప్రభావం నిర్గుణ్ మీద పడ్డది. "మరయితే నన్నేంచేయమంటారు?"

"నీకు ఒక ఇల్లు ఇస్తాను. భగవంతుడి దయవలన నా పరిస్థితి ఇదివరకటికన్నా ఎంతో మెరుగ్గా ఉంది. నాలుగురాళ్ళు సంపాయిస్తున్నాను. నిన్ను సుఖపెడతాను..."

"మీకు... మీకు... పెళ్ళయిందా మాస్టారూ... ఆ... ఆ... ఇన్‌స్పెక్టర్‌గారూ!"

"అయింది"

"అయితే నన్ను ఉంపుడుకత్తె కింద ఉంచుకుంటారా..."

"అట్లా అయినా నీకు ఎంతో గౌరవం దొరుకుతుంది. ఎంతయినా పాకీదానివి అని అనిపించుకోవుగా..."

"అనిపించుకుంటే మాత్రం ఏం? మా అమ్మ ఇంట్లో ముగ్గురు నలుగురు మొగాళ్ళ మైలను మోయలేదా?"

"నీవు బాగా మొండిదానివి నిర్గుణ్... ఎందుకు నీ సర్వనాశనం కొనితెచ్చుకుంటావు. నేను నీమంచే కోరుకుంటున్నాను"

"నేను ఓ ఇంటిదాన్నయ్యాక ఎవడి ఉంపుడుకత్తెనూ కాలేను. అతడు నన్ను తల్లిని చేశాడు"

బసంత్‌లాల్ ఒక్కసారిగా భూమి అదిరేలా కాళ్ళు ఎత్తికొట్టాడు. "పో ముండా! నీ ముఖాన తట్టల తట్టల మలం ఎత్తాలనే వ్రాసి ఉంది. పో అదే చేయి. గెట్ అవుట్ ఫ్రమ్ హియర్... కిషన్‌సింహ్... ఈ పాకీదాని అత్తమామ వచ్చారు. వాళ్ళేరీ? పాకీదాని అన్నశబ్దం వాడి నిర్గుణ్ మీద తన మనస్సులోని అసహ్యాతను పూర్తిగా వ్యక్తంచేసుకున్నాడు. దీన్ని తీసుకుపో... వీళ్ళందరిని ఇక్కడినుండి వెళ్ళిపొమ్మను"

"నా నగలు..."

"ఆ మూట నా క్వార్టర్‌లో ఉంది. రెండురోజులయ్యాక, అక్కడికి వచ్చి తీసుకుపో..."

నిర్గుణియాని మామ ఇంటికి రమ్మన్నాడు. కాని అత్త నిర్గుణియావంక అసహ్యంగా చూసింది. బూతులు తిట్టి నిర్గుణియా తన ఇంట్లో కాలుపెట్టడానికి వీల్లేదని చెప్పింది.

నిర్గుణియా అక్కడినుండి బయలుదేరి సికిందర్ క్లబ్‌కి వెళ్లింది. మరియమ్ ఆమె అక్కడ ఉండటానికి ఎంతమాత్రం ఒప్పుకోలేదు.

తన మూట తీసుకుని నిర్గుణియా బయట పడ్డది. విశాలమైన ఆకాశం దానికింద అంతం లేని భూమి.... నడవాలన్న కోరికే నిర్గుణియాని నడిపిస్తోంది. తెలియనిదారులలో వాళ్ళ బారక్స్‌దాకా వచ్చేసింది. సైకిళ్ళమీద పోతున్న ఇద్దరు తెల్లవాళ్లు ఆమెను చుట్టుముట్టారు. నిర్గుణియా పెద్దగా కేకలు వేయడం మొదలుపెట్టింది. వాళ్లు పారిపోయారు. ఆమె బాగా అలసిపోయి ఫుట్‌పాత్ దగ్గర ఉన్న ఓ చెట్టుకింద కూర్చుండిపోయింది

''ఎవడురా? ఇక్కడ కూర్చుంది... ఆడది... హాయ్ ఆడది...''

నిర్గుణియా కళ్లుతెరిచింది. ఎదురుగుండా ఒక మొగాడు నిల్చుని ఉన్నాడు.అతను బాగా తాగివున్నాడు. అతని చూపులు భయంకరంగా ఉన్నాయి. ఆమె వణికిపోయింది. లేవడానికి ప్రయత్నిస్తుంటే ఆ తాగుబోతు ఆమెను కౌగలించుకోడానికి ప్రయత్నించబోతూ ఆమె మీద పడిపోయాడు. వాడు ఆమెను గట్టిగా పట్టుకున్నాడు. ఆమె అతడి మెడకొరికి కింద పడతోసి మూట తీసుకుని పరుగెత్తింది. పరుగెత్తి పరుగెత్తి అలసిపోయింది.

అక్కడ కాసేపు కూర్చుండి మళ్ళీ బయలుదేరింది. కిందపడిపోయింది. అయినా జయించడమే తన లక్ష్యం అని అనుకునే వీరుడిలా తన శక్తికిమించి కొంచెం దూరం నడిచింది. చెత్తకుండీ దగ్గర ఉన్న గోడ దగ్గర ధన్‌మని కూలబడ్డది. మనస్సంతా భారంగా అయిపోయింది. ఆమె మనస్సులో ఒక గొంతు ఏదో మారుమ్రోగుతున్నట్టు అది తన తాతయ్య గొంతే అని ఆమెకి అనిపించసాగింది. ఆ గొంతు తనను ఎంతో ఎత్తయిన కప్పునుండి గంగానదిలోకి తోసేస్తోందా అని ఆమెకు అనిపించింది.''అబ్‌హ నాచ్యే బహుత్ గోపాల్... గోపాలా! గోపాలా! గోపాలా! ఇప్పటికే నువ్వాడించినట్టు చాలా ఆడాను. ఇంకా ఎన్నాళ్లు? ఎన్నాళ్లు? ఎన్నాళ్లు...?'' శరీరం మనస్సు రెండు తెలివితప్పాయి.

చీకటిపడింది. మసీతారామ్ తట్టను కడగడానికని ఇటువైపు రోజూ వస్తూఉంటాడు. నిర్గుణియాని చూసి ''ఈ ఆడదాన్ని ఎక్కడో చూసినట్లుగా ఉందే. ఆ... ఆ... గుర్తుకు వస్తోంది. నాలుగైదు రోజులకిందట ఈమెని చూశాను. మరియమ్ క్లబ్‌లో పనిచేసేది. ఆ... అరె... ఈమె మోహన్ ఇంటి ఆడది... అవును ఈమె మోహన్ భార్యే. సందేహంలేదు'' అనుకున్నాడు. రెండు మూడుసార్లు పిలిచాక కూడా ఆమె పలుకలేదు. చేయిపట్టుకుని చూశాడు. బాగా జ్వరంగా ఉంది. ఆమె ముఖాన్ని తలనిమిరాడు.

''అమ్మాయీ! కళ్ళు తెరు...''

ఆమె నెమ్మదిగా కళ్లు తెరిచింది నీరసంగా అడిగింది'' ''నువ్వెవరివి? నేనిక్కడెందుకున్నాను''

మసీతారామ్ నవ్వుతూ అన్నాడు. ''ఇప్పుడు నేను నీ తండ్రిని... లే అమ్మా లే... ఇంటికి తీసుకువెళ్తాను'' అంటూ ఆమెను లేవబోయాడు. కానీ ఆమె తెలివితప్పి పడిపోవడంతో మళ్లీ మళ్లీ ప్రయత్నించాడు. ''మోహన్ భార్యవికదూ! అమ్మాయీ... నెమ్మదిగా నడు ఇంటికి వెళ్దాం'' అన్నాడు. అతడి ఆదరాభిమానాలు ఆమెలో ఊపిరిపోశాయి. కొంచెంసేపయ్యాక ఆమె నెమ్మదిగా లేచింది. ఆమె బొడ్డున ఉన్నమూట జారిపడిపోయింది. మసీతా దాన్ని తడిమిచూసి జేబులో వేసుకున్నాడు. నిర్గుణియా నాలుగడుగులు వేసిందో లేదో కిందపడిపోయింది. మసీతా తన ఇంటికి వెళ్లి తనకెంతో ఆత్మీయురాలయిన గుల్లన్‌దాయి కొడుకునీ, మరో ఇద్దరు ముగ్గురు మనుమలనీ, ఓ తోపుడు బండినీ, తీసుకుని వచ్చాడు. బండిమీద ఆమెను పడుకోబెట్టి ఇంటికి బయలుదేరాడు.

ఇరవైనాలుగు గంటలూ నిర్గుణియా పూర్తిగా తెలివితప్పే పడివుంది. వాళ్ళు చేసిన సేవకి ఆమె మళ్ళీ మనిషయింది. ఒకరోజు

నగలు నాణాలు ఉన్న మూట ఆమెకి ఇచ్చి "నీ వస్తువు భద్రంగా ఉంచాను. డబ్బు నగలు సరిగ్గా ఉన్నాయో లేదో చూసుకో" అన్నాడు. నగలు మూటగట్టిన తన గులాబీరంగు దుపట్టా చూడగానే నిర్గుణియా ముఖంలో రంగు మారిపోయింది. మోహన్ కళ్ల ఎదుట కదలాడ సాగాడు. దుఃఖం, పశ్చాత్తాపం తమ చేయి చాపి తన చెంపలమీద ఫట్ ఫట్‌మని దెబ్బ



లు వేస్తున్నాయా అనిపించింది.

“నీ దగ్గరే ఉండనీ... తరువాత తీసుకుంటా” అని వస్తున్న ఏడుపును ఆపుకుంటూ అన్నది “బాబాయీ! నువ్వు నన్ను ఇంట్లోంచి వెళ్ళగొట్టవు కదూ!”

“నువ్వు నా కూతురివి. మోహన్ వచ్చి తీసుకువేళ్తే తప్ప నేను నిన్ను ఏనాటికీ వెళ్లకొట్టను”



ఆ తరువాత నిర్గుణియా పట్టుపట్టి తన డబ్బుతో ఇల్లు బాగుచేయించింది. మోహన్ విషయం ఏమీ తెలియలేదు. బస్తీలో పొద్దున్నే స్త్రీ-పురుషులందరూ తమతమ పనులమీద వెళ్లారు. నిర్గుణియా ఒంటరిదైపోతుంది. మంచంమీద కూర్చుని తన జీవిత సంఘటనలను సినిమా రీలులా చూస్తూ ఉంటుంది. ఆ ఒంటరితనంలో ఆమెలోంచి మరో నిర్గుణియా బయటికి వచ్చి మనస్సు అనే బైస్కోప్‌లో అభినేత్రిగా నటిస్తుందా అనిపిస్తుంది. ఒకరోజు నిర్గుణియా తన నగలను తెచ్చుకోవాలన్న ఉద్దేశంతో మసీతారామ్‌ని తీసుకుని ఇన్‌స్పెక్టర్ బసంత్ దగ్గరికి వెళ్ళింది. ఆమెను చూడంగానే బసంత్ సంతోషపడ్డాడు. నిర్గుణియా దగ్గరికి వచ్చి అన్నాడు. "నిన్ను చూడాలని నేనెంతో తహతహలాడుతున్నాను నిర్గుణ్! లోపలికి వెళ్దాంరా!" తరువాత దూరంగా ఉన్న మసీతాను చూస్తూ అన్నాడు.

"అరే, నువ్వెందుకు వచ్చావ్?"

"ఈమె నా కోడలు"

"ఓరి ముసలాడా! ఈమె నీ కోడలు ఎలా అయింది? ఎప్పటినుండి?"

"మోహన్ నాకు బంధువు"

"ఇదిగో ఈ రూపాయి తీసుకుని ఓ చుక్కవేసుకురా!" అని ఓ నాణాన్ని విసిరాడు. స్టేషన్ లోపలికి రాంగానే నిర్గుణియాకి ఒంటిమీద తేళ్లు, జెర్రెలు పాకినట్లుగా అనిపించింది. తను ఒక రాత్రంతా ఇక్కడ బంధింపబడ్డది. పురాణశాలి, ఛాందసుడు, పండితుడు అయిన వ్యాసులవారి మనవరాలు భ్రష్టురాలయి ఈ జైలులో పడివుంది. ఈ ఆలోచన రాగానే ఆమె మనసు కలతచెందింది. ఈ క్షణంలో భూమి పగిలిపోయివుంటే తను భూమాత ఒడిలో తల దాచుకునేదే...

బసంత్ నిర్గుణియా ముసుగును పూర్తిగా తొలగించాడు. ఆమె ముఖం చూడగానే అతడి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

తను ఎవరికైతే ఇంగ్లీషు నేర్పించాడో ఆమె...

తను హృదయపూర్వకంగా ఎవరినైతే ప్రేమించాడో ఆమె...

ఎంత దిగజారిపోయింది.

అతడు ఈ లోకంలోకి వచ్చాడు. "నిర్గుణ్ ప్రేమ నీ అదృష్టంతో ఎటువంటి ఆటలాడింది. ఒక ప్రియుడు సబ్‌ఇన్‌స్పెక్టర్... రెండోవాడు బందిపోటు దొంగ. ఒకడు ఉన్నత కులంవాడు. మరొకడు పాకీవాడు"

"ఇన్‌స్పెక్టర్‌గారూ! క్షమించండి. ఆడదీ, నదీ రెండు సమానమే. నదిలో అందరూ స్నానం చేస్తారు. అందరూ నీళ్లు తాగుతారు. నదికి పాపాత్ముడు, పుణ్యాత్ముడు, గాడిద, గుర్రం అన్నీ సమానమే"

"నిర్గుణ్! నీకు నేను సహాయం చేస్తాను. కొత్త జీవితం ప్రారంభించు. ముస్లిం గూండాల చేత వంచింపపడ్డావని అందరికీ చెబుతాను. ఆర్యసమాజంవాళ్లు నీకు తప్పకుండా సహాయం చేయడానికి ముందుకు వస్తారు. ఎట్లాగూ నీకు హిందీ చదవడం వ్రాయడం వచ్చు. ఇంగ్లీషు కూడా కొద్దో గొప్పో వచ్చు. ఎక్కడో ఒకచోట ఆర్యసమాజ పాఠశాలలో టీచరు ఉద్యోగం ఇప్పిస్తాను"

"నిర్గుణ్! మహాత్ముడు భారతమహిళలకు ముసుగు తొలగించి స్వాతంత్రం ఇప్పించాడు. కాంగ్రెస్ కార్యకర్తలు స్త్రీపురుషులు కూడా వాళ్ల వాళ్ల కోరికలు తీర్చుకోవడానికి ఓ అడ్డు ఏర్పరిచాడు. ఓ రెండుశబ్దాల మాటున ఏమైనా చేసుకోవడానికి అనుమతి ఇచ్చాడు. నీవు కూడా ఆ వ్యవహారమే నడుపు. ఆ అడ్డుపెట్టుకునే నీ కోరికలు తీర్చుకో..."

"అడ్డు ఏమిటి? ఈ చాటుమాటు వ్యవహారం ఏమిటి? నాకేం తెలియదు వాటి గురించి"

"ఈ ఖద్దరు ధరించే కార్యకర్తలు బహన్‌భాయిజీ... అనే ఓ సంప్రదాయాన్ని ఏర్పరిచారు. ఆడమొగ బహన్‌జీ... భాయిజీ అంటూ ఒకరి నొకరు పూసుకుతిరుగుతూ వుంటారు. పగలంతా వీళ్ళు ఒకళ్లకొకళ్లు సోదరసోదరీమణులే. కానీ చీకటిపడంగానే ఏకాంతం దొరకగానే సోదరుడు మొగుడవుతాడు. సోదరీమణి భార్యామణిగా మారిపోతుంది" బసంత్ ఎట్లాగయినాసరే తన కోరిక తీర్చుకోవాలనుకునే ఇవన్నీ చెప్పాడు. తర్వాత ఆమెకు డబ్బాశ

చూపించాడు. ఏది కావాలంటే అది ఇస్తానన్నాడు. ప్రైవేట్ నర్స్‌చేత ఆమె గర్భం తీయిస్తానన్నాడు. నిర్గుణియా మనస్సు ఊగిసలాడింది. కానీ ఆమెలోని నైతికభావన ఆమెను రక్షించింది. ఆమె నవ్వుతూ ఆ మాటలు ఈ మాటలు, చెప్పి నగలు తీసుకుని బయటపడింది.



రోజులు గడుస్తున్నాయి. నిర్గుణియాకి మసీతారామ్ ఇంటి చుట్టుపక్కల వాళ్ళందరితో పరిచయం అయింది. గుల్లన్‌దాయ్‌తో ఆమెకు కొంత కాలక్షేపం అయ్యేది. పగలంతా ఏదోవిధంగా గడిచిపోయేది. కానీ రాత్రయ్యేసరికి ఒంటరితనంతో ఎంతో బాధపడేది. ప్రకృతి సహజంగా స్త్రీలో ఉండేకోరిక ఆమెను నిలవనిచ్చేది కాదు. గతస్మృతులు ఆమె మనస్సును నీలాకాశంలోకి తీసుకుపోయేవి. ఆమె మానసిక వ్యధ వర్ణనాతీతం. ఆరోజు మసీతారామ్, గుల్లన్ తాగేటప్పుడు ఆమెను కొంచెం తాగమన్నారు. కానీ ఆమె నిరాకరించి ఇవతలకి వచ్చేసింది. గదిలో విరుచుకుపడ్డ వృక్షంలా మంచంమీద పడిపోయింది. ఆమెలో మానసిక సంఘర్షణ మొదలయింది. ఇప్పుడు తను ఎవరిదీ కాదు. కేవలం తన మోహన్‌కే అంకితం అయిపోయింది. ఆమెలో ఉన్న సంస్కారవంతమైన మనస్సు ఒకే పురుషుణ్ని కోరుకుంటోంది. కానీ కామపీడితమైన మనసు మాత్రం వెక్కిరించడానికి అన్నట్లుగా ఆమె స్మృతిపథంలోకి ఎందరో పురుషులని తీసుకురాసాగింది. పురుషుల ఆకారాలు... వాళ్ళ చేష్టలు... ఆమె కళ్ళ ఎదుట కదలాడసాగాయి. అశక్తుడు, అస్పృశ్యుడు అయిన ఆర్యపుత్రుని అసఫలమైన కామచేష్టలూ, అతడు అనహ్యంగా ప్రవర్తించే తీరూ ఆమెకు గుర్తుకురాసాగాయి. మనస్సు స్థిరంగా ఉండటంలేదు. హృదయపూర్వకంగా మోహనుడి ప్రేమ గంగలో మునిగిపోవాలానుకుంటోంది. ఈ క్షణం ఆమె కేవలం అతడి ప్రేమ చేష్టలను మాత్రమే గుర్తుకు తెచ్చుకోవాలని ఎంతో ప్రయత్నిస్తోంది. ఆ క్షణాలు, ఆ అనుభవం ఆమెకి కావాలి. కానీ ఇప్పుడు ఆ అనుభవం ఆమెకి కలగడంలేదు. ఊహు... మనస్సులో ఏమూలో అతడి జ్ఞాపకాలు అణగిపోయాయేమో అనిపించిందామెకు. ఎంతకీ ఆమె అతడి స్మృతులలో లీనం కాలేకపోతోంది. పోనీ ఇప్పుడు అసలు అతడిని ఎందుకు గుర్తుకు తెచ్చుకోవడం?

మనసు ఒక నిశ్చయానికి వచ్చేసరికి ఆమెకు మరో ఆలోచన వచ్చింది. రేపు బసంత్ లాల్ దగ్గరికి వెళ్లిపోతే...?

తనను సరైన సంరక్షకుడు చేతిలో పడేయగల శక్తి అతడికి వుంది. సంరక్షకుడు ఎవడైనా సరే... సుఖంగా గౌరవంగా బతకటానికి అవకాశం కల్పిస్తే చాలు. కులమతాలతో ఏంపని? తనకు రాజభోగాలు అక్కర్లేదు. తనకు కావల్సింది శారీరక, మానసిక తృప్తి. ముసలిమొగుడు తన సుఖంకోసం ఎన్నో సౌకర్యాలు కల్పించాడు. కాని... కాని... అతడు అస్పృశ్యుడికిందే లెక్క. అతడికన్నా మోహన్ ఎంతో మేలు. అతడిని ముట్టుకుంటే ఎంత హాయి. ఇప్పటికి కూడా అతడు అస్పృశ్యుడు అన్న భావం తనలో రాదు... తనని ముద్దుచేస్తూ సిగరెట్టుతో బుగ్గమీద కాల్చేవాడు. కొరికేవాడు. మోహన్‌లోని పాకీవాడు నిర్గుణియాలోని బ్రాహ్మణురాలిపై తన కక్ష తీర్చుకోవడానికే అంతగా హింసించేవాడా అని ఆమెకి అనిపించసాగింది. కాని... కాని... ఎందుకో అతడి దగ్గర తనకు ఆనందం దొరికేది... అతడు తనని మనఃస్ఫూర్తిగా ప్రేమించాడు... తన మోహన్ తన ఎదురుగుండా నిల్చున్నాడా... తను అతడి భార్యగానే జీవించాలి. తను ప్రతీ సందూ తిరిగే కుక్కలా ఎందుకు బతకాలి? ఇప్పుడైతే అతడి రూపం తనలో పెరుగుతోంది. కొన్ని నెలల తరువాత తను తల్లి

కాబోతోంది. అమ్మ కావాలన్న కోరిక. సంస్కార వంతురాలిగా గౌరవప్రతిష్టలతో బతకాలన్న కోరిక, ఆమెలోని ఈ కోరికలు, ఈ సంఘర్షణ రెండూ నిర్గుణియా మనస్సును తమ సుడి గుండంలోకి ఈడ్చుకుపోతున్నాయి. నాట్యం చేయిస్తున్నాయి. ఆమె పూర్తిగా అందులో మునిగిపోనూలేదు, ఈది బయటపడనూలేదు. ఎటు పడుకున్నా ఏం ఆలోచించినా శాంతి దొరకడంలేదు... 'రామా! రామా!' ఆ పవిత్రశబ్దం ఆమెలో మారుమోగసాగింది. ఆ రామ శబ్దం ఆమెను తన్మయురాలిని చేసింది. ఆ తన్మయత్వంలోనే ఆమెకి తాతగారి కంఠం వినిపించసాగింది.

''అబ్‌హమ్ నాచ్యే బహుత్ గోపాల్.

కామ్‌క్రోధ్‌కె పహిరిచోలనా కంఠవిషయకీ మాల్... ॥అబ్॥''

(గోపాలా! ఇప్పటికే చాలా నాట్యం చేశాను. కామక్రోధాల రవిక ధరించి, విషయలోలిత మైన కంఠమాల ధరించి నృత్యం చేశాను... అనే ఈ పద్యపంక్తులు సూర్‌దాస్ వ్రాసిన పదావళిలోని ఒక గీతంలోనివి) ఆ భజన ఆమె మనస్సుమీద అంకుశంలా పనిచేసింది. ఆమె తనలోని కామక్రోధ మదలోభాలను కొంతవరకు తన గుప్పిట్లోకి తెచ్చుకుంది. కానీ పూర్తిగా తనను తను కంట్రోల్ చేసుకోలేకపోయింది. అందుకే ఆమెకు ఆ రాత్రంతా అశాంతి...

మరుసటిరోజు ఇన్‌స్పెక్టర్ పిలుస్తున్నాడని కానిస్టేబుల్ చెప్పడంవలన నిర్గుణియా బసంత్ దగ్గరికి వెళ్లింది. బసంత్‌లాల్ నిర్గుణియాని చూడగానే నవ్వాడు. అతడి పక్కన ఒక ముస్లిం స్త్రీ కూర్చుని ఉంది. అతడు అసహ్యకరంగా ప్రవర్తించసాగాడు. నిర్గుణియాని తన పక్కన రమ్మని పిలిచాడు. అతడు తమ ఇద్దరితో కోరిక తీర్చుకోవాలనుకుంటున్నాడని నిర్గుణియా గ్రహించింది. గతరాత్రి ఆమె శరీరంలో కామజ్వాల ఆమెను నిలువనీయకుండా చేసింది. అందుకే 'బసంత్ దగ్గరికి వెళ్తే' అన్న ఆలోచన ఆమెలో వచ్చినమాట నిజమే. కాని ఇప్పుడు ఇక్కడ ఇంత అసహ్యకరంగా ఒకే సమయంలో ఇద్దరి ద్వారా కోరిక తీర్చుకోవాలనుకుంటున్న బసంత్‌ని చూడంగానే అసహ్యం వేసింది. వాళ్లిద్దరికి బాగా తాగించి తన శరీరాన్ని ముట్టుకోనివ్వకుండా ఆమె బయటపడింది.

★ ★ ★

ఈ అధ్యాయం నేను పూర్తిగా వ్రాయలేకపోయాను. ఇందుకు నాకు రెండు కారణాలు కనిపిస్తున్నాయి. బహుశ శృంగార విషయాలు చిత్రించడంలో నాకు అనుభవం లేకపోవటం కావచ్చు. ఇప్పటి నిర్గుణియా నాకు పవిత్రంగా కనబడటం రెండో కారణం అయిఉండవచ్చు. ఆమె యెడల నాకు కల గౌరవభావనే నన్ను ఆ దృశ్యాలని చిత్రించనీయకుండా అడ్డుపడి ఉండవచ్చు. గత జీవితంలో ఆమె కోరికకి బానిస అయిఉండవచ్చు. ఆ కోరికను తీర్చుకోవడానికి ఎన్నోసార్లు కాలుజారి ఉండవచ్చు. కాని ఇప్పుడు ఆమె ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ఏర్పరుచుకుంది. ఇప్పుడు ఆమె ఒక ఉన్నతమైన, పునీత వ్యక్తిత్వంగల వృద్ధురాలు. ఆమె ఇప్పుడు తాగుబోతు అయినా, బండబూతులు తిట్టే స్త్రీ అయినా తనకు మాత్రం ఆమెయెడల తక్కువభావం కలగదు. కామం మనిషిని అధోగతిలోకి తీసుకుపోతుంది. మనుషుల జీవితాలని నాశనం చేస్తుంది. చరిత్రపుటల్లో మనకు ఎన్నో ఉదాహరణలు కనిపిస్తాయి. బుద్ధుడి కాలంలో శ్రీ వాస్తవలోని ఒక పెద్ద షావుకారు కూతురు పటాచారా కూడా తన కామాన్ని అణుచుకోలేక తన దగ్గర పనిచేసే నౌకరుని తీసుకుని లేచిపోయింది. ఆమె ఆ తరువాత కష్టాల సుడిగుండంలో చిక్కుకుంది. నిర్గుణియా జీవితం కూడా ఇదేవిధంగా నాశనం అయింది. శరీరవాంఛలు ఆమెను పాపపంకిలంలోకి లాక్కుపోయాయి. కానీ ఈ కోరికనే ఆమె పొయ్యిలోని కట్టెలలాగా ఒకదగ్గరికి చేర్చి దాని సెగమీద తనుతను కాల్చుకుంటూ ఒక ప్రత్యేకమయిన వ్యక్తిత్వాన్ని ఏర్పరుచుకుంది. నిర్గుణియాని చూశాక ఆమె ఏ యోగినికన్నా తక్కువకాదని నాకనిపిస్తుంది. ఈ స్థితికి ఆమె అంత సులభంగా వచ్చిందా? లేదు, ఆమె కష్టాలను ధైర్యంగా ఎదుర్కొంది.

నేను మరునాడు నిర్గుణియా దగ్గరికి వెళ్లాను. నేను వ్రాసినవి చదివి వినిపించాను. ఇద్దరం మాట్లాడుతూ కూర్చుండగా ఆమె నోటివెంట మరో రహస్యం వెలువడ్డది. ''నా

కూతురికి తండ్రి పెట్టిన పేరు శకుంతల. మోహన్ చనిపోకముందు దాదాపు రెండు మూడు సంవత్సరాలక్రితంనుండి ఎండర్‌సన్ సాహెబ్ అక్కడ ఉంటున్నాడు. ఆయన మత ప్రవక్తేకాక డాక్టరు కూడా. అతడు ఎంతో దయా మయుడు. మొదటిసారి మసీతాబాబాయి కోసం ఆయన దగ్గరికి వెళ్లాను. తరువాత పిల్లల మందులకోసం వెళ్తూ ఉండేదాన్ని. భగవంతుడి దయవల్లేనేమో నా బిడ్డమీద అతనికి మమత కలిగింది''

'నిర్గుణ్ క్రిస్టియన్‌గా మారిపో... పిల్లని పెంచి పెద్ద చేస్తాను. దానిని విదేశం పంపించి గొప్పదాన్ని చేస్తాను' అని నాతో అంటూ ఉండే వాడు. మీ దగ్గర ఏ విషయం దాచనప్పుడు ఈ విషయం మాత్రం దాచడం ఎందుకు...? వినండి బాబుగారూ! మోహన్ చనిపోక ముందు కొన్ని నెలలుగా సహానుభూతి చూపిస్తూ నన్ను అతడు ప్రేమించాడు. ఆయన యెడల నాకు ప్రేమ కలిగిన మాట నిజమే. కానీ మోహన్ చనిపోయాక నేను కేవలం అతడి ధ్యానంలోనే మునిగిపోయాను. ఒకరోజు ఆయన కాళ్ళు పట్టుకుని అడిగాను. మీరు అందరికీ ఫాదరేకదా నా యెడల కూడా అట్లాగే ప్రవర్తించండి అన్నాను. ఆయన ముఖం వాడి పోయింది. 'ఒకసారి మనస్సు ఏ సంబంధాన్న యితే అనుకుందో దాన్ని తెంచడం అంత తేలిక కాదు. నిర్గుణ్! నేను నీలో భగవంతుడిని చూస్తున్నాను. నామాట విని నీ కూతుర్ని నాకు ఇచ్చేసేయ్ అన్నారు. ఆయనే ఆమెను క్రిస్టియన్‌ని చేసి మేరీ అని పేరు పెట్టారు. తరువాత ఆయన తన చెల్లెలి దగ్గరికి లాహోర్ వెళ్లిపోయారు. లాహోర్‌నుండి అమెరికా వెళ్లారు. మేరీ కూడా అతనితో వెళ్లిపోయింది. అక్కడే ఆయన మేరీని చదివించారు''

''ఫాదర్ ఎండర్‌సన్‌ని మీరు మళ్ళీ ఎప్పుడైనా కలిశారా?''

''కలిశాను''

''ఇట్లా అడుగుతున్నందుకు క్షమించండి. ఇన్ని సంవత్సరాల తరువాత కూడా అతడికి మీమీద అటువంటి ప్రేమేఉందా?''

''అతడు ఎంతమాత్రం మారలేదు. నా యెడల అతడికి ప్రేమానురాగాలు ఉన్నాయి. కించిత్ కూడా తగ్గలేదు'' అంటూ ఆమె గ్లాసులో బీర్‌నింపి తాగడం మొదలుపెట్టింది. నేను ఆమెకు సిగరెట్ ఆఫర్ చేశాను.

''బాబుగారూ! మీలాంటి గొప్పవ్యక్తి నాకు ఇంత గౌరవం ఇస్తున్నారు. ఇది నిజంగా నా అదృష్టమే'' అంది.

''నిర్గుణీయాగారూ! గౌరవం నేను ఈయడంలేదు. మీ వ్యక్తిత్వం నన్ను మీ వైపుకి లాక్కొస్తోంది. మీకు గౌరవం ఇమ్మంటోంది'' అన్నాను. ఆమె తన జీవితంలోని ముఖ్యమైన సంఘటనలను గురించి చెప్పడం మొదలుపెట్టింది. నేను వింటూ కూర్చున్నాను. ఆమె చెప్పినవన్నీ విన్నాక నాకు ఆశ్చర్యం, బాధ రెండూ కలిగాయి. ఎంతగా తాగినా తనను తను కంట్రోల్‌లో పెట్టుకుని తన జీవిత చరిత్రను ఇంత విస్తారంగా ఆమె ఎట్లా చెప్పగలుగుతోంది. ఈమె తన బహిర్‌చే తనను నిద్రపుచ్చి అంతర్‌చే తనని మేల్కొల్పకలదా? ఈమె చరిత్రహీనురాలైన స్త్రీయా? ఊహూఁ... ఎంత మాత్రం కాదు. ఈమెలోని అసలైన నిర్గుణీయాని గుర్తించాక నా మనస్సులో సముద్రంలోని అలలలాగా ఎన్నో ఆలోచనాతరంగాలు లేచాయి. ఆమె యెడల నాకెంతో గౌరవం కలగసాగింది. కానీ దేన్ని చూసి నాలో ఈ భావం ఉప్పొంగింది? నిర్గుణీయా జన్మతః బ్రాహ్మణురాలు అయినందుకా లేక పరిస్థితులవలన దిగజారి తన చేత్తో తన జీవితవనాన్ని నాశనం చేసుకున్నా సాహసంతో, ఆత్మబలంతో మళ్ళీ నవవసంతాన్ని నింపుకున్నందుకా? ఒక సాధారణ స్త్రీ ఎదురుగుండాకాక ఓ గొప్ప యోగిని ఎదురుగుండా కూర్చునే సౌభాగ్యం కలిగిందని నాకనిపించసాగింది. ఈ స్త్రీ ఆత్మవిశ్లేషణ చేసుకుని తన నిజస్వరూపాన్ని చూసింది. గుర్తించింది. ఈవిధంగా తమలో దాగివున్న అసలు రూపాన్ని ఎంతమంది గుర్తించగలుగుతారు? నా అసలు స్వరూపాన్ని నేను గుర్తించగలనా?

★ ★ ★

నిర్గుణీయా ఇంటినుంచి వచ్చేటప్పుడు ఆమె వ్రాసిన డైరీని తీసుకువచ్చాను. ఆమె వ్రాత అంత అందంగా లేదుగానీ అక్షరాలు

స్పష్టంగా ఉన్నాయి. ఈమె చాలా విచిత్రమైన వ్యక్తి. తన జీవితచరిత్రను అనేక చిన్న చిన్న భాగాలుగా వ్రాసిందికాని పూర్తిగా ఎందుకు వ్రాయలేదో అర్థంకావడంలేదు. తులసీరామాయణంలోని అయోధ్య కాండలోని ఒక దోహాతో ఆవిడ దీనిని ప్రారంభించింది. హంసలాపాలనీ నీళ్ళనీ వేరుచేయడానికి ఆమె తన వివేకాన్ని ఉపయోగించింది. తన ఆత్మను మేల్కొల్పింది. పరిస్థితులవలన, ప్రకృతి సహజంగా మనిషిలో కలిగేకోరికవలన కామాంధురాలై ఈమె కాలుజారింది. కానీ మంచి అవకాశం వచ్చివుంటే ఈమె ఒక గొప్ప భక్తురాలిగా మారిఉండేదే! ఆరోజు ఆమె "బాబుగారూ! ఇక ఈ పాపపు విషయాలు మానేస్తే మంచిది" అంది. నేను "నాకెక్కడా పాపం కనిపించడంలేదు నిర్గుణియాగారూ... నా ఎదురుగుండా ఉన్న స్త్రీ ఎవరో తెలుసా? పంకజంలా పవిత్రమయినది. వందరేకులు కలది. సాక్షాత్ ప్రజ్ఞాలక్ష్మి..." అన్నాను. సూరదాసు వ్రాసిన ఒక వాక్యం గుర్తుకు వస్తోంది. ఆ వాక్యం ప్రకారం నదిలో ఒకవైపు నిర్మలమైన నీరు ప్రవహిస్తున్నా మరోకవైపు అశుభ్రమైన జలం కూడా ఉండితీరుతుంది.

నాణానికి రెండువైపుల ఉన్నట్లే ఈమెలో కూడా రెండురకాలయిన వ్యక్తిత్వాలు ఉన్నాయి. నిర్గుణియాలోనే ఇటువంటి పూర్తిగా విరుద్ధమైన రెండు వ్యక్తిత్వాలు ఉన్నాయా? వెలుగు చీకటులు ఈమె వ్యక్తిత్వంలో మాత్రమే కనిపిస్తాయా? మరి ఇంకెవరిలోనూ కనిపించవా? ప్రతి మనిషిలో రెండురకాలయిన రూపాలు ఉంటాయని నేననుకుంటాను. ఒకటి జాగ్రుతమై ఉంటే మరొకటి నిద్రావస్థలో ఉంటుంది. మరి అటువంటప్పుడు ఏది వారి నిజరూపం అనుకోవాలి? ఏది నకిలీరూపం అనుకోవాలి? ఏది నిద్రావస్థలో ఉందనుకోవాలి? ఏది జాగృదావస్థలో ఉందనుకోవాలి?

నిర్గుణియా ఇచ్చిన డైరీలో వ్రాయబడివున్న విషయాలు యథాతథంగా ఇస్తున్నాను.

"గత ఆరునెలలనుండీ నా జీవితంలో జరిగిన సంఘటనలను, నాకు ఎదురైన అతి చేదయిన అనుభవాలను కష్టాలను చూస్తే రాముడు ఇవన్నీ అనుభవించడానికే ఈ జన్మనిచ్చాడా అనిపిస్తోంది. బసంత్‌లాల్ ఇంటిదగ్గరనుండి బయటపడి నేను పొలాలలో పడి నడుచుకుంటూ రోడ్డుదాకా వచ్చాను. ఒక బండివాడు ఛావనీవైపు వెళ్తుంటే అతన్ని బతిమిలాడి బండి ఎక్కాను. అతడు మాట్లాడటం మొదలుపెట్టాడు - "ఛావనీలో ఎవరో కొత్త ఇన్‌స్పెక్టర్ వచ్చాడట. చాలా మంచివాడట. పేదోళ్ళమీద దయ చూపిస్తాడట. నాలుగురోజులకిందట బందిపోటు మోహన్ ఇక్కడ బస్తీలో దోపిడీకి వచ్చాడు. బీదవాళ్ళ గుడిసెలన్నింటిని నాశనం చేశాడు. ఈ ఇన్‌స్పెక్టర్ ఛావనీలో ఉండే ఆలుగడ్డల వ్యాపారస్థుడు లాలా దగ్గరినుండి పైసలు తీసుకుని రేపు గుడిశలనన్నింటిని కట్టాల్సిందని ఆర్డరు ఇచ్చాడు. ఆయన ఎవడో చాలా పెద్దమనిషిలా ఉన్నాడు. అల్లా వాడిని చల్లగా కాపాడాలి"

మోహన్ పేరు వినగానే నాకు చాలా బాధ కలిగింది. నేను ఇంటికి చేరేసరికి మసీతా బాబాయి తన పనిమీద వెళ్ళిపోయాడు. గుల్లన్ పిన్ని కూడా లేదు. ఆమె కోడలి దగ్గరికి వెళ్ళాను. ఆమెకు నాగురించి కొంత తెలుసు. మోహన్ బందిపోటు దొంగగా మారాడు కనుక ఇక వాడు ఇంటికి రాడు. బసంత్‌లాల్ మొదటినుండే నీకు తెలుసు కనుక వాడి రక్షణకిందే ఉండు అంది. కొంచెంసేపటికి గుల్లన్ పిన్ని వచ్చింది. ఆమె చాలా అలసిపోయి ఉంది. బసంత్ పెళ్ళానికి పురుడు పోయడానికి వెళాననీ రాత్రినుండి వచ్చి మంచినీళ్ళు తాగలేదనీ చెప్పింది. "ఏం చెప్పను నిర్గుణ్! ఇదంతా నా ఖర్మ. ఖర్మ కాకపోతే ఈ కులంలో ఎందుకు పుడతాను? జన్మ అంతా కీలుబొమ్మలా అందరి పనులూ చేయాలి. నువ్వే చెప్పు నిర్గుణ్? ఇది తన్నులు తినే వయసేనా? ఈ ముసలితనంలో కూడా నాకు ఇన్ని కష్టాలు. అల్లామియా ఎటువంటి చెడురోజులు చూపిస్తున్నాడు? ఆ ఇన్‌స్పెక్టర్‌గాడి పెళ్ళానికి ఇది మూడో పురుడు అయినా ఎంత నఖరాలు చేసిందని. మొత్తం ఊరంతా ఏకం చేసింది. తాతముత్తాతలు దిగివచ్చారు. రాత్రంతా దాని దగ్గరే కూర్చున్నాను. వాళ్ళు తిన్నావా లేదా అని అడగలేదు. ఇంటికి వచ్చాక కోడలిని రెండు రొట్టెలు కాల్చిపెట్టమని అడిగాను. అది పొయ్యి వెలిగిస్తే ఒట్టు... సరిగదా కత్తిలాంటి

నాలుకతో నన్ను నానామాటలూ అన్నది. దీని అమ్మ అయ్యలు తగలడ...'' అంటూ తన రామాయణం చెప్పింది. నేను వేడివేడిగా పప్పు, రొట్టెలు చేసి ఆమెకు తినడానికి ఇచ్చాను.

''నిర్గుణియా! నీకు పిండికి రోజూ డబ్బు ఇస్తాను. నువ్వే ఓ రెండు రొట్టెలు కాల్చిపెట్టు. ఇక నేను నా కోడలి గడప తొక్కను'' అని కోపంగా అంది.

''పిన్నీ! నేనే ఈ ఇంట్లోంచి వెళ్ళిపోదామనుకుంటున్నాను. నువ్వు హాయిగా ఇక్కడే ఉండు'' అనుకోకుండా నా నోటివెంట ఈ మాటలు వెలువడ్డాయి.

''నిర్గుణ్! ఎక్కడికి వెళ్తావు? వయస్సులో ఉన్న ఆడదాన్ని ఈ ప్రపంచం బతకనివ్వదు''

''మోహన్ బందిపోటు దొంగ అయ్యాడు. బసంత్ ఇన్‌స్పెక్టర్‌కి చిక్కకుండా ఎలాగోలా బయటపడ్డాను. కానీ వాడు నామీద పగ తీర్చుకుంటాడు. నేను ఇక్కడే ఉంటే మీకు కష్టాలు తప్పవు''

కొంచెంసేపయ్యాక మసీతా వచ్చాడు. నన్ను వెళ్ళవద్దని బతిమిలాడాడు. వెళ్ళనని ఒట్టు వేయించుకున్నాడు. నా మనస్సు నుడిగుండంలా అయిపోయింది. బసంత్‌లాల్ నామీద పగ తీర్చుకుంటాడు. నన్ను అందరి ముందూ అవమానం చేసి తీరుతాడు. .ఆ అవమానం నేను సహించలేను. మా అమ్మ తాతయ్యల పేర్లు బజారుకెక్కడం నాకు ఇష్టంలేదు. ఇక్కడినుండి వెళ్ళిపోవాలి. కాని ఎక్కడికి వెళ్లను? కాంగ్రెస్‌వాళ్ళ హృదయాలలో జాతిప్రేమ ఉన్నదంటారు. ఆర్యసమాజంవాళ్ళు అంటరానివాళ్ళను ఉద్ధరిస్తారని విన్నాను. నన్ను కూడా ఉద్ధరిస్తే బాగుండును. హే రామా! హే రామా! రాత్రి గుల్షన్ పిన్ని కొడుకు నబ్బూ వచ్చాడు. తల్లిని అడ్డమైన తిట్లూ తిట్టాడు. ఇంటికి వస్తే జుట్టు పట్టుకుని బయటకి ఈడుస్తానన్నాడు. పిన్ని ఏడవడం మొదలుపెట్టింది. బస్తీవాళ్ళందరూ చేరారు. ఏడుపులు, పెడబొబ్బలు మొదలయ్యాయి. బస్తీవాళ్ళు నబ్బూని ఈడ్చి బయటికి లాగారు. బాబాయి పిన్నిని ఓదార్చటం మొదలుపెట్టాడు. అప్పుడు నాకనిపించింది నన్నూ ఈవిధంగా ఓదార్చేవాళ్ళు లేరుకదా అని...

ఆ మరునాడు పిన్నికి బసంత్ విషయంలో నాకున్న భయం గురించి చెప్పాను. ఆర్యసమాజంవాళ్ళు కాని, కాంగ్రెస్‌వాళ్ళుకాని ఎవరైనా తెలుసా అని అడిగాను. ఆర్యసమాజానికి చెందిన వేదప్రకాశానందస్వామివారు ఒకసారి పాకీబస్తీకి వచ్చారనీ, అంటరానివాళ్ళని ఉద్ధరిస్తానని చెప్పారనీ, కాని ఆ ముసలాయన కూడా మంచివాడు కాదని ఆనోటా, ఈనోటా విన్నాననీ చెప్పింది. నన్ను నేను ఆ ముసలాయననుండి రక్షించుకుంటాను గానీ నాకు అతడు ఆర్యసమాజంలో శరణం ఇస్తాడా అని అడిగి రమ్మని చెప్పాను.

ఆమె వెళ్ళి స్వామీజీని అడిగింది. ఆయన మా ఇంటికి వచ్చాడు. ఆయనకు నా మొదటి మొగుడి వయస్సు ఉంటుంది. నేను స్వామీజీకి నా కన్నీటి కథ చెప్పాను. ఏడుస్తూ ఆయన కాళ్ళకు దండం పెడుతూ ఎంతో నాటకం ఆడాను. ఆయన నన్ను ఓదార్చడంకోసం మంచి భావన ఉన్నవాడిలా పెద్దవాడిలా నా శరీరాన్ని నిమిరాడు. నన్ను ఓదార్చడానికి నా తలమీద పెట్టిన అతని చేయి నెమ్మది నెమ్మదిగా నా బుగ్గలను కూడా నొక్కసాగింది. వీపు తడుతూ శరీరంలోని వివిధ భాగాలమీద చేయివేశాడు. ఇవన్నీ గుర్తుకు వస్తూవుంటే ఇప్పుడు కూడా నాకు నవ్వు వస్తోంది. వృద్ధుడైన ఆ స్వామీజీ లెక్చర్ బాగా ఇస్తాడు. చూపులకు ఎర్రగా బుర్రగా ఉంటాడు. ఆయనకి ఇంగ్లీషు కూడా వచ్చు.

''దేవీ! నీకు నేను తప్పకుండా శరణు ఇస్తాను. కాని ఇక్కడనుండి ఎవరికీ కనబడకుండా బయటపడాలి. నాతో వస్తే ఇన్‌స్పెక్టర్‌కి నీ విషయం తప్పకుండా తెలుస్తుంది. ఈ ముసలామెకు జేమ్స్ కంపెనీ వెనక వున్న శివాలయంలో నిన్ను వదిలివేయమని చెప్పు. అక్కడినుండి వేదమందిరంలోకి నిన్ను తీసుకువెళ్తాను. నీలాంటి ఆడవాళ్ళు అక్కడ మరో ఇద్దరు ఉన్నారు. వాళ్ళిద్దరికి కూడా శరణం ఇచ్చి ఉద్ధరించాను'' అని ఆయన నాతో అన్నాడు. మసీతా బాబాయికి విషయం అంతా చెప్పి స్వామీజీ చెప్పినట్లే చేశాను. మధ్యాహ్నం కాకముందే ఆ జన్మనుండి విముక్తి

పొంది శంకరుడి మందిరంలోకి వెళ్ళిపోయాను. స్వామీజీ తనవెంట నన్ను వేదమందిరానికి తీసుకువెళ్ళాడు.



వేదమందిరంలో ఋషీదేవి, వేదవతీదేవి అనే ఇద్దరు మహిళలు ఉన్నారు. వాళ్ళ జీవితగ్రంధపు పుటలు కూడా కష్టాలూ, కన్నీళ్ళతోనే నిండిఉన్నాయి. వాళ్ళిద్దరి కన్నీటి కథలూ విన్నాను. నాకు చాలా బాధగా అనిపించింది. ఈ సమాజంలో స్త్రీజాతిపై జరిగినన్ని అన్యాయాలు, అత్యాచారాలు బహుశ మరెవరిమీదా జరిగి ఉండవు. స్త్రీ ఈ సమాజంలో ఎంత నికృష్టంగా బతుకుతోంది. ఆమె ఈ పురుషస్వామ్య సమాజంలో కట్టుబానిసగా బతుకుతోంది.

నాకు వేదమందిరంలో సుఖశాంతులు లభించాయి. ఋషీదేవికింద నేను అసిస్టెంట్ టీచర్‌గా పనిచేయడం మొదలుపెట్టాను. వేదమందిరంలో వాతావరణం ఎంతో బాగుంది. మళ్ళీ అమ్మమ్మ, తాతయ్యల ఇంటి వాతావరణం నాకు ఇక్కడ లభించింది. తెల్లవారుఝామున స్వామీజీ ప్రాతఃకాల ప్రార్థన జరిపేవారు. ఆ ప్రార్థన వింటున్నప్పుడల్లా నేను ఎంతో పవిత్రమయిపోయినట్లే భావించుకునేదాన్ని. సూర్యోదయ సమయంలో వేదమందిరంలో హోమం జరిగేది.

ఆర్యసమాజంలో ఉన్న రోజులలో నా మనస్సు ఎంతో శాంతిగా ఉండేది. కాని బసంత్, మోహన్‌లు గుర్తుకు వచ్చినప్పుడల్లా నా మనస్సు కలత చెందేది. ఒకరోజు పిన్ని బాబాయి వచ్చారు. ఇంటికి పోలీసులు వచ్చారనీ, నిర్గుణ్ ఎక్కడుందో చెప్పమని కొట్టారనీ చెప్పారు. స్వామీజీ కూడా ఒక వార్త మోసుకువచ్చాడు. నిర్గుణ్‌ని వేదమందిరంలో ఉండనీయవద్దనీ, గెంటివేయమనీ బసంత్‌లాల్ స్వామీజీకి చెప్పాడు. ఆమెకు శరణం ఇచ్చాను, ఆమెను వెళ్ళకొట్టనని స్వామీజీ చెప్పాడు. బసంత్ నన్ను వదిలిపెట్టడు. అతడి కోరిక తీరిస్తే నాకు ఇక అదనంగా వచ్చే పాపం ఏముంది? ఎటూ అన్నివిధాలా భ్రష్టురాలనయ్యాను. ఈరోజు నా గుండెలమీద చేయిపెట్టి చెబుతున్నాను... నిజానికి పురుష సంపర్కాన్ని నా శరీరం కోరుకుంటోంది. నేను స్వామీజీకి విషయం విడమరిచి చెప్పాను - బసంత్‌లాల్ కోరిక తీర్చి వేదమందిరానికి చందా వసూలు చేస్తానని. ఒక పాపంవలన మంచి జరిగితే ఆ పాపం నిజానికి పుణ్యంగానే మారిపోతుందని ఉపన్యాసం దంచాను. వేదమందిరం గాలి పీల్చడంవలన దాని ప్రభావం నామీద బాగా పడ్డది. అందుకే నాకు ఉపన్యాసం ఇచ్చే కళ కూడా వచ్చింది.

“ఒక గొప్ప ఆదర్శంకోసం చేసిన త్యాగం ఎంతో మహనీయమయినదే అవుతుంది. అందువలన నిర్గుణ్‌దేవీ, ఆదర్శంకోసం నీ శరీరం దానం చెయ్యి. నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను” అని అన్నాడు ఆయన. ఆ అభినందనలను నా హృదయంమీద చేయివేసి మరీ చెప్పారు. ఆయన నెరసిన గడ్డం చూసి నేను లోలోపలే నవ్వుకున్నాను. నా ముసలి మొగుడు కూడా ఇటువంటి చేష్టలే చేస్తూ ఉండేవాడు. నాకు చాలా కోపం వచ్చేది. ఇప్పుడు నిర్భయంగా ఒక విషయం చెప్పగలను. పూజ్యులయిన వేదప్రకాశానంద విద్యావంతుడై వుండకపోతే సన్యాసియై వుండకపోతే తప్పకుండా ఆడవాళ్ళను అమ్మే వ్యాపారం చేసేవాడు.

“నీవు ఒక ఉత్తరం వ్రాసి ఇవ్వు నేను ఇన్‌స్పెక్టర్ దగ్గరికి స్వయంగా వెళ్ళి ఇస్తాను” అని స్వామీజీ అన్నాడు. నేను బసంత్‌పేరున అతని పొందుకోసం తపించిపోతున్నట్లుగా ఒక ఉత్తరం వ్రాశాను. బసంత్ దగ్గరికి నా

ఉత్తరం చేరింది. అతని జవాబు చూసి నేను ఆశ్చర్యపడ్డాను. అతడిలో ఇంకా భావుకతగల ఒక యువకుడు నాకు మొట్టమొదట తెలిసిన బసంత్ ఉన్నాడని అనిపించింది. "ప్రియురాలా! నా ప్రాణమా! ఆరోజు నేను మత్తులో తప్పు చేశాను... నన్ను క్షమించు. ఈరోజు రాత్రి ఎనిమిది గంటలకు నీవు వేదమందిరం దగ్గర వున్న దిబ్బదగ్గరకి రా! నిన్ను తీసుకువెళ్తాను. ఒక బంగళాలో మన ఇద్దరం కలిసే ఏర్పాటు చేశాను. నిన్ను మళ్ళీ మంచి సమాజంలోకి తీసుకువెళ్ళడానికి ప్రయత్నిస్తాను" అని ఆ ఉత్తరంలో వ్రాసివుంది.

నేను బసంత్‌ని కలవడానికని బయలుదేరాను. బయలుదేరేముందు నేను పాపంచేయడానికి వెళ్తున్నాననీ, ఈసారి పట్టుబడిపోతాననీ నాకెందుకో అనిపించింది. నేను బసంత్‌కోసం ఎదురుచూస్తున్నాను.

ఇంతలో నా మెడమీద చల్లగా ఏదో తగిలింది.

"ఎవరు నువ్వు?" నెమ్మదిగా అడిగాను. భయంతో కళ్ళు మూసుకున్నాను.

"కళ్ళు తెరు, ఎదురుగుండా ఎవరున్నారో చూడు"

ఆ కంఠం తీయగా అనిపించింది. నా ఎదురుగుండా మోహన్ నిల్చుని ఉన్నాడు. నేను అతడిని కౌగలించుకుని అతని భుజాల మీద తలపెట్టి ఏడవడం మొదలుపెట్టాను. "ఇక్కడ ఎందుకు నిల్చున్నావు?" అడిగాడు మోహన్. అబద్ధం చెప్పేటప్పుడు గుండె దడదడలాడింది. మోసపుచ్చుతూనే నిజంచెప్పాను, అబద్ధమూ చెప్పాను. "ఇన్‌స్పెక్టర్ పిలిచాడు" అంటూ మోహన్ వెళ్ళినప్పటినుండి జరిగిన సంఘటనల గురించి చెప్పాను. ఇంతలో మెహన్ చిన్నగా ఈల వేశాడు. "అన్వర్ ఆ ఇన్‌స్పెక్టర్ వస్తున్నాడేమో చూడు" అన్నాడు.

"వాడిని ఏం చేయమంటావ్?" అని అడిగాడు అన్వర్.

"వాడు కారులోనైనా లేక మోటార్‌సైకిల్‌మీదనైనా రావచ్చును. టైర్లలో గాలి తీసెయ్యి. పెట్రోల్‌టాంక్‌కి చిల్లి పెట్టు. ఇన్‌స్పెక్టర్‌గాడిని తెలివి తప్పించి బట్టలూడదీయి..."

నేను, మోహన్ అక్కడ చాలాసేపు గడిపాము. నా మనస్సులో కోరికతోపాటు భయం కూడా చోటుచేసుకుంది. మేం ఇద్దరం మా బస్తీకి వస్తున్నప్పుడు నాకు చెమటలు పోశాయి.

"నిర్గుణ్ నువ్వెందుకంతగా భయపడుతున్నావు? నాకు పోలీసుల భయం లేదు. స్టేషన్‌లో నాకు చాలామంది పోలీసులు తెలుసు. బసంత్‌కి ఎంతోమంది శత్రువులు ఉన్నారు. వాళ్ళు నాకు అన్ని విషయాలూ చేరేస్తూ ఉంటారు. నిన్ను రక్షించడానికేగా నేను వచ్చింది" అని అతడు ప్రేమగా అన్నాడు. ఇంటికి వచ్చాము. తలుపు తట్టాడు మోహన్. తలుపు తీసిన మసీతా సంతోషంతో పిల్లవాడిలాగా ఓ గెంతు గెంతాడు.

"నువ్వా మోహన్! నూరేళ్ళు చల్లగా ఉండు. గుల్లన్, చూడు ఎవరు వచ్చారో" అన్నాడు. నేను లోపల అడుగుపెట్టగానే గుల్లన్ పిన్ని కాళ్ళకి దండం పెట్టాను. తనవాళ్ళల్లో నేను పూర్తిగా కలిసిపోయానన్న విషయం నా భర్తకు చూపెట్టాలని నేననుకున్నాను. ఆమె ఆశీర్వదించింది.

ఇంతవరకూ రాసి ఆపేసింది నిర్గుణియా. ఆ తర్వాతిభాగం నేను పూరించసాగాను. నిర్గుణియా, మోహన్‌లు పక్కగదిలోకి వచ్చారు. అంతకుముందే అక్కడ దీపం వెలిగించడంవలన ఆ గదిలో కొద్దిగా వెలుతురు ఉంది. మోహన్ తన సంచీలోనుండి నాలుగు కొవ్వొత్తులు తీసి వెలిగించాడు. నిర్గుణ్ అతడి సంచిలో చెయ్యిపెట్టింది. అందులో కత్తి, తాడు ఉన్నాయి. వాటిని ముట్టుకోగానే ఆమెకు భయం కలిగింది. అయినా కత్తిని బయటకి తీసింది. "ఇది ఎన్ని గొంతులను కోసింది?" అని ప్రశ్నించింది. మోహన్ నవ్వుతూ తన పాంట్ జేబులోనుండి పిస్తోలు తీశాడు. "నిర్గుణ్! నీ వదునైన చూపుల పాట్‌కి, నా పిస్తోల్ పాట్‌కి మధ్య ఏమాత్రం బేధంలేదు. నీ పాట్ నరాసరి ప్రేమికుల గుండెలకి తగిలితే... ఈ పిస్తోలు పాట్ శత్రువుల గుండెలకి తగుల్తుంది" అంటూ అతడు ఆమెకి దగ్గరగా వచ్చాడు.

నిర్గుణ్ శరీరం పులకించింది. ప్ర

పంచంలోని సుఖాలన్నీ ఒకటై తనలో ఇమిడి పోతున్నట్లుగా ఆమెకు అనిపించసాగింది.

"నీవు ఇంత పేరున్న బందిపోటుగా ఎలా మారావు? ఆ దొంగల నాయకుడు ఏమయ్యాడు?"

"నిర్గుణ్! అదృష్టం తన ఆట మొదలుపెడితే, అన్నీ వాటంతట అవే జరుగుతాయి. నీవు నా జీవితంలో ప్రవేశించటంమాత్రం ఆశ్చర్యకరమైన విషయం కాదా! నేను కోపంలో వాడి పీక నొక్కడం ఆశ్చర్యంకాదా? నేను ఈ విషయం గురించి ఆలోచించి ఆలోచించి ఎంత బాధపడతానో నీకేం తెలుసు? నేను హంతకుడనా? ఈ చేతుల్తో హత్య చేశానా? నిర్గుణ్ నీకేమని చెప్పను? రాత్రింబవళ్ళు ఇదే ఆలోచన... ఆ భయానికేగా నేను బందిపోటు వహీదాతో పారిపోయాను" అంటూ అతడు జరిగిన సంఘటనలన్నింటినీ చెప్పడం మొదలుపెట్టాడు. తన ముఠాతో కలిసి చేసిన దొంగతనాలు, దోపిడీలు, మానభంగాలు గురించి చెప్పాడు. నిర్గుణియాని మసీతా ఇంట్లోనే ఉండమని ఆజ్ఞ జారీచేశాడు. నిర్గుణియా మనస్సుకి కొంతవరకు శాంతి కలిగింది. అత్తమామల నరకం తనకు తప్పింది. కాని వేద మందిరంలో తనకు కలిగే మానసిక సంతోషం మసీతా ఇంట్లో కలగదు. ఆమెకు బాధగా కూడా అనిపించింది. వాళ్ళిద్దరూ అనురాగంతో ఒకరినొకరు చూసుకుంటూ గడిపారు. "వేద ప్రకాశానందగారి సహాయంతో, దళితుల కోసం స్కూల్ తెరుస్తాను" అని మోహన్ వెళ్ళేముందు తన కోరికను బయటపెట్టింది నిర్గుణియా.

"నిర్గుణ్! ఈ మాట అన్నావు బాగుంది. అస్పృశ్యులని ఉద్ధరించాల్సిన రోజులు ఇవి... వాళ్ళని పైకి తీసుకురావాలి. అందుకే స్కూల్ తెరవడం చాలా మంచిది. మన కులంవాళ్ళందరికీ చదువుకునే అవకాశం దొరుకుతుంది. చదువుకుంటే ఎక్కడోక్కడ నౌకరీ చేసుకోవచ్చు. జన్మంతా మలమూత్రాలు ఎత్తే పని తప్పుతుంది. విముక్తి కలుగుతుంది" అంటూ ఐదు వందల రూపాయలు ఇచ్చాడు. నిర్గుణియా తన బిడ్డకు తల్లి కాబోతోందని తెలియగానే మోహన్ ఆమెను ముద్దులతో నింపేశాడు. ఆ క్షణాలు నిర్గుణియా జీవితంలో ఎంతో అమూల్యమైనవి.

ఆరోజు పొద్దున్నే దిబ్బకింద ఇన్‌స్పెక్టర్ బసంత్‌లాల్ కాళ్ళు, చేతులు కట్టేసి తెలివి తప్పి పడివున్నాడనే వార్త ఊరంతటా పాకిపోయింది. అతడి ఒంటిమీద ఒక్క పీలిక లేదు. అతడి పురుషాంగాన్ని ఒక సంచీతో కట్టేశారు. ఆ సంచీకి చిన్న చిన్న రంధ్రాలు ఉన్నాయి. లోపల రెండు తేనెటీగలను వదిలేశారు. అవి కుట్టడంవలన ఆ ప్రదేశం అంతా వాచిపోయింది. అతడి నోట్లో బట్టలు కుక్కి ఉన్నాయి. అతడి మెడలో ఒక అట్టముక్క వేలాడుతోంది. 'పరాయి ఆడవాళ్ళ మానాన్ని దోచుకునే ప్రతీ వాడికీ ఇదే గతి పడుతుంది. మానవత్వం ఇప్పుడు నిద్రలేచింది. మహాత్మాగాంధీకి జై...' అని రాసివుందా అట్టమీద.

ఈ వార్త వినంగానే బస్తీవాళ్ళందరూ అక్కడే గుమిగూడారు. పోలీస్‌స్టేషన్‌కి వార్త పంపించారు. ఇంగ్లీషువాడైన కెప్టెన్, సబ్‌ఇన్‌స్పెక్టర్, స్టేషన్‌లో పనిచేసే సిబ్బంది వెంటనే వచ్చేశారు. కెప్టెన్ కోపంగా చిందులు తొక్కాడు. అట్టముక్కమీద ఉన్న మాటలని ఇంగ్లీషులో చదివించాడు. బసంత్ కట్లు విప్పించి పోలీస్‌స్టేషన్‌కి పంపించేసి విచారణ జరిపించాడు.

విచారణ జరిపాక, విప్లవకారులైన యువకులు ఎవరో ఈ పని చేశారు అన్న నిర్ణయానికి వచ్చారు. అక్కడికి వచ్చిన స్త్రీ ఎవరై ఉంటుందన్న విషయం తెలియలేదు. బసంత్‌లాల్ మోహన్‌మీద తనకు అనుమానం ఉందని చెప్పాడు. అతడి భార్య వేదమందిరంలో ఉంటోందన్న విషయం కూడా చెప్పాడు. పోలీసులు విచారణ జరిపించారు. మొత్తానికి మోహన్, నిర్గుణ్ ఇద్దరికీ ఈ సంఘటనతో సంబంధం లేదు అన్న నిర్ణయానికి పై అధికారులు వచ్చారు. మోహన్ అంటే అమితమైన ప్రేమ కలగసాగింది నిర్గుణియాకు. మోహన్ తనని ఉంపుడుకత్తెగా కాదు భార్యగానే చూస్తున్నాడనే భావం ఆమె మనోబలాన్ని పెంచింది. జీవితంలో కొత్తశక్తి ప్రవేశించింది. తను స్వామీజీకి మోహన్ ఇచ్చిన ఐదువందల రూపాయలు

ఇస్తే అతను గుల్లన్‌బాబీలాగా తనకు ఎంతో గౌరవం ఇస్తారు. నిర్గుణ్‌కి ఇంకోవిధంగా కూడా సంతోషం కలిగింది. మోహన్ తనను పాకీ బస్తీలోనే ఉండమన్నాడుగానీ ఆ పని చేస్తూ బతకమని బలవంతం చేయలేదు. తను స్కూల్ నడుపుతుంది. వేదమందిరంలోని వాతావరణమే ఇక్కడ ఉండేటట్లుగా ప్రయత్నం చేస్తుంది. ఈ వాతావరణంలో తను పవిత్ర జీవితం గడుపుతుంది.

మరునాడు పొద్దున్న స్వామీజీ మసీతారామ్ ఇంటికి వచ్చాడు. నిర్గుణ్ అతడి కాళ్ళకు దండం పెట్టింది. ఆమె మోహన్ ఇచ్చిన ఐదువందల రూపాయలు కట్ట అతడికిస్తూ - "మీరు పాకీబస్తీలో ఓ పాఠశాల తెరవాలి. ఇదే మోహన్ కోరిక" అన్నది.

ఆయన నోట్లను లెక్కపెట్టడం మొదలుపెట్టాడు. ఆయన ముఖంలో లక్ష్మీ స్పర్శవలన కలిగిన సంతోషం స్పష్టంగా వెల్లడవుతోంది. రూపాయలు లెక్కపెట్టాక వేదప్రకాశానంద ఆనందంతో, ఆశీర్వాదాలు ఇచ్చేందుకు నిర్గుణియా తలమీద చేతులు పెట్టాడు. నోట్లోంచి మాట వచ్చేలోపల అతని చేతులు ఆమె చెంపలని నిమరసాగాయి. "తప్పకుండా స్కూల్ తెరుద్దాం ఓ సుమంగళీ! ధర్మకార్యంకోసం అధర్మంగా సంపాదించిన ధనం అయినా పవిత్రమయినదే. ఆహా... నీ పతి ధన్యుడు. నీచ కులంలో పుట్టినా గొప్ప కార్యాలని చేయడమే తన ఉద్దేశంగా పెట్టుకున్నాడు. నిర్గుణ్‌దేవీ! నీవు కూడా ధన్యురాలివి. నీ ప్రేరణవలనే కదా ఈ ధర్మకార్యం" అంటూ ఆమెవంక చూశాడు. ఆ తరువాత ఇద్దరూ కాస్సేపు మాట్లాడుతూ కూర్చున్నారు.

★ ★ ★

ఒకరోజు మధ్యాహ్నం దాదాపు రెండున్నర మూడు గంటలకు నిర్గుణియా అకస్మాత్‌గా మా ఇంటికి వచ్చింది. ఆరోజు నా భార్య ఇంట్లో లేదు. అందుకే కేవలం టీ ఇచ్చి స్వాగత సత్కారాలు జరిపాను. ఆ తరువాత నేను వ్రాసినదంతా ఆమెకు చదివి వినిపించాను.

"ఇవన్నీ మీరు చదువుతూ, నేను వింటూ ఉంటే అసలు ఈ కథ నాది కాదు మరెవరిదో అనిపిస్తోంది. కాని ఆ 'ఎవరో' స్త్రీ కూడా నాకు ఎక్కడో, ఎప్పుడో బాగా తెలిసిన స్త్రీలాగా అనిపిస్తోంది."

"మనకు కలిగే అనుభవాలు నిజానికి మనవి కావు. వీటన్నింటినీ మనలో ఉండే మరొకరెవరో అనుభవిస్తూ ఉంటారు"

"మీ మాట నిజమే... నాలో ఉన్న మరొక జీవిని మీరు గుర్తుపట్టి దాన్ని గురించే వ్రాశారని అనిపిస్తోంది. ప్రతీ మనిషిలోనూ మరొక మనిషి ఉంటాడని మీరన్నారు చూశారూ... మీరు నాలో ఉన్న ఆ మరో మనిషిని బయటకు లాక్కొచ్చారు. ఆ జీవితం గురించే మీరు వ్రాశారు కదూ..."

"నేను వ్రాయడానికి ప్రయత్నించాను. పూర్తిగా సఫలీకృతుడుని కాగలిగానా లేదా అన్న విషయం మీరు చెప్పాలి నిర్గుణియాగారూ! మిమ్మల్ని మరో ప్రశ్న అడగాలి. మీరు స్కూల్ తెరిచినప్పుడు మీ బస్తీలో ఎటువంటి స్పందన కనుపించింది?"

"స్కూల్ గురించి మీకు తరువాత ఎటూ చెబుతాను కాని ఈ మధ్యలో జరిగిన మరో సంఘటన గురించి మీకు తప్పకుండా చెప్పాలి. ఆ సంఘటనవలన ఎన్నోరోజులు రాత్రింబవళ్ళు నా మనస్సులో బాధ చెలరేగుతూనే ఉండేది"

"నిర్గుణియాగారూ! ఆ సంఘటన..."

"నా ముసలి మొగుడు మసురియాదీన్ కలెక్టర్ పేరున ఒక ఉత్తరం వ్రాశాడు. 'బందిపోటు మోహన్ నా ధర్మపత్నిని లేవదీసుకుపోయాడు. ఈ సమయంలో ఆమె మీ నగరంలోనే ఉంది. ఆమెను నాకప్పగించగలరు' అని అందులో వ్రాశాడు"

వినంగానే నేను ఆశ్చర్యచకితుడనయ్యాను. "అతనికి ఎట్లా తెలిసింది?"

"ఆరోజు జరిగిన సంఘటన తరువాత ఇన్‌స్పెక్టర్ బసంత్‌ని ఉద్యోగంలోంచి తీసేశారు. ఆయనగారు నామీద కక్ష తీర్చుకోవాలనుకున్నాడు. ఈ ఆర్యపుత్రుడు వాడి సలహా తీసుకొని నన్ను పట్టుకోవాలని ప్రయత్నించాడు. ఓరోజు పోలీసుస్టేషన్‌నుండి ఇన్‌స్పెక్టర్ వచ్చాడు. కలెక్టర్‌గారు నిన్ను పిలుస్తున్నారు అని చెప్పాడు.

ఆరోజుల్లో ఇంగ్లీషువాళ్ళ దర్బార్‌కి వెళ్ళడం

ఎంత కష్టమైన పనో మీకు తెలిసిందేగా. గుర్రపు బండిమీద నన్ను కలెక్టర్ ఇంటికి తీసుకువెళ్ళారు. అప్పటికి ఆయన ఇంకా కచేరీనుండి రాలేదు. నేను వరండాలో కూర్చున్నాను. ఆయన రాగానే నన్ను లోపలికి తీసుకువెళ్ళారు. అక్కడ అతని భార్య కూర్చుని ఉంది.

'నీవు పండితుని భార్యవా?' ఆయన అధికార ధోరణిలో ప్రశ్నించారు.

ఆ మాట వినగానే నాకు శ్వాస ఆగినంతపనయింది. నా కళ్ళల్లో నీళ్ళు నిండాయి. ఆయన ప్రశ్నలమీద ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాడు. నేను అబద్ధం ఆడకుండా జరిగినవన్నీ చెప్పాను. ఆయన నన్ను నా ముసలి మొగుడిదగ్గరకు వెళ్ళి పొమ్మన్నాడు. నేను వెళ్ళనన్నాను. పాకీబస్తీలో వారికి నీవు బ్రాహ్మణురాలివని తెలుసా అని ఆయన అడిగాడు. తెలియదనీ, తెలిస్తే అక్కడ కూడా నన్ను ఉండనివ్వరనీ చెప్పాను.

అప్పుడు కలెక్టర్ భార్య "ఎటూ మోహన్ బందిపోటుగా మారాడు, నీవు మరొకరిని పెళ్ళి చేసుకుని జీవితం గడుపు" అంది.

అతడి బిడ్డ నా కడుపులో పెరుగుతోంది, ఒక తప్పు చేసి పశ్చాత్తాప పడుతున్నాను. మరొక తప్పు చేయమంటారా? అన్నాను. ఆనాటి నా స్థితి గురించి ఏం చెప్పను. వెక్కి వెక్కి ఏడ్చాను. కొంచెంసేపు వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు. ఆ తరువాత కలెక్టర్ నన్ను ఆర్యసమాజంలో ఉండమని ఆజ్ఞాపించాడు. నేను పాకీబస్తీలోనే జీవితం గడుపుతానని చెప్పాను. ఆయన ససేమిరా ఒప్పుకోలేదు. వేద మందిరంలో ఉండే అవకాశం మళ్ళీ కలిగింది. కాని వేదప్రకాశానందగారు ఇంగ్లీషువాళ్ళు తమ సంస్థ దేశభక్తి సంస్థ కనుక ఓ కన్ను వేసి ఉంచుతారనీ, లేనిపోని గొడవలు నెత్తిమీద పడతాయనీ కనుక మసీతారామ్ దగ్గర ఉండటమే అన్నివిధాలా మంచిదనీ అన్నారు.

"బాబుగారూ! ఆరోజు నా నిస్సహాయస్థితికి నేను గుండెలవిసేలా ఏడ్చాను. ఒకవైపు బసంత్ ఏం చేస్తాడోననే భయం! మరోవైపు పాకీవాళ్ళకి నా కులం తెలిస్తే నా బతుకు ఏమవుతుందోనని భయం. నేను అందరి దృష్టిలో ఒక బందిపోటు భార్యను. నా బతుకు నవ్వులపాలయింది. నేను చేసిన కొన్ని తప్పుల వలన, పరిస్థితులవలన, సమాజంవలన నేను చాలా దిగజారాను. ఆకాశంనుండి పాతాళంలోకి పడ్డాను. తాతగారు, అమ్మమ్మ, అమ్మ నా కళ్ళల్లో ఇరవై నాలుగు గంటలూ మెదిలేవాళ్ళు. నిప్పులు కూడా కడిగే ఇంట్లో పుట్టిన నిర్గుణ్ అన్నివిధాలా భ్రష్టురాలయింది బాబుగారూ! నేను మీకు ఒక సత్యం చెబుతున్నాను. ఎటువంటి పక్షపాతం లేకుండా మాట్లాడుతున్నాను. ఈ ప్రపంచంలో ఏ దేశంలోనైనాసరే ఆడది బానిసగా మాత్రమే బతుకుతోంది. ఆమెకన్నా మరెవరూ బానిసలు లేరు. ఇది సత్యం. నేను బ్రాహ్మణులని చూశాను. పాకీవాళ్లని చూశాను. అంతటా మొగవాడు ఒకేలాగా ఉన్నాడు. అన్నిదేశాలలో అన్ని కులాలలో ఆడదాని స్థితి హీనంగానే ఉంది. నేను దళితుల సమస్యను రెండురకాలుగా చూశాను. ఆ బాధను రెండు రకాలుగా అనుభవించాను" నిర్గుణియా బాధగా అన్నది.

డెబ్బై అయిదు సంవత్సరాల వయస్సుకల ఆ వృద్ధురాలి ముఖంలో ఆమె సంపూర్ణ జీవితం ప్రతిబింబిస్తోంది. కష్టాలను కాచి వడబోసిన ఆమె ఒక గొప్ప అనుభవజ్ఞురాలు. ఆమె ముఖంలో చిరునవ్వు చోటుచేసుకుంది.

"ఏమైనా అనండి బాబుగారూ! కష్టాలు కూడా ఒక్కొక్కసారి మనకు ఆనందాన్ని ఇస్తాయి. మనస్సు బాధలనే విసురురాళ్ళమధ్య తిరుగుతూ ఉంటుంది. మనస్సు తనను తను పూర్తిగా పోగొట్టుకోదు. పూర్తిగా స్థిరంగా నిలవనూ నిలవదు"

"బాధలు ఆనందం కలిగిస్తాయా...?"

"నా మాట అంత తేలికగా తీసేయకండి బాబుగారూ! ఇరవై నాలుగు గంటలూ బాధల మధ్య నలిగి పిండి పిండి అయ్యాక ఏ బాధ మనస్సులో రేగుతుందో ఆ బాధ మనిషిని కృంగతీయదు సరికదా మనిషికి శక్తినిస్తుంది. ఒక స్థితిలో బాధలు అమృతంగా మారిపోతాయి బాబుగారూ..."

ఆరోజు నిర్గుణియా చాలాసేపు కూర్చుంది. "తాగాలన్న కోరిక కలగకుండా ఉండటం ఇది మొదటిసారి. ఎన్నో సంవత్సరాల తరువాత ఇటువంటి రోజు చూస్తున్నాను. మీరు నా

చేతనే నా మనస్సును ఆపరేషను చేయించి అందులోని ప్రతీ నరాన్ని నేను చూడగలిగేలా చేశారు. నా నాడి గురించి నేనే తెలుసుకునేలా చేశారు. జరగాల్సిందేదో జరిగిపోయింది. చేసిన తప్పును క్షమించి భగవంతుడు గౌరవప్రతిష్టలతో బతికే అవకాశం ఇచ్చాడు. ఆ అవకాశాన్ని నేను జారవిడవలేదు. ఇప్పుడు అబద్ధాలు చెప్పి నా గురించిన రహస్యాలు దాచిపెడితేమాత్రం ఏం లాభం? నా హృదయం మండి మండి శివుడి భస్మంలాగా తయారయింది బాబుగారూ!'' అంటూ ఆమె నవ్వింది.

ఆమె అన్నింటినీ పోగొట్టుకుని కూడా, వసంతకాలంలో శిశిరపు బతుకు బతికినా కూడా ఎంతో కొంత ఆనందం పొందగలిగింది అని నాకనిపించింది. పాత సంఘటనల గురించి చెప్పేటప్పుడు జీవితాన్ని ఇంకా లోతుగా పరిశీలించాలన్న తపన ఆమె కళ్ళల్లో కనిపించడం చూశాను. ఎటువంటి భావం అయినా ఆమె కళ్ళు చెప్పగలుగుతాయి. ఒక్కొక్కసారి నాకు ఆమె ఆ కళ్ళతోటే ఎక్కడో ఉన్న మరెవరితోనైనా మాట్లాడుతోందా అనిపించేది. ఈ సారి వ్రాయడానికి ఆమె నాకెంతో సామాగ్రిని ఇచ్చింది. తను వ్రాసినవాటిగురించి అప్పుడప్పుడు ఆమె స్వయంగా చెప్పడంవలన వాటిని గురించి లోతుగా నేను ఆలోచించగలిగాను. ఆమెతో సంభాషణలు జరిపి, చర్చించడంవలన ఆమె జీవితపు పుటలను విశదంగా వ్రాయడం నాకు ఎంతో సులభంగా అనిపించింది.

★ ★ ★

మసీతారామ్ ఇంట్లో పాఠశాల మొదలయింది. అన్ని అలంకరణలూ పూర్తయ్యాయి. వేదప్రకాశానంద గురువుగారయిన స్వామి శ్రద్ధానంద రెండు సంవత్సరాల క్రితం స్వర్గస్థులయినారు. అందువలన పాఠశాల పేరు 'శ్రద్ధానంద శిశుమందిర్' అని పెట్టారు.

ప్రాతఃకాల సమయంలో మసీతా ఇంట్లో యజ్ఞం జరిగింది. ఇదంతా చూస్తూ మసీతారామ్ సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. చాలామంది అక్కడ చేరారు. దాదాపు ఐదు గంటలకు కార్యక్రమం మొదలయింది. స్వామీ వేదప్రకాశానంద ప్రార్థన తరువాత తన ఉపన్యాసం ఆరంభించారు. ముసలివాళ్ళదగ్గరనుండి, పిల్లలదాకా మంత్రముగ్ధులయి వింటున్నారు. ఆయన భక్తిమాలలోని ఒక కథ వినిపించాడు. "తమ ధర్మ గ్రంథాలలో వ్రాసి వున్న ఎన్నో కథలను ఎన్నో ముఖ్య విషయాలను ఈ సనాతనులు ఎంతమాత్రం శ్రద్ధగా చదవరు. మేం ఆర్యసమాజంవాళ్ళం రాముడిని కాని, రామాయణాన్నికాని ఎంతమాత్రం స్వీకరించం అని మీ అందరికీ తెలిసిన విషయమే. కాని గోస్వామి తులసీదాస్ ఒక గొప్ప యోగి. ఒక గొప్ప కవి. అందుకనే ఆయని సనాతనుడయినా వారి ఒక దోహాను ఉదాహరణగా మీముందు ఉంచుతున్నాను.

తులసీ భగత్‌సుహచభలో భజేరైన్‌డిన్ రామ్.
ఊంచె కుల్‌కేహికామ్‌కో, జహనహరికోనామ్

"రాత్రింబవళ్ళు రాముడిని కొలిచే భక్తుడయిన శ్వపచుడు, హరినామం జపించని ఉన్నతకులాలవాళ్ళకన్నా ఎంతో నయం'' అని తులసీదాస్ చెబుతున్నాడు. అగ్రవర్ణాలవారు మోసం, కపటంతో ప్రజల కళ్ళల్లో దుమ్ము కొట్టి బతుకుతున్నారు. మీ కులంలో కూడా ఎందరో మహాత్ములు ఉన్నారు. కాని మీకావిషయం తెలియదు. అయినా ఎట్లా తెలుస్తుంది? ఈ సనాతన ధర్మాధికారులు, పండితులు భక్తిమాలలో వర్ణింపబడ్డ మహర్షి శ్వపచుడి గురించి మీకు చెబితేకదా... మన పురాణ గ్రంథాలలో శ్వపచ మహర్షి గురించి ఎంత గొప్పగా వ్రాయబడిందో చెబితే మీరు కళ్ళు తెరుస్తారని వాళ్ళకు భయం. మీరందరూ చదువుకుని పండితులయిపోతారేమోనని వాళ్ళకు భయం. వాళ్ళు చేసే నీచపు పనుల గురించి ప్రశ్నిస్తారేమోనని వాళ్ళకు భయం. మీరందరు సంస్కారవంతులయిపోతారేమోనని వాళ్ళకు భయం. ఇటువంటి విషయాలు మీరు తెలుసుకుంటే వాళ్ళకు మీరు గౌరవం ఈయరని వాళ్ళకు భయం. అందుకే... అందుకే ఈ విషయాలనుంచి మిమ్మల్ని దూరంగా ఉంచారు. మొట్టమొదట ఈ విషయాన్ని బయటపెట్టింది ఎవరో తెలుసా? పూజ్యులయిన దయానంద సరస్వతిగారు. మనిషి మనిషికి మధ్య ఎటువంటి భేదం లేదనీ, అందరూ సమానమేననే సత్యాన్ని మొట్టమొదట వారే వెల్లడిచేశారు.

నిరాకారుడు, పరమేశ్వరుడు అయిన పరబ్రహ్మ అందరిలోను ఒకేవిధంగా ఉన్నాడు. సనాతన సంప్రదాయాల గ్రంధమాలలో శ్వపచ ఋషి కథ ఒకటి ఉంది. ఒకసారి శ్రీరామ చంద్రుడి దర్బార్‌లో ఒక పెద్ద యజ్ఞం జరిగింది. ఆ యజ్ఞం చూడటానికని దేవతలయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతోపాటు ముప్పైమూడుకోట్ల దేవీదేవతలున్నారని అంటారు. వాళ్ళందరూ, మరికొందరు ధర్మపరాయణులూ, ఋషులూ, మునులూ అందరూ వచ్చారు. యజ్ఞం పూర్తికాగానే హారతి ఇచ్చారు. కాని ఆకాశంలో శంఖాలు మ్రోగలేదు. గంటల గణగణ వినిపించలేదు. దేవీదేవతలందరు ఆశ్చర్యపోయారు. వారికి సంగతేమిటో అర్థంకాలేదు. భగవంతుడిని ఇదేమిటని అడిగారు. సర్వశ్రేష్టుడ యిన శ్వపచ మహర్షి ఈ యజ్ఞానికి రానందున ఈ యజ్ఞం సంపూర్ణంకాదు. అందుకే హారతి ఇచ్చేటప్పుడు ఆకాశంలో గంటలు మ్రోగలేదు అని అతడు సమాధానం చెప్పాడు.

ఒక ఋషి రానంతమాత్రంచేత భగవంతుడి యజ్ఞం పూర్తికాదు అని ఎట్లా చెప్పగలుగుతారు? నేను భగవంతుడి దూతగా వెళ్ళి శ్వపచ ఋషిని ఆహ్వానిస్తాను అని ఒక దేవదూత అన్నాడు.

సోదరులారా! వినండి. అతడు శ్వపచ మహర్షి దగ్గరకు వెళ్ళాడు. ఆ ఋషి బ్రహ్మనామం జపిస్తున్నాడు. దేవదూత అతడికి దండం పెట్టాడు. ''ఓ ఋషివర్యా! శ్రీరామ చంద్రుడి సభలో యజ్ఞం జరుగుతోంది. దేవతలందరు వేంచేశారు. మిమ్మల్ని తీసుకు వెళ్ళడానికి నేను వచ్చాను'' అన్నాడు.

శ్వపచ ఋషి తన దూరదృష్టిద్వారా యజ్ఞాన్ని చూశాడు. అక్కడి పరిస్థితి గురించి తెలుసుకున్నాడు. 'ఓ దేవదూతా! భగవంతుడయిన శ్రీరామచంద్రుడి చరణకమలాలకు నా నమస్కారములని చెప్పగలవు. ఇక్కడ కూడా ఆయననే నేను ధ్యానిస్తూ జీవిస్తున్నానని చెప్పగలవు' అన్నాడు.

ఏ యజ్ఞానికైతే వెళ్ళాలని అందరూ ఉవ్విళ్ళూరుతూ ఉంటారో అక్కడికి వెళ్ళడానికి ఈయనకి ఆహ్వానం వచ్చినా రావడానికి ఇష్టపడడంలేదా! అని దేవదూతకు చాలా కోపం వచ్చింది. ఇక్కడే ఆయనను ధ్యానిస్తున్నానంటాడా! గర్వంతో ఇతడు ఉచితానుచితాల మాట మరచిపోయాడు అని ఆ దూత అనుకున్నాడు. ఋషిని బెదిరించాలని ఆ దేవదూత- ''ఓ ఋషీ! నువ్వు మర్యాదగా నాతో యజ్ఞమండపానికి వస్తావా లేక బలవంతంగా తీసుకు వెళ్ళనా...'' అన్నాడు.

ఈ మాటలు విన్న శ్వపచ మహర్షి నవ్వాడు. తన చేతిలో ఉన్న మాలను అక్కడే అరుగుమీద పెట్టాడు. దేవదూతగారూ! మీరు ఈ మాలను పైకెత్తి చూపెట్టండి. తరువాత నన్ను బలవంతంగా తీసుకువెళ్ళే విషయం ఆలోచిద్దాం...'' అన్నాడు.

దేవదూత మాలను పైకెత్తడానికి ఎన్నోవిధాల ప్రయత్నం చేశాడు. కాని మాల పైకి లేవలేదు. చివరికి చమటలతో తడిసిపోయి కింద పడిపోయాడు. అతనికి జ్ఞానోదయం అయింది. ఏమాలలోని ఒక్కొక్క పూసను పట్టుకుని ఋషి బ్రహ్మనామాన్ని జపించాడో, ఆ మాల బరువుగా ఉండక మరేం అవుతుంది. ఈ తపోపూతమైన మాలని నేనేమిటి స్వయంగా శేషనాగు కూడా ఎత్తడం అసంభవం అని దేవదూత అనుకున్నాడు. అతడు ఋషి చరణాలమీద పడ్డాడు. శ్వపచ ఋషి దేవదూత గర్వాన్ని అణచాలి అన్న ఉద్దేశంతో అటువంటి పరీక్ష పెట్టాడు. అంతేకాని శ్రీరాముడు చేస్తున్న యజ్ఞానికి వెళ్ళడానికి అతడికి అభ్యంతరం ఎందుకు? అందుకే యోగమార్గం ద్వారా ఎగిరి ఒక్క నిమిషంలో శ్రీరాముడి దగ్గరికి చేరాడు. అతడు అక్కడికి చేరంగానే ఆకాశంలోంచి శంఖనాదాలు వినిపించాయి. గంటలు మ్రోగాయి. పుష్పవర్షం కురిసింది. నలుదిక్కులా జయజయధ్వనులు మారుమ్రోగాయి. భగవంతుడి చరణాలమీద తన శిరస్సును ఉంచాడు ఆ ఋషి. భగవంతుడు అతనిని కౌగలించుకున్నాడు. నిమ్నజాతివాడయినా ఇతడు ఒక గొప్ప ఋషి. నా హృదయంలో ఇతనికి ఎప్పుడూ స్థానం ఉంటుంది అని భగవంతుడు అన్నాడు. ఇది వినంగానే శ్వపచ ఋషి అంటే తక్కినవారందరి హృదయాలలో ఈర్ష్య కలిగింది. అతడిని అందరూ నిందించసాగారు.

కొంచెంసేపయ్యాక విందు ప్రారంభం అయింది. సీత చేతివంట. ఏభై ఆరు రకాల ఆ వంటకాల రుచుల గురించి చెప్పేది ఏముంది? కానీ, అక్కడ ఉన్న దేవతలు, దేవుళ్ళు, ఋషులు, మునులు ఒక వింతను చూడసాగారు. శ్వపచ ఋషి పళ్ళెంలో వడ్డించిన పులుపు, ఒగరు, కారం, ఉప్పు, తీపి మొదలగు రుచులుగల అన్ని పదార్థాలను ఒక పెద్ద ముద్దగా కలిపేసి భగవంతుడికి నైవేద్యం పెట్టి ఆనందంగా తినసాగాడు. మధ్యమధ్యలో జుర్రసాగాడు. దీన్ని చూడంగానే తక్కిన ఋషులకు, మునులకు కోపం వచ్చింది. ఛీ, ఈ శ్వపచ జాతివాడు ఎంత అసహ్యంగా అన్నింటిని కలుపుకుని తింటున్నాడు. ఇది జగదాంబ అయిన సీతాదేవి పాక కళను అవమానించడం కాదా? అని వారందరూ అన్నారు.

శ్రీరాముడు మాత్రం శ్వపచ ఋషి మహావ్యక్తి ఎంతో ఆనందంగా ఆయన సీతాదేవి వంటల రుచులను ఆస్వాదిస్తున్నాడు. కావాలంటే పరీక్ష చేసుకోండి అన్నాడు.

ఋషులు పరీక్ష చేశారు. "అన్ని వంటకాలూ బాగానే ఉన్నాయి కాని నౌరతన్ చట్నీలో మాత్రం నల్ల ఉప్పు కొంచెం తక్కువ అయింది. ఇదొక్కటే ఈ విందులో లోపం" అని శ్వపచ మహర్షి అన్నాడు.

"ఎద్దులు, బర్రెలు తిన్నట్లుగా తింటున్నావు. అందులోనూ కనీసం ఎవరూ తెలుసుకోలేని లోపాన్ని ఎంచి చెబుతున్నావు. నువ్వు ఋషివి కాదు. మూర్ఖుడివి, ధూర్తుడివి, మోనగాడివి" అని మునులందరూ కోపంగా అన్నారు.

శ్వపచ ఋషి చెప్పిన విషయం సరియైనదా కాదా అన్న విషయం సీతాదేవే నిర్ణయిస్తుందని శ్రీరామచంద్రుడు అన్నాడు.

సోదర సోదరీమణులారా! సీతాదేవి స్వయంగా నౌరతన్ చట్నీని రుచి చూసి శ్వపచుడు చెప్పింది నిజమే అంది. తరువాత శ్వపచ ఋషి తక్కిన ఋషిమునులతో కలిసి బయలుదేరాడు. తక్కిన ఋషులందరూ ఏవిధంగా నయినాసరే అతడిని తక్కువగా చేసి చూపెట్టాలనుకున్నారు. ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నారు. అందుకే ఒక పన్నాగం పన్నారు. "ఓ మహర్షిగారూ! మీరు గొప్ప మహాత్ములయితే ఇక్కడ సర్వత్రా పడివున్న మలమూత్రాలని ఎత్తి చూపించండి" అని అడిగారు.

"ఒహెూ! మీరందరూ నన్ను పరీక్షించదలుచుకున్నారన్నమాట. అయితే వినండి! ఈరోజు నుండీ నేనూ, నా కులంవాళ్ళందరూ సమాజంలో ఉన్న ఈ మురికిని పూర్తిగా శుభ్రంచేస్తాం" అని అతను జవాబు చెప్పాడు.

"సోదర సోదరీమణులారా! మీరందరూ ఎవరో తెలుసా? మీరు గొప్పవాడైన ఆర్యధర్మానికి చెందిన శ్వపచ ఋషి సంతానం. ఈ విషయం మరచిపోకండి. మీరందరూ ఆర్యధర్మానికి ఆధారస్తంభాలు. మీ అసలైన ధర్మాన్ని గుర్తించండి..."

ఈ ఉపన్యాసం వినగానే పాకీబస్తీలో అలజడి మొదలయింది. ప్రతి ఇంటా దీన్ని గురించే చర్చ. తమ అసలైన ధర్మాన్ని స్వీకరించాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. ఈ విషయంమీద ఎన్నో వాగ్యుద్ధాలు జరిగాయి. ఒకరోజు అదే బస్తీలో అదేచోట మహమ్మదీయుల సభ ఒకటి జరిగింది. ముస్లింలీగ్‌కి సంబంధించిన ఒక మౌలా వచ్చాడు. వాళ్ళందరిని తిరిగి తమ మతంలో చేరిపొమ్మని ఉపన్యాసం ఇచ్చాడు. నిజంగా ఎంత బాధపడాల్సిన విషయం. ఎన్నో సంవత్సరాలనుండి మాతో ఉంటూ రోజా నమాజ్ అన్నీ నేర్చుకున్నారు. కాని పిరికివారయిన మీ పూర్వజుల కొన్ని ఆచారాలు సంప్రదాయాలను మీరు వదలలేకపోయారు. స్నేహితుల్లారా... మీరందరు లాలాహరదయాల్, డాక్టర్ ముంజే వంటి ఆర్యసమాజానికి చెందిన కొందరి చేతుల్లో చిక్కిపోయి హెూమం చేస్తున్నారంటే ఎంత దుఃఖకరమైన విషయం. రంగీలారసూలా అనే ఛండాలమైన పుస్తకం వ్రాసి వీళ్ళు మహమ్మదును అవమానించారు. దళితుల్లారా! మీరు ఈ నాస్తికుల చేతుల్లో పడ్డారంటే వీళ్ళ వలలో చిక్కుకున్నారంటే ప్రళయం వచ్చి దుర్భర పరిస్థితి ఏర్పడుతుంది. మీరందరూ మంటలలోకి తోయబడతారు"

ఈ మీటింగ్ బస్తీ మొత్తంలో ఒక కొత్త మంటను రగిల్చింది. మసీతాను ఎన్నోవిధా



లుగా బెదిరించారు. వేదప్రకాశానంద వాళ్ళను నిందిస్తూ వారికి వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. బస్తీలో వాతావరణం కొంతవరకు మారసాగింది. కొంధరు చేసిన అలజడులవలన అశాంతి కూడా వ్యాపించింది.

ఇటువంటి సమయంలో ఒకరోజు మోహన్

దగ్గరనుండి నిర్గుణీయాకి పిలుపు వచ్చింది. రాజులకాలంనాటి ఒక మహల్‌లో మోహన్ ఆరోజు తను నిర్గుణీయాతో ఉండటానికి ఏర్పాట్లు చేశాడు. ఆ మహల్‌లో పైన ఉన్న ఒక్క గది తప్పితే తక్కినభాగం అంతా శిథిలావస్థలో ఉంది. నలువైపులా భయంకరమైన నిశ్శబ్దం.

మిణుకు మిణుకుమని వెలుగుతున్న దీపపు వెలుగులో నిర్గుణీయా తన ప్రియుడి కోసం ఎదురుచూడసాగింది. రాత్రి తొమ్మిది గంటలకు మోహన్ వచ్చాడు. మోహన్ చెప్పిన విషయం విని నిర్గుణీయా చాలా బాధపడింది. ముసలి మసురియాదీన్ పాకీబస్తీలో నిర్గుణీయా గురించి చెడుగా ప్రచారం చేయడానికని ఒక వ్యక్తిని పంపించాడు. మోహన్ అతడి నాలుక, చేతి పదివేళ్ళు, కాలి బొటనవేళ్ళను నరికించాడు. ఇక ముసలి మసురియాదీన్ తమ జోలికి రాడని చెప్పాడు.



మోహన్ ఎందరికో బద్ధశత్రువు అయ్యాడు. పత్రికలలో అతని పేరు మారుమోగిపో యింది. అతడు చేస్తున్న దొంగతనాల గురించీ, దయాదాక్షిణ్యాలు లేకుండా చేస్తున్న ఘోరమైన పనుల గురించీ పత్రికల్లో వ్రాస్తూ ఉండేవాళ్ళు. పోలీసులు మాటిమాటికి వేద మందిరానికి వచ్చి నిర్గుణియాని ఏదైనా కబురు వచ్చిందా అని అడిగిపోతూ ఉండేవాళ్ళు. వేదమందిరానికి వచ్చేపోయేవారంతా ఆమెను బందిపోటు మోహన్ భార్యగా మాత్రమే చూసే వాళ్ళు. కొందరామెను అసహ్యించుకునేవాళ్ళు.

ఆరోజు మసీతా చెప్పిన విషయం వినగానే నిర్గుణియాకి కాళ్ళు, చేతులు ఆడలేదు.

"ఎట్లా చెప్పాలో తెలియడంలేదు. నబ్బూ తెలుసుగా... గుల్లన్ కొడుకు... వాడు... వాడు... నిన్న బులాకీతో కూర్చుని తాగుతున్నాడు. మన గుల్లన్ రేషన్‌కార్డు తీసుకురావడానికని వెళ్ళింది. బులాకీతో నబ్బు అన్న మాటలు గుల్లన్ చెవిలో పడ్డాయి. మోహన్ ఛావనీ బజార్లో ఇళ్ళు దోచుకోవడానికి వస్తున్నాడట. నబ్బూ ఈ సంగతి పోలీసులకి చెప్పి మోహన్‌ని పట్టించి బహుమతిని పొందాలనుకుంటున్నాడట. వీడికి ఇదేం బుద్ధి పుట్టిందో! ఎట్లాగయినా మోహన్‌ని రక్షించు" అన్నాడు మసీత.

నిర్గుణియా వేదమందిరానికి వెళ్ళి స్వామీజీకి సంగతంతా చెప్పింది. ఆయన కాళ్ళు పట్టి ఆయనకు సేవ చేసింది. ఆమె చేసిన సేవకు ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "ఒకటి రెండురోజుల్లో బందిపోటు దొంగలు వస్తున్నారని ప్రచారం చేయించండి. హిందూ ముస్లింల కలహాలప్పుడు ఏవిధంగా అయితే రక్షణ కల్పించారో ఆవిధంగానే రక్షణ ఏర్పాట్లు చేయిస్తున్నానని కూడా అందరికి చెప్పండి. గల్లీలలో ఈ వార్త వ్యాపించిందని తెలియగానే మోహన్ దొంగతనం చేయడానికి రాకుండా ఉంటాడు"

ప్రొద్దున్న హోమంకోసం వచ్చిన మహాశయులందరికీ "నబ్బూ అనే దొంగ బందిపోట్ల అడ్డా దగ్గరికి వెళ్ళివచ్చాడనీ, ఛావనీ బజారులో లూటీ చేయడానికి పన్నాగం పన్నుతున్నాడనీ, ఎవరికి వాళ్ళు రక్షణ ఏర్పాట్లు చేసుకోవాలనీ, ఈ వెధవ ఏ బందిపోటుతో కలిసి ఈ పని చేస్తున్నాడో ఎవరికి తెలియదనీ" స్వామీజీ చెప్పారు.

వేదమందిరానికి వచ్చిన వాళ్ళందరూ ఈ వార్త విన్నారు. వేదప్రకాశానంద తను వెళ్ళిన ప్రతిచోట ఈ వార్తని వ్యాపింపచేశాడు. చూస్తూ చూస్తూండగానే నబ్బూ ఒక బందిపోటు దొంగగా అందరి దృష్టిలో పడిపోయాడు.

మూడవరోజు మోహన్ దగ్గరనుండి నిర్గుణియాకి పిలుపు వచ్చింది. మోహన్‌ని కలిశాక ఆమె విషయం అంతా చెప్పింది. "నబ్బూ పరిచిన వలలో నీవు చిక్కకుండా ఉండాలనే నేను ఈ పనిచేశాను. లూటీకి దొంగలు వస్తున్నారు అన్న వార్త బస్తీలో వాళ్లకి తెలిస్తే నీకూ తెలుస్తుందనీ, ఒకవేళ నీవు ఈ కమీనా నబ్బూ మాటలకు లొంగి లూటీ చేయడానికి వద్దామని అనుకుంటూవుంటే మానేస్తావనీ అనుకున్నాను" అంది.

మోహన్ కోపం హద్దులు దాటింది. పళ్ళు పటపట కొరికాడు. ఆ సాలాగాడు నబ్బూ నాకింత ద్రోహం చేస్తాడా... వాడి సంగతి చూస్తాను" అన్నాడు

"నీకు దండం పెడతాను. కాళ్ళమీద పడతాను. నబ్బూని మాత్రం చంపకు. ఎంతయినా పొరుగున ఉండేవాడాయె. గుల్లన్ పిన్ని నామీద ఎంతో దయ చూపింది"

మోహన్ నిర్గుణియాని భావావేశంతో కౌగలించుకున్నాడు. "నీవిచ్చిన ఈ సలహా నన్ను ఎలుకలబోనులో పడకుండా రక్షించింది. కానీ నబ్బూని మాత్రం వదిలిపెట్టను. వాడు జన్మంతా గుర్తుంచుకునేటట్లు పాఠం నేర్పిస్తాను" అన్నాడు.

ఒకరోజు నడిరోడ్డుమీద నబ్బూ పడిఉన్నాడు. అతడి కాళ్ళు చేతులు కట్టేసివున్నాయి. అతడి మెళ్ళో ఒక అట్ట ఉంది. "ఇతడు ప్రకృతి విరుద్ధంగా సంభోగంలో పాల్గొంటున్నారని బెదిరిస్తూ అమాయకుల దగ్గర డబ్బు గుంజుతున్నాడు. అందుకే ఈ శిక్ష" అనీ, "ఇకముందు మరెవరయినా ఇటువంటి పనులు చేశారంటే వాళ్ల గతీ ఇంతే" అనీ వ్రాసివుంది. నబ్బూ పడివున్నస్థితి అసహ్యకరంగా

నూ, హాస్యాస్పదంగానూ ఉంది. అక్కడ ఒక పెద్ద గుంపు తయారయింది. మోహన్ ఈ పనిచేసి ఉంటాడన్న అనుమానాన్ని నబ్బూ వ్యక్తం చేశాడు. ఈ సంఘటన జరిగాక ఆ బస్తీలో నబ్బూ ఎవరికి ముఖం చూపెట్టలేకపోయాడు. తక్కినవాళ్ళలాగే నబ్బూ భార్య కూడా నబ్బూ గురించి రాసినదంతా నిజమేనని నమ్మింది. అందుకనే ఆమె అతడిని చులకనగా చూడసాగింది. నబ్బూకి ఇప్పుడు మోహన్ బద్ధశత్రువయ్యాడు. ఇంట్లో కూర్చుని రాత్రింబవళ్ళూ సారా తాగే నబ్బూకి ఒక ఆలోచన వచ్చింది. మోహన్ భార్యను అవమానపరచి ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు.

ఒకరోజు ఇంట్లో ఏదో విషయంమీద భార్యాభర్తలిద్దరికీ గొడవ వచ్చింది. సారా కోసం నబ్బూ చేతిలో పైసలు పడేస్తూ ఎంతో అవమానకరమైన ఓ మాట అంది అతడి భార్య. నబ్బూ హృదయానికి ఈమాట ఈటెలాగా తగిలింది. ప్రతీకారం తీర్చుకోవడానికి అతడికి నిర్గుణియా తప్ప మరెవరూ కనిపించలేదు.

అతడు సరాసరి వెళ్ళి క్లాసులో పాఠాలు చెబుతున్న నిర్గుణియాని పట్టుకుని ఆమె ముక్కుమీద కత్తిపెట్టాడు. ఆమె ముక్కుమీద చిన్నగాటుపడి రక్తం రాసాగింది. ఈలోగా నిర్గుణియా అతడిని ఒకతోపు తోసింది. ఋషీదేవి అతడిని కిందకు పడతోసింది. అక్కడి పిల్లలందరు అతడిమీదపడి కొట్టడం మొదలెట్టారు. చుట్టుపక్కలవాళ్ళు అక్కడ చేరి అతడి చేతిలోని కత్తి లాక్కున్నారు. గుల్లన్‌కి ఈ విషయం తెలియగానే కొడుకును తిట్టడం ప్రారంభించింది.

నిర్గుణియా ఈ సంఘటన జరిగాక భయపడిపోయింది. వీలయినంత తొందరలో ఈ ప్రాంతంనుండి దూరంగా వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంది. కాని ఆమె నిండుగర్భిణి. తన బిడ్డని చూడటానికి ఎప్పుడో ఒకసారయినా ప్రాణం పణంగా పెట్టివస్తానని మోహన్ ఆమెకి చెప్పాడు. వేదమందిరంలో ఉండటానికి ఋషీదేవి వేదవతీదేవి, అభ్యంతరం చెప్పారు.

మోహన్ అతని అనుచరులు చేసే దోపిడీలను ఎవరూ అరికట్టలేకపోతున్నారు. ఒక గ్రామంలో వీళ్లు చేసిన "భయంకరమైన దోపిడీ" గురించి పత్రికలు వివరంగా వ్రాశాయి. ప్రభుత్వం మోహన్‌ని ప్రాణాలతోకాని, నిర్జీవంగా కానీ పట్టుకువచ్చేవారికి మూడువేల రూపాయలు బహుమానంగా ఇస్తాం అని ప్రకటించింది. ప్రతీరోజూ మోహన్ అతడి అనుచరులు చేస్తున్న హత్యలు, దోపిడీలు, బలాత్కారాలు మొదలగువాటి గురించిన వార్తలు పత్రికలలో వస్తూనే ఉన్నాయి. నిర్గుణియాకి భయాందోళనలు ఎక్కువకాసాగాయి. ఆమెకి తన కడుపులో పెరుగుతున్న బిడ్డ గురించిన బాధ రోజురోజుకీ ఎక్కువ కాసాగింది. ఆ బిడ్డ తండ్రి గురించిన ఆలోచన ఆమెను తినేయడం మొదలుపెట్టింది. పోలీసులు ఆమె ఇంటిచుట్టూ కాపలా ఉన్నారు. ఈ పరిస్థితులలో ఆమెకి సుఖశాంతులు అనేవేమన్నా కలిగాయంటే అది కేవలం పాఠశాలలో పిల్లలకు చదువు చెప్పడంవల్లనే. మోహన్ ఖర్చులకని అయిదువందల రూపాయలు పంపించాడు. గుల్లన్ కుటుంబానికి, మసీతాకి కొంత డబ్బు ఇవ్వమనీ, నిర్గుణియాని ఆరోగ్యం జాగ్రత్తగా చేసుకోమనీ ఉత్తరం వ్రాసి పంపించాడు. నిర్గుణియా నబ్బూ ఇంటికి వెళ్ళి స్వయంగా నబ్బూ భార్యకి డబ్బులిచ్చింది. మూడు నాలుగురోజుల తరువాత నడిరోడ్డుమీద నబ్బూ అవమానకరమైన హాస్యాస్పదమైన స్థితిలో పడివున్నాడు. నబ్బూ ముక్కు కోసివేయబడివుంది.

నిర్గుణ్ అదేరోజు రాత్రి ఆడపిల్లను కన్నది. తన పక్కన ఉన్న పిల్లను చూసుకుని ఆమె మురిసిపోయింది. ఇంతకుముందు ఒకసారి తనకు అమ్మ అయ్యే అవకాశం వచ్చింది. కానీ ఆనాడు తను తల్లి కాలేకపోయింది. కారణం తన గర్భానికి కారకుడయిన ఆ పురుషుడి గురించి తను చెప్పలేకపోవడమే. ఆ గర్భం అనైతికమయింది. చట్టవిరుద్ధమయింది. కానీ ఈ ఆడపిల్ల తండ్రి మోహన్ అని ఊరంతా తెలుసు. పిల్లను చూస్తుంటే ఆమెకు మాటిమాటికీ మోహన్ గుర్తుకు రాసాగాడు. మోహన్ పోలికలు పిల్లలో చాలా ఉన్నాయని అనిపించిందామెకు. మోహన్ శ్రీకృష్ణుడిలా కనిపించసాగాడు. దివ్యమైన మూర్తి... మోహన్...!

ఆమె ఒక్కసారిగా ఈ లోకంలోకి వచ్చింది.

మోహన్ పాణిగ్రహణంచేసి తను చేయరాని పనిచేసిందా...? ఈ ఆలోచన రాగానే ఆనంద డోలికలలో ఊగుతున్న మనస్సు అమావాస్య చీకటిలా మారిపోయింది. ఆమె కళ్లు మూసుకుంది. గుల్లన్ పురిటిగది గోడకు ఆనుకుని కూర్చుంది. తన బొంగురు గొంతుతో సోహర్ పాడుతోంది. వరండాలో తాగుతూ కూర్చున్న మసీతారామ్ మూడు లోకాలనూ జయించిన వాడిలా ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

ముక్కు తెగినప్పటినుండి నబ్బూ కళ్ళు తెరిచాడు. నిర్గుణియాని క్షమించమని అడిగాడు. ఆమె ఋషీదేవి ద్వారా నబ్బూని స్వామీజీ దగ్గరికి పంపించింది. స్వామీజీ వాల్మీకి కథ అతడికి చెప్పాడు, ''వాల్మీకి ఒకప్పుడు బంది పోటుదొంగే అయినా తన ప్రవర్తన మార్చుకుని ఋషి అయ్యాడు'' అని స్వామీజీ చెప్పాడు. వాల్మీకి కథ ప్రభావం నబ్బూమీద బాగా పడింది. తను పూర్వజుడయిన మహర్షి వాల్మీకి పూజ చేయాలని నబ్బూ ప్రయత్నాలు మొదలుపెట్టాడు. అందరి దగ్గర చందాలు వసూలు చేశాడు. నగరంలోని మిగిలిన పాకీబస్తీలలో ఉన్న ప్రజలని పిలిచి ఎంతో ఘనంగా పూజ జరిపించాడు. భజనలూ, ఉపన్యాసాలూ జరిగాయి.గాంధేయవాదిఅయిన ఓ పండితుడు ఇచ్చిన ఉపన్యాసం అస్పృశ్యులమీద చాలా ప్రభావం చూపించింది. పురిటిగదిలో పడుకుని ఉన్న నిర్గుణియాకి ఈ రోజులు ఎంతో అమూల్యమైనవిగా అనిపించాయి. కానీ అప్పుడప్పుడు ఆమె పిల్లను చూసి మాత్రం బాధపడుతూ ఉండేది. ఈ ఆడపిల్లే తన తాతగారి ఇంట్లో పుడితే దాని అదృష్టం ఎంతో బాగుండేది. కానీ ఈ పిల్ల ఇక్కడ పుట్టింది. అభాగ్యురాలయిన దీనినొసట తట్టచీపురు పట్టుకోవాలనే వ్రాసివుందా?! ఊహు... అట్లా కాకూడదు... ఈ నిర్గుణ్ కూతురుమీద తాత, అమ్మమ్మల సంస్కారాల ప్రభావం పడాలి. నా కూతురు బాగా చదువుకోవాలి...

ఒక ఉత్తరంలో కూతురి పేరు శకుంతల అని పెట్టాలని మోహన్ వ్రాశాడు. ఆమె ఆనందంగా శకుంతల అనే పెట్టింది.

గాంధీమహాత్ముడి హరిజనోద్యమం సందర్భంగా కాంగ్రెస్‌వాళ్లు అన్ని నగరాలలోను సత్యనారాయణ వ్రతాన్ని చేయించారు. హరిజనుల చేతులతో ప్రసాదం ఇప్పించారు. నబ్బూ ఎంతో ఉత్సాహంగా ఆ సభలోని కార్యకర్తలతో పనిచేద్దామని వెళ్ళాడు. కానీ ఒక హరిజనుడి వల్లనే అవమానం పొందాడు. మీ పాకీవాళ్లు ఇక్కడికి రాకూడదు... ఛో ఛో... పోయి పెంట ఎత్తుకో, దొంగతనాలు చేసుకో- అంటూ అతడు నబ్బూని ఈసడించాడు. అస్పృశ్యులలో కూడా తమని శ్రేష్ఠంగా భావించే కొందరు నబ్బూని తన్నారు.

నబ్బూ ఇంటికి వచ్చి జరిగినదంతా నిర్గుణ్‌కి చెప్పాడు. నిర్గుణ్ తన చుట్టుపక్కలవాళ్ళను కొందరిని పోగుచేసి కాంగ్రెస్ కార్యాలయం మీద దండెత్తింది. అక్కడ కూర్చున్న నేతలను దులపడం మొదలుపెట్టింది. ''మీరందరూ అరిచే అరుపులన్నీ ఎందుకూ పనికిరానివి. నేను మహాత్మాగాంధీగారికి ఉత్తరం వ్రాస్తాను. పాకీవాళ్లు ప్రపంచంలో ఉన్న అస్పృశ్యులందరి కన్నా నికృష్టమయిన వాళ్ళా?'' అంటూ పౌరాణిక కథలలోంచి కొన్ని సంఘటనలను చెప్పింది. శబరికథ అందరికీ వినిపించింది. భగవంతుడు దీనబంధువు. అతడి సన్నిధికి రానీయకుండా ఆపేందుకు మీరెవరు? అని సూటిగా ప్రశ్నించింది.

ఒకనేత ఆమెను శాంతపరిచాడు. ''స్వయంగా గాంధీగారు ఒక పాకీ అమ్మాయిని దత్తత తీసుకున్నారుకదా! మరి మేం గాంధీగారి శిష్యులమయి ఉండి మిమ్మల్ని ఎట్లా అవమానపరుస్తాం!'' అంటూ క్షమించిమని అడిగాడు.

''మీకు ఇంతటి జ్ఞానం ఎక్కడినుంచి వచ్చింది? ఇన్ని కథలు మీకెలా తెలుసు. మీలాంటి సమాజసేవికల ఆవశ్యకత మాకెంతయినా ఉంది. మనం హరిజన కళ్యాణంకోసం ఎన్నెన్నో పనులుచేయాలి'' అన్నాడు. నిర్గుణియా ఏమని సమాధానం చెప్పగలదు? అక్కడ ఉన్న పాకీవాళ్ళు మాత్రం నిర్గుణియా యెడల మరింత గౌరవభావం పెంచుకున్నారు.

తమ నాయకులు చెప్పినట్లు హరిజనులు

దేవుడి రథాన్ని ఎంతో అందంగా అలంక రించారు. వారు దాన్ని తీసుకుని బయలుదేరి నప్పుడు నిర్గుణియా ఊరేగింపుతో వెళ్ళలేకపో యింది. నబ్బూ ఉత్సాహంగా రథాన్ని లాగేవా ళ్ళల్లో కలవాలని ప్రయత్నించాడు. కానీ వాళ్లు అతడిని దగ్గరికి రానీయలేదు. కొంచెంసేపట్లో వాళ్ళల్లో వాళ్లకు పోట్లాట మొదలయ్యేదే. కానీ ఇంతలో హరిజనభక్తుల ఊరేగింపు ఒకచోట ఆగిపోవాల్సివచ్చింది. రోడ్డుమీద అటునుంచి ఇటు అడ్డంగా ఒక పెద్ద తాడు కట్టివుంది. నడిరోడ్డులో దాదాపు ఏభై అరవైమంది సనాత నులు తమ పిలకలను ముడివేస్తూ కోపంతో అరుస్తున్నారు.

"సనాతన ధర్మానికీ జై..."

"గాంధీ నాశనం కావాలి"

"ధర్మాన్ని భ్రష్టం చేసేవాళ్లు నాశనం కా వాలి"

"హరహర మహాదేవ..."

"ఈ ధర్మభ్రష్టుల ఊరేగింపు లక్ష్మీనారా యణ గుడిముందునుండి ఎంతమాత్రం వెళ్ళ డానికి వీల్లేదు. వెళ్ళనీయం"

హరిజనులందరూ వాళ్ళ ఎదుట భయప డుతూ నిలబడిపోయారు. స్థానిక కాంగ్రెస్ నాయకుడు తన ఉపన్యాసం ద్వారా మళ్ళీ అందరిలో చలనం కలిగించాడు. ఒక ఉపాయం కూడా చెప్పాడు. "సనాతనుల కా ళ్ళు పట్టుకుని రథాన్ని ముందుకు పోనీయ మనీ, అడ్డురావద్దనీ ప్రార్థించండి"

ఈ కాళ్లు పట్టుకోవడం అన్నమాట సనాతను లమీద బాగా పనిచేసింది. హరిజనులు కాళ్లు పట్టుకుంటే తాము భ్రష్టులయిపోతామన్న భయంతో సనాతనులు పారిపోయారు. ఊరే గింపు ముందుకు బయలుదేరింది.

శ్రద్ధానంద విద్యామందిరం సామాజిక ఉద్యమానికి సంబంధించిన కేంద్రంగా మారింది. అక్కడ ఎంతోమందికి విద్యాదానం జరిగేది. పాఠాలు చెబుతూ నిర్గుణియా తను చిన్నప్పుడు అమ్మమ్మ తాతయ్యల ద్వారా విన్న ఎన్నో కథలను చెబుతూ తనను తాను మరచి పోయేది. అక్కడి వారందరిలో నిర్గుణియా మీద భక్తిశ్రద్ధలు పెరగసాగాయి. నిర్గుణియా ఈ కథలన్నింటినీ ఎక్కడ, ఎవరి దగ్గర నేర్చు కుంది? అన్న ప్రశ్న సహజంగా ప్రతీవాళ్ళలో నూ కలిగింది. ఆ ప్రశ్నకు సమాధానం అయితే చెప్పిందికాని ఆమె మనస్సు బరువెక్కింది. తన తల్లిగారి ఇంటికి కొంచెం దూరంలో ఒక శివాలయం ఉండేదనీ అక్కడ ఎక్కువగా పురాణాలూ, హరికథలూ చెబుతూ ఉండేవా రనీ ప్రసాదం కోసం తను అక్కడికి వెళ్ళి నిల్చొని కథలు వింటూ ఉండేదాన్ననీ చె ప్పింది. కానీ ఇటువంటి పచ్చి అబద్ధం చెప్పి నందుకు తన మనస్సే చెంపలను టపటపా కొట్టిందా అని ఆమెకు అనిపించసాగింది. స్వర్గస్థులయిన, పూజనీయులైన తాతగారి తేజోమయమయిన ముఖం ఆమె మనస్సులో మాటిమాటికి తొంగిచూడసాగింది. ఆమెను కదిలించసాగింది. ఒకవేళ తను ఆనాడు అలా పతనమై ఉండకపోతే ఈనాడు తల ఎత్తుకుని మహాత్మాగాంధీ నడుపుతున్న ఉద్యమంలో పాల్గొని ఉండేదికదా...

ఇటువంటి నీచాతినీచమైన పని ఎందుకు చేశానా అని ఆమె పశ్చాత్తాపడసాగింది. ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. శకుంతల... శకుంతల... పాపపు సంతానం కాదూ? ఊహు కాదు... కాదు... ఓ రామా... రామా... పాపపుణ్యా నికి ప్రతిరూపం కాకపోవచ్చు. కాని పాపం మాత్రం కాదు. అయినా ఇప్పుడు పొంగిపో యిన పాలను చూసి పశ్చాత్తాపడితే ఏంలాభం? చేతులు కాలాక ఆకులు పట్టు కుంటే ఏంలాభం? తాత అమ్మమ్మల తపోపూ తమయిన సంస్కారాల మధ్య పెరిగిన నిర్గుణ్ దేవి ఎప్పుడో చచ్చిపోయింది. పూర్తిగా తగలబ డిపోయింది. ఈనాడు తను ఒక పాకీస్త్రీగా బతికే నిర్గుణియా మాత్రమే. ఆమెలోని ఇప్పటి నిర్గుణియా చెప్పసాగింది... ఒకడి చే యిపట్టుకుని గడప దాటావు. తెలిసోతెలియకో ఒక విహంగంతో ఎగిరివచ్చావు. ఒక గూట్లో తలదూర్చావు. ఇక అదే నీ గూడు... ఆ విహంగమే.... అతడే... అతడే అతడితోటే నీవు ఉండాలి... ఉండితీరాలి... పశ్చాత్తాపం పడేసా కుతో మాటిమాటికి మనస్సును మరోవైపు మర ల్చడం మంచిదికాదు. ఇక మోహన్ నీ భర్త. నీ బిడ్డకు అతడే తండ్రి. నీవు అతడి జీవితాన్ని బాగుచెయ్యి. నీ జీవితాన్ని బాగుచేసుకో... తక్కి

నవన్నీ మరచిపో... మరచిపో... మరచిపో...

★ ★ ★

నగరంలో అల్లర్లు జరిగాయి. 'రంగీత్ రసూల్' అనే పుస్తకం వ్రాసిన వారికి వ్యతిరేకంగా మహమ్మదీయులందరూ కలిసి ఊరేగింపు జరిపారు. రక్తపుటేరులు పారాయి. హిందువుల ఇళ్ళమీద లూటీలు చేశారు. ఆడవాళ్లను బలాత్కారాలు చేశారు. బస్తీలకు బస్తీలు కాలిపోయాయి. పాకీబస్తీ అగ్నికి ఆహుతి అయింది. ప్రభుత్వం ప్రజలని కంట్రోల్‌లో పెట్టలేకపోతోంది.

ఛావనీలో మాత్రం కర్ఫ్యూలేదు. ఆ బస్తీని నగరానికి కలిపే రోడ్డు మాత్రం మూసేశారు. మసీతా ఇంటివసారాలో కల్లూ, మైకూ, బులాకీ, ఖైరతా గులబ్బోల భార్యలు పాతపేపర్లమీద జాకెట్లు, కుర్తాల కటింగ్‌లు నేర్చుకుంటున్నారు.

ఇంతలో గుల్లన్ గుండెలు బాదుకుంటూ వచ్చింది. "నగరంలో చాలా అల్లర్లు అయ్యాయి. కాండల్‌గంజ్‌లో ఉన్న ముస్లింబస్తీ అంతా కాలిపోయిందిట. నీ అత్తమామలు చచ్చిపోయేవుంటారు. ఈ హిందువులకు ఏంపోయేకాలం వచ్చింది" అని ఆమె నిర్గుణియాతో అంది.

మసీతారామ్ మహమ్మదీయులే ఈపని చేశారని చెప్పాడు. మోహన్ అత్తమామలు సుబరాతిన్ రామచందర్‌ల కర్మ ఎట్లా చేయాలా అన్న ప్రశ్న నిర్గుణ్‌లో తలెత్తింది. పాకీవాళ్ల ఆచారాలు తనకు తెలియవు. ఎవరినైనా అడగాలంటే తన గురించి ఏమనుకుంటారోనని భయం.

"మన ఆచారం ప్రకారం పాతెయ్యాలి. కానీ వాళ్ళు మంటలలో కాలిపోయేవుంటారు. పెద్దకులాలవాళ్లు తమ స్మశానాలలో మన శవాలను కాల్చనివ్వరు. పది, పదకొండు, పదమూడు దినాలకి కర్మ చేస్తారు. హిందువులు ముస్లింలు మతంపేరిట ఎంత దారుణకార్యాలు చేస్తున్నారు. అయినా కోడలు కర్మచేసినా, చేయకపోయినా మన ఆత్మలు ముక్తిచెందుతాయి" అని మసీతా చెప్పాడు.

నిర్గుణియా అల్లర్ల గురించిన పూర్తి సమాచారం తెలుసుకుందామని వేదమందిరానికి వెళ్ళింది. అక్కడ స్వామీజీ 'తక్లీనెమజహబ్' అనే పుస్తకంలో హిందువుల ధర్మాన్ని గురించి ఎంత అసహ్యంగా వ్రాశాడో చెప్పాడు. ఇవన్నీ విన్న హిందువులకు రక్తం ఉడికిందిట.

ఒక పేరున్న బారిస్టర్ నిప్పు బాణాలను కురిపించి హిందువులను సమూలంగా నాశనం చేయాలి అని చెప్పాడు. మహమ్మదీయ ఇన్‌స్పెక్టర్లు ఇతడితో చేతులు కలిపారు. హిందువులు కిరసనాయిలు నింపిన పిచ్‌కారీలను కొట్టారు. మంటలు ప్రజ్వలించాయి.' మసీదులను నాశనం చేశారు. హిందువులు వాళ్ళ ఆడవాళ్ళను బలాత్కారం చేశారు. బారిస్టర్ కూతురిని ఎత్తుకుపోయారు. ఆమె వివాహితురాలు. అందమైనది. నిన్న మహమ్మదీయులు జరిపిన అత్యాచారాలకు ప్రతీకారంగా రెండోరోజు హిందువులు చేసిన పని ఇది. బందిపోటు మోహన్ స్వయంగా మహమ్మదీయులమీద ప్రతీకారం తీర్చుకోవడానికి ఈ పని చేశాడన్న వార్త ఊరంతా పాకిపోయింది. నగరం మొత్తంలో హిందువులందరికీ బందిపోటు మోహన్ దేవుడయ్యాడు. ఈ వార్తలన్నీ విన్నాక నిర్గుణియాకి భయం కలగసాగింది. అపహరింపబడిన సుందరిని చూడకపోయినా ఆమె రూపలావణ్యం గురించిన కల్పన ఆమెను మరింత దిగజార్చింది. దాని వలలో చిక్కుకుని తనను వదిలేయడుకదా! తిండి బట్టకు కూడా డబ్బులు పంపడం మానేయడుకదా!... ఈ అనుమానం ఒకవైపు ఆమెకు బాధ కలిగిస్తున్నా మరొకవైపు ఆమెకు శాంతి కూడా కలిగించింది. ఒకవేళ తనకు స్వతంత్రంగా జీవించగల అవకాశం వస్తే తను గాంధీగారి అస్పృశ్యులను ఉద్ధరించే ఉద్యమంలో పాల్గొంటుంది. తనకు కొంతపేరు వస్తుంది. జీవితంలో చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకున్నట్లు అవుతుంది. నిజానికి తను ఏం పాపం చేసిందని? ఆడది మొగవాడిని కోరుకోవడం పాపం ఎట్లా అవుతుంది? అది ప్రకృతి సహజం. నిజానికి పాపం చేసింది ఎవరు? నాన్న ఉంచుకున్న ముండ... మనురియాదీన్... కాని తను... తను... మోహన్‌ని తన వలలో వేసుకుంది. ఆమెకు తనమీద తనకే కోపం రాసాగింది.

రాత్రి తొమ్మిది గంటలకు మోహన్ పంపించిన మనిషి నిర్గుణియా దగ్గరికి వచ్చా

డు. వెంటనే నిర్గుణియాని రమ్మనమని చెప్పాడని అతడు చెప్పాడు. ఆమె మనస్సులో అనుమానం వచ్చింది. ఆ బసంత్‌లాగా మోహన్‌కూడా తన అధికార బలాన్ని తన మీద చూపెట్టడానికి పిలవడం లేదుకదా! అతడు బలవంతంగా ఎత్తుకు వచ్చిన ఆ సుందరి అక్కడే ఉంది... తమ ఇద్దరినీ ఒకేసారి తన కోరిక తీర్చుకోవడానికి ఉపయోగించడుకదా! తమ ఇద్దరితో అశ్లీలంగా, అసహ్యకరంగా తన ఆట సాగించడుకదా... ఒకవేళ అట్లా చేస్తే తనేం చేయకలదు. ఆ రోజంటే బసంత్‌ని ఏదోవిధంగా మోసం చేసి బయటపడ్డది. కానీ ఇప్పుడు మోహన్‌ని తన భర్తని... పెళ్ళికాకపోయినా భర్తస్థానాన్ని పొందిన మోహన్‌ని అదేవిధంగా మోసం చేసి బయటపడకలదా...

మరోవైపు ఆమె శరీరంలో కోరిక రేగసాగింది. ఈ వాంఛ... ఈ కోరిక పాపం కాకపోతే మరేమిటి? ఈ ఆలోచన రాగానే మనస్సు కోపంతో నిండిపోయింది. మోహన్ అట్లా చేయడు అని ఆమె మనస్సు చెప్పింది.

ఛావనీకి కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న జఠాకుర్ హవేలీలో మోహన్ ముఠావాళ్ళు మకాం వేశారు. నిర్గుణ్‌ని, శకుంతలని చూడగానే అతడి కళ్ళు మెరిశాయి. నిద్రపోతున్న శకుంతలని తన చేతుల్లోకి తీసుకున్నాడు. ''వాహ్... నా బిడ్డ ఎంత అందంగా ఉంది. పాప అంతా నీ పోలికే నిర్గుణ్'' అని అన్నాడు, పాపను ముద్దు పెట్టుకుంటూ...

''నీ మూలంగా నేను ఒక బిడ్డకు తండ్రిన య్యాను. నాకెంతో సంతోషంగా ఉంది''

ఆ మాటలు వినంగానే నిర్గుణ్ మనస్సులో ఉన్న అన్ని పాపాలు పుణ్యాలుగా మారాయి. గత మూడు, నాలుగు గంటల నుండీ ఆమెలో జరుగుతున్న మానసిక సంఘర్షణ ఒక్కసారిగా మాయమయింది. ఆ తరువాత తను చేసిన లూటీల గురించి బారిస్టర్ కూతురును ఎట్లా ఎత్తుకు వచ్చిందీ వివరంగా చెప్పాడు మోహన్. ''అయ్యో... ఒక బ్రాహ్మణురాలు తన ఇష్టమై పాకీదానిగా మారిపోయింది. నా బిడ్డకు తల్లయింది. నా బిడ్డ తల్లిని పక్కన పెట్టుకుని ఆ బారిస్టర్‌గాడి కూతురిని... ఆ బేగంని తన్ని తన్ని పాకీదానిగా చేస్తాను... ఆ తరువాత దాన్ని సందు సందు తిరిగే కుక్కకింద చేస్తాను. ఈ అల్లర్లలో ఎంతమంది మన హిందూ ఆడవాళ్ళు మానం పోగొట్టుకున్నారో... వాళ్ళందరి కక్ష దీనిమీద తీర్చుకుంటాను''

నిర్గుణియా వణికిపోయింది. మోహన్ పాపం చేస్తున్నాడేమో అనిపించింది. ఈ పాప పుణ్యాల గురించి తర్జనభర్జన చేస్తున్న మనస్సు స్కాచ్‌విస్కీ మత్తులో మునిగిపోయింది. మోహన్ మళ్ళీ భర్త రూపంలో ఆమె దగ్గరికి చేరాడు. మోహన్ ఆమెపై చూపించిన ప్రేమ వలన ఆమెఅన్నీ మరిచిపోయింది. ఆనందనౌకలో పయనిస్తున్న ఆమె ఇప్పుడు కేవలం మోహన్ భార్య మాత్రమే. భార్య, భర్త, సంతానం... ఈ సంబంధ బాంధవ్యాలు నిజానికి ఎంత అందమైనవి. ఎంత పవిత్రమయినవి అని ఆమెకు అనిపించింది. ఇక ఇప్పుడు పాపపుణ్యాల జంజాటంలో తను పడదు. తనకు కులం లేదు గోత్రం లేదు. పెద్ద పెద్ద కులాలలో పుట్టిన వాళ్ళందరూ పవిత్రమైన రక్తసంబంధం వలనే పుట్టారని ఎట్లా చెప్పగలుగుతాం. ఇక్కడ ఎవడి చరిత్ర మాత్రం పంచామృతం అంత పవిత్రంగా ఉంది కనుక... అసలు ధర్మం లేదు. అధర్మంలేదు, పాపం లేదు పుణ్యంలేదు. ఈ మాటలన్నీ అర్థం పర్థం లేనివి. ఇవన్నీ అరిగిపోయిన శబ్దాలు. కేవలం స్త్రీ పురుషుల ప్రేమబంధం మాత్రమే సత్యం.

మరునాడు మోహన్ అనుచరులు ఇంకా అక్కడే ఉంటే ప్రమాదమనీ ఎక్కడికైనా పారిపోదాం అనీ అతడితో అన్నారు. మరో రెండు మూడు రోజులు బ్రిటిష్ సర్కార్ తమవంక చూడదనీ, ప్రస్తుతం వాళ్ళ దృష్టి అంతా ఉగ్రవాదుల మీద ఉందనీ భయపడవద్దనీ, మోహన్ అన్నాడు. బారిస్టర్ కూతురు ఏమీ తినడం లేదనీ తాగడంలేదనీ వాళ్ళు చెప్పారు, ''ఏడిసింది. దాని చేత గాడిద మూత్రం తాగిస్తాను. ఇదేమిటి దీని బాబు కూడా తాగుతాడు. ఎవడికోసం ఒకపని చెయ్యి... రెండు గంటలయ్యాక ఒక తట్ట, చీపురు, చేతిపారా తీసుకురా.. దాన్ని తన్ని తన్ని పాకీదాన్ని చేస్తానని చెప్పు. దాని చేత బస్తీలోని ప్రతీ ఇంట్లో పాకీ పని చేయించకపోతే నా పేరు

మోహనేకాదు... ఏమనుకుంటున్నదో... చూపిస్తా నా తడాకా...''

మోహన్ ఆమెను బండబూతులు తిట్టడం మొదలుపెట్టాడు. వెనకగదిలో నిర్గుణియా వీళ్ళ మాటలన్నీ వింటూ కూర్చుంది. ఆమెకు వణుకుపుట్టసాగింది. మోహన్ మేనత్త సుబరాతన్ కూడా తనను తన్నితన్ని పాకీదానిగా మార్చింది. ఆ సంఘటన గుర్తుకు రాగానే మండుతున్న ఇనుపచువ్వ గుండెల్లో గుచ్చుకుపోయినట్లుగా అనిపించ సాగింది. బారిస్టర్ కూతురిని కూడా మోహన్ ఆవిధంగానే పాకీదానిగా మార్చి ఎంతోఘోరమైన పాపం చేయబోతున్నాడు, అనిపించింది నిర్గుణియాకి.

దాదాపు ఒక గంటదాకా మోహన్ తనవాళ్ళతో దోచుకున్న డబ్బు, నగలు లెక్కలు వేస్తూ కూర్చుంటే నిర్గుణియా తన మనస్సులో తను చేసిన కర్మల లెక్కలు వేసుకుంటూ కూర్చుంది.

ఆమె పాకీస్త్రీగా మారినప్పటికీ ఆమె మనస్సులో అట్టడుగు పొరలలో ఎక్కడో బ్రాహ్మణత్వం ఇంకా ఉంది. అందుకేనేమో ఆమె మనస్సు మోహన్ ఎత్తుకొచ్చిన యువతి గురించి ఎంతో బాధపడసాగింది. ఒక గొప్పింటి జమిందారుల పిల్లని ప్రతీకారవాంఛతో బలవంతంగా పాకీదానిగా తయారు చేస్తున్నారా... ఈగలు... దోమలు...కన్నా హీనమైన జాతి... ఈ పాకీజాతి...

కాని ఈ జాతి... ఆరోజు మసీతా తనతో ఏం చెప్పాడు. 'నీతి, నిజాయితీల్తో బతికేవాడు ఈ ప్రపంచంలో ఒక్కడే ఒక్కడు... వాడే... వాడే, పాకీవాడు...'

మోహన్ తట్ట, చీపురు, చేతిపారా తెమ్మనమని ఆజ్ఞాపించాడు. ఆ ఏర్పాటు జరిగిపోయింది. మోహన్ తనవాళ్ళందరినీ వేశ్యలు, నాట్యకత్తెలతో సహా మైదానంలోకి రమ్మనమని ఆజ్ఞ జారీచేశాడు. గదిలోంచి బారిస్టర్ కూతురిని ఈడ్చుకుంటూ లాక్కువచ్చాడు. రామ్‌దులారె, గరీబాకి ముందే విషయం అంతా వివరించి చెప్పాడు. గరీబా యువతి దగ్గరిగా వచ్చాడు. కొత్త తట్ట, చీపురు, చేతి పారలను యువతి నడుంకి తగిలించాడు. ఆమె కుడిచేతిని తట్టమీద పెట్టాడు.

''నడవండి రాణిగారూ!'' అని ఒకడన్నాడు. అక్కడ ఉన్నవాళ్ళందరు పెద్దగా నవ్వారు.

''నీ అబ్బ వందలమంది హిందువుల తాళ్ళు తెంచాడు... నీ అబ్బ హిందువులందరూ కుక్కలనుకుంటున్నాడా... నాలుగైదు రోజుల కిందట హిందువులను తన్ని తన్ని పాకీవాళ్ళుగా తయారుచేశాడు. ముస్లింల మలమూత్రాలని ఎత్తించాడు. వాళ్ళ ఆడోళ్ళని ఇష్టంవచ్చినట్లు వాడుకున్నాడు. ఇప్పుడు నేను కక్ష తీర్చుకుంటాను. నిన్ను పాకీదానిగా చేస్తాను. గల్లీ గల్లీ తిరిగే కుక్కలా చేస్తాను''

ఆ యువతి నిల్చుని ఉంది. ఆమెకు తల తిరగసాగింది. కొంచెం అటు ఇటు కదిలేసరికి గరీబా ఆమె నడుంమీద ఓ తన్ను తన్నాడు. ఆమె కింద పడబోయింది. ఆమె జాకెట్టు లాగేశాడు. దాంతో అక్కడున్న వాళ్ళందరూ అట్టహాసం చేశారు. ఆమె శిలలాగా నిల్చుండిపోయింది. ''ఇదిగో... రామ్‌దులారె... ఇక్కడ కూర్చున్న ఆడ, మగ అందరినీ దీని మీద మూత్రం పోయమను. ఇది వెళ్ళి మలమూత్రాలు ఎత్తేవరకు తన్నండి. కక్ష తీర్చుకోండి''

ఇవన్నీ వింటున్న నిర్గుణ్ చాలా బాధపడింది. ఇంతలో శకుంతల ఏడ్వడం మొదలుపెట్టింది. మోహన్ కూతురిని ముద్దుపెట్టుకున్నాడు.

''నిర్గుణ్... మనకి ఇంత పెద్ద బంగళా ఉండాలి. ఎంతో అందంగా అలంకరించి ఉండాలి. మరి ఇప్పుడయితే ఒక్క శకుంతలే ఉంది. ఇక ముందు ముందు పది పదకొండు మంది పిల్లలు పుట్టరూ... అప్పుడు ఇల్లు కళకళలాడుతూ ఉంటుంది. అప్పుడు అందరూ నన్ను ఏమంటారో తెలుసా... ఈ ఠాకుర్ మోహన్‌సింహ్ ఎంత అదృష్టవంతుడు అని అంటారు''

''మీ అమ్మని ఆ ఇంట్లో ఉంచుకోవా?'' అనుకోకుండా నిర్గుణియా నోటినుండి ఈ మాటలు వెలువడ్డాయి.

మోహన్ నవ్వాడు. ''ఇక్కడ అందరికీ నేను ఠాకుర్ బిడ్డననే చెప్పాను. ఠాకుర్ మోహన్ సింహ్ అనే అందరికి తెలుసు. మా అమ్మని

## సచిత్రవిచిత్రం

# గాడిదల మిత్రుడు



పెంపుడు గాడిదకు పేపరు చదివి వినిపిస్తున్న జాన్‌విల్సన్.

గాడిదలంటే జాన్‌విల్సన్‌గారికి పంచప్రాణాలనే చెప్పాలి. అందుకే హాంకీటాంక్, జెంటిల్‌బెన్ అనే రెండు గాడిదల్ని అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాడు క్వీన్స్‌లాండ్‌కు చెందిన ఈ పెద్దమనిషి.

''తెలివంటే గాడిదలదే తెలివి... అందమంటే గాడిదలదే అందం...'' అంటూ తెగ మురిసిపోయే జాన్‌విల్సన్‌గారు 'పెంపుడు జంతువులలోకెల్లా గాడిదే ఉత్తమమైనది' అని ఘంటాపథంగా ఎప్పుడూ నొక్కి వక్కాణిస్తుంటారు. ఆయన ఇంట్లోని రెండు గాడిదలకీ సకలరాజోపచారాలూ జరిగిపోతాయట. వాటికి జరిగే మర్యాదలు కనీసం వారి సంతానానికి కూడా జరగవని గిట్టనివారు విమర్శిస్తారు.

తెస్తే... అది పాకీకులంలో పుట్టిందని అందరికీ తెలుస్తుంది. నేను ఓ ఠాకుర్ వల్లనేకదా మా అమ్మకి పుట్టాను. అమ్మ సంగతి తెలిస్తే అందరు నన్ను... నా కులాన్ని ఎత్తిచూపిస్తారు. నాకెందుకిదంతా గుర్తు చేస్తావు? ఇదిగో నిర్గుణ్... నేను ఒక బ్రాహ్మణురాలి మొగుడునని కూడా గుర్తుంచుకో...''

''నీవు వేరే అర్థాన్ని తీసుకుంటున్నావు. నా మనస్సులో మరే చెడుభావం లేదు''

''భూమి ఎక్కడిదైతేమాత్రం ఏం? ఈ భూమిలో ఎన్నెన్ని రకాల చెట్లో పుడుతున్నాయి. పూలు పూస్తున్నాయి. భూమిమీద పడిన విత్తనంవల్లనేగా ఇవన్నీ పుట్టేది. ఆ పూవులకు ఆ విత్తనం పేరే వస్తుందిగాని భూమి పేరు రాదుగా... నేను ఠాకుర్ బిడ్డని''

''మరి నా శకుంతలో...''

ఈ మాట వినంగానే మోహన్ ముఖం మరింత ఎర్రబడింది.

పది నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

''నిర్గుణ్ నీవెంత తెలివైన ప్రశ్న వేశావు. నా శకుంతల తాత ఠాకుర్ అన్నది నిజం. మరి దీని తండ్రి పాకీవాడన్నది కూడా సత్యమే''

అనవసరంగా మోహన్‌కు బాధ కలిగించానేమో అని నిర్గుణ్‌కి అనిపించింది.

''ఈ కులగోత్రాలు అంతా బూటకమని నేనంటాను. నీకు ఒక పాత కథ గురించి చెప్పనా... మహర్షి వేదవ్యాసుడి తల్లిది బెస్త కులం. నాయనమ్మ శూద్రురాలు. కానీ ఈరోజు వ్యాసుడి కులగోత్రాలు ఎవరడుగుతారు? అతడిని కులం పేరు చెప్పినా ఎవరూ వెలివేయలేదుగా... అలాగే నీ కూతురు కూడా గొప్పదవుతుంది''

''ఆరోజు చూడటానికి నేను బతికి ఉంటానా?''

నిర్గుణ్ వెంటనే అతడి నోటిని మూసేసింది. ''ఇట్లాంటి సమయంలో అశుభం ఎందుకు పలుకుతావు?''

''నిర్గుణ్... మా బందిపోటు జీవితాలు గోపురాలమీద ఉండే అద్దాలతో చేసిన బంతుల లాంటివి. ఏ గాలి తాకిడికి ఎప్పుడు కిందపడ్తాయో ఎవడికి తెలుసు. ఇవాళ నేను అందరినీ ఎంత క్రూరంగా చంపుతున్నానో రేపు అంత క్రూరంగా నేను చంపబడతాను''

''మరయితే ఈ లూటీలు చేయడం ఎందుకుమానవు? కష్టించి పని చేయి. ఎంత వస్తే అంతలోనే బతుకుదాం. దూరంగా ఎటయినా వెళ్ళిపోదాం. ఆర్యసమాజంలో చేరిపోదాం. ఈ కులాల గోల ఉండదు''

''రోట్లో తల దూర్చాక ఇక చేసేదేముంది? నేను ఎత్తుకువచ్చానే! ఆవిడే రేపు నా చావుకి కారణం కావచ్చు. కాని నేను దాన్ని పాకీదాన్నిగా చేశాను. మహమ్మద్‌గోరి హిందుస్తానం మీదికి దండెత్తినప్పుడు ఎంతోమంది క్షత్రియులను తనవెంట తీసుకుపోయాడు. వాళ్ళందరినీ బానిసలుగా చేశాడు. ఇష్టమైన ఆడవాళ్ళను ఉంచుకుని తక్కినవాళ్ళందర్నీ తన్ని తన్ని పాకీవాళ్ళుగా చేశాడు. అందుకేగా మేం తరతరాలుగా ఇలాగే బతుకుతున్నాం. ఇదంతా నామాను చెప్పాడు. నేను ఈమెకి కూడా పాకీవాడినిచ్చి పెళ్ళి చేసి పెద్ద శిక్ష వేస్తాను''

''నన్ను నా సంతానాన్ని కూడా నువ్వు...''

''నేను నిజం చెబుతున్నాను నిర్గుణ్... నాకు నీ ప్రేమను ఇచ్చి నన్ను గొప్పవాడిని చేశావు. పెద్దకులంలోకి తీసుకుపోయావు. మన సంతానం పాకీజాతివాళ్ళు ఎట్లా అవుతారు. గాంధీమహాత్ముడు హరిజనోద్ధరణ ప్రారంభించాడు. అస్పృశ్యులను ఉద్ధరిస్తున్నాడు. మనం అందరం హరిజనులని పిలవబడుతాం. కొంతకాలానికి సజ్జనులు అని కూడా పిలవబడుతాం''

''మరయితే నీవు ఈరోజు ఎవరినైతే పాకీదానిగా మార్చావో దాని సంతానం కూడా సజ్జనులే అవుతారుగా...''

''దీని సంతానం హిందువులవుతారు. వీళ్ళని హిందువులనే పిలుస్తారు. ఒక్కొక్కడి పేరు చెప్పి దీనిమీద ప్రతీకారం తీర్చుకుంటాను''

స్త్రీ హృదయంలో సహజంగా ఉండే బాధ ఆమెను చుట్టుముట్టింది. ఆడది అన్నివిధాలా మొగజాతికి దాసురాలే... మొగవాడు తన ఇష్టం వచ్చినప్పుడు ఆమెను ప్రేమిస్తాడు. ఇష్టం లేనప్పుడు ఆమె గొంతును నులిమేస్తాడు. బలవంతులు బలహీనుల యెడల ఎప్పు

డూ ఈవిధంగానే ప్రవర్తిస్తారు. తరతరాలుగా స్త్రీని పురుషుడు బానిసగానే చూస్తున్నాడు. ఇక ముందు కూడా ఇట్లాగే ప్రవర్తిస్తారు పురుషులు. సందేహం లేదు... హే రామా... ఆమె హృదయం బాధతో గిలగిలా తన్నుకుంది. హే రామా...''

బాధలో రాముడే గుర్తుకు వచ్చాడు.

★ ★ ★

సాయంత్రం అయింది. నిర్గుణ్‌కి మోహన్ నుండి వీడ్కోలు తీసుకునే సమయం వచ్చింది.

కొత్త ఇన్‌స్పెక్టర్ అల్లర్లనుండి వార్తాపత్రికల వాళ్ళ దృష్టి మరల్చడానికి ఒక ఉపాయం ఆలోచించాడు. మోహన్ చేస్తున్న లూటీల గురించి ఎక్కువగా ప్రచారం చేస్తే ప్రజల దృష్టి అటువైపు మళ్ళుతుంది. అప్పుడు హిందూ, ముస్లింలమధ్య జరుగుతున్న అల్లర్లు, కొట్లాటలు కొంతవరకు తగ్గుతాయని అతడు అనుకున్నాడు. ఈ వార్త మోహన్‌కి చేరింది. ఇన్‌స్పెక్టర్ అడవి చుట్టుపక్కల ఉన్న మూడు బస్తీలలోని ప్రతి ఇల్లూ ప్రతీ గుడిసె గాలించమనీ, అడవిలోపల కూడా పోలీసుల స్థావరాలని ఏర్పరచమనీ ఆజ్ఞ జారీచేశాడు.

ఈ వార్త వినగానే గడియారం చూసుకుని, సరిగ్గా అర్ధగంట తరువాత ఆ స్థానాన్ని వదిలి వేయడానికి సిద్ధం అయి ఉండమని మోహన్ తనవాళ్ళందరికీ ఆజ్ఞాపించాడు. ఆ తరువాత పెట్టెలోంచి కొన్ని రూపాయల కట్టలు తీసి ఒక బట్టలో కట్టేశాడు. తన చేతులతో ఆ మూటను నిర్గుణ్ నడుంకి గట్టిగా కట్టేశాడు. చిలిపిగా ఆమె శరీరాన్ని నిమిరాడు. కొంత డబ్బు ముసలివాళ్ళిద్దరికీ ఇచ్చి, తక్కిన డబ్బుని కుండలలో పెట్టి ఇంట్లో బాగా లోతుగా గొయ్యి తవ్వి వాటిని పూడ్చేయమనీ, పోలీసులకి అనుమానం రాకుండా మట్టిని సరిగ్గా కప్పిపెట్టమని చెప్పాడు.

మోహన్ మాటలు విన్నాక నిర్గుణియాకి పిచ్చెక్కినట్లుగా అనిపించింది. రాబోయే ఆపద గురించిన భయం ఆమెలో చోటుచేసుకుంది. ''పోలీసులు అడిగితే నీకు ఏమీ తెలియదనీ, ఇంటినుండి వెళ్ళిపోయినప్పటి నుండి నా ముఖం చూడలేదనీ చెప్పు. ఎన్నివిధాల అడిగినా నోరు జారక'' అంటూ ఆమెను తన ఆలింగనంలో బంధించి గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు మోహన్. ఆమెను వదిలిపోయేటప్పుడు అతడి కళ్ళలో నీళ్ళు నిండాయి. నిర్గుణియా బాధగా అతడివంక చూసింది.

''నిర్గుణ్ నీకొక సత్యం చెబుతున్నాను. నేను దోచినదంతా నేనేమీ తినను. ఆ ధనం బీదవాళ్ళకి పంచుతున్నాను. పోలీసులకు తినబెడుతున్నాను. బందిపోటు దొంగలు ఎన్ని భోగాలు అనుభవిస్తారో అంత సన్యాసులుగా కూడా జీవిస్తారు. ఒకరకంగా ఈ మాయామోహాలనుంచి విముక్తులయ్యే ఉంటారు. నీవు ఇట్లాగే ఉండడం నేర్చుకో... శాంతిసుఖాలు లభిస్తాయి''

నిర్గుణియా మనస్సు భారంగా అయింది. బందిపోటు భార్యగా జీవితంలో ఇంకా ఎన్నెన్ని కష్టాలను ఎదుర్కోవాలో ఆమె ఊహించుకుంది. ఇంటికి వచ్చాక మోహన్ చెప్పినట్లే కొంత డబ్బు ముసలివాళ్ళకి ఇచ్చి కొంత నేలలో పూడ్చిపెట్టింది. ఎవరికీ అనుమానం రాకుండా తను తన పిన్నింటికి వెళ్ళానని చెప్పింది.

కాని పొద్దున్నే పోలీసులు వచ్చి ఆమెను నలుగురిలో నిల్చోబెట్టారు. అక్కడ ఆర్యసమాజానికి చెందినవాళ్ళు ఏవో చర్చలు జరుపుకుంటున్నారు. ఈమధ్య నిర్గుణియా ఆర్యసమాజంలో ఉంటోంది అన్న విషయం తెలిసి పోలీసులు అక్కడివాళ్ళందరిని నిర్గుణియా గురించి అడిగారు. ఆమెను మసీతా ఇంటికి తీసుకువెళ్ళి ఇల్లంతా గాలించారు. మసీతా గదిలో నూట ఇరవై రూపాయల ఆరు అణాలు దొరికాయి. నిర్గుణియా గదిలో గోడలను నేలను తవ్వారు కాని వాళ్ళకి ఏమీ దొరకలేదు.

కోపంతో వాళ్ళు ఆమెను బూతులు తిట్టి చెంపదెబ్బలు కొట్టారు. అసహ్యంగా ప్రవర్తించారు. కాని నిర్గుణియా మోహన్ గురించిన ఆచూకిమాత్రం చెప్పలేదు. చివరికి పోలీసులు విసుగెత్తి వెళ్ళిపోయారు.

నిర్గుణియాకి మోహన్ అంటే ఇదివరకటికన్నా ప్రేమ ఎక్కువ కాసాగింది. నిజంగా మోహన్ ఎంత తెలివికలవాడు అని

పించింది. ఆమె మనస్సులోని అట్టడుగు పొర లలో 'అయ్యో మోహన్ పాకీవాడే' అన్న దుఃఖం ఎటూ ఉంది. కాని దానితోపాటు అతడిమీద ఆమెకు విశ్వాసం, ప్రేమ కూడా కలగసాగాయి. వేదప్రకాశానంద నిర్గుణియాని వేదమందిరంలో ఉండటానికి వీల్లేదనీ, పోలీసులు ఆమెకోసం మాటిమాటికి వస్తూ ఉంటారు కనుక ఆర్యసమాజానికి చెడ్డపేరు వస్తుందనీ, సమాజం మరో స్కూల్ తెరవబోతోంది కనుక వేదవతి ఋషీదేవీలు ఎక్కువ సమయాన్ని పాకీబస్తీలోని పాఠశాలలో వినియోగించలేరనీ, కనుక ఆ స్కూల్ నడిపే బాధ్యత నిర్గుణియాదేనని ఉత్తరం వ్రాశాడు.

నిర్గుణియాకి ప్రపంచం అంటే ఏమిటో తెలియసాగింది. నగరంలో అల్లర్లు తగ్గాయి. ఆరోజంతా కర్ఫ్యూ తీసేసారు కాని సాయంత్రం అక్కడక్కడ చిన్న చిన్న సంఘటనలు జరగడంవలన మళ్ళీ కర్ఫ్యూ పెట్టారు. నిజానికి నిర్గుణ్ మనస్సుమీద కూడా ఎన్నో కర్ఫ్యూలు పెట్టబడ్డాయి. తన మనస్సులోనే ఈ ప్రపంచం యొక్క వివిధ రంగులను ఆమె దర్శించసాగింది.

★ ★ ★

గుల్లన్ నబ్బూ భార్యతో తనకు పోట్లాట జరిగినప్పటినుండి కొడుకుతో పూర్తిగా తెగ తెంపులు చేసుకోలేదుకాని మసీతా ఇంట్లోనే తింటూ, తాగుతూ కాలం గడుపుతోంది. నిర్గుణ్ వేదమందిరం వదిలేసి ఇంటికి వచ్చాక గుల్లన్‌కు తన స్వాతంత్ర్యాన్ని ఎవరో లాక్కున్నట్లుగా అనిపించింది. మసీతా ఆమె మాటలను ఇప్పుడేమాత్రం సమర్థించడంలేదు. ఒకటి రెండుసార్లు గుల్లన్ నిర్గుణియా మీద చాడీలు చెప్పడానికి ప్రయత్నించింది గానీ మసీతాకు విపరీతమయిన కోపం వచ్చింది. "గుల్లో! ఇట్లాంటి తలా, తోకా లేని మాటలు మాట్లాడకు. కోడలు ఇక్కడ ఉంటే నీ సొమ్మేం పోయింది? నీకేం నష్టం వచ్చింది. నీ నబ్బూ పెళ్ళాంలా కోడలు గయ్యాళి కాదు. నిర్గుణ్ ఎంతో మంచిది. నిన్ను ఎంతో గౌరవంగా చూస్తుంది. నీ మాటకి ఎదురు చెప్పదు. మరి నీవు ఇట్లాంటి లేని పోని మాటలు ఆమె గురించి ఎందుకంటావో నాకు అర్థంకాదు"

ఆరోజు ఇంట్లో చిన్న కీచులాట జరిగింది. గుల్లన్ బయటవాళ్ళందరికి నిర్గుణ్‌మీద లేని పోనివి నాలుగు కల్పించి చెప్పింది. "ఇంతకు ముందయితే మోహన్ తిండికి గుడ్డకి పైసలు పంపేవాడు. ఇప్పుడు ఒక్క పైసా పంపడంలేదు. పోలీసులు వెంటబడినప్పటినుండి వాడు ఇక్కడికి రానేరాలేదు. కొత్త ఇన్‌స్పెక్టర్ వాడిని వేయి కళ్ళతో కనిపెట్టి ఉన్నాడు. ముసలివాడైన మసీతా ఈ వయస్సులో మాకు తిండి పెట్టలేక చస్తున్నాడు. మోహన్ పెళ్ళాం మసీతా ఇంటిని తన పేర రాయించుకోవాలనే ఇక్కడ ఉంటోంది. దాని ఇంటికి పోదు. సిగ్గు లేనిది... తనేదో మాస్టరుగిరీ వెలగబెడుతున్నానని తిని కూర్చుంటుంది. అసలు దానికి చదువు చెప్పడం ఏం వచ్చుని? దాని బూడిద... ఆర్యసమాజం ఆడవాళ్ళు ఇక్కడికి రావడం మానేసినప్పటినుండి దీనికి మరీ గర్వం ఎక్కింది. ఆ స్కూల్‌వలన ఒక్క పైసా వచ్చేది లేదు. చచ్చేది లేదు. పాపం ముసలివాడు మధ్యలో నలిగిపోతున్నాడు"

ఈ మాటలన్నీ నిర్గుణియాకి ఒక శిష్యుడి ద్వారా తెలిశాయి. ఆమెలో సన్నగా మంట రగలసాగింది. ఇప్పటిదాకా తనకోసంకాని, తన శకుంతలకోసంగాని మసీతా దగ్గరనుంచి తను ఒక్క పైసా తీసుకోలేదు. తను గుల్లన్‌ని ఎప్పుడు అనాదరణ చేయలేదు. మరి గుల్లన్ అందరికీ ఇట్లా చెబుతూ ఎందుకు తిరుగుతోంది? మరయితే మసీతా ఏమైనా చెప్పాడనుకుందామా అంటే, అతడు తనతో ఎంతో ప్రేమగా మాట్లాడతాడే. శకుంతలని ఎంతగానో ముద్దుచేస్తాడే!

మసీతాతో విషయం అంతా చెప్పింది నిర్గుణియా. విన్నాక మసీతా చాలా బాధపడ్డాడు. "కోడలా! నాకు రోజులు దగ్గర పడుతున్నాయి. కాటికి ఎప్పుడు వెళ్తానా అని ఎదురుచూస్తున్నాను. ఈ చివరి రోజుల్లో అబద్ధం ఆడటం ఎందుకు? గుల్లో రాంగానే ఈ విషయం నిలదీసి అడుగుతాను"

"ఒద్దు బాబాయ్... నామీద ఒట్టు. ఈ పుస్తకం మీద ఒట్టు. ఆమెతో ఏమీ చెప్పవద్దు. ఈ విషయం మన ఇద్దరిమధ్యే ఉండనీయండి"

"అయినా గుల్లోకి నాకు మధ్య సంబంధం ఏముందని? అది నాకు ఒక స్నేహితురాలు మాత్రమే. నా ఆస్తి నాకు దూరపు బంధువయిన నీకిస్తాను కాని దాని కొడుక్కి ఎందుకు ఇస్తాను. వాడు నాకు పరాయివాడేగా..."

నెమ్మది నెమ్మదిగా ఇంట్లో వాతావరణం అంతా మారిపోయింది. నిర్గుణ్, గుల్లన్ ఏదో నాలుగు మాటలు మాట్లాడుకుంటున్నారు. మనీతా, ఎక్కువగా ఎవరితోనూ మాట్లాడటంలేదు. ఒకరోజు ఋషీదేవీ వచ్చింది. "ఈరోజు స్వామీజీకి ఓ ఉత్తరం వచ్చింది" అని చెప్పింది.

"ఎవరిదగ్గరనుంచి?"

"ఎవడో బసంత్‌లాల్‌ట. ఇంతకుముందు ఇక్కడ సబ్‌ఇన్‌స్పెక్టర్‌గా పనిచేశాడుట. అతడు నీకు తెలిసే ఉంటుంది. ఇక తక్కిన విషయం నువ్వే చదివి తెలుసుకో..."

బసంత్‌లాల్ పేరు వినంగానే నిర్గుణియా మనస్సు కలతచెందింది. ఉత్తరం విప్పి చదవడం మొదలుపెట్టింది.

ఆదరణీయులయిన స్వామీ వేద ప్రకాశానందగారికి,

నమస్కారములు

మీకు నేను ఒక వార్త పంపిస్తున్నాను. ఈ యుగంలో గొప్ప పేరు తెచ్చుకున్న కులట, ఒకనాటి బ్రాహ్మణురాలు, ఇప్పుడు చెడిపోయిన పాకీది అయిన నిర్గుణియాకు ఈ ఉత్తరం చదివి వినిపించండి. సమాచారం ఏమిటంటే నిన్న రాత్రి నిర్గుణియా ప్రియుడు ఆమె పతిదేవుడిని హత్య చేశాడు. ఒక లక్ష రూపాయల విలువకల ధనం దోచుకున్నాడని కూడా తెలిసింది. నేను గవర్నమెంటు ఉద్యోగం మానేసి ప్రైవేటుగా పరిశోధన ప్రారంభించాను. ఈ డిటెక్టివ్ ఆ బందిపోటును ఒకటి రెండు రోజుల్లో పట్టుకుని జైల్లో తోస్తాడు. మీరు ఆ కులటకి, ఆ వేశ్యకి, భర్త పేరుమీద గాజులు విరగగొట్టించుకోమని, బొట్టు చెరిపించుకోమని, తల గొరిగించుకోమని చెప్పండి. బహుశ ఒకటి రెండు రోజుల్లో దాని ప్రియుడి కోసం మరొకసారి విధవ కావల్సి వస్తుంది. అప్పుడు మరోచోట కూడా జుట్టు గొరిగించుకోవడానికి సిద్ధపడమని చెప్పండి.

ఇట్లు
బసంత్‌లాల్‌గుప్తా
మాజీ పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్

చదవంగానే నిర్గుణియాకి పాత సంఘటనలన్నీ గుర్తుకు రాసాగాయి. తన తండ్రి ఉంచుకున్న ముండ ఇంట్లో ఉన్నప్పుడు బసంత్‌లాల్‌కి తనకు మధ్య జరిగిన సంఘటనలు, ముసలి మొగుడి ఇంట్లో తాను క్షణం క్షణం చస్తూ బతికిన ఆ జీవితం గుర్తుకు రాంగానే ఆమె మనస్సు వాళ్ళంటే కోపం, అసహ్యాలతో నిండిపోయింది. బసంత్‌లాల్ వ్రాసిన ఈ ఉత్తరంలో తన జీవిత నాటకంలో ఒక రంగం అయిపోయిందని ఆమెకు అనిపించింది. అయితే ఆమెలో ఉన్న సంస్కారం ఆమెను మరోలా ఆలోచించేటట్లు చేసింది. భర్త చనిపోయిన పది రోజులలోనే తనకు ఉత్తరం అందింది. శాస్త్రప్రకారం తనకు ఇంకా సూతకం ఉంది. ఋషీదేవికి తన కూతుర్ని అప్పగించి వెళ్ళి రోడ్డుమీద ప్రభుత్వంవారి కుళాయి దగ్గర నీళ్ళు తెచ్చుకుని తలనిండా స్నానం చేసింది.

"నేను ఇక వేదమందిరంలో కాలు పెట్టడానికి అర్హురాలినో కాదో, స్వామీజీని అడుగు" అని ఋషీదేవితో అంది నిర్గుణియా.

"అట్లా అనుకోకు... నీ గురించి మేము ఎన్నోసార్లు అనుకుంటూనే ఉంటాం. నీవు తప్పకుండా రా... నామీద ఒట్టు. స్వామీజీని నీ దగ్గరకి పంపే ఏర్పాటు చేస్తాను" అని చెప్పి ఋషీదేవి వెళ్ళిపోయింది. నిర్గుణ్ మనస్సు ఎంతో బాధపడ్డది. తను విధవా? ప్చ్... అర్థంపర్థం లేని మాటలు. భర్తతో ఏడు ప్రదక్షిణాలు చేసినంతమాత్రాన ఆ భర్త చనిపోంగానే స్త్రీ విధవ అవుతుందా? ఆ చచ్చినాడితో అసలు తనకు సంబంధం ఏం ఉండేదని? తన మోహన్ వాడిని చంపేసి మంచిపని చేశాడు. వీడు... ఈ బసంత్‌ని కూడా చంపేస్తే పీడ పోయేది. ఆ సమయంలో తనే కనక అక్కడ ఉంటే తన తండ్రి ఉంపుడుకత్తెనీ, దాని కొడుకులనూ కూడా చంపించి ఉండేది. వీళ్ళే తనను నాశనం చేసింది. తనమీద చెడుగా

ప్రచారం చేస్తే చేయనీ... అయినా ఇప్పుడు తను ఏ బ్రాహ్మణవాడలో ఉండబోతోందనీ? అక్కడ తనకు చుట్టాలు ఎవరున్నారు? మెళ్ళో తాళి కట్టి కూడా తనతో ఏ సంబంధం లేనివాడు నరకానికి పోయాడు. ఇప్పుడు తనవాడు మోహన్ ఒక్కడే... నిర్గుణియా ఇప్పుడు సౌభాగ్యవతి అయింది. ఏది ఏమైనాసరే మోహన్ తన భర్త. ఈ పసుపు కుంకుమలు మోహన్‌వే. తను చేసిన పాపానికి రాముడు తననే శిక్షించాలి కాని తన మోహన్‌కిమాత్రం ఎటువంటి శిక్షా వేయకూడదు. హే రామా... రామా... రామా...

ఆరోజు మసీతారామ్ జబ్బుపడ్డాడు.

★ ★ ★

మసీతారామ్ జ్వరం ఎన్నాళ్ళకీ తగ్గలేదు. గుల్లన్ అప్పుడప్పుడు అతనికి కషాయం తాగిస్తూ ఉండేది. మసీతా పనిని మజ్జూ చేయడం మొదలుపెట్టాడు.

మొదటినుండి మజ్జూ పరిస్థితి అంత బాగాలేదు. చిన్న వయస్సులోనే తల్లి, తండ్రి చనిపోయారు. మజ్జూ ఆకతాయి వెధవల చేతిలో పడ్డాడు. చెల్లెలి పెళ్ళికోసం అప్పు చేసిన నూట పదిరూపాయలు తీర్చడంకోసం పదేళ్ళుగా ప్రతి నెలా వచ్చే జీతం కోఠీ యజమాని అయిన కాలూకి ఇస్తున్నాడు. అయినా అప్పు తీరలేదు. దాదాపు ప్రతిరోజూ కాలూ చేత అతడి నౌకర్లచేత దెబ్బలు తినవలసి వస్తూనే ఉంటుంది. వెట్టిచాకిరీ చేసి, చేసి మజ్జూ విసుగు చెందాడు. రోజూ తన్నులు తినాలి, అర్థమైనవాళ్ళచేత తిట్లు తినాలి - అని బాధపడుతూ ఉండేవాడు.

అదీకాక ఆ కాలూ బావమరిది కొడుకు టిపట్‌చంద్ ఓ జంతువులాంటివాడు. పద్దెనిమిది సంవత్సరాల వయస్సుకల మజ్జూని తన కోరిక తీర్చుకోవడంకోసం చేయి పట్టుకుని లాగుతూ ఉంటాడు. తన స్వాభిమానం దెబ్బ తినడంవలన మజ్జూకి చాలా కోపం వస్తుంది. కాని ఏం చేయకలడు?

ఇటువంటి పరిస్థితులలో ఇంకేం చేయలేక ఇతను మసీతా ఇళ్ళలో పాకీపని చేయనని చెప్పడానికి వచ్చాడు. గుల్లన్ అక్కడలేదు. నిర్గుణియాకి సంగతంతా చెప్పాడు. మసీతా ఆరోగ్యం నాలుగు రోజుల్లో బాగుపడుతుందని అంతవరకు పనిచేయమని ఆమె చెప్పింది.

"ఒక ఉపాయం చెబుతాను విను. నీవు రిజిస్టర్‌లో నీ పేరు ఎక్కించుకో. గుల్లన్ అత్త నిన్ను జమాదార్ దగ్గరికి తీసుకువెళ్తుంది. ఇన్‌స్పెక్టర్ దగ్గరికితీసుకు వెళ్తుంది. నన్ను ఈ బూతుల నుండి తన్నుల నుండి రక్షించు" అని మజ్జూ అన్నాడు.

నిర్గుణ్ నిశ్చేష్టురాలయింది. ముఖం మీద నెత్తుటి చుక్కలేదు. అప్పట్లో తను మోహన్‌ని తన కోర్కెతీర్చమని అడిగి ఎంత తప్పు చేసింది.

మళ్ళీ మళ్ళీ కళ్ళు తిరగడం...

తల తిరగడం

మండిపోతున్న ఎడారినే కొద్దిక్షణాల సుఖంకోసం అదో ఆకుపచ్చ ఉద్యానవనం అనుకుంది. కానీ ఆ ఉద్యానవనం అంతంలేని మరో ఎడారిని తనతోపాటు తీసుకువచ్చింది. జీవితవనంలో నాలుగు క్షణాల వసంతం వచ్చింది.

ఆ తరువాత ఆ తరువాత...

కొమ్మకొమ్మ కాలిపోయింది. ఆకుఆకు నేలరాలింది. అంతా శిశిరమయం అయిపోయింది. తన బతుకు ఎడారి బతుకయిపోయింది. మండిపోతున్న ఇసుకదిబ్బలు తనను తాకుతూ తనను పడదోస్తూనే ఉన్నాయి. తన జీవితం నాశనం అయింది. తను చావాలేదు... బతకాలేదు...

మిషన్ అనుపత్రిలో పని చేసే ఇంగ్లీషు డాక్టర్‌ని తీసుకువచ్చి మసీతాని చూపిస్తేనో అని ఆమె మనస్సులో అనిపించింది. మసీతా ఆరోగ్యం బాగుపడుతుందన్న ఆశ ఉంటే హవల్దార్ బైండల్‌సింహ్‌ని ఏదోవిధంగా సంతోషపరిచి అతడి ఎదురుగుండానే మజ్జూ అప్పు తీర్చినట్లుగా రాయించుకుంటే ఇక మజ్జూ తను చెప్పినట్లు వింటాడు. తనకు తట్టా, చీపురు, చేతిపారా తీసుకుని ఇల్లిల్లూ తిరిగే ఖర్మ తప్పుతుంది.

ఈవిధంగా ఆలోచించుకుని నిర్గుణియా మళ్ళీ మనిషయింది. గుల్లన్ రాగానే విషయం అంతా చెప్పింది. తనతో డాక్టర్ దగ్గరికి రమ్మన

మంది. కాని గుల్లన్ రావడానికి నిరాక రించింది.

నిర్గుణ్‌కి ఆమె మీద కోపం వచ్చింది. శకుంతలను తీసుకుని ఒంటరిగా బయలుదే రింది. మధ్యలో నబ్బూ కనబడ్డాడు. అతడు నిర్గుణ్‌తో డాక్టర్ దగ్గరికి వస్తానన్నాడు.

బంగాళాగేటుకి రెవరెండ్ డా॥ఆర్.ఎండర్ సన్ అన్న బోర్డు ఉంది. అతడు ఎంత డబ్బడి గితే అంతా ఇవ్వడానికి నిర్గుణియా సిద్ధం అయింది. మసీతాని కాపాడాలి అన్న మంచి ఉద్దేశ్యం ఉన్నా, అంతకన్నా ఎక్కువగా తట్టా, చీపురు పట్టుకుని తను సందు సందూ తిరగా ల్సి వస్తుందేమో అన్న ఆమెలోని భయమే బలమైన కారణం అయింది. నబ్బూ శకుంత లను తీసుకుని వరండాలో కూర్చున్నాడు. నిర్గుణ్ లోపలికి వెళ్ళి వచ్చీరాని ఇంగ్లీషు మాట్లాడటం మొదలుపెట్టింది.

"ఐ యామ్ స్వీపర్... సర్ మై ఫాదర్‌ఇ న్‌లా... నో నో... అంకుల్‌ఇన్‌లా... వెరీ వెరీ సిక్... వెరీ జంటిల్‌మెన్ సర్..."

డాక్టర్ చిరునవ్వు నవ్వాడు. "మీ హిందూ స్తానీ మాట నాకు బాగా తెలుస్తుందిలెండి. మీ ఓల్డ్‌మాన్‌కి ఏమయింది?" అన్నాడు.

నిర్గుణ్ మనస్సు డాక్టరు మాట్లాడిన తీరు చూశాక కొంత శాంతపడ్డది. మసీతా గురించి వివరంగా చెప్పింది. "పేషెంటునితీసుకువ చ్చారా?" అని అతడు అడిగాడు.

"నో సర్... మిమ్మల్ని రిక్వెస్ట్ చేయడానికని వచ్చాను. ఐ విల్ పే ఫుల్ ఫీజ్ సర్"

డాక్టర్ నవ్వుతూ ఆమెవంక చూశాడు. అత డి కళ్ళు మెరిశాయి. "డోంట్ వర్రీ ఎబవుట్ మై ఫీ మేడమ్... నేను పేషెంట్‌ని చూడటానికి వస్తాను"

డాక్టర్ తన ఫోర్డ్ కారుని బయటకి తీశాడు. నిర్గుణియాని తన పక్కన కూర్చోపెట్టుకున్నా డు. నబ్బూ వెనక కూర్చున్నాడు. ఆమె దారి చూపడం మొదలుపెట్టింది. "దిస్‌వే సర్... లెఫ్ట్‌సర్... రైట్ సర్..."

"ఆర్ యూ క్రిస్టియన్..."

"నో సర్... హిందూ..."

"వేర్ యూ హావ్ లర్న్డ్ ఇంగ్లీష్ మేడమ్?"

నిర్గుణియా ఏమీ మాట్లాడలేదు. ఏమని చెబుతుంది?

కారు ఆగింది. అందరూ దిగారు. ఇంగ్లీషు డాక్టర్‌ని చూడగానే అక్కడి వాళ్ళందరూ నమ స్కారాలు చేయసాగారు. ఆ బస్తీలోకి తెల్లదొర రావడం ఇదే మొదటిసారి. గుల్లన్ కళ్ళు పెద్దవి చేస్తూ డాక్టర్‌ని చూడసాగింది. డాక్టర్ మసీతాని పరీక్ష చేశాడు. నిర్గుణియాని పక్కకు పిలిచి అతడు బతకడం చాలా కష్టం అని చెప్పాడు. నిర్గుణ్ మనస్సంతా అంధకార మయం అయింది. మందు తేవడానికి నబ్బూ డాక్టర్‌తో బయలుదేరాడు. "కోడలా! డాక్టర్ ఎన్ని పైసలు తీసుకున్నాడు?" అడిగింది గుల్లన్.

"ఒక్కపైసా తీసుకోలేదు... టైం దొరికితే మళ్ళీ వస్తానని చెప్పాడు. మనిషి రూపంలో మనకు దేవుడు దొరికాడు"

గుల్లన్ కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు. తరువాత మళ్ళీ అడిగింది. "డాక్టర్ ఏం చెప్పాడు మసీతా ఆరోగ్యం బాగుపడుతుందని చెప్పాడా"

"నీవు తాగించావే ఆ కషాయాలు మసీతాని చంపేవరకు తీసుకువచ్చాయి. ఇక ఈశ్వరుడి చేతిలోనే అంతా ఉంది" అంటూ ఆమె మసీ తా దగ్గరికి వెళ్ళిపోయింది. గుల్లన్‌కి కోపం వచ్చి పెద్దగా అరవడంమొదలుపెట్టింది.

"అవునే... ఇప్పుడు నా కషాయాలు ఎవడికి పనికివస్తాయి. అంతే నా కషాయాలలోనే దోషా లు కనిపిస్తాయి. పెద్ద బడాయి... తెల్లదొరను తెచ్చిందిగా అందుకే దానికంత గర్వం. నేను ఈ మసీతాకి ఇరవై ఏళ్ళనుండి చేసిందంతా మట్టిలో కలిసిపోయింది. ఈ పని అసలు ఇదే చేసింది. ఈ పని ఇది ఎందుకు చేసిందో కూడా నాకు తెలుసు. మసీతా ఇంటిని తన పేర రాయించుకోవాలని... మరి ఆ బందిపో టు ఉంపుడుకత్తె అందరి ఇళ్ళను దోచుకోక ఏం చేస్తుంది"

ఉంపుడుకత్తె అన్న శబ్దాన్ని అసహ్యంతో కూడిన కంఠంతో మరీ పెద్దగా పలికింది. "నీ కాళ్ళమీద పడతా... ఈ సమయంలో ఇంత కోపంగా ప్రవర్తించకు. బాబాయ్‌కి బాగాలేదన్న బాధతో నీవు నా మీద కోపం చూపిస్తున్నావని నాకు తెలుసు. నీకు నా మీద కోపం

ఉంటుందని నేను అనుకోను. ఫీజు, మందు పైసలు మిగిలిపోయాయి. ఇదిగో ఈ రూపాయి తీసుకో. కొంచెం తాగితే... మనస్సు బాగుంటుంది''

"ఎవడిక్కావాలి నీ పైసలు? నా దగ్గర ఉన్నాయి. తాగాలనిపిస్తే తాగే వస్తాను''

"ఇవాళ నా మనస్సులో ఉన్న మాటను చెబుతాను. నాకు ఈ ఇల్లు రాయించుకోవాలన్న ఉద్దేశ్యం ఎంతమాత్రంలేదు. నా ఇంటిక న్నా నబ్బూ అన్నయ్యా హృదయంలో, నీ హృదయంలో ఇంత చోటు ఉంటే చాలు పిన్నీ అదే నాకు ఎంతో అమూల్యమైనది. ఎప్పుడూ నేను నబ్బూ అన్నయ్యా మంచే కోరుతాను''

గుల్లన్‌కి కోపం ఇంకా తగ్గలేదు. "నా కొడుకు మంచిని కోరేది పెద్ద బయలుదేరింది. నా



కొడుకు వేలలో ఒకడు. పాపం వాడిని అందవి హీనంగా చేసింది ఇదేగా... పైగా నాటకం ఆడుతోంది"

కొంచెం సేపయ్యాక నబ్బూ మందు, పాలు తీసుకువచ్చాడు. నిర్గుణ్ మసీతాకి మందు ఇచ్చి నబ్బూని వరండాలోకి తీసుకు వెళ్ళింది. అతడికి గుల్లన్‌కి, తనకు మధ్య జరిగిన గొడవ గురించి చెప్పింది. తను నబ్బూని కొట్టించలేదని, ఇల్లు తనకి అక్కర్లేదని చెప్పింది.

నబ్బూ ఆమె కాళ్ళమీద పడ్డాడు. "నీ దయవలన నాకు తెలివితేటలు కలిగాయి. ఇంతకుముందు ఆవారాలాగా తిరిగేవాడిని. అప్పులు చేసేవాడిని. ఇప్పుడు బుద్ధి వచ్చింది. అమ్మ సంగతి నేను చూసుకుంటాలే... నీవేమీ బాధపడకు..."



రాత్రయింది. గుల్లన్ బాగా తాగి ఇంటికి వచ్చింది. మజ్జు కూడా ఆమెతో వచ్చాడు. ఇక మజ్జూ పనిచేయడనీ, వాడి డబ్బులు లెక్కకట్టి ఇవ్వమనీ గుల్లన్ నిర్గుణ్‌తో చెప్పింది.

ప్రస్తుతం తన దగ్గర డబ్బులు లేవని చెప్పింది నిర్గుణ్.

"అంతగతి లేకపోతే నౌకరీ చెయ్యి. నువ్వే మైనా దిగివచ్చావా?"

గుల్లన్ అన్న ఈ మాటలకు నిర్గున్ మనస్సు తూట్లు పడ్డ జల్లెడలా అయిపోయింది. మజ్జు రూపాయలు తీసుకుని బయటపడ్డాడు. గుల్లన్ తన చాపమీద గొణుక్కుంటూ పడుకుంది. నిర్గుణ్ మసీతా మంచానికి ఆనుకుని కిందపడుకుని తన దురదృష్టానికి కన్నీళ్లు కార్చసాగింది. ప్చ్... తనెంత దురదృష్టవంతురాలు. తన దగ్గర కొంత డబ్బు ఉంది. ఇక్కడి నుంచి వెళ్ళిపోతే... మరెక్కడికయినా వెళ్ళి ఉంటే... ఇంతకుముందులా నిర్గుణియా ప్రపంచానికి భయపడటం మానేసింది. కాని... అతను జాడకనుక్కుంటే చిక్కు... కోపంతో చిందులు తొక్కుతాడు. తన జాడ ఎటూ తెలుసుకుంటాడు. బందిపోటు దొంగ గురించి ఏం చెబుతాం... ఒక్క క్షణం నీళ్ళు, మరోక్షణం నిప్పు... ఇక్కడినుండి వెళ్ళిపోవడం మంచిదికాదు... మరి? మరి?... తట్ట, చీపురు పట్టుకుని ఇల్లిల్లూ పాకీపని చేయాలనే తన నొసట రాసిపెట్టిఉందా... వెక్కివెక్కి ఏడుద్దామన్నా ధైర్యం చాలలేదు. కన్నీళ్ళు మాత్రమే కార్చకలిగింది. చాలా సేపటివరకు కన్నీళ్లు కారుతునే ఉన్నాయి. మనస్సంతా రామమయం అయింది. రామా... రామా... రామా...

★ ★ ★

నిర్గుణియాకి రాత్రంతా నిద్రపట్టలేదు. ఎన్నోసార్లు ఉలిక్కిపడి లేచింది. ఆమెలోని భయం, లోపల ఏమూలో ఉన్న ఆకాస్త ధైర్యాన్ని కూడా అణచి వడేసింది. మనస్సులో ఆందోళన, భయం కలిగాయి. భగవంతుడిని ముక్తి ప్రసాదించమని ఎంతో ప్రార్థించింది. ఆమె మనస్సుకు కొంత శాంతి కలిగింది. సమయం గడుస్తున్న కొద్దీ భయం, బాధ రెండు తగ్గ సాగాయి. ఒక స్థితికి వచ్చేసరికి ఆ భయం పెరుగుట విరుగుట కొరకే అన్నట్లుగా ఆమె మనస్సును గట్టిపరిచింది.

రాత్రి రెండు గంటలకే పక్షుల కలకలారావం మొదలయింది. పిట్టలు రెక్కలు విదిలించాయి. నాలుగు గంటలకి కోళ్ళు కొక్కొరోకో అని కూశాయి. అదే సమయానికి కాకుల కావ్ కావ్... అనే అరుపులు చుట్టు పక్కల అంతా ప్రతిధ్వనించసాగాయి. ఎంతో సేపు కావ్... కావ్... అని అరుస్తునే ఉన్నాయి. ఆ కర్కశమైన అరుపు నిర్గుణియా శరీరంలో తెలియని ఆందోళన కలిగించింది. పెదిమలు వణికాయి. మనస్సులోనే తిట్టుకుంది. మళ్ళీ భయం... ఆందోళన మొదటిసారిగా ఆమె నోట్లోంచి ఒక బూతు మాట వెలువడింది. వెంటనే తెలివి తెచ్చుకుంది. స్త్రీ- పురుషుల అంగాలకు సంబంధించిన ఎన్నో అశ్లీలమైన మాటలు ఎన్నో బూతులు చిన్నప్పటినుండి ఆమె వింటూనే ఉండేది. కాని ఆ బూతులను ఆమె ఎప్పుడూ కనీసం మనస్సులో కూడా అనుకునేదికాదు. అదొక పాపంగా భావించేది. తన తాతయ్య ఇంటి వాతావరణమే అంత. ఆ ఇంటిలోని సంస్కారాలు నేతి దీపం లాంటివి. నాన్న ఉంపుడుకత్తె ఇంట్లోనే తను అన్నివిధాలా చెడిపోయింది. కాని బూతులు మాట్లాడే అలవాటు మాత్రం రాలేదు. తన ముసలిమొగుడు బూతులు తిడుతూ ఉండేవాడు.

అతడు తన కోరికలు తీర్చుకోవాలన్న కాంక్షతో, తీర్చుకోలేని నిస్సహాయ స్థితిలో తన శరీరాన్ని నలిపివేస్తూ ఇష్టం వచ్చినట్లుగా బూతులు మాట్లాడేవాడు. ఆ పనిలో అతడు ఆనందం పొందేవాడు. అతడు ప్రయోగించే శబ్దాలన్నీ సభ్య సమాజంలో నిషిద్ధమైనవే. ఆ శబ్దాలను ఎవరూ ఉచ్చరించరు. అప్పుడు కూడా తన మనస్సులో అటువంటి శబ్దాలకు చోటు ఉండేదికాదు. ఆ శబ్దాలు తనకి పట్టుబడనూ లేదు. మోహన్ ఇంటికి వచ్చినప్పటి నుండి ఈ బస్తీలో పురుషులేకాదు స్త్రీలు కూడా బూతులు తిట్టడం తను విన్నది. పసివాళ్ళ దగ్గరినుండి ముసలివాళ్ళదాకా ఇరవై నాలుగు గంటలూ బూతులు మాట్లాడుతూనే ఉంటారు. పరిహాసాలాడేటప్పుడూ, కోపంలో ఉన్నప్పుడూ, మామూలుగా మాట్లాడేటప్పుడూ కూడా ప్రతీ నిమిషం వాళ్ళు బూతులను ప్రయోగిస్తూనే ఉంటారు. వీటిని వినడమే పాపం అన్న

భావాన్ని మనస్సులోంచి నిర్గుణియా అతి ప్రయత్నం మీద తీసేసుకోగలిగింది. ఇవాళ ఈ కాకి అరవడం వలన తన మనస్సులో ఇటువంటి శబ్దాలు వచ్చాయి. శరీరంలో కరెంటు పాకింది. ఆశ్చర్యం కలిగింది. అప జయం పొందినదానిలా లేచికూర్చుంది. మన స్సులో తనను చూసి తనే నవ్వుకుంది. తక్కువ కులంలో కలిసిపోయావు. బూతులు మాట్లాడ కుండా పనెట్లాగడుస్తుంది. అని తనకుతనే చెప్పుకుంది. మనస్సు శరీరాన్ని నిర్జీవంగా చేయడం ప్రారంభించింది. మళ్ళీ అంతలోనే ఆమెలో కలిగిన ఒక ఆలోచన తిరిగి చురుకు దనాన్ని కలిగించింది.

నిర్గుణియా లేచి కూర్చునేసరికి నిద్రపోతు న్న శకుంతలాలేచింది. "కాసేపు అలాగే పడి ఉండు. ఇప్పుడే వస్తా" అనివినుక్కుంటూ ఏడుస్తున్న శకుంతలను వదిలేసి ఆమె వేగంగా బయటపడ్డది. మసీతా, గుల్లన్ నిద్ర పోతున్నారు. నబ్బూ ఇంటికి వచ్చి తలుపుకొ ట్టింది. నబ్బు భార్య తలుపు తెరిచింది. మజ్జూ ఇక పనికి పోనని చెప్పాడనీ, తను అతనికి డబ్బులు ఇచ్చిందనీ, బహుశా గుల్లన్ ఇదంతా చేయించి ఉంటుందనీ నిర్గుణియా నబ్బూకి చెప్పింది. తల్లిమీద నబ్బూకి, అతడి భార్యకి విపరీతమైన కోపం వచ్చింది. "నువ్వు చెప్పింది నిజమే కాని మనం పనికి ఒక్కరోజు వెళ్ళకపోయినా బస్తీవాళ్ళు చెప్పులు తీసుకుని తన్నడానికని వస్తారు. పైవాళ్ళు వెంటనే ఇంగ్లీ షులో మన మీద రాసి పంపుతారు. అయినా ఆ మజ్జూగాడు పనికి వెళ్ళేటట్లు నేను చూస్తా ను. చాలా..."

"ఊహు లాభం లేదు ఒప్పుకోడు"

నబ్బూ కొంచెంసేపు ఆలోచించి అన్నాడు "ఇక మసీతా బాబాయి ఎక్కువకాలం బతక డని డాక్టర్ చెప్పాడు. గుండెల్లో నీరు చే రిందిట. బతకడం కష్టం. అందుకే ఇక నీ పేరు రిజిష్టర్‌లో ఎక్కించుకో..."

నబ్బూ తన చెంప మీద ఛెళ్ళున కొట్టిన ట్లుగా నిర్గుణియాకి అనిపించింది. అతని వంక చూసింది. "మజ్జు కూడాఇదే మాట అన్నాడు. కాని నబ్బూ ఈ పని నేను ఎప్పుడూ చేయలేదు. నా మొదటి భర్త నౌకరీ జడ్జీ దగ్గర. ఆయన నా చేత ఈ పని చేయించలే దు. చిన్నతనం నుండి పాకీపని చేసే అలవాటే లేదు. ఇప్పుడేమో చంటిపిల్ల, ఇంట్లో రోగి ఉన్నాడు. ఏం చేయాలో ఏం చేయవద్దో నాకేమీ అర్థం కావడంలేదు" అంటూ నిర్గుణియా ఏడ్వడం మొదలుపెట్టింది.

"ఇవాళ మజ్జూని జట్టుపట్టుకుని ఈడ్చు కుంటూవచ్చి పనిచేయిస్తాను. నా పనంతా బజారులోనే ఉంది. నేను ఇరవై నాలుగిళ్ళ పాకీపని చేయాలి. రోడ్లన్నీ ఊడవాలి. నేను పొద్దున్న పోతే మూడింటికి ఇంటికి వస్తాను. లేకపోతే నీ పని కూడా నేనే చేసి పెట్టేవాడిని. అయినా రేపు బాబాయ్ ఉంటాడో చస్తాడో తెలియదు. పనిదేముంది రెండు మూడు రోజు లు కష్టం అనిపిస్తుంది. తరువాత అదే అలవా టవుతుంది. ఈ పాకీకులంలో పుట్టాక తట్ట, చీపురు పట్టనంటే ఎట్లా? ఏదో ఒక రోజు పట్టాల్సిందే తప్పదు"

నిర్గుణియా మనస్సులో అంత క్రితం నుండి వెలుగుతున్న ఆశాదీపం ఆరిపో యింది. ఇంటికి తిరిగి వచ్చింది. శకుంతల గుల్లన్ ఒడిలో ఉంది. నిర్గుణ్‌ని చూడగానే గుల్లన్ పెద్దగా అరిచింది. "ఇంత పొద్దున్నే ఎక్కడికి వెళ్ళావ్? ఈ పిల్ల ఒకటే ఏడుపు. దీన్ని తీసుకో నేను మసీతాకి మందు ఇస్తాను"

శకుంతలను ఒళ్ళోకి తీసుకుని నిర్గుణియా వసారాలో కూర్చుంది. పిల్లకు పాలు ఇవ్వడం మొదలుపెట్టింది. హే రామా... ఇహ ఇప్పుడు ఏమవుతుంది? నిజంగానే తను ఇల్లు ఇల్లు తిరిగి మలమూత్రాలను...

ఒక్కసారిగా కడుపులో తిప్పింది. వాంతి వచ్చినట్లయింది. లేవబోయేసరికి పిల్ల నలిగి పోయి ఏడవడం మొదలుపెట్టింది. దాన్ని ముద్దుచేసి మళ్ళీ పాలు తాగించసాగింది. మళ్ళీ ఆమెలో సంఘర్షణ మొదలయింది. తను ఎంత గొప్పవంశంలో పుట్టింది. పూజలు పునస్కారాలు చేసే ఇంట్లో పెరిగింది. అక్కడ... పాకీ దొడ్డి ద్వారాన్ని పొరపాటున ముట్టుకున్నా స్నానం చేయాల్సివచ్చేది. బట్టలన్నీ ఉతకాల్సి వచ్చేది. అటువంటి అస్పృశ్యమైన వస్తువును తను తన చేతులతో ఎట్లా ముట్టుకోవాలి?...

ఎంతోసేపు మౌనంగా ఉండిపోయింది. మళ్ళీ ఆలోచన మొదలయింది. అరే, శకుంతల మలాన్ని ఎత్తడంలేదూ... సుబరాతన్... మోహన్‌మేనత్త... తన అత్త... కొట్టి కొట్టి... తన మలమూత్రాలని ఎత్తించలేదూ! కాని... కాని అది అప్పటి సంగతి... మరి ఇప్పుడో ... చెవులలో ఒక్కసారిగా మోహన్ తల్లి... తను మసురియాదీన్ ఇంట్లో ఉన్నప్పుడు... ఆమె... ఆమె గొంతు ప్రతిధ్వనించసాగింది ''అమ్మగారూ! నీళ్ళు పోయండి పాకీ దొడ్డి కడుగుతాను'' ఇక ఇప్పటినుండి ఇంటింట తను ఇదేమాట అనాలి. తను ఆ పాకీ దానికి దూరం నుండి అన్నం నీళ్ళు ఇచ్చేది. మరి ఇప్పుడు తనకి ఇట్లాగే అందరూ...

మళ్ళీ వాంతి వచ్చినట్లుగా అయింది. కడుపులో తిప్పుడం మొదలుపెట్టింది. పిల్లని వెంటనే కింద పడుకోపెట్టి మోరీ దగ్గరికి పరుగెత్తింది. నిన్న రాత్రినుండి అన్నం తినలేదు. పుల్లటి నీళ్ళు పైకి వచ్చాయి. రెండుమూడుసార్లు వాంతులు చేసుకుంది. బాధకు తట్టుకోలేక హాయ్ రామా! హాయ్ రామా! అంటూ నేలమీద పడిపోయింది.

గుల్లన్ బయటకి వచ్చింది. ''అరె... ఇట్లా వాంతులు ఎందుకు అవుతున్నాయ్'' అని అడిగింది కాని ఆమె దగ్గరికి పోలేదు. ఏడుస్తున్న శకుంతలను చేతులలోకి తీసుకుంది. ''బాగాలేదు ఏం అయిందో ఏమో ఆ రాముడికే తెలును'' రామా... రామా... అంటూ గొణుగుతూ మౌనంగా ఉండిపోయింది.

''భయపడకు ఏమీ కాదు. నేను శకుంతలని తీసుకువెళ్తున్నాను... మసీతాకి విషయం చెప్పివస్తాను'' అంటూ గుల్లన్ వెళ్ళిపోయింది.

ఆరోజంతా నిర్గుణియా కళ్ళ ఎదురుకుండా తాతయ్య, అమ్మమ్మలు కనిపిస్తూనే ఉన్నారు. బ్రాహ్మణుల గొంతులు వినిపిస్తూనే ఉన్నాయి. వాళ్ళు వేదాలు చదువుతున్నారు. ఇంటి దగ్గర ఉన్న శివుడి మందిరంలో గంటలు గణగణ మోగుతున్నాయి... ఎంత తలచుకోవద్దన్నా ఆ దృశ్యాలు కనబడసాగాయి. ఆ ప్రతిధ్వనులు వినబడసాగాయి. తాత, అమ్మమ్మలు గుర్తుకు వస్తే చాలు కళ్ళు గంగా యమునలయిపోతాయి.

గుల్లన్ వచ్చి ఆమె కడుపు ఒత్తి చూసింది. గుల్లన్ ఆరోజు కాస్త దయచూపించింది. సగం రొట్టె పలచగా నీళ్ళలాగా ఉన్న పప్పు తెచ్చి తినమంది. కాని తినబుద్ధికాలేదు. బీదరికంవలన తనకు తిండికికూడా గతిలేదు. పుట్టింట్లో... నాన్న ఉంపుడుకత్తె ఇంట్లో... ముసలి మొగుడు ఇంట్లో ఎన్నో రకరకాల తినుబండారాలు తనకు లభించేవి... ఇవాళ ఖర్మ... తన నొసటన ఇదే వ్రాసిపెట్టిఉంది...ఆమెలోని మరో నిర్గుణియా ఆమె చెంపలమీద ఫెడీల్మని కొడుతోంది... పాపిష్టిదానా... ఇంకా పాపం చెయ్యి... నిన్ను ఒక్క మెతుకు కూడా పెట్టకుండా ఆకలితో చంపాలి. నీ శరీరంలో పురుగులు పడాలి... పాపిష్టిదానా ఎంత సుఖమయ జీవితాన్ని ఎంతగా నాశనం చేసుకున్నావ్...

మధ్య మధ్య ఆమె మనస్సు రామా... రామా... అని పలవరిస్తోంది. నబ్బూ ఏదైనా ఏర్పాటు చేస్తాడనే ఆశమాత్రం ఆమెలో ఇంకా మిగిలి ఉంది.

నబ్బూకి ఆరోజు వాల్మీకి రంగుల బొమ్మ దొరికింది. అతడు ఓ పెయింటర్ ఇంట్లో పాకీపని చేస్తాడు. ఆ పెయింటర్‌ని బతిమిలాడి వాల్మీకి చిత్రం గీయించాడు. ఆ చిత్రాన్ని ఫ్రేమ్ చేయించడానికి అతడికి నాలుగు అణాలు ఖర్చయింది. ఇవాళ అతడి ఆనందానికి హద్దులు లేవు.''వాల్మీకి రామాయణం నాగరి లిపిలో అచ్చువేశారని పెయింటర్ చెప్పాడు. మన పెద్దలు ఎంత గొప్పవాళ్ళు. మనమూ ఉన్నాం, ఎందుకూ పనికిరాని బతుకులు. మలమూత్రాలు ఎత్తుతూ బతుకుతున్నాం... మన నొసటన తట్ట, చీపురు పట్టమనే రాసి ఉంది'' నిర్గుణియాతో అన్నాడు నబ్బూ.

''నేను చెప్పిన విషయం గుర్తుందా నబ్బూ... ఏమైనా ఏర్పాటు చేశావా?''

''మజ్జూతో చెప్పాను, నాలుగు రోజులు పనికి పోతానని అన్నాడు. ఈ లోపల నిన్ను గుమాస్తాకి పరిచయం చేస్తాను. వాడు ఇనస్పెక్టర్‌ని, గినస్పెక్టర్ చీఫ్‌ని అందరినీ ఆడిస్తాడు. ఎక్కవ పైసలు ఖర్చు కావు... అమ్మా... ఓసారి ఇటురా''...

"ఎందుకు పిలుస్తున్నావు?" అడిగింది గుల్లన్.

"ఇది చూశావా! వాల్మీకి ఋషి ఫోటో... ఐదు రూపాయలకు చేయించాను. ఈసారి వాల్మీకి జయంతి ఎంత ధూమ్‌ధామ్‌గా చేస్తానో చూడు. అందరూ... ఆ... అని ఆశ్చర్యపోవాల్సిందే"

గుల్లన్ ఫోటోకి దండం పెట్టింది. "నబ్బా ఈ ఫోటోను ఇక్కడ వేలాడేయి. ఇక్కడ రోజూ స్కూల్ నడుస్తుంది"

"స్కూలా... ఇక స్కూల్ ఎట్లానడుస్తుంది?"

నిర్గుణియా వెంటనే అంది, "తప్పకుండా నడుస్తుంది"

"ఎట్లా నడుస్తుంది? ఇకముందు నీ ఇళ్ళ పాకీ పనికి వెళ్ళేవాడు ఎవడూ లేడు. నువ్వే వెళ్ళాలి, తప్పదు"

నిర్గుణియా నాలిక మంచులాగా అయిపోయింది. యదార్థజీవితం మళ్ళీ ఆమె కళ్ళు తెరిపించింది. ఆమెకు తెలివి వచ్చింది.

"అమ్మా... రేపు వదినని గుమాస్తా దగ్గరికి తీసుకుపో..."

"ఎవడురా... వాడా... ఆ చచ్చినాడు కామతా ప్రసాద్ దగ్గరికా... వాడి దగ్గరికి కోడలిని తీసుకువెళ్ళడమా... నీకు తెలివి ఉండే మాట్లాడుతున్నావా? వాడు... వాడు ఆడదాని శరీరాన్ని నాకి నాకి తినే గొర్రె... వాడిని గురించి తెలియని వాడు ఎవడు?

"అమ్మా! నాకు వదిన గురించి బాగా తెలుసు. తన తీయని మాటల్తో ఆ ఇన్‌స్పెక్టర్ గాడిని వెధవను చేసి రాలేదూ... వాడి ముందు ఈ గుమాస్తాగాడు ఎంత? మా వదిన నిజమైన పతివ్రత... ఆమె మీద ఎవడైనా చెడుదృష్టితో చూశాడా... వాడి కళ్ళే పోతాయి. వాడికే చెడు జరుగుతుంది. నేను ఆ ఇన్‌స్పెక్టర్‌గాడి విషయంలోనూ చూశాను. నా విషయంలోనూ చూశాను... నువ్వు ఆమెను అక్కడికి తీసుకుపో" పతివ్రత అన్న శబ్దం వినగానే నిర్గుణియాలో ఉన్న సంస్కారం మళ్ళీ పాత సంఘటనలను తవ్వడం మొదలుపెట్టాయి... ఎవరికి తను భార్య? ఎంతో మంది తన జీవితంలో ప్రవేశించారు... తను కేవలం మోహన్ భార్యే. తన కోరికను తీర్చడానికి మోహన్... ఆ ఎడారిలో ఓ నీటిబిందువై తనకు కలిశాడు. మసురియాదీన్ చేసే అసహ్యమైన చేష్టలకు విసిగిపోయి మోహన్‌ని తనవైపు ఆకర్షితుడయ్యేలాగా తను ప్రవర్తించింది. తను అన్నీ మరచిపోయి అతడితో లేచిపోయి వచ్చింది. తను అమాయకంగా ఆలోచించింది. మోహన్‌ని దూరంగా మరే పట్టణానికైనా తీసుకువెళ్ళి దొరబాబుని చేద్దాం అని తను అనుకుంది. అతడు ఏదో ఒక వ్యాపారం చేసుకుంటాడని తను మానమర్యాదలతో మోహన్‌లాల్ భార్య అయి జీవిస్తుందనీ అనుకుంది. కాని మోహన్ కులాభిమానం నిర్గుణ్ జాతకాన్నే మార్చేసింది. మోహన్ ఏ కులంవాడైనాసరే ఇప్పుడు మాత్రం తన మానసచోరుడు... తను కేవలం మోహన్‌దే... ప్రాణం పోయినా సరే తనకు మరెవ్వరితోటీ... ఇంకే పురుషుడితోటీ అటువంటి సంబంధం ఉండదు... తను మోహన్ భార్య... మోహన్ సంతానానికి తల్లి...

"మరయితే నీవు పూర్తిగా పాకీదానిగా ఎందుకు మారవు?" ఆమె మనస్సు ప్రశ్నించింది. ఈ ప్రశ్నకు తనదగ్గర బదులేది?...

బ్రాహ్మణురాలిననే ఈ శబ్దం మాటిమాటికి తన చెవులలో ఎందుకు ప్రతిధ్వనిస్తుంది?... తనమీద దానికేం అధికారం ఉందని? అసలు శ్రేష్ఠమైనది ఎవరు? భార్యాత్వమా? కులమా? తన మనస్సే తనకుఎన్నోసార్లు చెంపదెబ్బలు కొట్టినట్లుగా అనిపించింది. ఒకటి... రెండు... మూడు... ఎన్నో... ఎన్నో... మనస్సు చెంపల మీద కొడుతూనే ఉంది. కన్నీళ్ళు ఆమె నరనరాలలో రక్తంలాగా గడ్డకట్టుకుపోయాయి. నిర్గుణియా మనస్సు, శరీరం రెండు నిర్జీవమయ్యాయి.

నిర్గుణియా మసీతా దగ్గరికి వెళ్ళి ఆరోగ్యం ఎలా ఉందని అడిగింది. "నా ఆరోగ్యం బాగుందిగానీ ఇంత డబ్బు ఎందుకు ఖర్చుపెట్టావు? ఈ ముసలివాడి ప్రాణానికి ఇవన్నీ ఎందుకు? నీకు వాంతులవుతున్నాయని గుల్లో చెప్పింది ఇప్పుడు ఎట్లా ఉంది?"

"బాగానే ఉంది..."

"అంతా అల్లా దయ"

గుల్లన్ చేయి చాపుతూ అంది, "ఇప్పుడు అల్లా అల్లా అని అనకు ముసలోడా... రామా...రామా అనడం నేర్చుకో... నబ్బూ మనం అందరం వాల్మీకి ఋషి సంతానం అని చెప్పాడు"

"నా పేరులోనే మసీతా ఉంది, రామ్ ఉంది. నాకైతే అల్లా, రాముడు ఒకటే, ఏమంటావు కోడలా!"

"అవును... గుమాస్తా పని ఇప్పిస్తాడని నబ్బూ అన్నాడు. మీ సలహా"

"గుమాస్తాతో నీకేం పని?"

"రిజిస్టర్‌లో దీనిపేరు ఎక్కించాలిగా... మజ్జు ఇక నీ ఇళ్ళు పాకీ పని చేయడు"

"చెయ్యకపోతే పోనీ... కోడలు మాత్రం తట్ట, చీపురు పట్టుకుని సందు సందు తిరగాల్సిన అవసరంలేదు. పాకీపని చేయడానికి వీల్లేదు" కోపంగా అన్నాడు మసీతా.

"అది తట్ట, చీపురు పట్టుకోకపోతే మరి నీ సంగతి ఎట్లా ముసలోడా? నీ కడుపులో ఇంత గంజి పడేదెట్లా?"

"నేను ఈ మంచంమీద నుండి సరాసరి పైకి వెళ్ళిపోతాను"

"వెళ్తే నువ్వు వెళ్ళు. అందరం ఏదో ఒక రోజు పైకి పోయేవాళ్ళమే. కాని దీని సంగతి ఏం చేస్తావ్? వయస్సులో ఉంది. దీని బతుకు ఎట్లా వెళ్ళాలి? మోహన్ బందిపోటు అయ్యాడు. పోలీసులు వాడి వెనకే ఉన్నారు. ఏదో ఒకరోజు వాడు జైల్‌కి పోతే..."

"నోరు మూసుకో..." భయం వలన కలిగిన ఆవేశంలో అంది నిర్గుణియా! కానీ వెంటనే సంబాళించుకుంది. "నా పేరు వ్రాయించుకోవాలని నిర్ణయించుకున్నాను. బందిపోటు దొంగ భార్య ఎక్కడ ఉండగలదని? ఏదో నీ దయవలన ఈ మాత్రం బతుకు ఈడుస్తున్నాను. నా కూతురు భవిష్యత్తు చూడాలిగా... నా కోసం కాకపోయినా పిల్లకోసం అయినా బతకాలిగా... మరి అక్కడికి ఎప్పుడు వెళ్దాం?" అంది గుల్లన్‌తో!

"ఇన్‌స్పెక్టర్ దగ్గరికే తీసుకుపోతాను. వాడితో నాకు పరిచయం ఉంది"

నిర్గుణియా తన గదిలోకి వెళ్ళిపోయింది. తన జీవితాన్ని పూర్తిగా మార్చుకోవాలన్న ఉద్దేశ్యంతో ఆమె ఒక యంత్రంలా మారిపోయింది. సింహం తన ఎదురుగుండా వచ్చినప్పుడు మనిషి ఇక తనకు చావు తప్పదనుకొని, ఏవిధంగా అయితే శిలలా మారిపోతాడో అదే విధంగా నిర్గుణియా కూడా మనస్సును గట్టి చేసుకుంది. ఈ పరిస్థితిలో తను పాకీపని చేయక తప్పదు. అందుకే ఇక తను పూర్తిగా ఆ ధర్మానికే అంకితం అయిపోతుంది. అన్ని కష్టనష్టాలకు సిద్ధపడేతను అడుగుముందుకు వేయబోతోంది.

ఆమె తనలో పాతుకుపోయిన ఆచారాలను, సంస్కారాలను బలవంతంగా అట్టడుగున వేసి తాళం వేసేసింది. ఈ క్షణం కళ్ళకు ఏది కనిపిస్తోందో అదే సత్యం. ఏది జరుగుతోందో అదే అన్నివిధాల మంచిది. నబ్బూ ఏ ఆదర భావంతో తనను పతివ్రత అన్నాడోగానీ ఆ శబ్దమే తనని ముందుకు నడిపిస్తోంది. ఇన్‌స్పెక్టర్ దగ్గరికి వెళ్తా... ఏ విధంగానయినా సరే వాడిని వలలో వేసుకుంటా మొగవాడిని వలలో వేసుకోవాలంటే ఆడదాని చేతిలో ఎన్ని అస్త్రాలు లేవూ! ఆ వెధవ బసంత్‌గాడికి, అఫ్సర్‌బేగంకి సున్నం పూసి తను వచ్చేసింది. అట్లాగే వీడిని కూడా... కాని ఇప్పటినుండే అవతలివాడు చెడ్డవాడేమో అని అనుకోవడం ఎందుకు? మనిషిని చూశాక ఆలోచించుకోవచ్చు. తనతో ఏభైరూపాయలు తీసుకువెళ్ళడం మంచిది. ఇరవై ఒక్క రూపాయిలు ఇచ్చి అతడిని సంతోషపరుస్తుంది కొంత కన్నీళ్ళతో... మరికొంత ధర్మాన్ని అడ్డుపెట్టుకుని. ఏవిధంగానైనా సరే అతడిని మెప్పించి తీరాలి. ఈ ముసలిదాన్ని మంచిచేసుకోవాలి. స్కూల్‌ని మాత్రం మూయడానికి వీల్లేదు. ఇంటిదగ్గర శకుంతలని ముసలిది చూస్తుంది. కాని ఇది ఒక్కసారిగా తనకు శత్రువుగా ఎందుకు మారిపోయింది. దీనికి పైసలిచ్చి మర్యాద ఇచ్చి అన్నివిధాల సంతోషపెట్టాలని తను అనుకుంది. నబ్బూ ముక్కు మోహన్ కోసినప్పటి నుండే తనమీద ఇంతగా శత్రుత్వం ఏర్పడ్డది. తన గౌరవాన్ని మంట కలపాలని చూస్తోంది. ముసలిముండ ఊరికే కన్నీళ్ళు కారుస్తుంది... కొడుకు కురూపి అయ్యాడని బాధ! ఎంతయినా తల్లి మనస్సాయె. ఖజరో భార్య చదువు

నేర్చుకుంటోంది. తను పనికి పోయినప్పుడు ఆమెను చదువు చెప్పమనాలి. తరువాత తను మానేయదు. మంచో చెడో తను ఎవడి చేయిని పట్టుకుని గడపదాటిందో పూర్తిగా అతడి మనిషి అయి బతుకు వెళ్ళబుచ్చాలి. శారీరకంగా మానసికంగా పూర్తిగా మారిపోవాలి. మోహన్‌ని మెప్పించకపోతే తనపేరు నిర్గుణియాయేకాదు.



ఇన్స్పెక్టర్‌ని కలవాలంటే ముందు కాలూ దగ్గరికి వెళ్ళడం మంచిదని గుల్లన్ అంది. కాలూ ప్రవర్తన ఆడవాళ్ళ విషయంలో అసహ్యంగా ఉంటుందని నిర్గుణియా ఇంతకు ముందే విన్నది. ఆ సంగతే గుల్లన్‌తో అంది.

''కోడలా! నువ్వు ఈ ప్రపంచంతో యుద్ధంచేయడానికని బయలుదేరావు. ముందు చెడును చూడు. నీలో ఉన్న ఆ భయం పోతుంది. అప్పుడు ధైర్యంగా నువ్వు ముందడుగు వేయవచ్చు. నీకే జయం కలుగుతుంది. నీముఖం చూడగానే ఆ కాలు ఈ మహతల్లి ఎవరికీ లొంగదని తెలుసుకుంటాడు. ఎంతైనా నువ్వు మోహన్ పెళ్ళానివి కదా'' గుల్లన్ అన్న ఈ మాటలు ఆమెలో ధైర్యాన్ని పెంచాయి.

టిపట్‌చంద్ వరండాలో కూర్చుని హిందీ వార్తా పత్రిక చదువుతున్నాడు. అతడిని చూడగానే నిర్గుణియాకి తన ముసలి మొగుడు గుర్తుకువచ్చాడు.

''అరె... ఎవరు? జహాగుల్లన్‌దాయీ... మా దగ్గరికి నువ్వెప్పుడూ రావుకదా! ఇవాళ దారి తప్పినట్లున్నావు...'' అతడు గుల్లన్‌తో మాట్లాడుతున్నా అతని దృష్టి అంతా నిర్గుణ్‌మీదే ఉంది.

''అల్లా దయవలన మీదగ్గర అప్పు తీసుకోవాల్సిన అవసరం పడలేదు. లేకపోతే మీ చుట్టూ తిరగాల్సిందేగా... అల్లా మిమ్మల్ని చల్లగా చూడాలి''

గుల్లన్ నిర్గుణియా గురించి చెప్పింది.

''ఇప్పుడు మోహన్ తన ప్రతాపం చూపిస్తున్నాడుగా... నగరంలో జరిగిన అల్లర్లలో తన విశ్వరూపం చూపించాడు కదూ... ఈమధ్య రాజాసాహెబ్ ఇంటిని దోచుకున్నాడట. వందలాది పోలీసులను, పిస్తోలు గుళ్ళను తప్పించుకుని పారిపోయాడట. రాజాసాహెబ్ కాళ్ళు, చేతులు, నోరు కట్టేసి మరీ పారిపోయాడు. రాణిని కట్టేసాడు. తల్లిదండ్రుల ఎదురుగుండానే వాళ్ళ ఇద్దరి ఆడపిల్లలనూ బలాత్కారం చేశాడు. లక్ష లక్షన్నరదాకా దోచాడని విన్నాను. మోహన్ బందిపోటుగా ఎంత పేరు సంపాయించాడనీ...''

నిర్గుణియా తన భర్త గురించిన ప్రశంస వింటోంది. కాని అది ఎట్లాంటి పొగడ్త. ఆ పొగడ్త విషంలోని ఓ అమృతపు చుక్కలాంటిది.

మసీతా ఇళ్ళ పని మజ్జూ చేస్తున్నాడు. కాని నీ భయం వలన వాడు ఉచ్చ పోసుకుంటున్నాడు. అయినా నీకు భయపడని వాడు ఎవడు?'' అంది గుల్లన్ కాలూని చూస్తూ.

''మరి ఏం చేయగలను. తప్పదు కదా... ఈ పనులు చేసేది కాలూ కాదు. ప్రతివారికీ పాడు పొట్ట ఒకటి ఉంది చూశావూ... అదే చేయిస్తుంది''

''ఆ పాపపు పొట్ట కోసమే ఈ కోడలు వచ్చింది. కాలూ! ఇటువంటి నిజాయితీపరురాలు దీపంపెట్టి వెతికినా కనిపించదు. ఆమెకు సహాయం చెయ్యి, నీకు ఎంతో కొంత ముట్టచెబుతుంది''

జేబురుమాలులోంచి రెండు వెండిరూపాయలు తీసి నిర్గుణియా కాలూ కాళ్ళ దగ్గర పెట్టింది. కాలూ తీసుకోలేదు.

గుల్లన్ నిర్గుణియా గురించి చెప్పాక అందరూ కలిసి బాబు శ్యామనోహర్‌లాల్ దగ్గరికి వెళ్ళారు. అతడు ''ఈమె ఎవరు?'' అనగానే

నిర్గుణ్ అతనికి వివరంగా తన గురించి చెప్పింది. ఏభై రూపాయలు సమర్పించు కుంటానని కూడా చెప్పింది. నిర్గుణియా మాట్లాడిన ఇంగ్లీషు, కన్నీళ్ళు, మాట్లాడేటప్పు డు ధ్వనించిన నిజాయితీపరురాలనే భావన, అన్నీ శ్యాంబాబు మనస్సును సంతోషపె ట్టాయి. ''వేర్ డిడ్యు లర్న్డ్ ఇంగ్లీష్'' అనడిగాడు.

''నాతండ్రి పని చేసే చోట ఒక ఆడపిల్ల ఉండేది. ఆమె నేర్పించింది''

''నీపేరేమిటి?''

''మైనెమ్ ఈజ్... ఈజ్... సర్... నిర్గుణ్ బాలా...''

''ఎ బ్యూటిఫుల్ నేమ్''

''మా ఫాదర్ ఆర్యసమాజానికి వెళ్తు ఉండే వాడు. నాకు శ్లోకాలు కూడా గుర్తున్నాయి. ఈమధ్య కలెక్టర్ ఆజ్ఞ ప్రకారం ఇక్కడే భావన లోని వేదమందిరంలో ఉంటున్నాను. నా ఇంట్లో ఒక స్కూల్ తెరిచాను''

''నీవు చదువుకున్న దానివిలా ఉన్నావు. ఈ పని ఎందుకు చేయాలనుకుంటున్నావు?''

''ఈ పాడు పొట్టకోసం ఏదో ఒకటి చేయా లిగా... మహాత్మాగాంధీ చెప్పినా, ఆర్యసమా జంవాళ్ళు ఎన్ని ప్రయత్నాలు చేసినా మరో రెండొందల సంవత్సరాలదాకా ఈ దేశంలో ఏమీ మార్పురాదని నా నమ్మకం. పాకీవాడు పాకీ వాడిగానే బతకాలి'' నిర్గుణియా శ్యాంబా బుని పూర్తిగా ఆకట్టుకుంది. అతనిలో ఉన్న దయ, ప్రేమలను మేల్కొల్పింది.

కోటను ముట్టడించి వశపరచుకున్న దానిలా నిర్గుణియా సంతోషంలో మునిగిపోయి మరీ నడుస్తోంది. ఎంతో ఆత్మవిశ్వాసంతో నడు స్తోంది. తను మోహన్ భార్య. ఇప్పుడు తన మనస్సులో ఆ పని అంటే అసహ్యతలేదు. బాధలేదు. సాయంత్రం మజ్జు వచ్చాక వాడిని ఏదో విధంగా సంతోషపరిచి, మసీతా పని చేసే ఇళ్ళన్నీ చూసి రావాలని నిశ్చయించుకుంది. మళ్ళీ ఆమెకు భయం అనిపించింది. కానీ పట్టుదల గల మనస్సు భయాన్ని దగ్గరికి రానీయలేదు. తను ఒకడికి భార్య. తను పతివ్రత అదే సత్యం.

★ ★ ★

శ్రద్ధానంద విద్యామందిరంలో చదువుకునే వాళ్ళ సంఖ్య ఎక్కువయింది. ఖుజరా భార్యకి కొన్త చదువు వచ్చు. ఆమె గులేబకావళి కథ, చిలకాగోరింకల కథ లాంటివి చదవడం నేర్చు కుంది. తను మసీతా ఇళ్ళలో పనికి వెళ్తోంది కనుక తను వచ్చేవరకు స్కూల్ నడిపే బాధ్యత ఆమెదేనని చెప్పింది. ఖుజరా భార్య సంతోషంగా ఒప్పుకుంది.

''నీ దయవలన నాకు చదవడం చది వించడం కూడా అలవాటు అయింది. నా మొగుడు కూడా బాల్మీకి ఋషి భక్తుడయ్యా డు'' అంది.

''బాల్మీకి కాదు వాల్మీకి... ఏదీ ఐదుసార్లు అను''

ఖుజరా భార్య నవ్వుతూ వాల్మీకి వాల్మీకి... అని ఐదు సార్లు అంది. నిర్గుణియా తృప్తిగా అంది, ''నీవు నీ భర్త, నబ్బూ అందరూ కలిసి ఇక్కడ స్కూల్ నడిపితే ముందు ముందు మీ పిల్లలు ఎంతో సంతోష పడతారు. ఇప్పుడు రోజులు మారుతున్నాయి. మహాత్మాగాంధీ ఏదో ఒకరోజున స్వరాజ్యం తప్పకుండా తెస్తాడు. అప్పుడు మన వాళ్ళ అదృష్టం పండుతుంది''

నిర్గుణియా ఆమెకి సంధ్యావందనం చే యడం, రామాయణం చదవడం నేర్పిస్తా నంది.

ఆ తరువాత నిర్గుణియా మజ్జు దగ్గరికి వెళ్ళింది. మజ్జూ భార్య గుడ్డిది. ఆమె మజ్జూకి వేడివేడిగా రొట్టెలు చేసి పెడ్తోంది. నిర్గుణి యాని చూడగానే ఆమెను లోపలికి రమ్మన్నా డు మజ్జూ. తన భార్య బాగా వంట చేస్తుందనీ, జాకెట్లు కుర్తాలు కుడుతుందనీ, చాపలు అల్లు తుందనీ, విసనకర్రలు చేస్తుందనీ చెప్పాడు.

''శభాష్! ఇవన్నీ ఎక్కడ నేర్చుకున్నావు?'' అనడిగింది నిర్గుణ్.

''విసనకర్రలు, చాపలు అల్లడం ఇంటిద గ్గర అవ్వ దగ్గర నేర్చుకున్నాను. కుట్టుపని ఒక దర్జీవాడి దగ్గర'' చెబుతూ మధ్యలో ఆమె ఆగిపోయింది.

''దర్జీవాడు నిన్ను ఇంట్లోకి రానిచ్చేవాడా?'' నిర్గుణియా అడిగింది.

"ఆ వెధవముండాకొడుకు దీన్ని నమ్మించి తీసుకుపోయాడు. ఇంట్లో దీనిచేత ఇంటెడు చాకిరీ చేయించుకునేవాడు. వాడే దీనికి మిష ను కుట్టడం నేర్పించాడు. వాడికి పైసా ఖర్చు లేకుండా పనిమనిషి దొరికింది. ఇది పాకీది అని అందరికి తెలిశాక ఆ దర్జీని పట్టుకుని తన్నారు. దీన్ని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టారు. ఇది ఇక్కడకు వచ్చేసింది. అప్పటినుండి నేను కాస్త సుఖపడుతున్నాను"

"రాముడు ఎప్పుడూ నిన్ను ఇట్లాగే కాపాడాలి. సాయంత్రం నీవు గొట్టెలు అడుక్కోవడానికి ఎలాగూ వెళ్తావుకదా! అప్పుడు నేను నీతో వస్తాను. నాకు నా ఇళ్ళు చూపెట్టు"

"ఈ పాకీ కులంలో పుట్టాక అందరిచేతా తన్నులు తినక తప్పదు. ఎంతో ఓర్చుకున్నాను. కానీ ఆ కాలూగాడు... నన్ను చాలా బాధపెట్టాడు. వాడు నా శరీరాన్ని నలిపివేసేవాడు. నా ఆత్మ నాలోని పురుషత్వాన్ని సవాల్ చేసింది. అందుకే... నీ గురించి..." అతడికళ్ళల్లోంచి కన్నీళ్ళు జలజలారాలాయి.

ఆ కన్నీళ్ళు చూడగానే ఆమెకు గుండెలలో గునపాలు గుచ్చుకున్నట్లుగా అయింది. మొగవాడు అయి ఉండి కూడా అతడు ఇంత నిస్సహాయుడిగా ఉంటే... మరి తను... ఆడది... ఏం చూడాలో, ఎటువంటి కష్టాలు అనుభవించాలో..."

నా తమ్ముడిని నీకు సహాయంగా పంపిస్తాను. నీ వెంటవస్తే పనీ నేర్చుకుంటాడు. ఎత్తడం కడగడం వాడు చేస్తాడు. పైపైన నువ్వు చూసుకో... వాడికి రోజూ ఒకటో రెండో అణాలు ఇవ్వు... నీ గుప్పిట్లో ఉంటాడు"

తప్పదు ఈ పని తను చేసి తీరాలి అనుకుంది. "నీవు లాలాకి ఎంత అప్పు ఉన్నావు?"

"వాడి లెక్కప్రకారం అసలు, వడ్డీ కలిపి నూట ఏభై రూపాయలు. ఏకాయిగాడివి కూడా పదిరూపాయలు ఉన్నాయి. వాడు వడ్డీ తీసుకోడు కానీ తంతాడు, కొడ్తాడు"

"సహకార సంఘం పేరు వినే ఉంటావు కదూ! మనం ఒక సహకారసంఘం తెరిచి బుట్టలు, తట్టలు అల్లిద్దాం. మీ అప్పులు తీరిపోతాయి"

"మంచి మాట చెప్పావు. మాస్టర్ కంపెనీలో పనిచేసే ఫర్గుసన్, గంగారామ్ మన బస్తీలోనే ఉంటారు. ఒకసారి మోహన్ కూడా ఇలాంటి మాటే అన్నట్లు గుర్తు. అప్పుడెప్పుడో మాస్టర్ దగ్గర ఉన్న బాజాలు అన్నీ ఫర్గుసన్ తెచ్చి ఎక్కడో తాకట్టు పెట్టాడు"

"వాటన్నింటిని నేను విడిపించుకుంటాను. మీరందరూ కలిసి ఓ కంపెనీని తయారు చేయండి. భగవంతుడి దయే వుంటే మన బస్తీవాళ్ళ జీవితాలు మారిపోతాయి"

"ఇవాళే అందరిని పిలిచి ఈ విషయం అడుగుతాను"

నిర్గుణియా ముందుకు నడిచి మజ్జూ భార్యని కౌగలించుకుంది. ఆమె బుగ్గలను ముద్దుపెట్టుకుంది.

★ ★ ★

శ్రీమతి నిర్గుణియా తన స్వహస్తంతో వ్రాసిన నోట్‌బుక్‌నుండి ఈ కింది విషయాలు ఎత్తి రాస్తున్నాను.

"తులసీదాస్ జయంతి సందర్భంలో ఇవాళ నగరంలో పెద్ద ఊరేగింపు జరుగుతోందని విన్నాను. మహమ్మదీయులు బారావఫాత్, మీలాగ్‌షరీఫ్‌ని జరుపుకోవడానికని గవర్నమెంటు ఓ లక్ష రూపాయలు ఇచ్చింది. నగరంలోని మహమ్మదీయుల బస్తీలు దీపావళినాటిలాగా ధగధగా మెరుస్తూ కళకళలాడుతున్నాయి. ఈ కారణంవల్లనే హిందువులందరూ పెద్దపెద్ద సేట్లు, షావుకార్లు కలిసి ఈసారి తులసీ జయంతిని ఎంతో గొప్పగా చేయాలని నిర్ణయించుకున్నారు. ఇరవై ఒక్క ఏనుగులు, ఏభైఒక్క ఒంటెలు, నూట ఒక్క గుర్రాలమీద సవారీలు ఊరేగింపులో బయలుదేరుతున్నాయని విన్నాను. రామాయణం చదివే ఇరవై ఒక్క మండలీలు పెద్దపెద్ద ట్రక్కులలో దేవుళ్ళని ఊరేగిస్తారు. బాజా బజంత్రీలు, బుర్రకథలు, పురాణాలు చెబుతూ ఎన్నో వేడుకలు కూడా జరుపుతారు.

"తులసీదాస్... నీవెంత ధన్యుడివి... తాతయ్యా తులసీ దోహాలను ఎంత శ్రావ్యంగా పాడేవాడు. గవర్నమెంటు డబ్బులతో తమ ధర్మాన్ని ప్రచారం చేయాలని పాటుపడుతున్న ఈ మహమ్మదీయులూ, నల్లడబ్బుతో తమ

ధర్మం కలకాలం నిలవాలని పాటుపడుతున్న ఈ హిందువులూ, ఇద్దరూ నిజానికి మూర్ఖులే. వీళ్ళు తమ తమ ధర్మాలను భ్రష్టం చేస్తున్నారు. నాకు మహమ్మదీయుల గ్రంధాలలోని కొన్ని విషయాలైనా తెలుసు. ఆ సత్యాలకి తులసీదాస్ చెప్పిన ఈ సత్యాలకి ఏమాత్రం భేదం లేదు. త్యాగం, తపస్సు, సత్యం ఈ మూడింటిని మానవుడు ఎప్పుడూ విడనాడరాదని ప్రతి ధర్మమూ చెబుతోంది. కాని ఇప్పుడు అంతా అసత్యమే. అధర్మమే... ఇదంతా రాముడి మాయ. రాత్రిపూట కటిక చీకటిగా లేకపోతే, రక్తం గడ్డకట్టించేంత చలి లేకపోతే, సూర్యభగవానుడిని ఎవరు జ్ఞాపకం చేసుకుంటారు? ఎవరు కొలుస్తారు? పని చేయడానికి మజ్జూతో మొదటిసారిగా ఇళ్ళకు వెళ్ళిన ఆరోజు నాకు ఇప్పటికీ గుర్తుంది. అదే ప్రపంచం... అవే బజార్లు... అవే ఇళ్ళు... కాని నాకు ఆరోజు అన్నీ కొత్తగా అనిపించాయి. మనస్సు ఒకవైపు బరువుగా ఉంది. మరొకవైపు తేలికగా కూడా ఉంది. ఆరోజు నా మనస్థితిని తలచుకుంటే ఈరోజు కూడా నా నరాలను ఎవరో నిర్దాక్షిణ్యంగా పిండేస్తున్నట్లుగా అనిపిస్తుంది. నేను నా మనఃస్థితిని పూర్తిగా వర్ణించలేను. వర్ణించడానికి శబ్దాలు చాలవు. వాక్యాలు లేవు. నేను నడుస్తూనే వున్నా... కాని నా పాదాలు అంగదుడి పాదాల్లా ఒకేచోట కదలకుండా నిల్చున్నాయా అని అనిపించింది. నబ్బూ నోటినుండి ఏనాడైతే పతివ్రత అన్న శబ్దం విన్నానో ఆనాడే నేను పతివ్రతని కాగలగాలి అని మనస్సులో అనుకున్నాను. నేను నరకంలోని అగ్నిలో భస్మం అయి కొత్త జన్మ ఎత్తాను. రాముడి దయ ఉంటే తప్పకుండా నన్ను నేను పతివ్రతగా నిరూపించుకుంటాను. ఇకనుంచీ పతివ్రతలాగానే బతికి అలాగే చనిపోవాలి...

ఛావనీ బజారులో వెనకవైపుగా సుమారు ఇరవై ఇళ్ళు కల ఓ బస్తీ ఉంది. ఇందులో సగం ఇళ్ళు హిందువుల పద్ధతిలో కట్టబడి ఉన్నాయి. హిందువుల పద్ధతిలో ఉన్న ఇళ్ళు బజారుకు ఎడంవైపు వున్నాయి. కుడివైపు కొన్ని పెంకుటిళ్ళు ఉన్నాయి. అదేవైపు రైలుపట్టాలకు దగ్గరగా కొత్త పద్ధతిలో కొన్ని ఇళ్ళు కడుతున్నారు. మజ్జూ నన్ను పాతబస్తీకి తీసుకు వెళ్ళాడు. ఐదవ బంగళా చివర చిన్న మైదానం ఉంది. ఆ మైదానం దగ్గర ఉన్న గల్లీలోని ఇళ్ళు నావి. మజ్జూ, నేనూ మైదానం దాటి సందువైపు వెళ్తుండగా ఓ ఇంటి ధగ్గర భిక్ష అడుగుతున్న ఒక తెల్లగడ్డం ఫకీరు కనిపించాడు. "ఏక్ రోటీకా సవాల్ హై బాబా" అని అతడు అరుస్తున్నాడు. మజ్జూ ఈ అరుపు విని తనూ అరవడం మొదలుపెట్టాడు.

"అమ్మగారూ... మిమ్మల్ని అల్లా చల్లగా చూడాలి. మీ ఇంట్లో నేతి దీపం వెలగాలి. ఇంత ఎంగిలో గింగిలో ఓ ముద్ద పడేయండి"

"నేను మజ్జూ వెనకే నిల్చుని ఉన్నాను. హాయ్... రేపటినుండి నాకు ఇట్లాంటి గతే పడుతుందిగా... గడప గడప దగ్గర ఇట్లాగే అడుక్కోవాల్సి వస్తుంది... రామా... రామా... నాలుగు ముక్కలకోసం... గుప్పెడు మెతుకుల కోసం కుక్కలా ఎదురుచూసేలా మారాలి... హే రామా... ఒకప్పుడు నన్ను అందరూ అమ్మగారూ... రాణిగారూ... హుజూర్... సర్కార్... అంటూ పిలిచేవాళ్ళు. మహారాణిలా చూసేవాళ్ళు. కాని... కాని ఈరోజు నేను అందరినీ "అమ్మగారూ" అంటూ పిలవాలి. వాళ్ళు పెట్టే మెతుకులకోసం ఎదురుచూడాలి. ఎట్లాంటి రోజులు చూస్తున్నాను.

ఎన్నోసార్లు అరిచాక ఒకామె బయటకి వచ్చింది. ఫకీర్ బొచ్చెలో ఓ పైసా వేసింది. మాకు రెండు రొట్టెలు ఇవ్వడానికి చేయి చాచింది. మజ్జూ నేను తీసుకుంటానని అనుకున్నాడు. నేను అట్లాగే నిల్చున్నాను. ఆ గృహిణి ముందు మజ్జూని చూసింది. ఏదో అడగబోయింది. కాని నాకెందుకో భయం అనిపించింది. వెంటనే నేను కొంగు జాపాను...

ఆ గృహిణి నా అసలు రూపం గుర్తుపడుతుందన్న భయంతో ఆ విధంగా చేశానేమోనని ఈరోజు నాకనిపిస్తోంది. కొత్త జన్మలోని కొత్త అలవాటు ఆ భయంతోటే నాకు పూర్తిగా అలవాటయింది. ఇంతకుముందు అయితే ఇంకొకరిముందు కొంగుపట్టి అడిగేదాన్నా? ఊహు... చచ్చిపోయేదాన్ని... కాని ఇంకొకరి ముందు చేయి జాపడమా... నా కొత్త జన్మలో నేను పట్టిన కొంగుమీద బిచ్చం రెండు మాడిపోయిన రొట్టెల రూపంలో పడ్డది. అప్పుడు నాకు తెలివి వచ్చింది. ఫకీరు మాటలు నా

చెవుల్లో పడ్డాయి. "అమ్మా... పైసా తీసుకో... ఆ రొట్టె నాకు ఇచ్చేయి"

"ఒద్దు... ఒద్దు... బాబా... ముట్టుకోకు... అది పాకీది... ముట్టుకోకు" అని ఆ ఇంటి ఇల్లాలు అంది.

"అయితేమాత్రం ఏం? మేమూ అంతేగా... ఈమె శరీరంనుండి వచ్చే మైలను శుభ్రపరుస్తుంది. నేను మనస్సునకు పట్టిన మైలను శుభ్రపరుస్తాను. అమ్మా, అవి ఇటు ఇవ్వు..."

పకీరు నన్ను నవ్వుతూ అలా పిలిచేసరికి నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నన్ను నేను సంభాళించుకోలేకపోయాను. అతడి కాళ్ళమీదపడి వెక్కివెక్కి ఏడ్చాను...

ఆ ఫకిరు నా తలను చేతితో నిమురుతూ. అన్నాడు, "పాకీదానికి మహారాణికి తేడా ఏముంది. అదంతా మనం అనుకోవడంలో ఉంది. ఆ దేవుడే అందరికన్నా పెద్ద పాకీవాడు... లే... లే... ఆ రొట్టెలు నాకివ్వు... ఆకలి వేస్తోంది"

శ్రీమతి నిర్గుణ్ ఇంతవరకు మాత్రమే రాసింది.

ఆ తరువాత ఏమయిందో... ఏమో. ఏయే సంఘటనలు జరిగాయో తెలుసుకోవాలని నా మనస్సు తహతహలాడింది. దాహం కొన్నవాడి నోటిముందు నీళ్ళున్న గ్లాసువచ్చి తాగకుండానే మాయమైతే అతడి పరిస్థితి ఎట్లా ఉంటుందో నా పరిస్థితీ అట్లాగే ఉంది. ఎప్పుడైనా ఎవరైనా నిస్సహాయ స్థితిలో అలాంటి పని చేయాల్సి వచ్చినప్పుడు ఆనందంగా ఎవరూ చేసి ఉండరు. ఏ అలవాట్లయినా మనకు తొందరగా అలవడవు. అలవడిన అలవాట్లను వదిలించుకోవాలంటే కూడా అదో పెద్ద యజ్ఞమే. ఎంతో మంది పాకీవాళ్ళు తమ పూర్వజులు క్షత్రియవంశానికి చెందినవాళ్ళనే చెప్పారు. పదకొండవ శతాబ్దంలో సయ్యద్ సాలాద్‌మసూద్‌ని చంపి, తను చనిపోయిన రాజా సుహైల్‌దేవ్ తన పూర్వజుడు అని ఒకరు చెప్పారు. బహరాయిబ్‌కి చెందిన రాజా సుహల్‌దేవ్ జైనమతస్థుడని ఎక్కడో చదివినట్లు గుర్తుంది. కాని అతడు వీరి వంశానికే చెందినవాడని ఈమధ్యనే తెలిసింది. మరొకరు చెప్పిన గోత్రం రాజస్థాన్ నుండి గఢ్‌వాల్ వరకు ఉన్న బ్రాహ్మణులలోనూ, క్షత్రియులలోనూ కూడా ఉంది.

వివిధ గోత్రాలకు చెందిన వాళ్ళు నాకు చెప్పిన విషయాలలో ఎంతో నిజం ఉందని పించసాగింది. బలవంతులు బలహీనుల్ని తన్ని, కొట్టి ఇలా హీనకులస్తులుగాముద్రవేసి ఉంటారు. వేసి ఉంటారేమిటి వేశారు అని ఖచ్చితంగా చెప్పవచ్చు. ఇప్పటికీ పాకిస్తాన్‌లోని చిత్రాల్ అనే ప్రదేశానికి చెందిన ఒక రాజు పాకీజాతికి చెందిన వాడేనంటారు. భంగపడ్డ అగ్రవర్ణాల వారు 'భంగీలు' అయ్యారన్నది చారిత్రక సత్యం. అసలు పాకీవాళ్ళ జాతి అన్నది చరిత్రలో లేనేలేదు. ప్రాచీన గ్రంథాలలో ఎక్కడా వారు ఒక కులంగా వర్ణింపబడలేదు. ఎంత వెతికినా పాకీకులం అన్నది ఒకటి ఉందని ప్రామాణికంగా నాకు కనిపించలేదు. కేవలం నారదీయ సంహితలో పదిహేను రకాల పనులు చేసే దాసులను వర్ణించారు. అందులో మలమూత్రాలను ఎత్తేదాసులను కూడా వర్ణించారుగానీ పాకీవాళ్ళనే మాటలేదు. బానిసత్వం ఆనాటి నుండి ఈనాటివరకు మనిషిని తన కబంధ హస్తాలలో బంధించి వేసింది. ఈ ప్రపంచంలో బానిసలుగా బతుకుతున్న వాళ్ళు ఎందరో ఉన్నారు. ఎన్నో యాతనలు అనుభవించి నిస్సహాయ స్థితిలో అసహ్యకరమైన పనులు చేయడానికి సిద్ధపడిన ఎందరో బానిసల కథలతో మన చరిత్ర పుటలు నిండిపోయాయి. ఎంతమంది గురించి కథలు చెప్పగలం? వీళ్ళు పడ్డ నరకయాతనలను ఏమని వర్ణించగలం?

నేను నిర్గుణియాని కలవడానికి బయలుదేరాను. నా దగ్గర బహుమతి రూపంలో వచ్చిన పన్నెండు వందల రూపాయలు ఉన్నాయి. నా భార్యకు పదకొండు వందలు ఇచ్చి మిగిలిన వందరూపాయలతో నిర్గుణియాకి ఏదైనా బహుమతి కొనడానికి ఖర్చుచేయాలని అనుకున్నాను. ఆ వృద్ధురాలికి విస్కీబాటిల్ ఒకటి ఇద్దామా అనుకున్నాను కాని ఆమె ఆ బహుమతిని స్వీకరించదేమో అనిపించింది. పళ్ళు కొంటే పదిహేను రూపాయలు మాత్రమే ఖర్చయ్యాయి. వందరూపాయలు పెట్టి బహుమతి ఇద్దామనుకున్నాను కనుక అందులో ఒకపైసా

కూడా నా దగ్గర ఉంచుకోవాలని అనిపించడం లేదు. ఆమె ఇంటివైపు వెళ్తున్నప్పుడు బట్టల షాపులో లక్నో చికెన్ తెల్లచీర ఒకటి ఎనభై అయిదు రూపాయలకుకొన్నాను. ఇంత పరిచయం తరువాత మా ఇద్దరి మధ్య విడరాని బంధం పెరిగిందన్న సత్యాన్ని నేను ఒప్పుకుంటాను. ఇది ఎటువంటి బంధమో నేను పూర్తిగా వర్ణించలేనుకానీ, మేం ఇద్దరం ప్రాణ స్నేహితులులా మారామని మాత్రం చెప్పగలను.

ఇంటి ముందు రిక్షా ఆగింది. వెళ్ళి వెనకగదిలోని కిటికీ దగ్గర నిల్చుని కేకవేశాను. ఆవిడ తలుపు తెరిచింది. లోపల గదిలోకి వెళ్ళి కూర్చున్నాం. ఆవిడ దృష్టి నేను తెచ్చిన సంచీ మీద పడగానే "ఇదేమిటి?" అనడిగింది.

నేను చీర బయటకి తీసి ఆవిడ చేతిలోపెట్టాను.

ఆవిడ ఏమీ మాట్లాడలేదు. నావంక చూస్తుంటే ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "పుట్టింట్లో నాకు ఒక సోదరుడుంటే నాకు చీర పెట్టే వాడు. మీరు ఈ చీర తెచ్చి పుట్టింటిని గుర్తు చేశారు. మన ఆచారం ప్రకారం పుట్టింటి వాళ్ళు తమ ఆడపిల్లకు చీర, వసుపు కుంకుమ ఇవ్వాలిగా..."

"ఇది పుట్టింటి వాళ్ళే పెట్టారని అనుకోండి"

"ఎట్లా అనుకోను బాబుగారూ, ఇప్పుడు నేను బ్రాహ్మణురాలిని కానుగా"

"కాకపోతే మాత్రం ఏమయింది, మీ విషయంలో లోతుగా ఆలోచించటం రాయడం మొదలుపెట్టినప్పటినుండి ఇప్పటికే కొంతవరకు నేను మానసికంగా పాకీవాడిని అయ్యాను.

శ్రీమతి నిర్గుణియా చీరను నెత్తిమీద పెట్టుకుంది. "ఇప్పటివరకు నాకు ఇటువంటి బహుమతి ఎవరూ ఇవ్వలేదు బాబుగారూ... నాకు చాలా ఆనందంగా ఉంది. ఇవాళ నా చేతి భోజనం తినికాని వెళ్ళకూడదు. కూర్చోండి... ఇప్పుడే వస్తాను మంగరూని కేకేస్తాను"

"దేనికి?"

"పది పదిన్నర గంటలకి ఇంటి దగ్గరికి రిక్షా తీసుకు రమ్మనమని చెప్పి వస్తాను"

"అంతసేపూ నన్ను కూర్చోమంటారా?"

నిర్గుణియా నీలికళ్ళు మెరిశాయి. "బాబుగారూ, మీరెక్కడున్నా, ఎక్కడ కూర్చున్నా, ఇంటికి ఎంత ఆలస్యంగా వెళ్ళినా ఫరవాలేదు. మీ ముసలావిడ ఈ వయస్సులో ఎక్కడికి వెళ్ళారు? ఎందుకు వెళ్ళారు? అని అడగరుగా?"

ఇద్దరం నవ్వాం. ఆవిడ మంగరు దగ్గరికి వెళ్ళి ఏదో చెప్పి వచ్చింది. "ఇప్పుడే పిండి తడిపి వస్తాను. మీరు తినే సమయానికి వేడివేడిగా పూరీలు చేయవచ్చు"

"నా మాట వినండి నిర్గుణియాగారూ... ఇప్పుడు మీరు అనవసరంగా శ్రమ తీసుకోవడం నాకు ఎంత మాత్రం ఇష్టంలేదు. నేను ఇన్ని పళ్ళు ఎందుకు తెచ్చాననుకుంటున్నారు?"

"ఆహా... అదేం కుదరదు బాబుగారూ. మీరు తప్పకుండా భోజనం చేయాలి. ఆ గదిలోని కుర్చీ ఇటు తీసుకువచ్చి కూర్చోండి. నేను పిండి కలుపుతూ మీతో మాట్లాడుతూ ఉంటాను. పొద్దున్నే పెరటిలోని బెండకాయలు కోశాను. వాటి కూర చేసిపెడతాను. తరువాత కూర్చుని మజాగా తిందాం... తాగుదాం" అంటూనే ఆవిడ పిండి కలపడం మొదలుపెట్టింది.

"ఫకీరుతో మీ కలయికదాకా మీరు రాశారు. కాని ఆ తరువాత ఏమయిందో అందులో లేదు. అది తెలుసుకోవాలన్న ఆశతో ఇక ఉండలేక మీ దగ్గరికి వచ్చేశాను"

"బాబుగారూ! నాకు రాయడం చదవడం ఏం వచ్చును గనుక! ఏదో నా మనస్సు బాధతో బరువెక్కినప్పుడు కాగితం మీద ఆ బాధను వ్యక్తం చేయడానికని ప్రయత్నించాను. నా మనస్సులో ఆ బాధ మెదుల్తున్నంతసేపూ మాత్రమే అలా రాసేదాన్ని"

"తరువాత ఆ ఫకీరు మీకు మళ్ళీ కనిపించాడా?"

"ఎన్నోసార్లు కనిపించాడు, ఆ ఫకీరు బాబా నాకు స్నేహితుడైపోయాడు. నిజానికి ఏ జన్మలోనో ఏదో పుణ్యం చేశాను. అందుకే ఈ అభాగ్యురాలి జీవితంలో అతను కనిపించాడు.

'కిందటి జన్మలో నీకు, నీ భర్తకి మధ్య ఎంతో ప్రేమ ఉండేది. నీవు ఆ జన్మలో తొందరగా చనిపోయి మళ్ళీ తొందరగా ఈ జన్మ పొందావు. అతడు ఆలస్యంగా చనిపోయి ఆల స్యంగా పుట్టాడు. నీకూ, అతనికీ మధ్య ఉన్న మిగిలిన ఋణాన్ని ఈ జన్మలో తీర్చుకోగలుగు తున్నావు. పాప పుణ్యాలంటూ ఏవీ ఉండవు భక్తురాలా... అసలు [illegible] మనస్సులోంచి ఈ రెండిటినీ పూర్తిగా తీసి వేస్తేనే మనిషి మని షిగా బతకగలుగుతాడు' అని అతడు నాతో ఒకసారి చెప్పాడు. ఏకాంతంలో కూర్చుని తా గడం కూడా ఒక పూజే అన్న మంత్రాన్ని కూడా ఆ ఫకీరే నేర్పాడు. ఆయన చనిపోయేముందు ఏం చెప్పాడో తెలుసా...? 'నన్ను తగలబెట్టడాని కి కట్టెల కోసం బిచ్చం అడగకుండా నీ దగ్గర కాస్తో కూస్తో డబ్బులు ఉంటే ఒక బండీ తీసుకుని అందులో నా శవాన్ని పడేసి తీసుకు వెళ్ళి కాల్చేయి. ఎట్లాగూ నీకు ఎన్నో కళంకా లు వచ్చాయి. ఎన్నో అపనిందలు భరించావు. మరో అపనింద భరించు. రోజూ సాయంత్రం తాగు. తాగి ఏకాంతంలో నీ మోహన్‌ని ధ్యా నించు. నీ మనస్సుకు ఎట్లా తోస్తే అట్లా ధ్యానించు. ఓ రోజు నువ్వే చూస్తావు. బురద నుండీ కమలం పుడుతుంది. వేయి రేకుల కమలం''

ఈ స్త్రీ దగ్గర ఇంకా ఎన్నో జ్ఞాపకాల నిధి ఉందని నాకనిపించింది. ఒకే జీవితకాలంలో మనిషికి ఎన్నెన్ని అనుభవాలు కలుగుతాయి. మనిషి జీవితంలో ఎన్నెన్ని ఎత్తుపల్లాలు. ఒక్క క్షణంలో నిచ్చెన ఎక్కి పైదాకా పోతాడు. మరొక సారి అగాధంలో పడిపోతాడు. ఒక ప్రాణం వెనక ఎంతో జంజాటం ఉంటుంది. నిజం చెప్పాలంటే జీవితానికి మరొక పేరు జంజాటం.

ఆవిడ తన పని పూర్తి చేశాక లోకాభిరామా యణం మాట్లాడుకుంటూ కూర్చున్నాం. రెండు పెగ్‌లు తాగిన తర్వాత చెప్పడం మొదలెట్టింది ''బాబా నాకు పదేపదే రెండు కథలు చెబుతూ ఉండేవాడు. ఒకటి జడభర తుడి గురించి రెండోది మహావీరుని గురించి''

''ఆయన జైనమతం స్వీకరించిన సాధువా?''

''ఆయన జైనుడూ కాదు. మహమ్మదీయు డూ కాదు. క్రిస్టియన్ అసలే కాదు. 'నేను ఎందరినో నా గురువుల్నుగా చేసుకున్నాను. ప్రతీ ధర్మంలోని మంచినీ స్వీకరించాను' అంటూ చెప్పేవారు. ఆ బాబా ఎనిమిది రోజు లు తిండి లేకుండా ధ్యానంలో ఉండేవాడు''

''సరే... ఈ విషయాలన్నీ ఆధ్యాత్మిక జీవితా నికి సంబంధించినవి. వాటిని తరువాత తెలు సుకుంటాను. ముందు ఈ విషయం చెప్పండి. మీరు రెండోరోజు పాకీపని చేయడానికి బయ లుదేరారా? ఎటువంటి అనుభవాలు కలి గాయి? అప్పుడు మీకెట్లా అనిపించింది?''

''బాబుగారూ! ఇప్పుడు ఆ మాటలు విని మీరు దుర్గంధాన్ని పీల్చడం ఎందుకు? మని షికి ఎదురుగుండా ఒకే ఒక దారి ఉంటే మనం ఏది అసంభవం అని అనుకుంటామో అదే తప్పకుండా సహజం, సంభవం అయి తీరుతుంది. ఒకరోజు... రెండోరోజు... మూడో రోజు... రోజులు గడుస్తున్నాయి. నేను నా కొత్త జన్మలోని పనిని స్వీకరించాను. ఆ పని చేయ డానికి అలవాటు పడిపోయాను. క్రితం జన్మ లోని సంకోచం దూరమయిపోయింది. అవన్నీ మీకు వినిపించను. వాటిని గురించి మీకు చెప్పాలనీ నాకనిపించడంలేదు. ఇప్పటికి దాదాపు ఇరవై ఎనిమిది, ముప్పై సంవత్సరాల పాటు ఈ పని చేశాను బాబుగారు. కాని ఒక సత్యం మాత్రం చెప్పగలుగుతాను. మనిషి ఒకస్థితినుండి మరో స్థితికి మారాలంటే మాన సికంగా సంఘర్షణ పడవలసి వస్తుంది. శారీర కంగా కష్టపడాల్సి వస్తుంది. సమాజం కూడా అంతే! ఒక దశనుండి మరో దశలోకి రావా లంటే ఎన్నెన్నో ఆటుపోట్లకు తలవంచాల్సి వస్తుంది. నేను ఎంతోకాలం ఈ పని చేశాను. ఈమధ్య ఓ పదిహేను పదహారు సంవత్సరా లుగా ఈ పనిమానేశాను. అసహ్యకరమైన పని ఎప్పుడూ అసహ్యకరంగానే ఉంటుంది. ఆ పని చేసేవారికి కొంతకాలానికి సంకోచం అస హ్యం అన్నీ దూరం అవుతాయి. వాళ్ళు ఆ పనికి అలవాటు పడిపోతారు. అంతేకాని మన స్ఫూర్తిగా ఈ పనిని ఎవరూ స్వీకరించలే రు. ఈ బస్తీలో తమ పిల్లలు చదువుకోకపోతే తల్లితండ్రులు ఏమంటారో తెలుసా? 'చదవక

పోతే ఎట్లారా? పాకీ పనిలో బతకమని మీ ఖర్మలో రాసి ఉందేమో' అని. వీళ్ళు తమ వృత్తిని ఎంతో హీన దృష్టితో చూస్తూ తమనితా ము ఎంతో తిరస్కార భావంతో ఈ జాతిలో ఎందుకు పుట్టామో అనుకుంటూ ఉంటే నాకెంతో బాధగా అనిపిస్తుంది. బాబుగారూ... మీ ప్రపంచంలో, అగాధంలో పడిపోయి నిక్కష్టంగా బతికే ఎందరి జీవితాలో బాగుపడ్డాయి. నిన్నటివరకూ తెల్లవాళ్ళ కింద బానిసలుగా బతికిన ఆఫ్రికా ప్రజలు నేడు తామే యజమానులయ్యారు. ప్రపంచం అంతటా విప్లవం వర్థిల్లాలి, స్వతంత్రం కావాలి అన్న కేకలు వినిపిస్తూనే ఉన్నాయి. కాని మా వాళ్లకు మాత్రం ఏ ఒక్కరూ స్వతంత్రం ఇప్పించ లేకపోయారు బాబుగారూ..."

నేను సిగ్గుపడి తలవంచుకున్నాను.

"మీరందరూ చదువుకున్నవాళ్ళు, తెలివి కలవాళ్ళు, మేధావులు. ఎంతసేపూ మంత్రివ దవికో లేక మరే పెద్ద పెద్ద పదవులకోనమో ఎగబడుతూ వాటి చుట్టూ పిచ్చివాళ్ళలా తిరుగుతున్నారు. ఎవరైనా నిజాయితీగా ఆలోచించి ఇంటింటా ఫ్లష్ అవుట్ లెట్రిన్‌లు ఎందుకు కట్టకూడదు. మా వాళ్ళందరికీ మంచి పనులు చేసే అవకాశం కల్పించి వాళ్ళను బాగు చేయవచ్చుగా"

"చేయవలసిన పనులు ఎన్నో ఉన్నాయి నిర్గుణియాగారూ! ఒక వర్గం నుండి అధికారాన్ని చేజిక్కుంచుకోవాలన్న లోభత్వం మరో వర్గంలో ముందు పోవాలిగా. ఇప్పుడు పెద్ద కులం వాళ్ళు ఎవరో తెలుసా... పెద్ద పెద్ద పదవులలోఉన్న అధికారులు. ధనవంతులే! వాళ్ళముందు బ్రాహ్మణులయితేనేం మరెవరయితేనేం అందరూ తక్కువ కులం వాళ్ళ కిందే లెక్క"

"ఏ విషయంలోనైనా సరే పూర్తిగా మార్పు రావడం చాలా కష్టం. ఇవన్నీ తేలికగా అయ్యే పనులుకావు. మీరు మళ్ళీ ఆధ్యాత్మికం వైపు వచ్చానని అంటారేమో బాబుగారూ... కాని మీకు ఈ మాట ఇప్పుడే చెప్పాలి. మళ్ళీ మరచిపోతానేమో... బాబా ప్రాణం పోయే ముందు నన్ను తన దగ్గరికి రమ్మన్నారు. నేను ఆయన దగ్గర కూర్చున్నాను. ఆయన నా రెండు కనుబొమ్మల మధ్య గట్టిగా గిల్లారు. నా రెండు కళ్ళమీద చేత్తో నిమిరారు. క్రితం జన్మలో నీవు నా కూతురివి. ఎంత రాసిపెట్టి ఉందో అంతా నీకిచ్చాను. ఇహ నేను ఈ జన్మ నుండి ముక్తి పొందుతున్నాను, అన్నారు"

"అతడి ప్రభావం మీ మీద పడిందా?"

"ఏం చెప్పను బాబుగారూ... నాకు తెలిసిందేదో చెబుదామనుకున్నా నా దగ్గర అంత తెలివిలేదు. అంతభాషలేదు. అన్ని శబ్దాలు లేవు"

నేను మాట మార్చేశాను "మరి ఆ తరువాత? మసీతారామ్?"

"నేను మొట్టమొదటిసారిగా పనిచేసి ఇంటికి తిరిగి వచ్చేనరికి మసీతారామ్ ఈ లోకం వదిలి వెళ్ళిపోయాడు. గుల్లన్ పెద్దగా ఏడుస్తోంది. మసీతా శవాన్ని పట్టుకుని నేను వెక్కివెక్కి ఏడ్చాను. ఆయనే లేకపోతే నా గతి ఏమయ్యేది. ఆ ఆపద సమయంలో అతనేగా నాకు ఆసరా ఇచ్చాడు. నేను నా అనుభవం మీద చెబుతున్నాను బాబుగారూ... వెలుగు కావాలని కోరుకునే వారి దగ్గరకు భగవంతుడు తప్పకుండా వస్తాడు. ఒకసారి సూర్యుడి రూపంలో అయితే మరొకసారి ప్రమిదలోని జ్యోతి రూపంలో.

"మసీతారామ్ చనిపోయాక గుల్లన్‌కి మీకు మధ్య ఎటువంటి గొడవా రాలేదా?"

"ఊహు...అటువంటిది ఏదీ రాలేదు. నేను ఆమెను నా దగ్గరే ఉండమన్నాను"

"స్కూల్ నడుస్తోంది. నబ్బూ దీనికి సంబంధించిన పనేదైనా చేస్తానంటే అడ్డు చెప్పకు. నీది నాది ఏముంది. ఈ ఇంటికింద మన ఇద్దరికి ఇంత నీడ దొరికితే చాలు" అన్నాను. గుల్లన్ నన్ను గట్టిగా పట్టుకుంది. ఇప్పటికీ ఆమె అన్న ఓ మాట నాకు అర్థం కావటం లేదు "మరో విధంగా అనుకోకు కోడలా! మసీతా చనిపోయాక నేను రెండోసారి విధవనయ్యానని, అనిపిస్తోంది. మా ఇద్దరి మధ్య వేళాకోళాలు, పరిహాసాలు, నవ్వులు తప్ప మరొక సంబంధం లేనేలేదు. అయినా ఎందుకో నబ్బూ తండ్రి చనిపోయినప్పటికన్నా మసీతా చనిపోయాక నాకెందుకో చాలా బాధ అనిపిస్తోంది" అందామె!

"మరి మీ మోహన్?"

"ఒకసారి వచ్చాడు. నేను పూర్తిగా మారి పోయి పాకీ పనిచేస్తున్నానని తెలిసి ఎంతగానో సంతోషపడ్డాడు. అప్పటినుండి నన్ను మన స్ఫూర్తిగా ప్రేమించడం మొదలుపెట్టాడు. ఓ రోజు క్రిస్టియన్ ఫాదర్‌లా డ్రెస్ వేసుకుని నకిలీ గడ్డం పెట్టుకుని మారువేషంలో వచ్చా డు. ఒకటిన్నర రోజు ఉన్నాడు. [illegible]కి రెండు వేల రూపాయలు ఇచ్చి జాగ్రత్తగా ఉండమని చెప్పాడు. వెళ్ళేటప్పుడు బొంబాయిలో మాట్లా డే బైస్కోప్ తయారు అవుతోందని చెప్పాడు. ఏ రోజున నగరంలోకి అది వస్తుందో ఆరోజు నీకు చూపించడానికి వస్తాను అన్నాడు"

"మరి వచ్చారా?"

"ఆ... వచ్చాడు"

"వెళ్ళేటప్పుడు మీకు డబ్బు ఇచ్చి వెళ్ళా రా?"

"ఇచ్చాడు ఓ వేయి రూపాయలు. శకుంతల ఖర్చుకోసం. 'నీవు గ్లాసు నింపుకుని తాగుతున్నప్పుడు నీ పక్కన కూర్చుని నీ పెదాల అమృతాన్ని నేను తాగుతున్నానని అనుకో...' అని కూడా చెప్పాడు"

"మీరు చెప్పేఈ మాటలు మళ్ళీ ఆ బాబాని గుర్తు చేస్తున్నాయి"

"నిజమే బాబుగారూ... బాబా ఏమాట అయితే రెండు సంవత్సరాల తరువాత చెప్పా డో అదే మాట నా మోహన్ ప్రేమగా తన పద్ధతిలో చెప్పి వెళ్ళిపోయాడు"

"ఆ పని చేసే రోజుల్లో మీకు కలిగిన తీపి చేదుల అనుభవాలని కాగితం మీద పెట్టమని ప్రార్థిస్తున్నాను"

"ఇక ఇప్పుడు రాయడం గీయడం కుదర దుకానీ, బాబుగారూ మీరు రేపు రండి. ఇంకా కొన్నివిషయాలు చెబుతా. నేను ఎన్నెన్నో చూశా ను. యౌవనంలో ఉన్న అందమైన ఆడది బయటకి వస్తే ఆమెను ప్రపంచం తన నోటి ముందున్న ముద్దలాగా మాత్రమే చూస్తుంది. నిప్పులమీద నడిచే నటులను మీరు ఎప్పు డైనా చూశారా? కణకణ మండే నిప్పులమీద వాళ్ళు నడుస్తారు. కానీ పాదాలు కాలవు. నేనూ అంతే! ఓ అభినేత్రిని అయ్యాను బాబుగారు... ఒకటి రెండు బొబ్బలు ఎక్కిన మాట వాస్తవమే కాని ఆ నిప్పుల మీద నడిచి ఏ మాత్రం నష్టం కలగకుండా బయటపడ్డాను. సరే భోజనం చేయండి పండితులుగారూ..."



మర్నాడు మధ్యాహ్నం నిర్గుణియా దగ్గరికి వెళ్ళాను. వెళ్ళేటప్పుడు నా భార్యకి నా ప్రో గ్రాం గురించి చెప్పాను. 'ఆతాగుబోతుతో మాట్లాడండి. ఆమె మనస్సును నిద్రలేపండి. ఈ విషయంలో నేనేమీ అనను. కాని మీరు మాత్రం ఈ వృద్ధాప్యంలో రోజూ తాగడం అలవాటు చేసుకోవద్దు. లేకపోతే ఈ కరువు రోజుల్లో దివాలా తీస్తాం' అన్నది కాంత.

"జన్మంతా ఈతి బాధలతోనే గడిచింది. ఆకాశాన్నంటుతున్న ధరలను స్వీకరిస్తూనే గడి పాముగదా. నేనిహ ఈ ముసలితనంలో తాగు బోతునెట్లా అవుతాను చెప్పు" అన్నాను నవ్వు తూ.

నిర్గుణియా ఇంట్లో ఆమె తన కొడుకు కోడళ్ళతో కబుర్లు చెబుతోంది. నేను వెళ్ళగానే ఆహ్వానించారు. కోడలు నీలమ్ తన భర్త ఆఫీసులో ఒక గొడవలో ఇరుక్కున్నాడని చె ప్పింది. ఆఫీస్‌లో స్టాఫ్ తులసీజయంతి రో జున జయంతి జరపాలని అనుకున్నారు. కానీ ఇతనికి అది ఇష్టంలేదు. ఆఫీసు సెక్యూలర్ కాబట్టి, ఒక మతానికే సంబంధించిన కార్యక్ర మాలు చేయకూడదు అని అతడి అభి ప్రాయం. ఇటువంటి కార్యక్రమాలు జరపకూడ దని అతడు నోట్ పుటప్ చేశాడు. బైన్ సింహ్ అనే వ్యక్తి ఇతడికి వ్యతిరేకంగా పైవాళ్ళకి

రాశాడు. అతడు ఫుడ్ సెక్రటరీ లాల్‌ని కలిశాడు. రెవెన్యూ మినిస్టర్‌ని ఈ ఫంక్షన్‌కి పిలిచారు. తులసీ జయంతి ఆరోజు ఎంతో గొప్పగా జరిపారు. తన ఆర్డర్‌కి వ్యతిరేకంగా ఈ ఫంక్షన్ ఎట్లా చేశారో ఎక్స్‌ప్లనేషన్ ఇవ్వమని నిర్గుణ్‌మోహన్ అతడిని అడిగాడు. ఈ విషయం మీద పదిరోజుల నుండి ఆఫీసులో మహాభారత యుద్ధం జరుగుతోంది. ఫుడ్ సెక్రటరీ నిర్గుణ్ మోహన్‌ని పిలిచి నిన్ను ట్రాన్స్‌ఫర్ చేస్తానని, డిగ్రేడ్ చేస్తానని బెదిరించాడు. నిర్గుణ్‌మోహన్ హరిజన మంత్రి దాస్‌గుప్తకి అన్ని సంగతులు చెప్పాడు. పైజాతులవాళ్ళు వాళ్ళవాళ్ళ కల్చర్‌ని వ్యాపింపచేస్తున్నారని, తులసీదాస్ హిందూ ధర్మాన్ని రామాయణం ద్వారా ప్రచారం చేశాడని, ఇక భారతదేశాన్ని ధర్మ నిరపేక్షరాజ్యం అని అనడంలో అర్థం లేదని నిర్గుణ్‌మోహన్ అతడితో అన్నాడు. రాష్ట్ర మంత్రికి కూడా నిర్గుణ్‌మోహన్ మీద చాలా కోపం వచ్చింది. హరిజన మంత్రేమో నిర్గుణ్ మోహన్‌ని బైన్‌సింహ్‌తోటి రాజీపడమనీ, తన ఆర్డర్స్ వెనక్కి తీసుకోమనిచెప్పాడు. నిర్గుణ్ మోహన్ తన కోపాన్ని నా దగ్గర వెళ్ళకక్కాడు

"అంకుల్ ఈ పైకులాలవాళ్ళందరూ కేవలం వాళ్ళ సంస్కృతిని మాత్రమే వ్యాపింపచేస్తారు. సెక్యూలరిజంకి వాళ్ళు వ్యతిరేకులు"

అతడి ఈ అభిప్రాయం విన్నాక నాకు నవ్వు వచ్చింది. నిర్గుణియాకి కోపం వచ్చింది.

"మన పూర్వజుడు వాల్మీకి ఎంతో గొప్పవాడు. తులసీదాస్ అవనీమరేదాస్‌కాని ఆ గ్రేట్ జీనియస్ ఎంగిలేగా" నవ్వుతూ అన్నాడు నిర్గుణ్‌మోహన్.

"రాముడి కథ కూడా వాల్మీకి సొంతంగా రాయలేదు. నిర్గుణ్‌మోహన్‌గారూ... ఆయన కూడా ఎక్కడో ఒకచోట రామకథ వినే ఉండాలి. వాల్మీకి కూడా బ్రాహ్మణుడే అన్న విషయం మీరెందుకు మరచిపోతారు? మహాత్ములను గురించి తలాతోకలేని విమర్శలని చేస్తే నాకు చాలాకోపం వస్తుంది. వాల్మీకి అయితేనేం... తులసీదాస్ అయితేనేం... బుద్ధుడు, మహమ్మదు, క్రీస్తు ఎవ్వరైనా సరే ఒక జాతికి, దేశానికి,. కులానికి సంబంధించిన వాళ్ళు కానేకాదు. రామ చరితమానస్, బైబిల్, కురాన్, ఈ పవిత్రగ్రంధాలన్నీ అందరికీ మంచినే నేర్పిస్తాయి. అందరికీ హితం చేస్తాయి. అందరిని మంచి దారిలో నడవమని బోధిస్తాయి"

"బాబుగారూ! వీడు కోపంలో ఏదో కూస్తాడు గానీ మీరేమీ అనుకోవద్దు. నేను వీడి చిన్నప్పుడు స్నానం చేసి రామాయణం చదివి హారతి ఇచ్చేదాన్ని. తరువాత భోజనం చేసేదాన్ని. వీడినే అడగండి... తులసీదాస్ ప్రభావం వీడి మీద పడకుండా ఎట్లా ఉంటుంది. బాబుగారూ... మీరే ఏదో ఒక ఉపాయం చెప్పండి. వీడు పట్టుదల కలవాడు. ఉద్యోగానికే ఎసరు తెచ్చుకుంటున్నాడు. బాబుగారూ... మీకు శర్మగారు తెలుసుకదా... మీరు ఆయన మనస్సు మార్చగలరు. నా మీద దయచూపించండి"

నిర్గుణియా ప్రార్థనను నేను కాదనలేకపోయాను. మంత్రిగారికి ఫోను చేశాను. ఆయన నన్ను తనని కలవమని చెప్పాడు. నేను నిర్గుణియాని తీసుకుని ఆఫీస్‌కి వెళ్ళాను. నిర్గుణియా దళితులకు చదువుచెప్పి వాళ్ళసేవ చేసిందని అక్కడ కొందరికి తెలుసు. ఆమె మంత్రిగారితో మాట్లాడింది. పనిపూర్తి చేసుకుని మేం బయటపడ్డాం.

"బాబూగారూ! ఈ భారతదేశంలో కులమతబేధాలు పోయి సమానత్వం వస్తుందంటారా?" ఆమె అడిగింది.

"ఇన్ని సంవత్సరాల మన చరిత్రను మారుతున్న జీవనక్రమాన్ని చూశాక మరో వంద సంవత్సరాల తరువాత ఈ వర్ణవ్యవస్థ పూర్తిగా నాశనం కావచ్చుననిపిస్తోంది. ఇంతకు ముందు అగ్రవర్ణాలవాళ్ళు ప్రేమవివాహాలతో కులగోత్రాల గీటుని దాటారు. వాళ్లావిధంగా చేసి ఎన్నో కష్టాలు పడ్డారు. ఇప్పుడైతే అగ్రవర్ణాల వాళ్లలో అంతర్జాతీయ వివాహాలు కూడా జరుగుతున్నాయి. కులం మతం అడ్డుగోడలుగా నిలువలేకపోతున్నాయి. హిందువులు, మహమ్మదీయుల మధ్య కూడా వివాహ సంబంధాలు ఏర్పడుతున్నాయి. కానీ ఒక విషయం నిజం. ఈ కులమమతభేదాల వేళ్ళు జనంలో బాగా పాతుకుపోయాయి. ఈ వేళ్లని పూర్తిగా పెకిలించి పారేయడం చాలా కష్టమైన పని.

★ ★ ★

నేను నిర్గుణియాతో వాళ్ళ కాలనీకి దగ్గరగా

ఉన్న రోడ్డుమీదకు వచ్చాను. అక్కడినుండి నిర్గుణియా ఇంటికి వెళ్ళాలంటే జీపుని కాలవ దగ్గర మలుపుతిప్పాలి. కానీ అక్కడ రోడ్డంతా జనంతో కిటికిటలాడిపోతోంది. మొహర్రమ్ ఊరేగింపు జరుగుతోంది. ఇకముందుకు పోవడం కష్టం అని అనిపించింది. "బాబుగారూ... జీపు ఇక్కడ వదిలేసి వెళ్దాం. ఈ సందుగొందుల్లోంచి వెళ్తే [illegible] తొందరగా చేరుకుంటాం" అందామె. అక్కడంతా బురదగా ఉంది. నెమ్మదిగా ఆ బురదమీద కాలుపడకుండా దాటాం. అక్కడ ఒక ఇంటిమీద మోహన్ బ్రాస్ బాండ్ కంపెనీ అన్న బోర్డు ఉంది. మోహన్ అనే పేరు చూడగానే "ఈ కంపెనీని మీ మోహన్ పేరుమీదనే తెరిచారు కదూ!" అనడిగాను.

ఆమె నవ్వింది "ఆ పేరయితే నా మోహన్‌దే. కానీ ఇప్పుడు ఆ మోహన్ జగ్‌మోహన్ అయ్యాడు"

"ఈ కంపెనీకి యజమాని మీరేకదూ..."

"దీనికి ఎవరూ యజమాని కాదు. బాజాలు వగైరా నేనే కొని పంచాయతీ సమితికి ఇచ్చేశాను. నేను పెట్టిన పెట్టుబడి వచ్చే ఆదాయాన్ని బట్టి వసూలు చేసుకుంటాననీ, వడ్డీలేదనీ చెప్పాను. వసూలయిన డబ్బుని బాంక్‌లో వేశాను. ఇప్పుడు దానితో నాకు పెద్దగా సంబంధంలేదు. లెక్కలలో ఏవైనా గొడవలు వస్తే మాత్రం నన్ను పిలుస్తుంటారు"

కొంచెం దూరంలో ఉన్న ఓ ఇంట్లోంచి అరుపులు, కేకలు, ఏడుపులు వినిపిస్తున్నాయి. నా చెవులు నిక్కపొడుచుకున్నాయి. కాలవ దాటుతూ ఉంటే నిర్గుణియా నావైపు చూసి చిరునవ్వు నవ్వింది. "ఈ బస్తీలో ఇరవై నాలుగు గంటలూ ఇట్లాంటి తమాషాలు జరుగుతూనే ఉంటాయి బాబుగారూ... ఇక్కడ ఆడది రోజూ చస్తూనే ఉంటుంది. తన్నులు తింటూనే ఉంటుంది. ప్రపంచంలోని బాధలన్నింటినీ భరించాలంటే బలహీనులకు సారా తప్పితే మరో మందు లేదు. పైనలకోసం అందరికింద బానిసగా బతికే మొగాడు కూడా ఇంటి దగ్గర ఆడదాన్ని బొమికెలు విరగ్గొడుతూనే ఉంటాడు. పాపం వాడు మాత్రం ఏం చేస్తాడు?"

"నీవు నాతో రావల్సిందే... నిన్ను పాతేస్తాను... పాతేస్తా..." అనే బూతుతిట్లూ, అరుపులూ, ఏడుపులూ, పెడబొబ్బలూ వినిపిస్తున్నాయి.

నిర్గుణియా వేగంగా నడుస్తూ ఆ ఇంటి దగ్గరకి వెళ్లింది. ఇంటిముందు నలుగురైదుగురు పిల్లలు నిల్చుని తమాషా చూస్తున్నారు. ఆ పాకీవాడు తన భార్యని పడదోసి ఆమెమీద పడి గొంతుపిసకబోయాడు. ఇంతలో నిర్గుణియా ఒక్క అంగంలో ముందుకువెళ్ళి అతడి చెంపమీద గట్టిగా ఓ లెంపదెబ్బకొట్టి తన రెండు చేతుల్తో అతడి భుజాలను పట్టుకుని కిందకు పడతోసింది. "ఒరేయ్... దీన్ని చంపేసి ఉరికంబం ఎక్కుదామనుకున్నావా? ఓరి మగనక్కల్లారా అట్లా చూస్తూ నిల్చున్నారేమిటి? నీళ్ళు తీసుకురండిరా... అమ్మకి తాగించండిరా... వీడిని... ఈ చచ్చినాడిని వెంటనే పోలీసులకి పట్టించండి"

ఆమె బెదిరింపులు, అదిరింపులు వాతావరణాన్ని కొంత మార్చాయి. అతడు ఏడవడం మొదలుపెట్టాడు. "పిన్నీ! పోలీసులకి పట్టించడం ఎందుకు? ఉరికంబం ఎక్కిస్తే పోలా... పిన్నీ! నన్ను ఉరికంబం ఎక్కించు. ఉరికంబం ఎక్కడానికేగా ఆడదాన్నీ, పిల్లవాడినీ చంపేస్తున్నాను. ఈ ప్రపంచంలో నేను బతకలేను. నాకు చావాలని ఉంది... నాకు చావాలని ఉంది..."

నిర్గుణియా, నేనూ అతడిని ఓదార్చడం మొదలుపెట్టాము. అతడి గురించి కొన్ని విషయాలు సేకరించాను. అతడు గర్భదరిద్రంలో అల్లాడిపోతున్నాడు. జీతం నూటఅరవైరూపాయలు. దాంట్లో వందరూపాయలు షావుకారు గుమాస్తా గుంజుకుపోతాడు. ఇరవైఅయిదు రూపాయలు గవర్నమెంట్ లోనుక్రింద నెల నెలా కట్ అవుతుంది. జమాదార్‌కి మరో ఇరవైఅయిదురూపాయలు ఇవ్వాలి. మిగిలిన రూపాయలతో వాడి ఇల్లు ఎట్లా గడుస్తుంది. బాధను మరచిపోవడానికి తాటికల్లు తప్పితే మరో మందులేదు. ఈ గర్భదరిద్రంతో అతడిలో వేదాంతం పుట్టుకువచ్చింది. ఇల్లూవాకిలి మాయా మోహాలు వదిలేసి పెళ్ళాన్ని పిల్లలని చంపేసి తను చచ్చిపోతే తనకు ముక్తి దొరుకుతుందనుకున్నాడు.



నిర్గుణియా అతడిని బాధపడవద్దని చెప్పింది. ఈ నెలరోజుల తిండీ తనే ఏర్పాటు చేస్తానంది. వాళ్ళిద్దరూ ఒకటై నిర్గుణియా కాళ్ళమీద పడ్డారు. మేం ముందుకు అడుగులు వేయబోతున్నంతలో అతడు అన్నాడు-
''పిన్నీ! నువ్వు ఎన్నిరోజులని పెడతావు. పాకీవాడు రుణగ్రస్తుడయ్యే పుడతాడు. మళ్ళీ ఆ రుణం తీర్చడంలోనే ప్రాణం వదిలేస్తాడు. ఇవాళ ఈ షావుకారు జమాదార్లయితే రేపటి రోజు మరొక ధనవంతుడు మనలని తన కాళ్ళకింద నలిపేస్తాడు. మనకు చావు తప్పదు''

ఇవన్నీ విన్నాక నా మనస్సు చాలా బాధపడ్డది. ఒకప్పుడు నేనూ ఎన్నో కష్టాలు అనుభవించాను. కానీ నేను పడ్డ కష్టాలకుగాను నాకు తగిన న్యాయం చేకూరిందనే చెప్పాలి.

నేనూ నిర్గుణియా ఆమె ఇంట్లోకి అడుగుపెట్టాము. ఆవిడ తలుపులు తెరిచి లైట్ వేసింది.

మున్నీబేగం బస్తీలోని కొందరు యువకులు తరతరాలనుండి తాము అనుభవిస్తున్న బానిసత్వాన్ని చూసీ, ప్రపంచం చేస్తున్న అత్యాచారాలను చూసీ ఎంతో ఆవేశపడ్డారు. తక్కిన హరిజనులకి రకరకాల లాభాలు ఉన్నాయి. కానీ మా కులంవారికి... ఏం దొరుకుతుందని? ఇంత మట్టి తప్పితే... అన్నారు. హరిజనులకన్నా కూడా తాము ఎంతో తక్కువ అన్న హీనభావం మా వాళ్ళలో ప్రతీవాడిలోనూ ఉంది. వాళ్ళలో ఎనిమిదోతరగతిదాకా చదివిన వాళ్ళూ ఉన్నారు. వీళ్ళకి ఎన్నో కారణాలవలన చదువుకునే అవకాశం లభించదు. పరిస్థితులకు లొంగిపోయి తమ పూర్వజుల వృత్తినే స్వీకరిస్తారు. మాట్లాడేటప్పుడు మనకు ఎన్నో ఇంగ్లీషు మాటలు వినిపిస్తాయి. వాళ్లలో ఒకరిద్దరు బి.ఎ.దాకా చదివినవాళ్లు ఉన్నారు. చింతామణి అనే వ్యక్తి ఎమ్.ఎ. ఉత్తీర్ణుడయి మెజిస్ట్రేట్ పరీక్షకి కూడా కూర్చున్నాడు. ఆ పరీక్షలో కూడా ఉత్తీర్ణుడయ్యాడు. రిజర్వేషన్ల కోటాలో కాదు ఓపెన్ కాంపిటీషన్‌లో అతడు ఉత్తీర్ణుడయ్యాడు. ఒకతను లా చదివి ప్లీడర్ అయ్యాడు. కానీ అతడి దగ్గరికి ఎవరూ రాకపో

వడంవలన ఉద్యోగం చేయకతప్పలేదు. ఎంతోమంది ఎత్తయిన గోడలను, కోటలను సైతం అధిగమించి తమ గమ్యంవైపు సాగిపోవడానికి ప్రయత్నిస్తారు. కాని వాళ్లు కూడా చివరికి పురుగులలాగానే బతకక తప్పడంలేదు. వీళ్ళ బతుకులు ఎందుకిట్లా ఉన్నాయి. ఇది దైవనిర్ణయమా... ఊహు కానేకాదు... ఇది కుళ్ళిపోయిన మన సామాజిక వ్యవస్థ ఇచ్చిన దానం. ఈ వ్యవస్థలో మార్పురావాలి!

నిర్గుణియా తన రెగ్యులర్ ప్రోగ్రాం మొదలుపెట్టింది. నన్ను తాగమని బలవంతం చేసింది. నేను నిరాకరించాను.

"ఆ గొడవ చూశాక మీకు చాలా బాధ కలిగిందనిపిస్తోంది. ఆ విషయాన్ని మరచిపోండి" అంది.

"ఈ నగరంలో మీరు ఎప్పటినుండి ఉంటున్నారు నిర్గుణియాగారూ..." అనడిగాను.

"మోహన్ చనిపోయాక బహుశా రెండు మూడు నెలల తరువాత ఇక్కడికి వచ్చివుంటాను"

"ఎందుకు వచ్చారు?"

నిర్గుణియా చిరునవ్వు నవ్వింది. "శర్మగారూ! ప్రియుడి స్థితిమారిపోతే ప్రియురాళ్ళ రాతకూడా మారుతుందిగా... శానిటరీ ఇన్స్పెక్టర్ అయిన శ్యామ్ మనోహర్‌లాల్‌కి ఇక్కడ చీఫ్ శానిటరీ ఇన్స్పెక్టర్ అయ్యే అవకాశం వచ్చింది. వెళ్ళేటప్పుడు సభలు సన్మానాలు జరిగాయి. నేను ఆయనను కలుసుకోవడానికి వెళ్ళాను. యూ ఆల్సో కమ్ విత్‌మి" అని ఆయన అన్నారు.

"నిర్గుణియాగారూ... మీ ఇద్దరి మధ్య కూడా..."

ఆమె నవ్వింది... "నిప్పులమీద నడిచే మనుషులని మీరెప్పుడైనా చూశారా?"

"ఆ.... చూశాను..."

"మోహన్ లేకుండా... జీవితం అంతా నేను నిప్పులమీద నడిచాను బాబుగారూ... ఆడది తలచుకుంటే వేశ్యలాగా ప్రవర్తించినా కూడా పవిత్రంగానే ఉంటుంది"

"మిమ్మల్ని అర్థం చేసుకోగలను నిర్గుణియాగారూ... మరి ఆ తరువాత ఏమయిందో చెప్పండి"

"వాడు నేనంటే పడిచచ్చేవాడు. వాడిని నేను నా స్వార్థంకోసం కట్టేసి ఉంచేదాన్ని. వాడు భార్యకి భయపడేవాడు. నా వాళ్ళందరు చనిపోయారు. డాక్టర్. ఎండర్‌సన్ శకుంతలని తీసుకుని లాహోర్ వెళ్ళిపోయారు. అప్పటికి నా కొడుకు మూడునెలల పిల్లవాడు"

"నాకు కొంచెం ఓ క్రమంలో చెప్పండి నిర్గుణియాగారూ! మీరు డైరీలో వ్రాసినట్లు నాకు గుర్తు. డాక్టర్ ఎండర్‌సన్‌మీద మీకో మీమీద ఎండర్‌సన్‌కో మనస్సు మళ్ళిందని..."

"ఆ... ఆ... గుర్తుకువస్తోంది. నిజమే బాబుగారూ.... నిప్పులమీద నడిచేటప్పుడు అదొక్కటే వచ్చిన పెద్ద బొబ్బ. ఒకటి రెండు బొబ్బలు తగిలాయనుకోండి వాటిని గురించి మీరు వింటానంటే తరువాత చెబుతాను"

"అసలు నేనివాళ వచ్చింది అందుకేగా..."

"ఎండర్‌సన్ క్రిస్టియన్ ఫాదర్. అతడిది పూవులాంటి మనస్సు. అలాంటివాడిని మరొకడిని చూడలేదు. మొట్టమొదటిసారి మసీతాని చూపెట్టడానికని అతడిని కలిశాను"

"మీరు స్కూల్ తెరిచారా? మరి దాని సంగతేమయింది?"

"ఆ స్కూల్ ఎంతో బాగా నడిచేది. దాని పేరు వాల్మీకి మందిరం. బోర్డు రాయించడానికి నేను అయిదురూపాయలు ఇచ్చాను. వేద మందిరంలాగానే వాల్మీకి మందిరం సమాజసేవకి అంకితం కావాలని సబ్బూతో చెప్పాను. దాని బాధ్యత అంతా అతడిమీదే వేశాను. మసీతా తన ఇంటిని నాపేర వ్రాశాడు. శారదానంద్ విద్యామందిరం, వాల్మీకి మందిరం రెండూ ఆరోజుల్లో ఎంతో బాగా నడిచాయి. ఈ పనులన్నీ చేస్తూ మనస్సును ఆహ్లాదకరంగా ఉంచుకోవడం కోసం సాయంత్రం ఎండర్‌సన్ గారి దగ్గర ఇంగ్లీషు నేర్చుకోవాలన్న నెపంతో బయటపడేదాన్ని. ఆయన దగ్గరికి వెళ్ళడం ఒక అలవాటుగా మారిపోయింది. ఒకరోజు ఎండర్‌సన్ చదువు చెబుతూ... చెబుతూ... ఆపుచేసి తదేకంగా నావంక చూడటం మొదలుపెట్టాడు. కళ్ళతో కళ్ళు కలిశాయి. నాకు మత్తెక్కినట్లుగా అనిపించింది. ఇవాళ మీతో

నిజం చెప్పనా... నా మనస్సులో మాట చెప్పనా... ఆరోజు కనక ఆయన నాచేయి పట్టుకుని ఉంటే నేను ఒద్దని అనగలిగేదాన్నికాదేమో...

"నిర్గుణ్ నీ కళ్ళల్లో నాకు ఓ దేవదూత కనిపిస్తోంది" అన్నాడు. నేను అతడి చేతిమీద చేయివేశాను. "ఈ దేవదూతకు తననీడ మీలో కనిపిస్తోంది" అన్నాను.

అతను తన చేతిని వెనక్కి లాక్కున్నాడు. "నేను కాను... దేవదూత నీలోనే ఉంది" అన్నాడు. అతని మాటలు వినగానే నేను నా గుర్రాన్ని కట్టేశాను..." అంటూ ఆమె గ్లాసు చేతిలోకి తీసుకుంది. ఆమె చూపులు స్థిరంగా నిలిచిపోయాయి. పాతజ్ఞాపకాల చిరునవ్వులు ఆమె పెదవులమీద సగం విచ్చుకున్న మొగ్గల్లా ఎంతో అందంగా కనిపిస్తున్నాయి. ఆయన నావంక పిచ్చిగా చూస్తూ ఇంగ్లీషులో ఎన్నో పద్యాలు చెబుతూ ఉండేవాడు. ఆయన నన్ను పెళ్ళి చేసుకుని అమెరికాకి తీసుకువెళ్తానని అన్నాడు. బ్రాహ్మణులు పాకీవాళ్ళు అన్న బేధంలేని వేరేదేశంలో నన్ను తీసుకువెళ్ళి నాకు కొత్తజీవితాన్ని ప్రసాదించాలని తహతహలాడాడు. కానీ ఎండర్‌సన్‌ని మోహన్ ఏడు సముద్రాలు దాటైనా సరే వచ్చి చంపుతాడు. నేను భరించలేను..."

"మీ నరాలను మనస్సును రంపంలా కోస్తున్న ఆ బాధను నేను తెలుసుకోగలిగాను నిర్గుణీయాగారూ... నిజం చెప్పాలంటే మీ మనస్సులో మీరు ప్రేమకి పరిభాష ఏమిటా అని ఇన్నాళ్ళూ, ఇన్నేళ్ళూ శోధించారు. మీలో ఒక పతివ్రతరూపం ఉంది. కామంతో పీడింపబడే ఒక స్త్రీరూపం ఉంది. ఒకే మనిషిలో విరోధప్రకృతి కల ఈ రెండురూపాలు ఉండటంవలన మీలో ఆరనిగాయంలా సంఘర్షణ జరుగుతూ ఉండేది"

"నిజమే బాబుగారూ! పతివ్రతగానే బతకాలి అని నా మనస్సు అనుకునేది. కానీ శరీరం తన కోరిక తీర్చుకోవాలని నన్ను పదేపదే రెచ్చకొట్టేది"

"మీరు మీ రోజువారీ పనిమీద వెళ్ళినప్పుడు తక్కిన మీ వృత్తిలోని స్త్రీలను ఏడ్పించినట్లుగానే, పురుషులు మిమ్మల్ని కూడా వాళ్ళ చేష్టలతో, అధికారబలంతో లొంగదీసుకోవాలని ప్రయత్నించలేదా?"

"బయట నేను ఎన్నెన్నో సమస్యలను ఎదుర్కొన్నాను. అలాంటప్పుడు నాకు ఎవరో ఒకడి ఆసరా కావాలని అనిపించేది. నాకు ఎండర్‌సన్ దేవుడిలా కనిపించేవాడు. ఆయన నన్ను క్రిస్టియన్ మతం పుచ్చుకోమని ఎన్నోసార్లు అడిగాడు. కాని నాకు తాతగారు చెప్పిన భగవద్గీతలోని ఒక శ్లోకం మాటిమాటికి గుర్తుకు వచ్చేది. 'స్వధర్మే నిధనం శ్రేయమ్ పరధర్మో భయావహః' అనాటి సంగతులు గుర్తుకి వస్తే నాలో ఒక తుఫాను లేస్తుంది బాబుగారూ... బానిస స్త్రీ ఈ మొగాళ్ళ ప్రపంచంలో మసలేటప్పుడు ప్రతి నిమిషం ముప్పైరెండుపళ్ళ మధ్య ఉన్న నాలుకలా నడుచుకోవాల్సివస్తుంది. ఒకాయనుండేవాడు. మీలాగానే ఖాదీ బట్టలు వేసుకునేవాడు. వాడు మీలాగే ఒక రచయిత, వాడు నన్ను ఉద్ధరిద్దామనుకున్నాడు. మరో భావూలాల్ ఉండేవాడు. వాడి దృష్టినుండి కూడా ఎట్లాగొట్లా బయటపడ్డాను. ఈ జీవితంలో ఎందరి ముఖాలో... ఎన్ని మాటలో... ఎన్ని సంఘటనలో... చూశాను. విన్నాను... మనిషి తన జీవితంలో ఏవేవో కావాలని కోరుకుంటాడు. జీవితం బొంగరంలాంటిది. బొంగరాన్ని విసరండి కొంచెంసేపటివరకు ఒకటే గిరిలో అది తిరుగుతూ ఉంటుంది. నాట్యం చేస్తూ ఉంటుంది... నాట్యం చేస్తూ చేస్తూ... అలసిపోతుంది.... అలసి కిందపడిపోతుంది. దొర్లిపోతుంది... అబ్ మై నాచ్యో బహుత్ గోపాల్... కామక్రోధకా పహరిబోలనా కంఠ విషైకిమాల్... అబ్ మై నాచ్యో బహుత్ గోపాల్..."

"ఆ... అవును... అబ్‌హం నాచ్యో బహుత్ గోపాల్... నేనూ జీవితంలో ఎన్నో కటు అనుభవాలను పొందాను. అయినా... మీరు మీ జీవిత కథ వినిపించి హిమాలయాలపైన గౌరీశంకర్ శిఖరంనుండి సముద్రం అట్టడుగున ఉన్న నేలదాకా నాకు చూపించారు. మీ నోటివెంట సంస్కృతశ్లోకాలు, కబీర్ తులసీ, నానక్ మొదలగు యోగులు వ్రాసిన పంక్తులు, దానితో పాటుగా సంకోచం లేకుండా వెలువడే అశ్లీలమైన బూతులు..."

"కమలం బురద రెండు కలిసే ఉంటాయి

బాబుగారూ... ఉదయం రాత్రి గర్భంనుంచే జన్మిస్తుంది. రాత్రి ఉదయం గర్భంలోంచి... మరి ఇందులో ఎవరు తల్లి? ఎవరు బిడ్డ? పెరుగు చిలికితే వెన్న వస్తుంది. పాలదగ్గర నుండి నెయ్యిదాకా ఒకేరూపం... మోహనుడు ఒకడే... వాడే మనలందరిని రకరకాలుగా ఆడిస్తాడు... నా మోహన్... నా మోహన్...''

''మీరు మళ్ళీ మోహన్‌ని ఎప్పుడు కలిశారు?''

''ఒకరోజు కాబూలీ పఠాన్ వేషంలో ఇంటికి వచ్చాడు. ''నిర్గుణ్ పద, మనం ఇద్దరం మాట్లాడే బైస్కోప్ చూద్దాం'' అన్నాడు. ''ఆ తెల్లవాళ్ళ మాయ చూద్దామనే నేను ప్రాణం అరచేతిలో పెట్టుకుని వచ్చాను... త్వరగా తయారవ్వు...'' అన్నాడు మోహన్.

''పోలీసులు వెంబడిస్తున్నారా?'' అని నేను అడిగాను. ''నన్ను పట్టిస్తే పోలీసువాళ్ళు అయిదువేల రూపాయలు బహుమతి ఇస్తామని ప్రకటించారు. నన్ను వాళ్ళకి పట్టివ్వు. నీకు బోలెడు డబ్బు దొరుకుతుంది.'' అన్నాడు.

''అశుభం పలుకకు. ఇట్లాంటప్పుడు నిన్ను తీసుకుని నేను ఎక్కడికీ వెళ్ళను'' అన్నాను.

''అది మాయమంత్రాల సినిమా! దాన్ని ఈ మాయలేడితోనే చూడాలి. అక్కడ నా మనుములు ఎదురుచూస్తూ ఉంటారు'' అన్నాడు. సరే అని వెళ్ళాం. ''మేం ఇద్దరం ఆ మాట్లాడే బైస్కోప్ చూశాం దాని పేరు...''

''ఆలమ్ ఆరా... కదూ...?''

''అవును. ఆలమ్ ఆరాయే... పృథ్వీరాజ్ అందులో ఉన్నాడుకదూ... మిస్ జుబేరా... జిల్లో కూడా ఉన్నారు. చాలా పాతవిషయం... దాదాపు ఏభైసంవత్సరాలు అయిఉంటుంది. ఆ తరువాత మోహన్ నన్ను ఒక హొటల్‌కి తీసుకువెళ్ళాడు. మూడోరోజు పొద్దున్న నన్ను లేపాడు. ''తమరు ఇంగ్లండు వెళ్ళి పదినిమిషాల్లో రండి... అర్థం అయిందా... ఎవరూ చూడకుండా బయటపడుదాం...'' అన్నాడు.

''ఏమిటి?'' అని నేనడిగాను.

ఇంగ్లాండు... ఇంగ్లాండు... అంటే తెలియదా... పాకీదొడ్డి... ఇక్కడి ఇంగ్లాండ్ చూడు ఎంత బాగుందో... గొలుసు లాగితే చాలు బడబడ నీళ్ళుపోతాయ్. మనం అక్కడ వదిలే బంగారం అంతా నీళ్ళతో కొట్టుకుపోతుంది... అన్ని బస్తీల్లో ఇట్లాంటి పాకీదొడ్లు ఉంటే ఎంత బాగుంటుంది. మన వాళ్లందరు మూతికి పట్టీ కట్టి ఈ ప్రపంచంపు మైలలంతా ఎత్తక్కరలేదు. అట్లాంటిరోజు వస్తే ఎంత బాగుంటుంది'' అన్నాడు.

నా పనులు ముగించుకున్నాను. అదే ఆఖరుసారి నేను మోహన్‌ని కలవడం. ఇద్దరి మనస్సుల్లో ఇదే ఆఖరి కలయిక ఏమో అని కూడా అప్పుడే అనిపించింది. వెళ్ళేముందు ఇద్దరం ఒకరినొకరు గట్టిగా కౌగలించుకున్నాం... మా ఇద్దరి హృదయాలే మా నాలుకలయ్యాయి. ఆ హృదయాలకే నోరు వచ్చి ఒకరి భావాలు ఒకరికి తెలిపాయి. మా ఇద్దరి గుండె చప్పుళ్ళు... ఎన్నో ఎన్నెన్నో మాటలు విన్నాయి. వినిపించాయి. ఇన్నేళ్ళు గడిచాయి. కాని ఆ కౌగిలింత ... ఆ ముద్దులవేడి... ఈనాటికి గుర్తున్నాయి. ఆ క్షణాలను ఇప్పటికీ నేను అనుకున్నప్పుడల్లా జీవింపచేయగలుగుతాను బాబుగారూ... ఆ క్షణాలకు ప్రాణంపోసి మళ్ళీ అదే అనుభవాన్ని ఈనాడు పొందకలుగుతాను. ఆ ఆఖరి కౌగిలింత ఇచ్చిన వేడే నాకు అసరా అయింది. ఆ ఆసరాలో, రాముడి దయవలన ఇన్ని సంవత్సరాలూ ఏ మచ్చరాకుండా జీవితం గడిపాను. చివరికి వెళ్ళేటప్పుడు మోహన్ అన్న మాటలు నాకింకా గుర్తున్నాయి. ''నిర్గుణ్... నీవు నా జీవితంలో వసంతంలా వచ్చావు. కానీ నా దురదృష్టం... నా బతుకుపాడైపోయింది. నేను బతికి బాగుంటే ఈ నేరాల జీవితాన్ని వదిలేస్తాను. నిన్ను,పాపని తీసుకుని ఏ అరబ్‌దేశాలకో పారిపోతాను. విదేశాలలో గంజాయి, హషీష్ వ్యాపారం చేస్తున్న నా స్నేహితులు ఎంతోమంది ఉన్నారు.

''ఈ మాట వినగానే ఆనందంతో నా మనస్సు ఉప్పొంగిపోయింది బాబుగారూ! ఆరోజు ఎంత త్వరగా వస్తుందా అనుకున్నాను. కానీ నా జీవితంలో అటువంటిరోజు రానేరాలేదు. మళ్ళీ మోహన్‌కి కౌగలించుకునే క్షణాలే రాలేదు''

''ఎందుకని?''

''ఏం చెప్పను బాబుగారూ... నేననుకున్నది ఒకటైతే పైవాడు చేసేది మరొకటి. వెళ్ళేటప్పు

డు మోహన్ నన్ను పాకీపనికి వెళ్ళవద్దని చెప్పాడు. "అందరూ నిన్ను హీనదృష్టితో చూస్తారు. నీ మానప్రాణాలకే ముప్పువస్తుంది" అన్నాడు మోహన్... నీ మోహంలో పడి నేను పాడయితే అయ్యానేమో కాని, నేను మాత్రం మరెవడికీ లొంగను. పతివ్రతలాగానే బతుకుతాను" అని నేనన్నాను బాబుగారూ...

ఆడదానిలో సహజంగా ఉండే ఈ దర్పం చూడంగానే నా మనస్సు పద్మంలా వికసించింది. భోజనం పెట్టే తల్లి, నిత్యజీవితంలో సలహాలిచ్చేమంత్రి, జీవితాంతం తోడుగా నడిచే సఖి, శయ్యమీద రంభలా ప్రవర్తించే మోహిని, అన్ని కలిపితే ఆడదవుతుంది. స్త్రీ తనదంటూ ఒక ప్రత్యేకమయిన వ్యక్తిత్వం ఏర్పరుచుకుని తనని దేవుడు కూడా ఏమీ చేయలేడనే గర్వంతో బతుకుతుంది. ఆడదానిలోని ఈ దర్పమే, ఈ తేజస్సే నా భార్య దగ్గరే కాదు, ఆ తేజస్సుకల మరే స్త్రీ ముందయినా నేను తలవంచేలా చేస్తాయి. స్త్రీల యెడల నాకెంతో శ్రద్ధాభావం ఉంది.

"బాబుగారూ! మరో సంఘటన గుర్తుకు వస్తోంది. మోహన్ చనిపోయాక నేను జైలుకి వెళ్ళాను"

"ఎందుకు?"

"మహాత్మాగాంధీగారి హరిజనోద్ధరణ ఉద్యమం గురించి మీకు తెలుసుగా... ఛావనీలోని మందిర ప్రవేశం కావాలని మావాళ్ళు వేదమందిరం తరఫున అడిగారు. ఆ రోజుల్లో దక్షిణ భారతంలో కూడా మందిర ప్రవేశ ఉద్యమం నడుస్తోంది. నాకు విషయం తెలియగానే నేను ఆవేశంగా వెళ్ళాను. అప్పుడు నేను గర్భిణిగా ఉన్నాను. తొమ్మిదో నెల. అప్పుడే నేను జైల్‌కి కూడా వెళ్ళాల్సి వచ్చింది. దక్షిణంలో అంటరానివారు కృష్ణభగవానుడి మందిర ద్వార ప్రవేశంకోసం ఊరేగింపు సాగించారు. ఆ ఊరేగింపు ఆపివేయబడింది. సత్యాగ్రహం చేశారు. ఛావనీలోని లక్ష్మీనారాయణ మందిరం ఎదురుకుండా గంటల తరబడి భజనలు పాడుతూ అక్కడే నిలబడి ఉన్నాం. తరువాత నేను సత్యాగ్రహం చేశాను. నాతోపాటు చాలామంది కూర్చున్నారు. నన్ను చూడటానికి స్వామీ వేద ప్రకాశానంద వచ్చారు. నా కడుపులో మరోప్రాణి ఉండటం వలన నన్ను సత్యాగ్రహం మానేయమని చాలామంది అడిగారు. కానీ నేను నా పట్టుదలను విడువలేదు.

పోలీసులు మమ్మల్ని జైల్‌కి తీసుకువెళ్ళారు. అక్కడ ఒక ఛండాలపు వార్డెన్ ఉన్నాడు. నన్ను చూడగానే వాడు నా చేయిపట్టుకున్నాడు. నా గర్భం మీద చేయివేసి అటుఇటు నిమురుతూ అక్కడ నిల్చున్న పోలీస్‌తో అన్నాడు. 'రాత్రిదీన్ని నా దగ్గరకు పంపు అందంగా ఉంది. అదీకాక నాకు కడుపుతో ఉన్న వాళ్ళంటే మరీ సరదా...' అంటూ నవ్వేడు.

నాలో శక్తి ఎట్లా వచ్చిందో ఆ రాముడికే తెలుసు నా శక్తి ఉపయోగించి చెయ్యి విడిపించుకున్నాను. వాడి ముక్కుమీద ఒకటి, నోటిమీద ఒకటి గుద్దాను. 'నన్ను రక్షించండి... రక్షించండి' అని పెద్దగా కేకలు వేయడం మొదలుపెట్టాను"

ఆ సంఘటన వినగానే నా గుండె బాధతో ద్రవించి పోయింది. మనుష్యులలో ఇంతటి రాక్షసత్వాన్ని కనీసం ఊహించనైనా ఊహించలేమే! ఎమర్జెన్సీ రోజులలో జైళ్ళల్లో ఇట్లాంటి రాక్షసకృత్యాలు ఎన్నో జరిగాయని విన్నాను. కాని అవన్నీ అతిశయోక్తిగా చెప్పేమాటలు అనుకునేవాడిని. ఇప్పుడు నిర్గుణియా నోటి ద్వారా విన్నాక ఈ ప్రపంచంలో రాక్షసులు ఉంటూనే ఉంటారు అనిపించింది.

నిర్గుణియా చెప్పసాగింది. "ఒక్కొక్కసారి చమత్కారాలు కూడా జరుగుతాయి. మనం వాటినే భగవంతుడి దయ అనుకుంటాం. జైలర్ అకస్మాత్‌గా అక్కడికి వచ్చాడు. భగవంతుడే వచ్చినట్లుగా అనిపించాడు. కాని ఈ సంఘటన వలన నాకు నొప్పులు బాగా వచ్చాయి. నాకు జైల్లోనే కొడుకు పుట్టాడు"

"మోహన్?"

"రేపు చెబుతా బాబుగారూ..."

ఒక పతిత ఆత్మకథలో నాకు భగవతి కథ కనిపించింది. శ్రీరామకృష్ణపరమహంస తనకు ప్రతీ ఆడది తల్లిరూపంలోనే కనిపిస్తుందని అన్నారు. 'ఓ జగదాంబా... ఓ దుర్గామాతా స్త్రీలు తరతరాల నుండి ఈ భూమి మీద బానిసలుగానే బ్రతుకుతున్నారు.



వీళ్ళకు మంచి రోజులు ఎప్పుడు వస్తాయితల్లీ... వీళ్ళకు ఈ బానిసత్వం నుండి విముక్తి కలిగేదెప్పుడు' అని మనుష్యులని పుట్టించిన ఆ తల్లిని అడగాలనిపించింది.

★ ★ ★

రెండో రోజు నేను విన్నకథ:

మాట్లాడే బైస్కోప్ 'ఆలమ్ ఆరా' చూపించి మోహన్ నిర్గుణియాకు హోటల్లో రెండు రోజులు సర్వసుఖాలు చూపించి ఆ తర్వాత కొన్ని నెలల పాటు ఎవరికీ కనిపించకుండా మాయమయ్యాడు. గుల్లన్‌దాయికి ఒకరోజు అకస్మాత్‌గా నగరంలో కనిపించాడు. గడ్డం మీసాలు తీసేసి దొరబాబుల దుస్తులలో ఉన్న మోహన్ గుల్లన్ భుజం మీద చేయివేసి "పిన్నీ! గుర్తుపట్టావా? నిర్గుణ్ ఎట్లా ఉంది" అని అడిగాడు.

"బాగానే ఉంది. ఇంటికి రావా?" అని అడిగింది.

"నన్ను పట్టిస్తే గవర్నమెంట్ వాళ్ళు ఐదు వేల రూపాయలు ఇస్తాం అని ప్రకటించారు. నేను ఒక పని మీద వచ్చాను. ఒక గంటలో వెనక్కి వెళ్ళిపోవాలి"

"కోడలిని చూడవా! పిల్లవాడిని చూడవా? నీ పిల్లఎంతో బాగుంది. దాని మాటలు వినితీరాలి"

మోహన్‌కి వాళ్ళని చూడాలనిపించింది. "సాయంత్రం నాలుగైదు గంటలకు నిర్గుణియాని బేగం సత్రంకి తీసుకునిరా... బేగం సత్రం ఎక్కడుందో తెలుసా?"

"తెలుసు" అని గుల్లన్ అంది.

"ఈ విషయం ఎవడికీ తెలియకూడదు. పోలీసువాళ్ళు నాకోసం పిచ్చిగా గాలిస్తున్నారు. పిన్నీ! నీకు ఏదో కొంత సమర్పించి సంతోషపరుస్తాలే..."

గుల్లన్ నగరం నుండి గుర్రపు బండీ మీద కూర్చుని ఛావనీ వైపుకి బయలుదేరింది.

మోహన్ మహా అయితే ఎంతిస్తాడు. రెండొందలో నాలుగు వందలో... గవర్నమెంట్ వాళ్ళకి మోహన్ విషయం చెబితే ఐదువేలు... ఐదు వేల రూపాయలు ఇస్తారు. ఈ ఆలోచన

ఆ ముసలి మనస్సును గిలిగింతలు పెట్టింది. మోహన్‌ని పట్టిద్దామా వద్దా అన్న సంఘర్షణ మనస్సులో మొదలయింది. మోహన్ మసీతాకి బంధువయితే అయ్యాడు. తన కొడుకు నబ్బూని అందవిహీనంగా చేశాడు.

ఆమె మనస్సులో క్రమంగా మోహన్ నిర్గుణియాలంటే ద్వేషం కలగసాగింది. ముక్కు తెగాకే నబ్బూ వ్యక్తిత్వంలో మార్పు వచ్చింది. ముఖ్యంగా నిర్గుణియాకి పరమభక్తుడయ్యాడు. అప్పుడప్పుడూ పైసలు ఇస్తూ ఉండటం వలన గుల్లన్ మనస్సులో ఒకవైపు మోహన్, నిర్గుణియాల యెడల కృతజ్ఞతా భావం కూడా ఉంది. కానీ ఈ సమయంలో వాళ్ళు చూపిన దయ, మానవత్వం, బంధుప్రేమ ఏవీ ఆమె కళ్ళకు కనబడలేదు. కేవలం ఐదు వేల రూపాయలే కనిపించాయి.

బసంత్‌లాల్ తరువాత సబ్‌ఇన్‌స్పెక్టర్‌గా రిపుమదనసింహచౌహాన్ వచ్చాడు. పొద్దున్న సాయంత్రం కాప్టెన్ దగ్గరికి వెళ్ళడం సలామ్ చెప్పడం అతడి అలవాటు. తన భార్యద్వారా గుల్లన్ తెచ్చిన వార్తవిన్నాక రిపు మదనసింహ్ చిందులు వేశాడు. వెంటనే కెప్టెన్ దగ్గరికి వెళ్ళాడు. మూడు గంటలకు బేగమ్ సత్రాన్ని పోలీసులు చుట్టుముట్టారు. మోహన్ పది మంది మనుష్యులతో అక్కడ ఉన్నాడు. అందులో నలుగురు ఏదో పనిమీద బయటకి వెళ్ళారు. రెండు వైపుల కాల్పులు మొదలయ్యాయి. ఈ కాల్పులలో మోహన్ చనిపోయాడు. మోహన్ చచ్చిపోయాడు అన్న వార్త నగరం అంతటా అడవిలోని నిప్పులా పాకిపోయింది.

గుల్లన్ సబ్‌ఇన్‌స్పెక్టర్‌కి వార్త తెలిపి త్వరగానే ఇంటికి వచ్చేసింది. సరిగ్గా అదే సమయంలో స్కూల్ నడుస్తోంది. నిర్గుణ్ తన పని పూర్తిచేసుకుని ఇంటికి వచ్చి స్నానం చేస్తోంది. గుల్లన్ ఏమీ తెలియనిదానిలా శకుంతలను ఎత్తుకుని మసీతా గదిలోకి వెళ్ళిపోయింది. నిర్గుణ్ స్నానం చేసి రామాయణం చేతిలో తీసుకుని కూర్చుంది. ఇవాళ ఆమె మనస్సు అంత బాగాలేదు. ఎందుకో ఆమెకు అర్థం కాలేదు. రామాయణంలోని కొన్ని అధ్యాయాలు చదవడం పూర్తి చేసి లేచింది. "కోడలా... అన్నం వండే ఉంది. లేచి తిను..." అంది గుల్లన్.

"తింటాలే పిన్నీ..."

"రెండు ముద్దలు నోట్లో వేసుకో... నేను లేకపోతే నిన్ను తిన్నావా తినలేదా అని అడిగే వాడు ఎవడూ ఉండడు. లే... తిను"

నిర్గుణియా ఏమీ మాట్లాడలేదు. గుల్లన్ అన్నమాటలను శకుంతల అనడం మొదలు పెట్టింది. "అమ్మా ఆమ్ తిను ఆమ్ మలె నేను వొడ్డించనా..." కూతురి ముద్దు ముద్దు మాటలు ఆమె మనస్సుకు హాయిని కలిగించాయి.

"ఒద్దమ్మా... నేను వడ్డించుకుంటాలే"

సంభాషణ జరుగుతూనే ఉంది. ఇంతలో నబ్బూ వెనక మరో ఐదుగురు మనుష్యులు ఒక్కసారిగాలోపలికి వచ్చారు. అందరిముఖాలు వాడిపోయి ఉన్నాయి. ముఖ్యంగా నబ్బూ ముఖం మరీ ఉదాశీనంగా ఉంది.

"నబ్బూ... ఎందుకట్లా ఉన్నావు?" నిర్గుణియా అడిగింది.

నబ్బూ ఒక్కసారిగా బావురుమని ఏడ్చాడు. "మోహన్ అన్న చంపబడ్డాడు..."

ఆ గదిలో బాంబు ప్రేలినట్లయింది. అందరూ రెండు క్షణాలు చైతన్య రహితులై నబ్బూ వంక చూశారు. ఈ రోజు తను ఏదో చెడువార్త వింటుందేమోననే అనుమానం నిర్గుణియాకి అంత క్రితం నుంచే ఉంది. మోహన్ లేడా... మోహన్ లేకుండా పోయాడా... ఆమె తలలో, నరనరాలలో ఈ మాటలు ప్రతిధ్వనిస్తున్నాయి. మనస్సు శూన్యం... ప్రపంచం అంతా రాత్రిలాగా నిశ్శబ్దంగా ఉంది. అంతా శూన్యం... కళ్ళల్లో అంతా శూన్యం.

గుల్లన్ గుండెలకు చేతులు కొట్టుకుంటూ ఏడ్వసాగింది. అందరికన్నా ఎక్కువగా బాధపడుతున్నది ఈ ముసల్దే అన్న భావం అందరిలో కలగాలని గుల్లన్ నాటకం ఆడసాగింది. కొంచెం సేపట్లో మొత్తంబస్తీ వాళ్ళందరూ ఆ ఇంటి దగ్గర చేరారు. స్వామీ వేద ప్రకాశానంద తనతోపాటు వేదవతి, ఋషీదేవిలను కూడా తీసుకు వచ్చారు. ముసలి ముతక పెద్ద చిన్న అందరూ అక్కడ చేరడం వలన ఏడుపులు పెడబొబ్బలు ఎక్కువ అయ్యాయి. శకుంతల

కూడా ఏడవడం మొదలుపెట్టింది. నిర్గుణి యా కళ్ళు ఎడారిలా ఉన్నాయి.

ఆ రాత్రికి మోహన్ శవాన్ని పోలీసులు అతడి బంధువులకి ఇచ్చారు. శవాన్ని చూడ గానే నిర్గుణ్‌కి దుఃఖం పెల్లుబికింది. ఆమె శవం మీద పడి స్పృహకోల్పోయింది.

మూడోరోజు గుల్లన్ చేసిన మోసం అందరి కీ తెలిసిపోయింది. 'బస్తీలో వాళ్ళు మీ అమ్మకి బహుమతి దొరకబోతోంది' అని నబ్బూకి చెప్పా రు. ఆమె మోహన్ ఆచూకీ చెప్పిందని కూడా అర్థమైపోయింది. అక్కడి పోలీస్ స్టేషన్‌లో మోహన్ విసిరే మెతుకుల మీద బతికేవాళ్ళు ఎందరో ఉన్నారు. గంజాయికి, సారాకి కష్టపడ కుండా వాళ్ళకు పైసలు ముడుతూ ఉండేవి. వాళ్ళకి మోహన్ మరణం సహజంగా కొంత బాధ కలిగించింది. బహుమతి, ఉద్యోగంలో ఉన్నతి రెండూ రిపుమదనసింహ్‌కే దొరుకుతు న్నాయని కొందరికి ఈర్ష్యగా కూడా ఉంది. ఆయన తన విజయం గురించి చెబుతూ నోరుజారి గుల్లన్ విషయం ఎవరి చెవినో పడేశాడు. అంతే ఆ వార్త అగ్నిజ్వాలలా పాకిపో యింది. బజారులో కొందరు నబ్బూ మీద వ్యంగ్యం బాణాలు కురిపించారు కూడా "న బ్బూ... ఒక్క రోజులో మహారాజువైపోయావు. ఐదువేల రూపాయలు నడుచుకుంటూ నీ దగ్గరకు వస్తున్నాయి. వాహ్... మరి మాకు విందు భోజనం ఎప్పుడు?" అన్నాడు మసీహ్

"ఏమిటి? నీకు మతేమయినా పోయిందా? ఐదు వేల రూపాయలు... నువ్వు భంగ్ తాగలే దుకదా..."

"అంత డబ్బు నీదాకా ఎటూ రాదనుకో... పై ఆఫీసర్లు ఆ పైసలను గుటకాయి స్వాహ్ చేస్తారనుకో... మీ అమ్మ ఒక రాక్షసి... అదేగా మా మోహన్ ఆచూకీ పోలీసులకు చెప్పి వాడిని చంపించింది"

"ఏమిటిరా వాగుతున్నావ్? ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు"

"వెళ్ళు... అందరూ ఏం చెప్పుకుంటున్నారో విను. మీ అమ్మేగా మోహన్ బేగం సత్రంలో ఉన్నాడన్న వార్త వాళ్ళకి చేరవేసింది"

"ఎవడురా... ఆ మాట అనేది... పిల్చుకురా వాడిని... వాడి మక్కెలిరగతంతాను"

"పోలీస్ స్టేషనులో నీ బావ మరుదులు, మామలు ఉన్నారుగా... వాళ్ళే చెప్పుకుంటు న్నారు... నేను అబద్ధం ఎందుకు చెబుతాను? బయటకిపోయి వినిరా... ఎవడి నోట విన్నా ఇదే మాట.."

నబ్బూ రక్తం ఉడికిపోసాగింది. అక్కడి నుండి సరాసరి నిర్గుణియా ఇంటికే వచ్చాడు. గుల్లన్ కిళ్ళీ కడుతోంది. నబ్బూ ఆమె ఎదురు కుండా నిల్చుని పళ్ళు పటపట కొరకసాగాడు. "అమ్మా... నీకు బుద్ధి లేదుటే, నువ్వేనా మోహన్ విషయం స్టేషన్లో చెప్పింది" అన్నా డు ఆగ్రహంతో.

గుల్లన్ ముఖం నల్లగా మాడిపోయింది. తడబడుతూ ఏదో చెప్పబోయింది. కాని అప్పటి కే కొడుకు తన్నే తన్నులకు ముసలిదాని ప్రాణం పైదాకా వచ్చేసింది. ఆ సమయంలో నిర్గుణియా అక్కడ లేదు. పాపను తీసుకుని ఫకీరుబాబా దగ్గరికి వెళ్ళింది. కోడలూ చుట్టు పక్కల కొందరూ ఆ కేకలు పెడబొబ్బలు విని అక్కడికి చేరారు.

నబ్బూని ఎవరూ ఆపలేకపోయారు. తల్లిని బాగా తన్ని మొత్తానికి ఆమె నోటినుండి నిజం చెప్పించాడు.

"దాని చెప్పుడు మాటలు వినే ఆ మోహన్ నా కొడుకు ముక్కు కోసేశాడు. వాడిని అందవి హీనంగా చేశాడు. అందుకే నేను నా కక్ష తీర్చుకున్నాను..." అంది గుల్లన్.

అది వినంగానే బస్తీలో వాళ్ళందరికీ కోపం వచ్చి ఆ ముసలిదానిని తిట్టసాగారు. ఎవరికీ ఆమెమీద సానుభూతి కలగలేదు. సరిగదా ఆమెమీద ఉమ్మేయడం మొదలుపెట్టారు.

ఇంటికి రాగానే నిర్గుణియా అసలు విషయం విన్నాక శిలలాగా నిల్చుండిపో యింది. గుల్లన్ మసీతా గదిలో పడుకుని ఉంది. నిర్గుణియా ఆమె దగ్గరకు వెళ్ళలేదు. గుల్లన్‌మీద చాలా కోపం వచ్చింది. నబ్బూ ఆమె కాళ్ళు పట్టుకుని ఎంతో ఏడ్చాడు.

"నబ్బూ... ఇక నేను ఇక్కడ ఉండను..."

"ఎక్కడికి వెళ్తావు వదినా..."

"ఎక్కడికైనా సరే... నరకంలోకి అయినా సరే... ఇక ఇక్కడమాత్రం ఉండలేను..."

''వదినా నువ్వు ఇక్కడే ఉండు... ఉండక పోతే... మహర్షి వాల్మీకిమీద ఒట్టేసి చెబుతు న్నాను. ఇవ్వాళే ఉరిపోసుకుని చచ్చిపోతాను. ఒకవైపు నా తల్లి నన్ను ముఖం ఎత్తుకోకుండా చేసింది. నువ్వు... నువ్వు... లేకపోతే... నా ఆత్మ రాత్రింబవళ్ళు నన్ను శపిస్తూనే ఉంటుంది...

నబ్బూ భార్యా, ఇంకా అక్కడ ఉన్న కొంద రూ నిర్గుణియాకి నచ్చచెప్పారు. నిర్గుణియా ఆలోచించుకుంది. ఎక్కడికి వెళ్ళాలి... తను ఎక్కడికి వెళ్తుంది. తనకెవరున్నారని? మోహా న్‌కోసం తనంతట తను ఒక లోకాన్ని వదిలేసి వచ్చింది. మరొకటి మోహన్‌తో పోయింది. మధ్యలో కలలాగా వేదమందిరంలో కొత్త జీవితం దొరికింది. వసంతం దొరికింది. కాని తల రాత ఆ జీవితాన్ని కూడా లాక్కుంది. మళ్ళీ మరో కొత్త ప్రపంచాన్ని తాను ఎట్లా సృష్టించుకోగలదు. ఏ ప్రపంచంలోకి వెళ్ళాలి? ఒకవేళ వెళ్ళగలిగితే కేవలం డాక్టర్ ఎండర్ సన్ దగ్గరికే...

రెండు రోజులయింది. ఆమె పనిలోకి వెళ్ళ లేదు. నిజం చెప్పాలంటే రెండు రోజులనుండి అసలు గడపే దాటలేదు.

పొద్దున్నే వేదప్రకాశానంద ''మోహన్ ఆత్మ శాంతి యజ్ఞం చేయాలనుకుంటున్నాను'' అని చెప్పాడు.

హాస్పిటల్‌నుండి లంచ్‌కి వెళ్ళేటప్పుడు నిర్గుణియాని ఓదార్చడానికి ఎండర్‌సన్ వచ్చా డు. రెండోరోజు వచ్చినప్పుడు డాక్టర్‌ని చూడ గానే శకుంతల ''ఫాదర్... ఫాదర్...'' అంటూ ఆయనవైపు వెళ్ళింది. రెండురోజులనుండి ఇంట్లో వాతావరణం బాగా లేనందున అందరి ముఖాలు వాడిపోయి వున్నాయి. బాధతో నిట్టూరుస్తున్నారు. శకుంతల డాక్టర్ దగ్గర కూర్చుని మాటిమాటికి అతడి బుగ్గలని ముద్దు పెట్టుకుంటోంది. నిర్గుణియా ఆ దృశ్యం చూ స్తూ నిల్చుండిపోయింది. ''నీకు, మేరీకి (డా.ఎండర్‌సన్ శకుంతలని మేరీ అని పిలిచే వాడు) సుఖసంతోషాలు కలిగించడం భగ వంతుడి భజనతో సమానం... ఈ పని చేయ డంవలన ఆనందం, సంతోషం కలుగుతాయి. గుడ్‌బై... నే వస్తా'' అని నిర్గుణియాతో ఎండర్ సన్ అన్నాడు.

నిర్గుణియా తల పైకెత్తి దేవుడిలాంటి ఎండర్‌సన్ ముఖంవైపు చూసింది. ఆ ము ఖంలో తేజస్సు ఉంది. ఆ ముఖంమీద శాంతి, మనస్సును స్పందింపచేసే మంచితనం కనబ డుతున్నాయి. ఆ ముఖం దివ్యమైనది, అంద మైనది. కాని... కాని... తీగలు తెగిన వీణ తన ఎదురుగుండా ఉన్నట్లుగా అనిపించింది. ఇన్ని నెలలబట్టీ నిర్గుణ్ మనస్సులో డా.ఎండర్‌సన్ యెడల పెరిగిన స్నేహభావం ఆమె మనస్సును స్పర్శిస్తోంది.

డాక్టర్ వెళ్ళడానికని లేచాడు. శకుంతల అతనితో వెళ్ళాలని చేతులు చాచింది. ''నేను మేరీని తీసుకు వెళ్తాను. సాయంత్రం పంపిస్తా ను'' అని డాక్టర్ అన్నాడు. దాదాపు మూడు న్నర గంటలకు నిర్గుణియా లేచింది. ''నేను ఫకీరు బాబా దగ్గరకి వెళ్ళివస్తాను. అక్కడి నుండి డాక్టర్ దగ్గరకి వెళ్ళి శకుంతలను తీసుకువస్తాను'' అని గుల్షన్‌తో చెప్పింది.

మనస్సుకు తగిలిన తీవ్రమయిన గాయా లకు ఫకీర్‌బాబా మాటలు కొంత మందులాగా పనిచేశాయి. శాంతిగా అనిపించింది. కాని అతడి మాటలు ఆమెకు అంతగా అర్థంకాలే దు. తిరిగి వచ్చేటప్పుడు ఎండర్‌సన్ కోఠీకి వెళ్ళింది. డాక్టర్ శకుంతలతో బంతి ఆడుతు న్నాడు. ఫకీర్‌బాబా అన్న మాటలు నిర్గుణియా కి గుర్తుకు వచ్చాయి.

''పాప అదృష్టం పండబోతోంది''

బహుశ శకుంతల అదృష్టం ఈ ఇంట్లోనే పండబోతోందేమో...

డాక్టర్ బతిమిలాడటంవలన టీ బిస్కెట్లు తీసుకుంది. ఆమె అతడి ముఖంలోకి చూసిన ప్పుడల్లా ఆమెకు ఇంతకుముందు కనిపించి నట్లుగా అతడి ముఖంలో మోహన మురళి కనబడటంలేదు. పువ్వే వాడిపోయినప్పుడు దాని సువాసనమాత్రం ఎట్లా నిలుస్తుంది. ''ఈ పిల్లని మీరు మీతోపాటు అమెరికా తీసుకువెళ్ళ ండి. ఇక్కడే ఉంటే ఇదీ స్కావెంజర్ అవు తుంది...''

''నో... నో...'' డాక్టర్ పెద్ద కేక వేసినట్లుగా అన్నాడు. ''మేరీ భవిష్యత్తు ఎంతో బాగుంటుందని నేనూ అనుకుంటూనే ఉన్నా ను. మేరీని నాతో తీసుకువెళ్తాను. నిన్ను కూడా మేడమ్... మీకో కొత్త జీవితం దొరుకుతుంది...

ఆలోచించుకోండి...''

''మీ దగ్గర విస్కీ ఉందికదూ...''

''ఎస్...''

''ఓ బాటిల్ ఇవ్వండి. తాగి మత్తుగా పడిపోవాలని ఉంది...''

డాక్టర్ ఒక భాటిల్ ఇచ్చాడు. ''మేడమ్... ఎక్కువ తాగడం అంతగా మంచిది కాదు. తాగగానే దుఃఖం మరిచిపోతాం అని అందరూ అనుకుంటూ ఉంటారు. కాని ఈ అభిప్రాయం తప్పు. నాతో అమెరికా వచ్చావంటే తాగి మత్తుగా పడిపోవాలని నువ్వు అనుకుంటున్నావు చూశావూ... అసలు అటువంటి కోరికే అక్కడ కలగదు. ఆలోచించుకో. ఇప్పుడైతే గాయం పూర్తిగా మానలేదు. నిన్ను చూడంగానే నా మనస్సులో ఏదో అనిర్వచనీయమైన సుఖం కలుగుతోంది. బైబిల్‌ని చూసినప్పుడు, ప్రభువును ధ్యానించినప్పుడు, పరోపకారం చేసినప్పుడు ఎటువంటి ఆనందం కలుగుతుందో అదే ఆనందం నిన్ను చూస్తే నాకు కలుగుతూ ఉంటుంది. ఇంతమటుకు ఏ స్త్రీని, ఏ పురుషుడిని చూసినా ఇటువంటి ఆత్మీయతాభావం కలగలేదు. నీవు నాతో కనక వచ్చేస్తే ఈ లోకంలోనే నీకు స్వర్గం కనిపిస్తుంది''

''నేను అభాగ్యురాలిని డాక్టర్... ఎక్కడో ఓ చోట సుఖంగా బతుకుదామనే అనుకుంటా... కాని నేను కాలుపెట్టినచోటల్లా అదేం ఖర్మో... ఆకు పచ్చటి తోట కూడా నిస్సారమైన ఎడారిలా తయారవుతుంది. ఇప్పుడు ఈ ఎడారిని వదిలేసి ఎక్కడికి రమ్మంటారు చెప్పండి''

శకుంతల ఆరోజు ఎండర్‌సన్ దగ్గరే ఉండిపోయింది. గుల్లన్ విషయం తెలియగానే ఆమె మనస్సు గాయపడింది. అసలు మానవత్వంమీదే నమ్మకం పోయింది. అందుకే ఇక అక్కడినుండి వెళ్ళిపోవాలని అనుకుంది. కాని నబ్బూ ఓదార్పువలన కొంత శాంతి కలిగింది. నిర్గుణియా తన గతంలోకి వెళ్ళిపోయింది. ఆమె మనస్సంతా ఆలోచనలతో నిండిపోయింది. అల్లర్లు... ప్రేమ... అసహ్యం... అన్నింటికీ దూరంగా... ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది. తలుపులు మూసేసి తాగడం మొదలుపెట్టింది. ఆమె కళ్ళముందు ఎన్నెన్నో బొమ్మలు వస్తున్నాయి, మాయం అవుతున్నాయి. స్మృతుల సుగంధాలు వెదజల్లుతున్నాయి. అశ్రువుల రూపంలో పొగగా మాయం అవుతున్నాయి. మోహన్ స్మృతులలో మునిగిపోయి పాపాలన్నీ పుణ్యాలుగా మార్చేసుకుంటోంది. ఆ ఫకీరు బాబా స్మశానపు అగ్గిలా నిరంతరం కాలే ఈ స్త్రీకి... మద్యం తాగి ధ్యానమగ్నురాలివి కమ్మనమని ఓ దారి చూపించాడు.

నిన్న మధ్యాహ్నం నిర్గుణియా మా ఇంటికి వచ్చి మూడు నాలుగు గంటలు ఉంది. ''బాబుగారూ... నేను నా మనస్సుని పూర్తిగా విప్పి మీ ముందు ఉంచాను. మనస్సులోని అట్టడుగు పొరలలో దాగి వున్న ప్రతీ భావాన్ని పైకి తీసుకు వచ్చాక ఇక ఈ భూమిమీద నాదంటూ ఏమీ లేదు. మనస్సు పూర్తిగా ఖాళీ అయిపోయింది''

''ఖాళీ అంటే బోలుగా...''

ఆమె చిరునవ్వు నవ్వింది. ''బోలుగా ఉన్న దాంట్లో కూడా ఏదో ఒకటి నిండే ఉంటుంది. బాబుగారు... ఈ బోలులోని అణువణువులో నేను, మోహన్ ఉన్నాం... నాట్యం చేస్తున్నాం... ఇక ఈ నాట్యం ఆపేద్దాం... చాలా నటించాం... ఇక ఇప్పుడు నాతోడు వదిలేయి అని ఒకరికొకరు చెప్పుకుంటున్నాం... కాని ఎట్లా వదలగలుగుతాం... ఇప్పుడైతే మోహన్ లేడు... తాగాక... ఆ తాగిన మత్తులో కలలో అతడితో జీవిస్తున్నాను. ఇప్పుడైతే పొద్దుటి పనులలో కూడా అడ్డువస్తున్నాడు. మీరే చెప్పండి బాబుగారూ... నిత్య జీవితంలో చేయాల్సిన పనులనే చేయనా, లేకపోతే అతడికి పక్కవేసి రాత్రింబవళ్ళు అతడి సేవ చేయనా... ఇక అలసిపోయా బాబుగారూ... నాట్యంచేసి చేసి, అభినయించి అభినయించి అలసిపోయాను బాబుగారూ... చాలా అలసిపోయా... ఇక ఇప్పుడు కంటి నిండా తృప్తిగా నిద్రపోవాలని ఉంది. అల్లా మీద ఒట్టు... మోహన్‌మీద ఒట్టు''

నీలపు సెలయేటిలో రెండు ముత్యాలు పైకి వచ్చాయి... ఆమె డెబ్భైఐదు సంవత్సరాల వృద్ధురాలు... శరీరం అంతా ముడుతలు పడ్డాయి. విధి ఆమె బుగ్గలమీద ఎన్నో గాట్లు పెట్టింది. ఆమె భరించింది. కాలం ఆమెను

నిమిష నిమిషం గాయపరచింది. ఆమె భరించింది. అదృష్టం ఆమె జీవితంతో చెల గాటం ఆడింది... ఆకర్షణీయమైన ఆమె కళ్ళ లోంచి కింద రాలిన ఆ కన్నీటి బిందువులని చూస్తుంటే సాక్షాత్తూ కర్పూరపు చివరి కణాలు నేలరాలాయా అని అనిపించింది.

"మీరు నాట్యం చేసి చేసి అలసిపోయానని అన్నారు కదూ... ఇక ఆడలేను అంటున్నారు కదూ... మీకు కలిగిన అలసట... మీకు... మీకు... ఎవరి సహానుభూతి అవసరంలేదు. ఎంతో గౌరవించతగ్గ విషయం ఇది... ఎంతో ధైర్యంగల పురుషులే ఇటువంటి జీవన రణ రంగంలోఓడిపోతారు. ఇటువంటి భయంకర మైన యుద్ధంలో దిగజారిపోతారు. ఇక ఆడవా ళ్ళ పరిస్థితి గురించి చెప్పేదేముంది? ఒక్క కోరికకోసం ఏ జీవితం అయితే బలి అయిందో ఆ జీవితాన్ని చూసి, ఆ జీవితం గురించి విని, ఆ జీవితం ద్వారానే నేను కరుణ అంటే ఏమిటో తెలుసుకోగలిగాను... రాముడు ప్రతీ రూపంలోనూ ఉన్నాడు. ఇంకో ప్రశ్న అడ గనా?"

"అడగండి బాబుగారూ..."

"మీరు శ్రేష్టమైన కులాన్ని చూశారు. జాతి కుల మత బేధాలులేని సమాజాన్ని చూశారు. ఎన్నో అనుభవాలు గడించారు. ఏ కులం గొప్పది చెప్పండి?"

"స్వతంత్రం అనే కులమే గొప్పది. నికృష్ట జీవితాన్ని కూడా అనుభవించాను బాబుగారూ. నేను ఒక నగ్నసత్యం చెబుతా వినండి. ప్ర పంచంలో తరతరాల నుండి ఇద్దరే ఇద్దరు బానిసలుగా బతుకుతున్నారు. ఒకరు మా కులంవాళ్ళు. రెండు ఆడవాళ్ళు. వీళ్ళిద్దరు బానిసలుగా ఉన్నంతకాలం మీరు, స్వా తంత్ర్యం మా జన్మహక్కు... అందరూ సమా నులే అంటూ గొంతు చించుకుని అరుస్తూ ఉంటారే అవన్నీ అర్థంలేనివి. పూర్తి స్వా తంత్ర్యం ఇప్పటిదాకా రాలేదు"

ఆ మాట అంటూ ఉంటే ఆమెలో తాగకపో యినా రెండు బాటిల్స్ తాగినంత ఆవేశం, కోపం వచ్చాయి. ఆమె లేచి నిల్చుంది.

"అప్పుడేనా... నిర్గుణియాగారూ... కాస్సేపు కూర్చోండి... ఈ అరవై సంవత్సరాల వయ స్సులో మీకు శిష్యుడనయ్యాను. గురుజ్ఞానం.. ఇంకా మరో రెండు మూడు అమృత బిందువు లు..."

"ఆపండి... ఆపండి బాబుగారూ..." నిర్గు ణియా నవ్వుతూ మళ్ళీ కూర్చుంది.

"మీరు నన్ను చాలా ప్రశ్నలు అడిగేశారు. నేను మిమ్మల్ని ఓ ప్రశ్న అడగనా?"

"తప్పకుండా"

"పేపర్లలో హరిజనులను ఉద్ధరించడానికి ఇవి చేస్తున్నాం... అవి చేస్తున్నాం అంటూ రోజూ వ్రాస్తూ ఉంటారు. కాని ముఖ్యమైన పని ఒకటి ఎందుకు చెయ్యరు?"

"ఏమిటా ముఖ్యమైన పని?"

"పాకీ దొడ్లకి ఫ్లష్ అవుట్ సిస్టమ్ ఏర్పాటు చేయించండి. ఈ బానిసత్వంనుండి మా వాళ్ళ ను విముక్తులను చేయండి"

"వీళ్ళ జీవనవిధానం గురించి నేను కొంత స్టడీచేశాను. అసలు పాకీవాళ్ళు అన్న కులమే లేదు. విజేతలు పరాజితులను బానిసలుగా తయారుచేసి వాళ్ళచేత బలవంతంగా ఈ పని చేయించనారంభించారు. మనుష్యుల బానిసత్వానికి ప్రతీకలైన ఈ పాతకాల పాకీదొ డ్లని పూర్తిగా రూపుమాపాలని నిర్గుణియా అభి ప్రాయం. ఆలోచనలోపడ్డ నన్ను చూస్తూ ఆమె అంది.

"నేను తీరని కోరిక కోరాను కదూ..."

"లేదు నిర్గుణియాగారూ! మీరు అడగా ల్సిందే అడిగారు. మీరడిగినది ఏమంత తగ నిదీ కాదూ తీరని కోరికా కాదు... మీరన్నదాంట్లో ఎంతో సత్యం ఉంది. షావుకార్లు, రాజకీయవేత్త లు, మన నాయకులు, ధనవంతులు తమ జేబులను నింపుకునే పనితో కాస్త విసుగు చెందితే మీరు చెప్పారే ఆ ఫ్లష్ అవుట్ లెట్రిన్‌ల సంగతి చూడగలరు. ఆ లెట్రిన్‌లు కట్టించడం పెద్ద కష్టం కాదు. ఈ పని వలన నగరం అందంగా తయారవుతుంది. కాని ఈ పని చేయడం అంత తేలికకాదు. ఏ సమాజం అయితే సంకుచిత మనస్తత్వంతో ఆలోచి స్తుందో... ఏ సమాజానికైతే విశాలమైన భావా లు లేవో... ఆ సమాజం ఎంతో తెలివిగా ఇటువంటి విలువైన ఆలోచనలను 'ఆ

ఏముందిలే మామూలే' అని దాటేస్తుంది. ఒక వేళ ఈ ఆలోచనకి విలువ ఇచ్చినా పొగడ్తల ధంకా కొట్టుకుని ఎంతో అందంగా వాటిని అణిచి పారేస్తుంది''

''ఎట్లాగయితే నేను నా మోహన్‌ని ధ్యానిస్తూ అతడిలోనే లీనమైపోయానో... అదేవిధంగా పై వర్గాలు తాము పరిచిన వలలో తామే పడిపోతారు. వల వేసేవాళ్ళూ ఆ వలలో చిక్కుకోక మానరు బాబుగారూ... రోజులు మారి తీరుతాయి... బాబుగారూ...''

వెళ్ళేటప్పుడు ఆమె నా భార్యతో ''ఒకసారి మీ దేవుడిని చూడాలని ఉంది నాకు దర్శనభాగ్యం కలిగించండి'' అంది.

నా భార్య అభ్యంతరం చెప్పలేదు. ఆమె కాళ్ళు, చేతులు కడుక్కుని దేవుడి దర్శనం చేసుకుంది. ఈసారి శ్లోకాలు పాడలేదు. కేవలం ధ్యానమగ్నురాలయింది. ఆమె ముఖం ఎంతో తేజోమయంగా ఉంది.

★ ★ ★

శ్రీమతి నిర్గుణియా రాత్రి స్వర్గస్థురాలయిందన్న వార్త మరునాడు పొద్దున్న పది గంటలకు ఫోన్‌ద్వారా తెలిసింది.

వినగానే నేను శిలాప్రతిమలా నిల్చుండిపోయాను. వెంటనే ఈ లోకంలోకి వచ్చి వాళ్ళ ఇంటికి వెళ్ళాను. నిర్గుణ్‌మోహన్, అతని భార్య కొంతమంది అతని ఆఫీసు మిత్రులు, బస్తీలోని వాళ్ళు, అనేకమందిఅక్కడ చేరారు. కొందరు ఆమె గురించి ఎంతో ప్రశంసిస్తున్నారు. నిర్గుణియా కొడుకు తన చెల్లెలికి ట్రంకాల్ చేశాడు.

నిర్గుణ్‌మోహన్ నాకు ఒక కవరు అందించాడు. శ్రీమతి నిర్గుణియా నా పేర వ్రాసిన రెండు పంక్తుల ఉత్తరం అది ''నిన్న మీతో అన్నీ చెప్పి నా మనస్సును తేలిక చేసుకున్నాను. కాని ఒక విషయం మీతో చెప్పకుండా దాచిపెట్టాను. స్లీపింగ్ పిల్స్ ఎన్నాళ్ళ నుండో తీసుకుంటున్నాను. ఒక వారం నుండి మోహన్ తన దగ్గరికి రమ్మనమని నన్ను బలవంతం చేస్తున్నాడు. 'మొత్తం స్లీపింగ్ పిల్స్ తినేసేయ్, నా దగ్గరకు వచ్చేసేయ్' అని నన్ను పిలుస్తున్నాడు. నిన్న మీతో మాట్లాడి ఇంటికి వచ్చాక ఆలోచించాను. ఈ నిద్రమాత్రల రుణం తీర్చుకోవాలనుకున్నాను. ఈ జన్మ నుండి విముక్తి పొందాలనుకున్నాను''

నిర్గుణ్‌మోహన్, అతడి భార్య ఏడుస్తూ నిల్చున్నారు.

''ఒకసారి మీ అమ్మగారిని చూడాలని ఉంది'' అని నేనన్నాను.

''వాళ్ళు నన్ను లోపల గదిలోకి తీసుకువెళ్ళారు. ఆ గదిలోనే ఇంతకుముందు నేను ఎన్నోసార్లు ఆమెతో మాట్లాడాను. అక్కడే చివరిసారిగా ఆవిడ దర్శనం చేసుకున్నాను. ఆమె కొడుకు, కోడలు నాపక్కనే నిల్చుని ఉన్నారు.

''మమ్మీ ఎందుకిట్లా చేసింది? ఎందుకు? ఎందుకు?'' అని అతడు వెక్కివెక్కి ఏడుస్తూ అడిగాడు. నేను నిర్గుణియాకేసి చూశాను. ఆమె పెదవులమీద చిరునవ్వు చిందిస్తూ శాశ్వత నిద్రలో ఉంది. నాకు ఒక షేర్ గుర్తుకు వచ్చింది.

ఫనాకా హోష్ ఆనా జిందగీకా దరదె సర్ జానా

అజల్ క్యాహై ఖుమారె బాద్ ఎ హస్తీ ఉతర్ జానా

(దుఃఖపూరితమైన జీవితానికి అంతం మృత్యువు మేల్కొనడమే. మృత్యువు అంటే జీవితంలోని ఆనందపు మత్తు ఒదిలి పోవడమే)

నిర్గుణియా కోడలు, నీలమ్ అత్తగారి చేతులకు ఉన్న బంగారపు గాజులు, మెళ్ళో ఉన్న లాకెట్టు తీసింది. లాకెట్టు తెరిచి తన భర్తకు చూపించింది. భర్త ఆ చిత్రం చూసి ఆశ్చర్యచకితుడయి నిల్చుండిపోయాడు. అతడి కళ్ళ వెంట నీళ్ళు రాసాగాయి.

నేను దగ్గరికి వెళ్ళి చూశాను.

బంగారపు నగిషీ చేయించిన రంగుల చిత్రం అది. మురళి వాయిస్తున్న మోహనుడి దాచిత్రం. కాని ఆ మోహనుడు నీల మేఘశ్యాముడు కాదు, రాధా మానసచోరుడూ కాదు, గోపికా ప్రియుడూ కాదు.

ఆమె భర్త మోహన్ చిత్రం అది. ఆమె భర్త మోహన్ ముఖమే అందులోని మురళీమోహనుడి ముఖంగా అమరి ఉంది.

★

# చతుర 'ఆ మనిషి'పై సమీక్షలు.

జూన్ 'చతుర'లో ప్రచురితమైన వివినమూర్తి నవల 'ఆమనిషి'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## 'కనువిప్పు'

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

నవల పూర్తిగా చదివిన తర్వాత కనీసం ఓ గంటవరకు 'ఆ మనిషి' మాయాపాశంనుండి విముక్తులం కాలేకపోయామంటే అతిశయోక్తి కాదేమో! మనం 21వ శతాబ్దంలోకి అడుగుపెడుతున్న ఈ తరుణంలో కూడా యింకా శాంత అత్తవారిలా అంత మూఢంగా స్వాములను, యోగులను విశ్వసించేవారున్నారా? అని ఒక్క క్షణం అనుమానం కలిగినా, అసంభవం కాదనిపించింది!

ఒక మధ్యతరగతి కుటుంబంలోని సమస్యలు, సహజమైన సంభాషణలు చక్కగా ప్రతిబింబించాయి ఈ నవలలో. శాంత భర్త, అత్తవారిలాంటివారి ఛాందసుల మూఢ నమ్మకాలను 'స్వామిని'లాంటివారు ఎలా సొమ్ముచేసుకుంటున్నారో బాగా చిత్రీకరించారు. చిత్రమేమిటంటే నవలలో ఆయా ఘట్టాలను చదివేటప్పుడు మనకి కూడా మనసులో ఏమూలో ఆ 'స్వామిని' మాటలమీద, చేష్టలమీద నమ్మకం ఏర్పడకమానదు. అది క్షణికమే కావచ్చు! అంటే పాత్ర చిత్రణ, కథ నడిపిన తీరు అంత సమర్ధవంతంగా ఉన్నాయన్నమాట. పెళ్ళిళ్ళలో చిన్నచిన్న విషయాలలో మగపెళ్ళివారి అలకలు, ఆడపెళ్ళివారిని ఏడిపించడానికి పెళ్ళికొడుకు తరఫువారు చేసే ఆకతాయి పనులు, మర్యాదలోపం జరిగేసరికి మగపెళ్ళివారి కసుర్లు, ఏమీ చెయ్యలేని పరిస్థితులలో ఆడపెళ్ళివారు ఒకరిమీదొకరు విసుక్కోవడాలు యిలాంటివి సహజత్వానికి చాలా దగ్గరగా ఉండి ఆడపెళ్ళివారంటే మగపెళ్ళివారికెంత లోకువో తెలియజేస్తాయి.

మంచితనం ముసుగులో ఛాదస్తాలపేరిట, శాంత భర్త శాంతను ఎంత శారీరక, మానసిక క్షోభకు గురిచేశాడో చదివిన ప్రతి ఒక్కరికీ మనసంటూ ఉంటే అది చలించక మానదు. అటు మూఢులకి నచ్చజెప్పలేక, ఇటు కూతురు పరిస్థితీ చూడలేక అడకత్తెరలో పోకచెక్కలా నలిగిపోయిన ఓ మాతృమూర్తిని శాంత తల్లిలో చూశాం.

అక్కడక్కడ 'ఆ మనిషి' మాటలు, చేష్టలు కొంతమేర పాఠకులకి విసుగు పుట్టించినా, మొత్తంమీద సమాజాన్ని జాడ్యంలా పట్టుకుపీడిస్తున్న ఈ మూఢనమ్మకాలను నవలాపరంగా వెలికితీయడంలో రచయిత కృతకృత్యులయ్యారనే చెప్పాలి.

చివరిగా ఒక్కమాట! పాతికేళ్ళకే అన్ని ముద్దుముచ్చట్లూ తీరిపోయిన శాంత జీవితానికి రచయిత ఓ చక్కని మలుపు చూపించి ఉంటే బాగుండేదేమో? ఏమైనా, పదికాలాలపాటు పాఠకుల మనస్సులో చెరగని ముద్ర వేసిన పాత్ర శాంత!

-పేరెపు లక్ష్మి కొత్తగూడెం

## 'ఒక గుణపాఠం'

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

వివినమూర్తిగారి 'ఆ మనిషి' నవల పేరు మొదట చదివి ఏమిటిలాగ ఉందనిపించింది. కానీ చదవడం మొదలుపెట్టాక నా ప్రమేయం లేకుండానే మనసు ముందుకి పరుగెత్తింది. ఇది శాంత కథలాగ, శాంత ఆక్రోశంలాగ లేదు. ఎందరో అమాయకుల, అసహాయుల ఆర్తనాదంలాగ ఉంది. మనసు

ను పిండినట్లయింది.

చదువుకొనే వయసులో చదువుమీద ఇష్టం ఉన్న పిల్ల, పెద్దల బలవంతంతో పెళ్ళికి తప్పనిసరిగా ఒప్పుకొని, కాపురంలో పడిన కష్టాలు మన మనసుని ద్రవింపచేస్తాయి. ఆమె జీవితం, సంసారం ఆమె ప్రమేయం లేకుండానే పాదరసంలాగ జారిపోయింది. ఆమె భర్త, అత్తమామలు, మూర్ఖులై ఆమె అమాయకత్వాన్ని ఆసరాగా తీసికొని దుఃఖ మయం చేశారు.

భగవంతునిపై భక్తి, నమ్మకం, ఉండటం మంచిదే. కానీ భక్తి భయంవలన ఏర్పడకూడ దు. స్వార్థపరులైన స్వాములు, స్వామినులు ప్రజల బలహీనతలను ఆసరాగా చేసికొని తమ పబ్బం గడుపుకొంటున్నారు. శాంత, శాంత భర్త, అత్తమామలు... దగాపడి పచ్చటి జీవితాల్ని కోల్పోయిన సంఘంలోని ఎందరో అసహాయులకు ప్రతీకలు.

మగబిడ్డ కావాలనే తపనతో సోమ సుందరం, అతడి కుటుంబం యోగినివెంట తిరగడం, ఆమె చెప్పింది వేదమని నమ్మడం, కుటుంబం నవ్వులపాలవడం చాలా చక్కగా చిత్రీకరించారు.

కాలం మారిందనుకోవడం కూడా భ్రమే నేమో! ఈనాటికీ సిద్ధుల, యోగుల, యోగినుల వెనకాల అమాయకంగా తిరిగి, వాళ్ళల్లో ఏదో అలౌకిక శక్తులున్నాయని నమ్మి వాళ్ళ మాటల్లో చేతల్లో చిక్కి శ్లేష్మంలో పడ్డ ఈగల్లాగ ప్రజలు కొట్టుకొంటున్నారు. వివినమూర్తి గారి నవలలో శాంత, సోమసుందరంల పాత్రలు అలాంటివా ళ్ళకి ఒక గుణపాఠం.

ఏవిధంగా యోగుల లేక యోగినుల మాయల్లో చిక్కుకొంటారో, చివరికి ఎలా నష్టపో తారో దశలవారీగా నవలలో బాగా విపులంగా రచయిత చెప్పడం బావుంది. చివరల్లోనైనా మనసును ధృడపరచుకొని 'ఆ మనిషి' మాయలోనుండి బయటపడి శాంత ప్రవ ర్తించిన తీరు అభినందనీయం. మొదట్లో మన సు దృఢత్వం లేనట్లుగా శాంతను చిత్రీక రించినా, చివరలో ఆమె ఆలోచనావిధానంలో కూడా మార్పు తేవడం రచయిత ప్రతిభకి నిదర్శనం. కనబడ్డ రాయికి, యోగినులకు, యోగులకు మొక్కడం, వారు ఏవో శక్తులు కలవారని నమ్మడం అవివేకమని, మూఢనమ్మ కాలతో జీవితాలను నష్టపోరాదని నవలద్వారా రచయిత ఇచ్చిన సందేశం అమోఘం. రచ యితకి అభినందనలు.

-టి.సూర్యనారాయణమూర్తి పెదబొండపల్లి.

# 'నా అనుభవం'

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**'ఆ** మనిషి' నవల చదువుతుంటే నా చిన్న నాటి సంఘటన ఒకటి గుర్తుకొచ్చి రాస్తున్నా ను.

నవల్లో శాంత తల్లిపాత్ర చాలా సహజంగా రాశారని చెప్పగలను. సహజంగా సమస్యలు ఎక్కువగా ఉండేది మధ్యతరగతివాళ్ళకే. వాళ్ళ లో ఎక్కువమంది సమస్యాపరిష్కారానికి ఆశ్ర యించేది మొదట దేవుణ్ని, తర్వాత తర్వాత దైవాంశ సంభూతులుగా పిలవబడే స్వాము లు, బాబాలు వగైరాల్ని.

కాలక్రమంలో సహజంగా పరిష్కరించబడే సమస్యలకి 'మహిమ' అనేపదాన్ని తగిలించి పబ్బం గడుపుకుంటున్నారు దొంగస్వాములు. వారిని నమ్మినవారికి ఆ మహిమలు నిజం అన్పిస్తుంది. నమ్మకం కల్గనివారికి మోసం అని తెల్సిపోతుంది.

ఓ వూర్లో అమ్మవారి అవతారంగా ఒకామెను గురించి చెప్పుకొనేవారు. ఆనోటా ఈనోటా విన్న దానినిబట్టి మా అమ్మగారు మా పెద్దక్కయ్యకి పుట్టిన కొడుక్కు పేరు పెట్టించాలని ఆ వూరు తీసుకెళ్తే నేను కూడ వెళ్ళాను. తీరా వెళ్లాక అక్కడి అసహజ వాతావరణం మా అమ్మగారికి నచ్చలేదు. ఎటూ వచ్చాం కనుక ఆమెను చూసి వెళ్దామని నిశ్చయించుకొన్నాం. మా అక్కయ్య కొడుకుని చూసి ఆమె ప్రేమకుమార్ అనే పేరు పెట్టమంది. అంతకుముందు కూడా ఆమె చాలామందికి అదే పేరు పెట్టిన ట్లు అక్కడ పనిచేస్తున్నవారిద్వారా తెలుసుకు న్న మా అమ్మగారికి ఆమెమీద నమ్మకం పూర్తిగా పోయి, యింటికి రాగానే మా అక్కయ్య

కొడుక్కి వేరే పేరు పెట్టించారు. తర్వాత మా అమ్మగారు దేవుడి పూజలూ అవీ మానలేదు గానీ స్వాములు, బాబాలువంటి వారిదగ్గరకు మాత్రం వెళ్ళలేదు.

నవల్లో శాంత తల్లి పాత్ర చదవగానే పై సన్నివేశం గుర్తుకొచ్చింది.

సమస్యల వలయంనుంచి తొందరగా బయటపడాలన్న తపనలో 'మానవాతీత వ్యక్తు ల'మని చెప్పుకొనేవారి వద్దకు వెళ్ళి నగటు మనిషి ఎలా దగా పడుతున్నాడో రచయిత వివినమూర్తి వివరించిన వైనం నాకు బాగా నచ్చింది.

కాకపోతే శాంత చిన్నబావ ఆ మనిషికి తలవొగ్గిన రీతి నచ్చలేదు. శాంతకు సహాయం చేయదల్చుకుంటే వేరేరకంగా చేయవచ్చు కదా!

మొత్తంమీద ప్రయోజనాత్మక నవల. బతుకుభయంతో మూర్ఖంగా వ్యవహరించేవారికి కనువిప్పు ఈ నవల.

పదిహేనున్నర సంవత్సరాలుగా పాఠకులకు చక్కని నవలల్ని అందిస్తున్న 'చతుర'కు నా కృతజ్ఞతలు.

-బి.వెంకటేశ్వర్ శ్రీహరికోట

## 'మనమే కారణం...'

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**'ఆ**మనిషి' నవలను చిన్న కథ, చిన్న నవల కలసిన ఒక నవలగా భావించవచ్చు. దేనికదే విడిగా చదవవచ్చు. కాని రెండింటిలోని పాత్రలు ఒకదానికొకటి కలసిపోయి జీవితమనే మహాపుస్తకంలో కొన్ని పుటలుగా ఆవిర్భవించాయి.

చిన్నకథగా ఉన్న భాగం పెండ్లికొడుకుయొక్క బంధుమిత్రాదులు చేసే హంగామాను, ఆర్భాటాన్ని తెలియజేస్తుంది. చెక్క బొమ్మకు చీరకట్టి దానికి ఆడబిడ్డ అని పేరు పెడితే ఎగిరెగిరి పడిందట. అదేవిధంగా పెండ్లికొడుకు తరపువారమనేసరికి, అకస్మాత్తుగా కొమ్ములు మొలుస్తాయి, కండ్లు నెత్తిపైకి వచ్చి, పెండ్లికూతురి తరపువారు గూడా మనవంటి మనుషులనే ఇంగితజ్ఞానం మరచి, పూనకం పూనిన వ్యక్తులలాగ, రకరకాల గొంతెమ్మ కోరికలతో. ఆడపెండ్లివారిని ముప్పుతిప్పలు పెట్టి, మూడు చెరువులు నీరు తాగిస్తారు. ఇటువంటి హేయమయిన ప్రవర్తన గలిగినవారిని అతి చక్కగా దుయ్యబట్టారు రచయిత వివినమూర్తి. ఇటువంటి నవలలు చదివయినా మగపెండ్లివారు తమ పద్ధతులు మార్చుకొంటే మంచిది.

'ఆ మనిషి' నవలాభాగం ఇంకా విచిత్రం. మగపెండ్లివారి బాధ పెండ్లిరోజులవరకే పరిమితం, కాని 'ఆ మనిషి'వంటి వారి బాధ సంవత్సరాల తరబడి వుంటుంది.

నవగ్రహాలలో శనిగ్రహం దుష్టగ్రహం అంటారు. ఈ గ్రహం పట్టిన వ్యక్తుల అవస్థ వర్ణనాతీతమంటారు. ఈ శనేశ్వరుడిని శాంతింపజేయాలన్నా, ప్రసన్నుని చేసుకోవాలన్నా తిలాదానం, తైలాభిషేకంతో సరిపోతుందంటారు. కాని 'ఆ మనిషి'వంటి దుష్టగ్రహాలు (వీరిని బాబాలనండి, స్వాములనండి, అమ్మవారలనండి, దేవీమాతలనండి. ఏపేరునయినా పిలవండి) పట్టిన వ్యక్తులు జీవితాంతము తమ రక్తమాంసాలు, సమస్త సంపదా 'కృష్ణార్పణం' చేయాల్సిందే. ఈ 'ఆ మనిషి' వర్గం తమ భక్తకోటికి ఆధ్యాత్మికపరంగా ముక్తిని ప్రసాదిస్తామని ప్రభోధిస్తుంటారు కాని వారు ప్రసాదించేది సుఖశాంతుల నుంచి, ఆస్థిపాస్థులనుంచి విముక్తి మాత్రమే. వీళ్ళే వారి పాలిట 'జలగలు'.

ఈ నికృష్టవర్గం పుట్టుకకు, పోషణకు కారణం ఎవరు అని ప్రశ్నించుకుంటే మనమే అని తెలుస్తుంది. మనలోని దురాశ, పేరాశలు, తీరని కోరికల పర్యవసానము ఈ వర్గంయొక్క వృద్ధికి కారణం.

అందుకని ఇటువంటి వర్గం మానవ జాతికి కళంకం అని నిందించేదానికంటే ఈ వర్గం పుట్టుకకు మనము, మనలోని విపరీత కోరికలే కారణమని తెలుసుకొని మనకి మనమే బుద్ధితెచ్చుకోవాలనే నీతినిస్తుంది 'ఆ మనిషి' నవల.

-బి.గంగానాథ్ సికింద్రాబాద్

## 'నమ్మకాలదుర్వినియోగం'

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'**ఆ**మనిషి' ఎదుటివారి భక్తినీ, నమ్మకాన్నీ, తన అవసరాలకు, అనుభవాలకు ఉపయో గించుకోడమే కాకుండా, ఒక ఆడపిల్ల జీవితా న్ని ఆమె కుటుంబసభ్యులను ఎలా అవస్థల పాలు చేసిందీ, ఎంత నరకయాతన పెట్టిందీ చదువుతుంటే మనసు కకావికలమై పోతుంది. అమ్మానాన్నల చాటున, అక్కాబావలమధ్య అమాయకంగా బతుకుతూ, సాంప్రదాయబ ద్ధంగా సాగే పూర్వాచార పరాయణమైన కుటుంబంలోని శాంతలాంటి ఓ ఆడపిల్ల పదవతరగతి ఫస్టులో పాసై, ఇంకా చదవాలని ఉన్నా, సర్దుబాటు చేసుకొని, పెళ్ళిపేరుతో అత్తింట్లో దిగి ఎన్ని అవస్థలు పడిందో చదువు తుంటే హృదయం ద్రవిస్తుంది. నమ్మకం పే రుతో మగపిల్లలు పుట్టడానికి మందని గంజాయి యిచ్చి, ఆ మత్తులో ఆమెను తనక నుగుణంగా, అనుకూలంగా మార్చుకున్న చిత్రవిచిత్రమైన వికృతమైన పూజలు, ప్ర తంచేయించిన ఆ మానసిక రోగి, నీచమైన తిట్లు, అతివాగుడు అసహ్యమనిపిస్తుంది. నమ్మకం మత్తుమందులాంటిదే అనిపిస్తుంది. మగపిల్లవాడు కావాలనే కోరికతో కాకమ్మకథలు నమ్మి 'ఆ మనిషి'కి దాసుడై పిచ్చిభక్తితో, బానిసగా మారిన శాంత భర్తను చూస్తుంటే జాలివేస్తుంది. మగపిల్లవాడు కావాలని కోరిక ఉండవచ్చు. కానీ దానికోసం ఇలా దిగజారడం మూర్ఖత్వం. కొన్ని కుటుంబాల్లోని అలవాట్లు, ఆచారాలు, సంప్రదాయాలు, పద్ధతులు, ఆ కుటుంబాల్లోని గొడవలు అన్నింటినీ చాలా చక్కగా వర్ణించారు రచయిత. శాంత తన కథను చెప్తూనే వాళ్ళ ఇంట్లో, మామగారింట్లో మనుష్యుల ప్రవర్తన, స్వభావాలు తనే చెప్తూ, దానికి తగ్గ సంఘటనల్లో వాళ్ళ చేష్టలు వర్ణించడం బావుంది. చివరలో చంద్రస్వామి, ధీరేంద్రబ్రహ్మచారుల్లాంటి బాబాలనూ, బాబా లచేత తన్నించుకొనే మన మేటి రాజకీయ నాయకులను గుర్తుకు తెచ్చారు.

మొత్తానికి పసిపిల్లలచేత కూడా వ్రతాలు చేయించి, శుద్ధిచేసి, పేర్లు మార్చి బూతులు తిట్టిస 'ఆ మనిషి' మనిషి కాదు, 'మహిషి' అనవచ్చునేమో. 'తోలేసిందీ ఆయనే గనక రావల్సిందీ ఆయనే'వంటి మాటలు బావు న్నాయి. రచయితకు, 'చతుర'కు ధన్యవాదా లు.

-బి.రాంబాబు భద్రగిరి

## 'మూఢత్వం'

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**న**వలకు 'ఆ మనిషి' అనే టైటిల్ పెట్ట డంలోనే రచయిత వివినమూర్తిగారికి ఆరకం మనుష్యులపై వున్న తిరస్కారభావం అర్థం అవుతోంది.

ఒకమూల సర్వసౌఖ్యాలూ వాళ్ళనుభవిస్తూ వాటన్నిటికీ దూరంగా వుండాలని ప్రజలకి ఉద్బోధించడం, గొర్రెమందలాంటి ప్రజ మూ ఢత్వంతో తలలూపి జీవితాల్ని, సంసారాల్ని సర్వసంపదల్నీ పణంగా పెట్టడం ప్రస్తుతకా లంలో జరుగుతూన్న చరిత్రకు ప్రతిబింబం. కేవలం అజ్ఞానపు ప్రజ తగినంత విషయావగా హన లేకా, తెలుసుకునేందుకు తగిన అవకాశా లూ లేకా అలా తయారౌతున్నారనుకున్నా... మీకూ మాకూ తేడాలేం లేవన్నట్లు చదువుకు న్న వారు కూడా అదే పంథాలో నడవడం శోచనీయం.

నడతలో కొంత 'నస' కనిపించినా కథావ స్తువు చక్కనిది. కథావస్తువుని పక్కకి పెట్టినా ప్రయత్నిస్తే తామూ నెగ్గుకురాగలం అనే ఆత్మ విశ్వాసాన్ని పెంపొందింపచేస్తుందీ నవల పాఠ కులలో. పాఠకులని కొంతైనా ఆలోచింపచేయ గలగడంకంటే మంచి రచనకు ప్రయోజనం ఏముంటుంది?

ఈ నవలద్వారా విభిన్నమైన కథలను ఎంపిక చేయడంలో సాటిలేని 'చతుర' చాతు ర్యం వ్యక్తమౌతోంది.

జోశ్యుల సూర్యకుమారి హైదరాబాద్

# విచిత్ర ప్రపంచం

## విషఫలాల కథ

ఓ గమ్మత్తయిన మొక్క అమెరికా పరిసర ప్రాంతాలలో కన్పించేది ఒకప్పుడు. దాని పళ్లు అందంగా, ఎర్రగా నోరూరిస్తూ ఉండేవి. కానీ ఎవ్వరూ వాటిని రుచి చూడడానికి సాహసించ లేదు. కారణం అందులో విషం ఉంటుందని, నోటపెట్టుకున్న మరుక్షణమే చచ్చిపోతారని అందరికీ భయం. అయినా తినడంకోసం కాక పోయినా అందంగా ఉంటాయనే ఉద్దేశంతో రెడ్ఇండియన్లు ఆ మొక్కల్ని తమ పెరళ్లలో పెంచడం మొదలుపెట్టారు. అలా క్రమేణా ఆ మొక్కలు ఐరోపాకూ ప్రయాణించాయి. అక్కడ కూడా వాటి పండ్లను తినడానికి ఎవ్వరూ ధైర్యం చేయలేకపోయారు. ఎందుకంటే రెడ్ ఇండియన్లలాగే యూరోపియన్లూ వాటిని విష ఫలాలుగానే భావించారు.

కానీ 18వ శతాబ్దం మధ్యలో ఓ నీగ్రో ఆ పండును తినడానికి సాహసించాడు. డాక్టర్ జార్జివాషింగ్టన్ కార్వర్ అనే ఆ నీగ్రో సైంటిస్ట్ పేదప్రజలకి ఆహారపదార్థాల గురించి, వివిధ ఫలాల గురించి, వాటిలో ఉండే పోషకవిలువల గురించీ సోదాహరణంగా చెబుతూ ఆ పని చేశాడు. మొదట అతని టేబుల్మీద ఉన్న విషఫలాల్ని చూసి గ్రామీణ ప్రజలు భయభ్రాంతులయ్యారు. ఆ పళ్లని తాను తింటానని అతను వారికి చెప్పినప్పుడు "వద్దు... వద్దు... అది విషం... చచ్చిపోతావ్" అంటూ హాహాకారాలు చేశారు వారు.

అయినా కార్వర్ వారి మాటల్ని ఖాతరు చేయలేదు. చిరునవ్వు నవ్వుతూనే ఆ పండుని చాకుతో కోసి ముక్కల్ని తినేశాడు. జనం అంతా అతని సాహసానికి ఘొల్లుమన్నారు. అతడు మరికొన్ని క్షణాలలో చనిపోతాడని అంతా ఊహించారు. కానీ వారి అంచనాలు తారుమారయ్యాయి. కార్వర్ నిక్షేపంలా ఉన్నాడు.

"చక్కని పోషకవిలువలున్న పళ్లని విషఫలాలంటూ ఇన్నాళ్లూ మీరు తినకపోవడం మీ అమాయకత్వం... ఈ పళ్లు నిరపాయకరమైనవి. మీరూ ఎంచక్కా భుజించండి" అన్నాడాయన వారినుద్దేశించి.




జనం ఆయన మాటలు నమ్మారు. అప్పటి నుంచి వాటిని తృప్తిగా ఆరగించడం మొదలెట్టారు. ఇంతకీ అవేంపళ్లనుకుంటున్నారు? మనమంతా ఇష్టపడే 'టమోటా పళ్లు'!

# అసాధారణ 'ధారణా' సంపన్నులు

ప్రపంచంలో అసాధారణమైన జ్ఞాపకశక్తిగల మహానుభావులూ ఉన్నారు. అయితే వారి సంఖ్య ఎప్పుడూ తక్కువే. కాని వారి ప్రతిభ మాత్రం అపారం. అటువంటివారి ప్రస్తావన వచ్చినప్పుడు మొదటగా చెప్పుకోవల్సినవ్యక్తి రాజా శ్రుతిధర్. ప్రాచీన భారతదేశంలో ఓ చిన్న రాజ్యాధినేతగా ఉండే శ్రుతిధర్‌కు ఒక్కసారి వింటేచాలు అది ఏదైనా సరే జీవితాంతం గుర్తుండిపోయేది. తన సమక్షానికి వచ్చిన కవి పండితులు తమతమ కావ్యాల్ని ఒక్కసారి విన్పిస్తే చాలు, ఆ రాజు అక్షరం పొల్లుపోకుండా ఆ తర్వాత ఎప్పుడడిగినా ఒప్పగించేవాడు.

జపాన్‌కు చెందిన శతాధిక వృద్ధవిద్వాంసుడు (1722-1823) హనావాహొకచికి ఏడేళ్ల వయస్సులోనే అంధత్వం ప్రాప్తించింది. అయితేనేం? ఆ ధారణా సామ్రాట్ నాలుగు లక్షల పుస్తకాల్ని ఇతరులతో చదివించుకొని విని జ్ఞాపకం పెట్టుకోగలిగాడు. ఆ పుస్తకాలలోని అంశాల్ని ఎందరో విద్యార్థులకు బోధించిన అనుభవశాలి.

జర్మనీకి చెందిన నేబూర్ కూడా అంతటి ఘనుడే! ఉద్యోగరీత్యా నిత్యం అతనెన్నో ఫైళ్లని స్టడీచేసేవాడు. ప్రమాదవశాత్తు ఓనాడు ఆఫీసుకు అగ్నిప్రమాదం జరిగి ఫైళ్లన్నీ భస్మీపటలమయ్యాయి. అయితేనేం? ఏకసంథాగ్రహివంటి నేబూర్ ఒక్క అక్షరం కూడా బీరుపోకుండా ఆ ఫైళ్లనన్నింటినీ తిరిగి రాసి అధికారులకి సహకరించాడు.

ఒకప్పటి లిథేనియా ప్రధాని రవీఎతీజాకు కూడా అపారమైన జ్ఞాపకశక్తి ఉండేది. ఒకసారి చదివిన గ్రంథాన్ని ఆయన ఎప్పటికీ మరిచిపోయేవాడు కాడు. ఆ రకంగా ఆయనకు 2,500 గ్రంథాలకు పైగా కంఠోపాఠమైపోయాయి.

ఫీల్డింగ్ అనే ఓ ఇంగ్లీసాయన పుట్టుగుడ్డి. అయినా అతనికి పదివేల మంది వ్యక్తుల పేర్లు, వారి కంఠస్వరాలు గుర్తించే నేర్పు ఉంది. కంఠస్వరం విన్పించడంతోనే అతని పేరేమిటో ఏం చేస్తాడో వివరాలన్నీ చటుక్కున చెప్పేస్తాడా ప్రతిభాశాలి. ఏథెన్స్ నగరవాసియైన థెమిస్టాక్లీజ్ అనే పెద్ద మనిషికి ఆ




నగరంలోని ఇరవైవేలమంది పేర్లు తెలుసు. వారు కన్పించినపుడు వారి పేర్లతో పిలుస్తూ విష్ చేసేవాడతను. ఇరాన్‌కు ఒకనాటి చక్రవర్తి అయిన సాయిరస్‌కు తనసైనికులందరిపేర్లూ తెలుసు. పేరుపేరునా వారిని పలకరించి వెళ్తుండేవాడాయన.

ప్రఖ్యాతకవి జోసఫ్ ఎడిసన్ కుమార్తె షర్లార్ ఎడిసన్ (1719-1797) అవడానికి పిచ్చిదైనా అపారమైన జ్ఞాపకశక్తి గలది. 300 పేజీల నిఘంటువులోని అన్ని పదాలు అక్షరక్రమంలో ఆమెకు కంఠోపాఠమేనట.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

